# శ్రీమద్రామాయణ

# కల్పవృక్షము

## కిష్కింధా కాండము

**

విశ్వనాథ సత్యనారాయణ

# కిష్కింధాకాండము



## నూపురఖండము



శ్రీ వినతాసితసుషమా
గ్రీవాదేశాభిరామ ! కృతనూపుర సం
ధ్యావిమలితామృతాంశు
వ్యావర్తపదాభిరామ ! అర్ధకృతోమా !

శా॥ ఆకుల్ పూవులు తప్తకుంభశిఖరవ్యాకీర్ణముల్ గా దృశాం
తాకుంచ్యాకృతి దైన్య ధైర్యరమణీయంబై విడంబింపగా
నాకూతిం జనెదున్ బ్రియావిరహిమత్తానేకపంబొందు పం
పాకేళీవని మందఘీంకృతిరవ వ్యాహారసాహస్రియై 1

చ॥ మరియు మతంగమూని మహిమస్పృశముల్ పరమానుకూలశాం
తరసము మానలేవు రతినాయకసాయకతీవ్రరూపబం
ధురతఁ ద్యజింపలేవు సుమనోవ్రజ మల్లులఁ బంప నీటితుం
పురులను జల్లగాలులను మోచి సుమావళిమాత్రమైనవై 2

శా॥ కంబళ్లన్ మెయినిండఁ గప్పికొని యీ గండైన భల్లూకరా
జం బేదల్ తమి రేఁటు చేయువదిలే కల్లాడి గగ్గోలుగా
సంబారంబున నేన నేత్రవృత్తులఁ బీల్చంజూచు నాకాశశా
ఖం బట్టూడకయుండ గాలదిమి చక్రభ్రామ్యదక్షుంబుగన్ 3

క॥ ఆచెట్టున కాతీవకు
రాఁచి పెనంగొనిన ప్రణయరాగము కలుగన్
వీచీవక్షిణవాయువు
త్రోఁచెన్ మృదువల్లి దూరదూరంబులకున్ 4

ఉ॥ ఇంతమయూరరాజునకు నేమి పౌనర్భవో దుష్టపాము దు
ర్దాంతగళోగ్రసారణవిసారితషడ్జముగాఁగ నేగుచున్
దాంతపదాభిఘట్టితపదంబున నర్ధవికీర్ణపింఛమై
ప్రాంతమహోగ్రనాకు వివరాంతప్రవిష్టముఁ జూచి రోఁజెడున్ 5

చ॥ తిరిగిన పంపనీరములు తీర్చని సారణులై లతల్ పొదల్
తరువుల చిక్కపచ్చనల తన్కుల యాకులు నేత్రతర్పణ
స్ఫురణముచేయ నియ్యటవి ముగ్ధమనోహర కేళికాననా
దరము గడించెడున్ నవలతాంతమహోయుధు బాకుటిల్లువాన్ 6

ఆ॥ కేగి ముదురు వెలగక్రింద ముగ్గినపండ్లు
రాలి కమ్మతావి గాలి సాగ
మూఁగికొనిన తేఁటి మొత్తమ్మునకు స్పృహా
స్పృహాలనడుమ తత్తరింపు లయ్యె 7

మ॥ వన మీనాటికి నయ్యె బిల్వఖదిరాశ్వత్థంబు లీతీర్పు తీ
ర్చిన శేఖన్ తొలినాటి సిద్ధి క్రతుధాత్రింబోలెఁ గన్పించుచున్
దనయున్ జానకియున్ జనుర్విభవవృత్తాంతంబు నా పంప యొ
డ్డున దుఃఖోల్బణకంఠరోధములు గండూషించెఁ బ్రాణేశుడున్ 8

చ॥ పొరిఁ జిఱుపిందెలున్ ముదురుపూతలు తేలిన నింబవృక్షముల్
విరిసి కషాయవాసనలవెల్లువలై నవవత్సరంబు దు
ర్ధరమయి సేవ్యతోఁగుణము వాసినయట్లులఁ దోఁచు శాఖికా
వికుదితవాయసీకుల దవిష్ఠసలాగము సంధిబంధమై 9

గీ॥ పెనగొనియె నిందు నశ్వత్థవృక్షకంబు
నింబవృక్షంబు, మిన్ను పూనినది తాళ

ముం బెనంగొనె నిచ్చట భువిని గూట
ములు పవిత్రము లపవిత్రములు స్ఫురింప. 10

శా॥ పంపాకాననభిన్నదేశముల సౌభాగ్యంబు చిత్రంబు నై
లింపశ్రీకముగాఁ గనంబడెడు వల్లీగుల్మవృక్షావలం
దింపౌ నీడిగచెట్ల తాఁగరప తానిచ్చోటు నచ్చోటు చొ
క్కంపుఁగుమ్మల జీడిమామిడిపొదల్ గా సైకతశ్రేణులన్. 11

గీ॥ గగనమునయందుఁ బూచె జాకాలమల్లి
తొడిమపట్టింత లేని కూఁతుంద్రతల్లి
నేల రాలినపూలలో నిలచి తేంట్లు
విరవిరల తేనె గ్రహియింప వెక్కసించు. 12

ఉ॥ కాశసితాంబుజంబులనగాఁ జను తారల పంపనీటి యా
కాశముమీఁదఁ బాదహతి గా సితమత్స్యమటన్న సీతఁ గా
కాశరుఁ డిబ్లై తన్నుకొని యక్కట యేగెను డేగయొక్కఁడా
హా శరమల్లు వచ్చినను నాగక తప్పకపోయెఁ గాకముల్. 13

చ॥ అలఘులు పారిజాతము లనార్తవ మీ తరురాజి ప్రొద్దుటిం
తలనుచు లేదు కాదు దిననాథుఁడు తా నడిమింట నుండె నం
చలయదు ప్రొద్దుక్రుంకినదటంచును లేదు మనోజ్ఞభావనా
విలసితహేలయా ననుఁగు ప్రేయసివోలె సదాసుమాకృతిన్. 14

చ॥ మరి తెలిరేకు లెజ్జతొడిమల్ నునుమల్లెలకంటె నందముల్
పరువములై కనంబడని స్వర్గమునందలి సౌఖ్య మూహసుం
దరమయినట్టు లీ పువులతావియు నూహకొలంది స్వాదుసుం
దరము నకృత్రిమంబయిన నాస ప్రధానగుణంబు చుట్టమై 15

ఉ॥ పూవులవింటిజోదు మరి పూర్వపుపూదిరికాదు క్లిష్టహా
త్రోవలు చూచి లొద్దుగల దుమ్ములు కన్నులఁ జల్లుఁ దంగెడుం
బూవుల నిండుగుత్తులయి పొల్చెడు కారపుబుండలన్ గనుల్
క్రేవలఁ గొట్టు పట్టియపకీర్తిగడించె నయోధమార్గుఁడై 16

ఆ॥ ఇంతపెద్దవృక్ష మీ పూఁతచుక్కలు
పొడిచినట్లు సాగుఁబో రసాలి
తేంట్లు కామమార్గధృష్టముల్ కాలెందు
మోపు నెపుడు రసము పొందు నెందు 17

ఆ॥ కొన్ని చెట్లు వ్రాలుకొమ్మల ధాత్రిని
గదిసి యిచటె పూచుఁ గాచు నిచటె
కొన్ని పెరిగిపెరిగి మిన్నుల గాలికిఁ
బోయి హద్దుమీఱిపోవు నెచటొ. 18

శా॥ మత్తానేకపహంసయానను బికీమంజుప్రియాలాపనున్
నృత్తప్రౌఢమయూరపింఛకబరిన్ నిర్వ్యాజముగ్ధాకృతిన్
జిత్తంబందున నూహచేసెదను నా సీతన్ సరశ్కాననా
యత్తోద్యన్మధుమూర్తి సస్పృహముగానై నిస్పృహం జెందుచున్ 19

క॥ ఆవిష్కృత్యభిముఖ నవ
భావజ సుమనోమనోజ్ఞ బంధురహేలా
జీవనవసంత వేళా
యావతమును బోలుఁ గాననాంతరవల్లుల్. 20

మ॥ ఉదితేద్ధృజ్మధుమాసవంచితుడ నేమో సీత జీవించియు
న్నదటన్నాశయు లేదు నాకును నరణ్యానీ సమాసన్నసం
పద యీ బాలరసాలసూనవిభవప్రాకృష్టసృష్ట్యాదిమో
హదశత్కామముగాక దైత్యులు సతిన్ బ్రాణాలతో నుంతురా! 21

క॥ ఇది యొక యాశావృక్షము
మొదలు మొదలు చివరిదాఁక భువిప్రాణులయున్
బ్రదుకుల జగత్తో కట్టిన
యది నే నిందొక్క రెమ్మనై యారటముల్ 22

గీ॥ నష్టసారంగపతిసమాకృష్ట యామె
సంగతాకృష్టముగ్ధసారంగ వీవు

విప్రతీపదశాగత పృథ్వీతనయ
నీకుఁ గనిపించెనా చెప్పవే! కదంబ 23

ఆ॥ అదిగో! సీత యంబుజాస్త్రకరోద్దీప్త
మైన చీరచెరగు లార నేగు
దవ్వు భ్రాంతిదంబు దగ్గరకును జిగి
ర్చినది యిద్ది లేఁత రేలకొమ్మ 24

వ॥ తునుకలు కొట్టుచున్ జెఱకుతోటల వింటికి విత్తనాలు పా
తిన తఱిఁ గర్షకుండయిన తియ్యనివిల్లుమూఁడారు, సీతఁ గై
కొని చనుదెంచి మైథిలులకోటకుఁ బంపుమ యింతదాఁకఁ బం
పునది యికేమియున్నయది పోవుట నేనును లే దయోధ్యకున్ 25

క॥ తెలిసిన వయసున నన్నుం
గొలుచుట యబ్రమ్ముకాదు క్షోణీసుతకున్
తెలియని వయసున నన్నుం
గొలిచినయది సర్వదైవకూటమ్ము వలెన్ 26

ఉ॥ భార్యకునంచుఁ బ్రాఁజదువుబాటల నేమిగుణాలి యున్నదో
భార్యకు ధారుణీసుతకు బంధుర మా గుణపాళియున్నదీ
యర్యమవంశనూత్నవధు వామెకు నాకు వియోగకల్పనా
ధుర్యము దైవ మేగుణము తోఁచని యంధముగాఁ గనంబడున్ 27

సీ॥ నీటిమట్టముగాఁగ నీలముల్ పరిలఘుల్
జలములు తెక్కలఁ జరణములను
గమపుచు నెగుడు నీ పదమరాళంబులు,
కాళ్ళయెఱ్ఱనయు తెక్కలచివళ్ళ
పసిడికాంతియుఁ బరిప్లవమానశీకర
గతబాలమార్తాండకరనివహము
పంపైకదేశంబు పాకారినవచాప
ఖండమనోజ్ఞరేఖం దనర్చు

గీ॥ వారిజాంతరోచ్ఛ్వలితబంభరగరుత్ప
రాగసాధుకిర్మీరవర్ణములు కలిసి
రామణీయకతావారిరాశి పంప
నమృతవీధులయందుఁ బ్రాణములు పంప 28

శా॥ ఇంతాలస్యముచేసినాననుచుఁ దా నేమైన నాకోసమై
కాంతారంబునయందునన్ వెదుకగా క్ష్మాపుత్రి యేతెంచెనా
ప్రాంతారణ్యములందు నామెఁ గనఁగా రక్షోదురాచారవృ
త్తాంతం బాత్మను మభ్యపెట్టుకొనఁ గాసంతైన వీలీయకన్ 29

ఆ॥ వేఁపకొమ్మమీఁద విరుదించుఁ గాకమ్మ
దీనిఁ బ్రశ్న యడుగఁగాను వలయు
మీకు నను గుతల్లి కాకమ్మ! కాకమ్మ!
వనిత యెపుడు తిరిగివచ్చుఁ జెపుము. 30

ఆ॥ గంతువేసి కూయకయ లేచిపోయెను
పాడుకాకి ప్రాఁతపగ తలంచి
తల్లిబిడ్డలకును చెల్లనీయదుగదా
కోపమెంతయైన కుటిలగుణము. 31

క॥ మునికాళ్ల నిలచి కుందెలు
నను పరకాయించి చూచు నలినాక్షి కథల్
తనకుం దెలిసినఁ జెప్పను
తనచేతంగాక పోవు దక్షిణదిశకున్ 32

శా॥ నోరున్ వాయియు లేని జంతువులు నన్నుం జూచి జాలింబడున్
దా రక్షించుటకుం జాతియు యూరక విరోధంబూను నేనున్నచో
నౌరా! సృష్టిసమస్త మొక్కెడను వైద్యుశ్రేణి యొక్కెండనున్
స్వారంబై చను సృష్టి యిన్నిలల ... ధారాస్రుతిన్ 33

మ॥ ఒకసీతం గొనిపోయె రావణుఁడు నాకొక్కొక్కవల్లినిం
జకమం దొక్కొకసీతయున్నది పరిష్వంగంబులం బట్టెదన్

ప్రకటంబైన సహస్రబాహువుల నే రాముండ నా భార్గవుం
డొక తచ్ఛత్రువు కార్తవీర్యుఁడును దా మున్నారునాయందుఁగన్ 34

చ॥ మునుపొకసీతఁ గౌఁగిలికిఁ బొందిన సౌఖ్యమొకండె యిప్పుడో
జనకజలన్ సహస్రగతసంఖ్యల కౌఁగిళులన్ సుఖంబులం
గనుగొనగా సహస్రమునుగాక యొకండుగఁ దోఁచె భ్రాంతిపొం
దిన మది విచ్చిపోయి సుదతీవిరహానలభాజనుండనై 35

మ॥ ఇదిగో దైత్యుఁడు చాచి బాహువులు తా నేతెంచు నేత్రంబు లి
ర్వదిగాఁ గన్పడు వీనిఁజంపుట కహో రక్షస్సుఁ గాడాయెఁ దా
నిదియుం బూరుగుచెట్టు మిణ్గురులక ట్టీదీర్ఘచైత్రక్షపా
మదలిప్తల్ పరిలుప్తధైర్యుఁడ ననున్ మల్లాకృతుల్ తూల్చెడున్ 36

మ॥ అనయంబున్ జలజాప్తుఁడై యుభయసంధ్యాకామినీకోపభా
జనుడై యాసతి యుష్ణబాష్పసలిలవ్యాసక్తచిత్తాబ్జ గాన్
దినముల్ పుచ్చెడు నీ వియోగమునకుం దీరంబులేదాయె నా
దనుజగ్రస్తకుఁ గాడు భాస్కరుఁడు సంధ్యావేళ కేయింతయున్. 37

సీ॥ ఇవె సరస్సుకు వర్షఋతువున విమలపా
థస్సులు తెచ్చెడు తల్లికయ్యె
కడు గ్రీష్మమునఁ దటాకమ్ము నీరమ్ముల
చే నత్తార్యంబును చెందియుండ
నిరుపక్రకఁ గాంతార మెసపి గోలాంగూల
సమితి యట్టిటు దాఁటు జతనమందు
సనోన్యహస్తపాదాలంబనంబున
నుభయతటీసంగతోన్నతిని

శాఖాగ్రహణంబు సంస్పందిపాశ
మైన యుయ్యాలవంతెన ప్రాణముతమ

కట్టిన వసాధ్యమగు కార్యఘటనగాఁగ
వానరంబులదగు బుద్ధివైభవంబు 38

శా॥ నానావానికులంబులన్ బ్రియసఖుల్ నానామునీంద్రాంగనల్
కానలోకనలయందుఁ బండుగులకుం గైకొంచుఁ దారేగి డో
లానిర్వ్యాజ రసానుకూలమగు హేలన్ వల్లులం దూగి నా
తో నావార్తలు చెప్పు జానకియుఁ జేతోవీధి బాధించెడున్ 39

గీ॥ బిగిసి కొయ్యబాఱు వేలుపు పగతుఱ
యందు సురభిమాస మనుచు లేదు
తరులలోన గాలిదారి గగుర్పాటు
మొలకలే వసంతముగ్ధసుషమ. 40

ఉ॥ క్రిందికి వ్రేలు హారమును గేవలమున్ గుడిమూపునం జనన్
మందితరశ్మి సప్తఋషిమండలమట్లుగ స్వేదబిందుని
ష్పందము శ్వేతవారిద లవంబులుగాఁగను దీర్ఘచైత్రమా
స్సుందరయామినీగగనశోభను తత్ప్రియ కేళి నెన్నెదన్ 41

గీ॥ ఎగిరిపోవుదాఁక నిది కొంగయో తమ్మి
మొగుడుపూవో తెలియఁబోకయుండ
గుమ్ముగాఁగ నున్న గొడుగాకులకుమధ్య
భంగపెట్టెఁ గొంగ దొంగతబిసి 42

సీ॥ ఒడ్డున నెత్తైనయుర్వీరుహమ్ముల
వరుసల నీడలువారు నెడలు
నింద్రనీలమ్ముల నెసలారు బురుజులై
యెఱ్ఱకల్వలుపూచు నెడలయందు
మాణిక్యతోరణమంటపవ్రజమునై
పల్లటీల్గొను చిన్నిపక్షివితతి
గాలికూగెడు పతాకాశ్రేణియయి పైడి
తమ్మిపూఁదోట సౌధములుగాఁగ

వరుణదేవుని దుర్గసౌభాగ్యమెల్లఁ
బ్రకటముగఁ జూపుచుండెఁ బంపాసరస్సు
తెల్లతామరపూవులదిమ్మలందు
మధుకరీగానములు ప్రేమమధువులూన 43

మ॥ కనులందుల్ ఖగముల్ లతాంతములు వృక్షంబుల్ సరోవారి య
ల్లిన వల్లీచయముల్ మృగంబులు సుమాళిన్ యోగపద్యంబుగాఁ
గన నిర్వాచ్యమనోజ్ఞతామధురిమల్ కల్పించుచుంబో వాకొనన్
మనసౌఖ్యైకమనోజ్ఞవస్తువె పరామర్శింపఁగాఁ గల్గెడిన్ 44

శా॥ పారావారము ధారుణిం బుడిసిటంబట్టంగ సామర్థ్యసం
భారంబుండిన నుండవచ్చు నొనరింపంబోవ నేనైకదే
శారంభంబు ఫలంచునుల్ గ్రమముగా స్వాధీనమౌఁగాని ప్రా
కాస్ఫురవ్యక్తముగావు సర్వజగతీసంసృష్టిసంహారముల్ 45

క॥ అట శబరియు నిట పంపయు
నటులాత్మకు నిటులఁగనుల కనవధిభూత
స్ఫుటతరసుఖానుభూతిం
ఘటియించిరి యింతకష్టకాలమునందున్ 46

క॥ ఆయాపద యచ్చోటిది
రా ! యని తెలిసినను గొంత రాపిడితగ్గున్
గోయిలయు నుల్ల కొండల
లోయలలోనుండి యెడఁదలో నిడియించున్ 47

శా॥ పాప మ్మోమ్మపులి పీటవెట్టికొని యీ బాటం దువాళించెదున్
వే పుచ్ఛాహతితర్జనోగ్రరదనావిర్భూతరక్తచ్ఛవిన్
చాపం బెత్తక హస్తకర్షణముగా జ్యావల్లిమ్రోయింపు మీ !
ప్రోవుం జెందుత దాని దారి నదిపోవుఁగ జంసఁగా నేటికిన్ 48

ఉ॥ చంపుట చంపులే యనును జానకి హేతువివక్షచే ఫలం
బింపగుఁగాని యిప్పటికి నేమగునో యఘమేమొ యన్న వా

క్యంపుయథార్థముం జరిగె నక్కట తాదృశసీతఁ బాసి సై
రింపులు దక్కియుండుట భరింపఁగజాల నిమేషమేనియున్ 49

మ॥ ఇదిగో నిల్చినపాటు నిల్చినటు లిట్లే చేసుకొంటిన్ వియ
త్పద మాలంబముగాఁగ దైత్యపదవీ విధ్వస్తదేశంబు నే
మొదలన్ సర్వచరాచరంబు విలువంపున్ మీటునన్ దేల్తున
న్నది కాదంటిని పోవనిమ్ము యిపుడైనన్ నాసతిం జూడగన్ 50

వ॥ అని యనుచున్న యన్న సౌమిత్రి మధురప్రియాలాపంబుల సుగ్రీవ
ప్రసంగమ్ముల నాదుకొంచున్నంత 51

సీ॥ ఋశ్యమూకగిరీంద్రశృంగమ్ములను క్రింగ
నైన యుత్తాల దేహములవారి
సప్తసాలసముత్థశాఖాంతములచెంత
నమరు కోదండచూడములవారి
నీరాకరంబు డిండీరమ్ములకు సమ్ము
ఖములైన జాటజూటములవారి
ఆహవనీయవహ్న్యతిపవిత్రతకు గో
త్రమ్మైన మేనియందములవారి

గుమ్ములుగ నున్న తరువులకొమ్మలందు
నుండి గిరిరాజుకొమ్ములనుండి వారి
దగ్గరయు దూరములనుండి యుగ్గిమొగ్గి
సూర్యసూతి వారిద్దఱిఁ జూచి చూచి 52

మ॥ ఇద సిత్థమ్మని నిర్ణయించుటకు లేదీ వీరు లెవ్వారలో
మదదైత్యుల్ పొనరించు యజ్ఞపరిహింసాకాండ మాన్పింపఁగా
ముదుకంద్రొముసు లూహచేసి ధృతిమన్మూర్త్యగ్నులన్ వీరిఁ దె
చ్చెదరో శౌర్యమహాంబుధుల్ తరచి రాశీభూతతేజస్కులన్ 53

మ॥ తన యీచోటికి రానుజాలసుకిఁ జింతంగూరి పంతంబు పూ
నిన యవ్వాలియు నాయుపాంశువధపొంటెం దెచ్చెనో వీరిఁ గ్రు

వ్వీన కోదండము నేర్పు నమ్మికొని జీవింపంగనౌ బీటువి
చ్చిన యాదాత్మ్యంపు రేఖ తోఁచదిట సుశ్రీప్రౌఢపాథోధులన్ 54

చ॥ వెఱపున ఋశ్యమూకమును వీడి యొకంగుళ మేగలేను ని
వ్వెఱయగు నేరిఁ జూచినను విజ్ఞత లేక జగత్ప్రవృత్తి నీ
తెఱఁగగు వార్త యే నరపతిప్రకటాన్వయమందుఁ బుట్టెనో
తఱచిన వార్ధి సారహాయదంతుల మిన్నునఁ గ్రక్కినట్లుగన్ 55

శా॥ వృత్తాంతర్హితుఁడై త్వరాఘటన సుగ్రీవుండు సాలోచనా
భ్రూక్షేపంబుగ దూరమైన గిరికొప్పున్ లంఘనప్రస్తరో
గ్రక్షోదంబుగ నేగుచుండగను దూరానన్ విలోకించి త
త్పక్షీయుల్ వెనువెంబడిం జనిరి తత్ప్రౌఢోగ్రశృంగానికిన్ 56

వ॥ తత్ర సమావిష్టులఁ బ్రవృత్తిజ్ఞానాశానిశితాక్షుల మంత్రులఁ గాంచి
సుగ్రీవుం డిట్లనియె. 57

క॥ ఆరూఢ మేరుశిఖరా
కారుఁ డొకఁడు వార్షకాభ్రకారణకాంతి
స్ఫారశరీరుం డొక్కఁడు
మీరలు చూచితిరె మన సమీపాటవులన్ 58

శా॥ దృక్కోణంబులు పట్టరాక మలఁగెన్ గ్రీవాంతదేశంబు తా
దృక్కోదండప్రచండధారులును దాదృక్క్రూరబాహార్గళుల్
చిక్కంబట్టగలేక నాదు నెడఁదన్ శీఘ్రంబ యేతెంచితిన్
దిక్కుల్ నాల్గిటమున్ను తాదృశులు సందీపింప రీధారుణిన్ 59

చ॥ నియతము కాని కోపమును నిష్ఠురవృత్తి పరాక్రమైక జీ
వియు రిపుభావనిష్ఠుఁడును వెక్కసమైచను వైరవృత్తి వా
లియు నిది చేయుఁ జేయఁడని లేదు మరెవ్వరొ వీరెఱుంగఁగా
భయమగుఁ బూర్వ మెవ్వరయి వచ్చిరి యీదృశు లీవనానికిన్ 60

చ॥ కమలమునందునన్ వెడఁదకన్నులు మిన్నునఁ జాపకోటులున్
దమరు సహాయులై సకలధారుణియున్ సమకూర్చి పెట్టగా

దమరు విరోధులైయమపదంబునటుల్ గలిగింపఁ జాలగా
నమరిన యాకృతుల్ మరి భయంబగు వారి నెఱుంగఁగానగున్ 61

శా॥ ఆయేనాటికొ రాజసోదరుఁడనై యారాటమే లేక యి
క్కాయోఁడాదియు రాజనౌట పరవార్తాధీనజీవుండనై
నా యీ దుస్థితికూడఁ దాదృశముగానై రాజ్యమే లేదు శా
నీ యీకాపున్మకరుద్రులం దెలియకన్ నిద్రింపలేకుండగన్. 62

వ॥ అనిన నమ్మంత్రులయం దొక్కఁడు చెక్కుటఁబెద్ద కత్తిదెబ్బనొక్కు
గలయాయన యిట్లనియె. 63

శా॥ ఆమూర్తిద్వయ మేనుఁ జూచితిఁ దదీయాకారరేఖల్ ప్రమా
సామానాధికరణ్యమై చను దిదృక్షాస్వాదు రేఖావధుల్
కామారిప్రథమానమూర్తులు జటాకాంతిచ్ఛటావహ్ని రే
ఖాముగ్ధైకజగత్ప్రదీపములు విక్రాంతిప్రథాహేతువుల్ 64

గీ॥ భావ మకుతోభయమ్మును శ్వోవసీయ
మానసేందిరాపర్యాప్తమై వెలుంగు
నచ్యుతులకును బుణ్యభావచ్యుతులకు
నూహాగతమును సంబంధముండఁబోదు. 65

గీ॥ లౌకికాధికారలాభవాంఛాధౌర్త్య
వశత నాచరించుఁ బాప మెంతొ
యంత జనుఁడు దానివగు దుష్టఫలమును
దగులునంచు భీతిఁ దగులుచుండు. 66

మ॥ తమకం బందదు నూహచేతఁ గ్రియచేతన్ బుణ్యపాకంబు ప్రాం
తములన్ ముట్టదు వాలి వాని వెడయాదర్పంబు వేరొండు వి
క్రమసాహాయ్యము సమ్మతింపదు పరాక్రాంత్యేకనిష్ఠంబు ను
త్తమహా లక్షణ మొక్కఁడున్నది భుజోద్యత్కేలికిన్ వాలికిన్ 67

శా॥ వీరల్ వీరెవరో మరేల యిటకున్ విచ్చేసినారో జటా
ధారుల్ చాపములూని క్లిష్టమగువృత్తం బేలొకో శైలకాం
తారంబుల్ చరియించు టెక్కతమొ వృత్తాంతంబు దీపింపగా
నేరంగానగుఁ గాని భీతిఫలమున్నే కార్యమార్గంబునన్. 68

మ॥ అన సుగ్రీవుఁడు నీవు చెప్పినది న్యాయ్యంబున్ సమర్థ్యంబు కా
ని నితాంతోగ్రశరాసశృంగకవృషాణిప్రౌఢదేహుల్ నిజం
బునకున్ భీతి యదేలపుట్టదు దృఢవ్యూఢంబులౌ వక్షముల్
కనులంబట్టగరాని తేజమును నాకారంబులం జూచుచున్. 69

చ॥ ఉరవడి నున్న చోట నిలుచుండగనీయక బిట్టు నాలుగౌ
చెఱువులనీళ్లుత్రాఁచెఁ దుదిచెఁదినదంచనరాని వైరని
ష్ఠురుఁడయి యెత్తిపట్టిదగు నూడుచు దాఁటుతీర్చునంచు లే
దరియన వాలియైనయెడ నక్కట! సౌఖ్యములేదు గుండెకున్. 70

ఉ॥ క్ష్మాపతి చారచక్షువును గార్యముపట్లఁ బరప్రయోక్తయౌఁ
బ్రాపితధారుణీశ్వరసపత్నత రాజదశాయమానమౌ
నా పురుషోత్తముల్ తెలియనైనది ముఖ్యము వారలెవ్వరో
ఆపయి వారినెంచిన సమార్ద్రితఁ బొందెదు భావమంతయున్. 71

ఉ॥ వేలుపువెజ్జు లిద్దఱును వింధ్యనుబూని మహోజ్జ్వలౌషధీ
జాలముకోసమై యిటకు సోదరా! నీవుగఁబోయి సాధువౌ
వేళను జూచి వారలప్రవృత్తి నెఱుంగుము రమ్ము వెంటనే
ప్రాలి ఛలాకృతిం జనుము వానరపుంచు గణింతురో మఱిన్. 72

గీ॥ మూఁడు స్థితులొక్కటి విరోధమును వహించు
టయును రెండు సఖ్యముఁబూనుటయును మూఁడు
నదియిదియుకాకయుండుట యుద్ధియేదొ
తెలిసినన్ భావికార్యంబు తీర్పనగుట. 73

వ॥ అనిన నట్లేయని యమ్మహానుభావుండు నిమేషంబున రాఘవులకు
సుంతదవ్వునకు లంఘించి భిక్షుకాకారంబున రాఘవులఁ జేరి వినయ
భావసమున్మిషితశరీరుండై యభివందనపూర్వంబుగ నిట్లనియె. 74

ఉ॥ ఇవ్వనరాజిలోఁ దిరుగు చెన్నడుచూడను లేదు మిమ్ము మీ
రెవ్వరు వ్యూఢవక్షులు మహేశ్వరతేజులు దీర్ఘబాహువుల్
నవ్వులరారు మోములఁ గనంబడు సన్నని దైన్యరేఖగా
నెవ్వరికోసమో వెదకు చేగెడునట్లుగఁ గానిపించుచున్ 75

ఉ॥ కవ్వినవౌ జటల్ చివురుకానుగుజొంపములట్లుగాఁ గనుల్
పువ్వులమీఁద తేంట్లు ననువున్ విడిదుల్ పొనరించుకొన్నటుల్
మవ్వపుఁగాంతియున్ సురభిమాసవికాసముగాగ నున్న మీ
రివ్వనపత్రపుష్పప్రభ లేచు పుమాకృతులా వచింపుడీ 76

చ॥ కలితతనూచ్ఛవిద్యుతిత కాననభాగులు మస్తకోజ్జ్వల
త్పులకితధూర్జటాపవితమూర్తులు నన్యదురాపచాపవి
వ్యాలముఖకోటిశాత్రవసమాగమచండులు శాంబరీ జయం
తులు మరి మీర లెవ్వరు వినూతనదైవతమోహనాకృతుల్ 77

ఉ॥ ఇక్షుశరాసుఁడున్ మధువు నిద్దఱు జంటగవచ్చిరో శమీ
వృక్షగతాగ్నికిన్ విచలితేంధనవహ్నికి రెంటిమధ్యఁ బ్ర
త్యక్షసరోఽక్షభాసవిదితంబగుసట్టి యుషర్బుధాకృతుల్
దక్షులు మీర లెవ్వరు ప్రదక్షిణయోగ్యు లుదాత్తతేజసుల్ 78

శా॥ వేవిండ్లొక్కపిరిన్ ధరించినటులౌ విభ్రాంతిశాతాదాత్మ్యప్రహా
రావారీణులు సర్వలోకసృజనారంభాదివేళాద్విధా
సౌవర్చస్యులు ఘంవిదాసముదయుత్సంకల్పయుగ్మంబు నాన్
ఈ వేషంబులు మీర లెవ్వరు మహోపేంద్రప్రధానాకృతుల్ 79

చ॥ సకలచరాచరాగ్రసహనాగమనాత్మ్యమైన కాలరూ
పకవినతాతనూజుఁడు శుభంబులు కష్టాలు వెల్లులై చన

చ్చకితముగా దివానిశలఁ జూచినచెక్కులుపోలె నున్న మీ
రకుటిలమూర్తు లెవ్వరు హృదంతరవర్తిప్రదీపికాకృతుల్. 80

వ॥ మఱియు నమ్మహామేధావి యిట్లనియె. 81

గీ॥ అన్న వాలిచేత నపహృతరాజ్యదా
రుండు వానరేశ్వరుం డొకండు
సుగుణవారిరాశి సుగ్రీవుఁడనువాఁడు
అతని కేను సచివులం దొకండ. 82

క॥ మీతో సఖ్యముచేయఁగ
చేతోగతి నతఁడు వాంఛచేయుచునుండెన్
నాతోడ వార్తనంపెను
వే తెలియఁగ మిమ్ము ఛలితవేషముతోడన్. 83

వ॥ నాతండ్రి కేసరి. మా యమ్మగా రంజనాదేవి. నాపేరు హనుమంతుఁ
డని యూరకుండిన శ్రీరామచంద్రుఁడు లక్ష్మణునితో నిట్లనియె. 84

ఆ॥ తెలియు నీయనయు నధీతఋగ్యజుషుండు
స్వరనిబద్ధశుద్ధసామవేద
నిత్యగానజనితనిభృతసమశ్రుతి
సర్వశాస్త్రములయు జ్ఞానరాశి. 85

గీ॥ అనపమృషితంబు ఘుషితంబునైన వాక్కు
త్రిస్థలవ్యంజకంబగు దీప్రరవము
పూతవేదశిఖాసారభూతబుద్ధి
యాచితీజ్ఞానపర్యాప్తమైన మనసు. 86

ఉ॥ సన్నమిమాత్ర తత్ప్రతిహృదంతరభావుఁడు సాధుమూర్తి యీ
దర్శగతాత్మబింబకలితంబుగ నక్కపిరాజుఁ జూపెనున్
స్పర్శముచేత వాయుసుఖశైత్యము దీపిక మెట్లో భావనా
మర్శితవాక్కుచే నుభయమంజులభావము దీప్తమయ్యెడున్ 87

ఉ॥ ఇంతటి చారుధీయు వినయోందిరు సాధుని వ్యాకృతిష్ఠు నా
చెంతకుఁ బంచినట్టి కపిశేఖరు నొచితి వ్యాదృశ్యంబుయెట్లు దుర్
జింత సురారి చెప్పినది చెప్పినయట్టులఁ గానిపించుఁ దా
నింతటి మంత్రినేలెడు కపీశ్వరుఁ డెంతటివాఁడు కావలెన్. 88

క॥ ఇది కాలఁదవ్వులు తీవియ
వెదుకంబోయిన దటంచు వేచెప్ప మనన్
గదలి సుమిత్రాసూతియు
మృదులోచనకాంతి హనుమ కిట్లనిపలికెన్. 89

క॥ మీయధిపతి కెట్లున్నదొ
మాయెడ మీరాజునెడల మాకు నదె యభి
ప్రాయమ్ము దానికోసమె
మా యిటకరుదెంచుటయును మతిమన్నొాళీ. 90

గీ॥ హనుమ తా మాటలాడుచున్నంతసేపు
వ్రాల్పకయ ఱెప్ప నాతనివంకఁ గనుచు
లక్ష్మణుఁడు ప్రాణముల నూర్మిళామనస్క-
డయ్యె నవిదితసర్వవృత్తాంతుఁ డగుచు. 91

గీ॥ హనుమ తా వారిఁ జూచుచున్నంతసేపు
నన్నదమ్ములకన్నులయందుఁ గనుచు
రాము కన్నులఁ బరమేశ్వరత్వ మనుజు
కన్నులను యోగిరాజలక్షణము గాంచు 92

గీ॥ వేయిపడగలు విచ్చినవిధము వేఁ[illegible]
యంచులాడినవిధము రత్నాంశు లగసి,
సుసమధిగత సౌధాతథ్యుఁ [illegible]
వానరేశ్వరు సుగ్రీవుభాగ్య మెంచి. 93

శా॥ స్వామీ తమ్మునితో ద్వితీయుఁడవుగాఁ [illegible] నీ
నీమర్ వచ్చితి, మీర లెవ్వరు ధరానీమంతినీ[illegible]సుల్

హేమాద్రింబలె దేవతాయతను లుర్వీశానమూర్ధన్యు లం
హోమిధ్యాకరణప్రభావులు సమప్రోన్నీలదంతర్ద్యుతుల్. 94

ఆ॥ అన్నకనుల దీనమైన యంగీకృతి
నరసి స్వామి యిట్టులాడెఁ గపికి
నాడఁబోవునంత నాయన కీయన
ప్రాణబంధుఁడన్నపగిది తోప. 95

సీ॥ జన్నంపుఁబొగలచే మిన్నుమేదిన నైల్య
భావమాకల్పశోభానిధాన
మైనట్టి యజమానుఁ డాయన రఘువుల
తలమానికంబైన దశరథుండు
పరమహాతుర్వర్ణ్య పరిపాలనాకార్య
సాధుచిక్కణపరిష్కర్త నృపతి
తాను ద్వేషింపడు తన్ను ద్వేషింపదు
జగము మర్యాదాప్రసన్నమూర్తి

అమృతరసభావపర్యాప్తి నందినాడు
దశరథావనీపతి యయోధ్యాప్రభుండు
ఆయనకు జ్యేష్ఠపుత్రుఁడీయనఘమూర్తి
మేనుతాల్చి ధర్మమైన వా 96

సీ॥ నలువుగ మన్న దమ్ము లము మే మ మొ
డం దాసభావంబునం శి నేను
వనవీథులకు వెంటవచ్చి నా నన్న కు
లాంగనాశోఁగూడ కవికరుగ
నాయమ జానకి యే యమ ముచ్చు శై
వధనుర్విక్షణ పణము చేవి
తాజగజ్జనపూర్ణదర్శి మై యున్న యు
న్నుగహించెను తండ్రినుడి వే నర్ప

దైత్యుఁ డెవ్వఁడో భూమిసుతన్ హరించె
జన్నపుంబైడినాఁ గేటి సన్నకొట్టు
గీతఁ గనుగొన్న శ్రీపరిపూత సీత
నిటఁ దదన్వేషణార్థుల మేగుచుండి 97

క॥ ఒకఁడు కబంధుఁడు శపితుఁడు
మొకరియయిన పెద్దమద్దిమొద్దునలెన్ హా
మకమార్గరోధి సహసా
నికృత్తబాహుండు నింగినిండెను వేల్పై 98

శా॥ వే సౌహార్దనిధాన మాదితిజుఁ డుద్వేలప్రియవ్యక్తి మా
తో సుగ్రీవునిగూర్చి కీశపతి యెంతో మంచివాఁడంచు నెం
తో సమ్యఙ్మతియంచుఁ జెల్మికిని బాత్రుండంచు నన్వేషణా
ఘూసామర్థ్యవిచారసాధనసమగ్రుండంచుఁ జెప్పెంజుమీ 99

క॥ ధృతి నెత్తినచాపమునకు
బ్రతిలేని మహాప్రతాపవార్నిధి నతఁడి
క్షితి యన్న యహో శరణా
గతుఁడై చనుదెంచెనయ్య కపిరాజునకున్ 100

క॥ మతి సంయూపితవేద
త్రితయార్థవినిర్ణయైకధీరుఁడు నుతవా
క్షితి యన్న యహో శరణా
గతుఁడై చనుదెంచెనయ్య కపిరాజునకున్ 101

గీ॥ అన్న శరణాగతుండయి యరుగుదెంచె
నెన్న సుగ్రీవునకు వానరేశ్వరునకు
శబలితములైనయవి యశస్సాధుజగము
లెవనిచేఁ బితృవాక్యసాహాత్మ్యచేత 102

గీ॥ అన్న శరణాగతుండయి యరుగుదెంచె
నెన్న సుగ్రీవునకు వానరేశ్వరునకు

స్పర్శమాత్రవిఘటితముల్ శైనవైష్ణ
వములు ధనువు లెవ్వనిచేతఁ బ్రభువుచేత 103

శా॥ కందర్పారిసకామనిష్ఠురతపత్కర్మందిత్రేతాసరా
స్కందిక్రూరశిరశ్ఛిదాశితసృషత్క ప్రౌఢుడౌ నన్న తా
నొందుంబో శరణంబు మీ ప్లవగరా జూహ్యప్రియుండంచు నం
చుం దీప్తోరుమతిప్రభావయుతుఁ డాశుప్రక్రియాబుద్ధియై 104

శా॥ నిర్ధూతాఖిలలోకకల్మషుఁడు మన్నీడై పుమాకారవే
దార్థీభూతసమస్తధర్మచయుఁడై తానైన మా యన్న తా
నర్థాంగీవిరహార్తిచేత శరణంబందుర్ గపీశాను స్నే
హార్థస్వీకరణాభియానరచనాహైయంగవీనార్ద్రినిర్ 105

గీ॥ ఒకకిరేకు హంసముక్కుతోఁ జీల్చిన
నవ్యమైన కోకనదముకుళము
ప్రొద్దుపొడుపువేళ ఫుల్లమైనట్లుగా
హనుమ వదనసీమ యందగించి 106

గీ॥ ఇంత మంచితనము నింత పాండిత్యంబు
నింతశౌర్యరేఖ యింతదీప్తి
సాధులోకమాళి సరగ సుగ్రీవుండు
చూడవలయు మిమ్ముఁ జొక్కవలయు 107

గీ॥ అన్న వాలిచేత నపహృతరాజ్యుఁడై
కూడ సూర్యసూతి వాఁడిమగడు
అతని పాల్యవర్గమైన మేమున్నాము
పృథ్వితనయ మేము వెదుకఁగలము 108

గీ॥ మీరుమీరు కలిసి మిత్రులౌటయు మాకుఁ
జక్షురస్తిభావచారితార్థ్య
మఖిలసృష్టి సారమైనది యొకఁడే
యరయ సాధుజనసమాగమంబు 109

వ॥ రండు దయచేయుఁడు సుగ్రీవుపాలికిఁ గొనిపోదు నన లక్ష్మణుండు శ్రీరామచంద్రునితో నిట్లనియె. 110

చ॥ పరముఁడు సాధుశేఖరుఁడు పండితమౌళి యబద్ధమాడు నే
విరిసినమోమునం దెడఁద విప్పి కనంబడుఁ గంటికాంతులం
బెరసి సుఖానుభూతి కనిపించెడుఁ బ్రశ్వసనీయతాగుణ
స్ఫురణము కోటికెక్కినది పోననువచ్చును వీనివెంబడిన్ 111

క॥ పరివిదితప్రసన్నాంతః
కరణుండవు నీదు వెడఁదకన్నుల వెలుఁగుల్
ధరణిజను గుహుని శబరిని
బరికించినయట్లు దీప్తిభాస్వరములుగా 112

సీ॥ శ్రీహనుమ భిక్షురూపు పరిత్యజించి
ప్రోడ కపినృపభాశ్రుతి మోకరించి
బుజములం దెక్కుఁడీ కొంచుఁబోదు ననిన
నన్నదమ్ములు బుజముల నధివసించి 113

గీ॥ మహిత పరిణాహములును మాంసలము లగుచు
మృదుపిశంగ జాంబూనదమృష్టలోమ
సమితి చిక్కణవినిభృతాస్తరణమైన
నన్నదమ్ములు బుజముల నధివసించి 114

గీ॥ సరగ నాగ్నేయమునకు నీశాన్యమునకు
వ్యాప్తమైన మహేంద్ర చాపంబు కొసల
వరుణపర్జన్యు లధివసింపనయినట్లు
లన్నదమ్ములు బుజముల నధివసించి 115

ఆ॥ పక్షి యెగురు దూరపు వానరం బిది దూఁకి
నాఁడో హనుమ యెగిరినాఁడో తమ్ము
జాగ్రసంస్థులయిన యన్నదమ్ములును సు
గ్రీవబుద్ధు లవధరించలేదో ! 116

చ॥ నడచియ పోవునంచును మనంబుల నెంచిరొ దూఁకుచుండగా
గడువడి వానరంబె యవుఁగా యని యెంచిరొ! పోవుచుండగా,
నిడివిగఁ జిత్రమంచును గణింపరహో! ఖగవాహనత్వమే
ర్పడి చిరకాలమద్ది యలవాటయినట్లుగ రామభద్రులున్ 117

మధ్యాక్కర :—

ఈయనంతాకాశమెల్ల నీయన యీగతిఁ జనునో
మాయురే యీమింట నేగు మహిమంబు మహితుండు వైన
తేయుండు మింటిలో చెక్కతీర్చిన తెన్నుగా నెగడె
నీయన యెంతటివాఁడొ యెఱుగంగ నేగతి నౌను 118

మధ్యాక్కర :—

భావమం దీయన దేహపరిమాణపరిణాహములును
భావింపఁగాఁ గొంతయైన వర్ణింపఁ బట్టందఁబోదు
తా వచ్చి భిక్షువై యల్పతను వున్నతబలిష్ఠదేహుఁ
డై వానరం బంసములును నష్టాపదాదిచూడములు 119

వ॥ అనుకొన్నంతసేపు లేదు రామలక్ష్మణులే రెక్కలుగా హనుమయన్న
గరుడి సుగ్రీవునిముందు వ్రాలి యిట్లనియె. 120

చ॥ దశరథుఁడన్న కోసలుఁడు ధారుణీనాథుఁడు జన్నపుంబొగల్
విశదముగాఁగ మింటికని పెట్టిన పూఁతలుగాగ నొప్పెఁబో
ప్రశమితచిత్తుఁ డాయనకు రాముఁడు లక్ష్మణుఁడన్న పుత్రు లీ
విశదమతుల్ జటాచ్ఛవులు విచ్చిన చొక్కపుఁ బూతమామిడుల్

చ॥ తఱుదగు రాజ్యముల్ సపత్నితల్లి మనస్సును బట్టి తండ్రిసం
సను విడి శాంతుఁడై పటశిఫాఘటి గ్రగజటానిటాలుఁడై
వనమున వచ్చినాడు సిత్రనాశ్యగ లేసుకాన్తి నుండెడుసం
మున ననుజాతుతో వనితతో నెడఁబాయు కెఱుంగరానిదై 122

చ॥ పసితనమందు గల్లమున వజ్రపుఁబెట్టున బాధలేద యీ
ఘసృణతనుల్ బుజాలపయి మన్ననగా దయచేసినంత వె
క్కసమయిపోయెఁ గార్ముకశిఖాజ్యహదగ్నులు ధర్మలగ్నచే
తసులు గభీరభావులును ద్రాసవిహీనులు మైత్రిదీనులుర్. 123

ఉ॥ రావణుఁడన్న దైత్యుఁడు ధరాతనయామణి దొంగిలించె నా
దేవియు మైథిలేశసుత దీపితబాల్యమునందె రాముఁడుర్
శైవధనుర్వికర్షణవిశారదబాహుడు పెండ్లియాడెఁ దా
మీ వనమెల్లచో వెదకు చిచ్చట వచ్చిరి పంపఁ జూడఁగర్ 124

గీ॥ వీరు మొదట వాలిపేరైన నెఱుఁగరు
దను కబంధుఁ డల్ల విను వచింప
వెదకికొంచు నిన్ను విచ్చేసి రిచటికి
పరమమైత్రిభావబద్ధులగుచు. 125

చ॥ నిను శరణంబుపొందెదరు నీరజనేత్రులు భాస్కరాన్వయుల్
జనకసుతాగవేషణవశంవదచిత్తులు మిత్రభావసం
జనితపడంగలాభగతచాపమనస్కులు రాజమోడముల్
ధనువదితిప్రచండనిభృతంబగు శక్తి మదిం దలంచుచుర్. 126

గీ॥ అర్చనముచేసి యర్ఘ్యపాద్యంబు లిచ్చి
రమ్యవాక్యమర్యాదాపురస్సరముగ
సఖ్యభావ మర్థింపు నిస్సంశయముగ
దీర్ఘభూతు లలౌకికాతిథులు వీరు. 127

ఉ॥ మానుషమై [illegible] సమంజసగౌరవభావ [illegible] నా
మానిన సూర్యసూతి మఱియుర్ మృ[illegible]చనమందహాసు [illegible]
తానుగ [illegible]ంజనాసుతుఁడు [illegible] [illegible] మోసి [illegible]
నేనును తెచ్చినట్లెయగు నీరజపత్ర[illegible] లలోచనుల్. 128

చ॥ హనుమ [illegible]చింన నీ సక[illegible]మైన [illegible] నా[illegible] [illegible]ంబు [illegible]
మ్మునిఁ గొనివచ్చి నిల్చితివి [illegible]ంగిటు నేస్తముగోరి, నేను రా

నని తొలుదొల్త రాచబిగువైనను జేయపు నిన్ను మించి నా
యునికియు లేదు రాజ్యమును నుగ్మలి లేరనుటల్ సమానుడా 129

క॥ ఈ కొండ వదలి రాలే
నాకారణ మొక్కఁడుండె నది పాలింపం
గైకొంటి నన్ను నెచ్చెలిఁ
గైకొంటివి యావదసునికాయకృతజ్ఞా 130

క॥ వాగర్థభూతబుద్ధి
స్థాగూసమదీపితాంతరానందాస్యా!
నా గడప తొక్క తనుటకు
నేఁడపయు లేఁ నే నదేమనఁగలనో. 131

వ॥ అని చ మాళముఁ కీలితే దీ రముఁ వోని హస్తాక్షణంబులఁ గైలాస
గిరి శిఖరనికషకారదంబింపోని పరిష్వంగంబుల హనుమత్కృత సర్వ
సంభారసామ్రాజ్యం బగ్నియందు వేల్చి. 132

మధ్యాక్కర:—

ఈ మేనిలోపలఁ బ్రాణ మెన్నాళ్ళు లెసలారుచుండు
నీమైత్రి యన్నాళ్ళు నాకు నిరపాయనిర్నిద్ర మొప్పు
నీమేనిలోపలఁ బ్రాణ మెన్నాళ్ళు లెసలారుచుండు
నీమైత్రి యన్నాళ్ళు నాకు నిరపాయనిర్నిద్ర మొప్పు 133

వ॥ అని ప్రతిజ్ఞ లాడుకొన్నంత హుతాగ్నిలో 134

క॥ వెలిసమిధ లోఁసి పానువడు
తెలిసడలని బూది బీట్లుతేలి తదంతః
కలితారుణానలచ్ఛవి
వెలలిచెఁగపిరాజరాజ విస్రబ్ధాక్షుల్ 135

వ॥ సుగ్రీవహనుమత్కృత్తాస్తీర్ణ సాలచందనశాఖలమీఁద నన్నదమ్ములు
విశ్రమించినంత సుగ్రీవుఁ డిట్లనియె 136

చ॥ ప్రభువులు మీరలిద్దఱును బచ్చనియాకులపై నిషణ్ణులై
ఋభుపరిషన్మణిస్థలిని నింద్రబృహస్పతులట్లు వారలై
శుభమతులౌచు నన్నదయ జూచెద రీగతి భాగధేయవ
ల్లభనవవల్లి మోకద్విదళంబుగఁ బూఁతను బట్టినట్లుగన్ 137

ఉ॥ అచ్చట మిమ్ము మామకగుహామణిరాజసభాంతరంబునన్
మెచ్చగు రత్నవేదికల మిమ్మును జేర్చి నాదుగుంపెసన్
నచ్చిన మిమ్ము గౌరవసనాథుఁడ నౌటకు లేదు లేదనన్
గ్రుచ్చినబల్లెమైనయది గుండెను భ్రాతృవిరోధదుష్టుఁడన్ 138

చ॥ ప్రియతముఁడైన తమ్ముని సరే! యెవరైనను దాసభావభా
రయుతుని నేల పోనడచి రాళ్లలఱప్పల నుండనిత్తురా
దయయని మాలి వాలియను దానొకరుండనుదక్కఁబోవ నీ
స్మయమతి నాదుభార్యను రుమన్ హరియించుట కేమిచెప్పుదున్ 139

ఉ॥ మీ స్థితి చూచెదం బ్రతిని మేషము తమ్ముఁడు స్రుక్కనే మొయి
న్నాస్థ కనంగనయ్యో నయనాంతములందున నీకు నిట్టినీ
సుస్థితి వాలి దుస్థితికిఁ జొచ్చిన భేదము కొండలఁదు రా
జ్యస్థితిఁబాసి మత్ప్రియులకైనను నేనది కాకపోవుటే 140

క॥ కోపమ్మును రావచ్చును
గోపమ్మును నంటిపెట్టికొనియుండుట యుం
గాపురుషలక్షణంబగు
నా పొనరించినది చూచినన్ స్వల్పమగున్ 141

క॥ ఆయనయో నేనో మరి
యీయిలపై బ్రదికియుండు టెద్దఱ మనసా
ధేయమ్ము నసంభవమును
ఆయన యది యట్లుచేసె నంభోజాక్షా 142

ఉ॥ దారిని బక్షిరాజు కటుదానవునాఁగి హతాసువయ్యెనం
చో రఘురామ! యీవిహగమోపనుజాంగవు నీవటంచుఁ బ్ర
జ్ఞారమమాణచేతసులు సంగతశిఖము నోర్చుకోనుతే
రోదిమిచున్నదా గుణ మిఁకొక్కయెడం గనరాదు చూచినన్. 157

ఉ॥ ఈచతురంబులాశిరల యాకృతభాత్రిని నెంకు జానకిం
దాఁచిననెనఁ బూత కతుదాత్రిజ నేఁ వెదకించి తెచ్చెదన్
నీ చెలికాం మెంతటిన నేర్పు గసాంకృతిప్రసయత్న రే
ఖాచణ మాశరాన్వయశిఖాహితాగ్నికణంబు రాఘవా! 158

ఉ॥ ప్రాజ్ఞతవీడి బాహుబలబంధురమంధకబుద్ధి నూఁది తా
నాజ్ఞ నటించు నేర కు ధరాధిపుఁ డయ్యుఁ జమూపనూహకా
ర్యజ్ఞత లేదు రాజనుచు నన్యకపీంద్రప్రయుక్త్యనూనకా
ర్యజ్ఞత లేదు వాలికి భుజాగ్రశిబద్ధనృపోగ్రకీర్తికిన్. 159

ఉ॥ నాకమునన్నలం బ్లవగనాథులసామ్యబలం బకోటిసం
ఖ్యాకులు కామరూపులు దిగంతవిహంగమునక్రియాపచం
డాకృతు లుర్వరాదశదిశాద్రిగుహాబహుకాననోగ్రవీ
థీకృతపర్యటుల్ వసుమతీసుత యొక్కెడ యభిజ్ఞ నేర్తురున్ 160

చ॥ కనుఁగడి మబ్బులో మెఱుపుగాఁ గొనిపోఁబడినట్టి యామెయే
పుడమిని నూజయేమొ యపవిరా కొన గనునమ్ము నా మెయిం
దొడవులు తీసి మూట ముడి త్రోచెను మా నిలుమన్న చోట బ
ల్విడి కొనిచేరఁజించి ముడివేసెను దాఁచి జూతువా యనన్ 161

గీ॥ ఇద్ది యడుగనువలయునా యిఁక నిచటి
కూఁచుచుంటివా యనియె రఘుప్రభుండు
నిజరహోగుహాగ్ర ప్రవేశనిష్క్రమణము
గను గపీశ్వరుఁ డివ్విగో యనుచుఁ జూపె. 162

చ॥ ఒకనిఱుపేదనున్ మనిమయోగనిధానము త్రోఁచినట్లు నే
త్రికములు విచ్చి రాఘవుఁ డుదారగళస్వనమొప్ప నింద్రియ

ప్రకరము సంజ్ఞమాలి ధరపైఁబడి మూర్ఛితుండైన లక్ష్మణుం
డొక పరిదీనదృక్ఛవియు నూని సహోదరునూది తేర్చెనర్. 163

మధ్యాక్కఱ :—

హా! హా! పయోధరకైశికా! మనోజ్ఞాకారకా! వి
దేహరాజకుమారికా! క్షితిపవ్రతతీవిలాసాంగి!
యూహసౌందర్యరేఖానవోదవుఫ్యూహసౌశీల్య
ప్రోహాధ్వభర్తృవ్రతానిరూపితారుంధతీతుల్య. 164

మ॥ కనుఁగుఁడ్డుల్ నవవాక్షుకాభ్రిపటలీగండూషితక్షోణిభృ
న్మణికూటంబులుగాఁగ బాష్పపటలిన్ క్ష్మాకన్యకాభర్తకుం
చు నగల్ నూపురమంచుఁ గంకణము సంచున్ రత్నకేయూరమం
చు నిదిన్నేరగరాను రాదురలుచుం జూపంబు నిష్పిడమై 165

క॥ ఎందుకు చూపించితి నం
చుం దిగులుంబడనుజొచ్చె సుగ్రీవుఁడు నే
త్రాంచోళిత మాశ్చర్య
స్పందమువం బ్రణయగౌరవము తొలుకాడన్ 166

మ॥ ఒకయేనైనను గుర్తుకల్గెనదొ లేదో నే, కామూల్య తీ
రిక సౌమిత్రిని జూడుమంచు నొసుగ్రీవుం బు సౌమిత్రియుం
జకితాక్షుంబులుగాఁగ జూడుమ శిరస్సు వాంఛ పమూ
ధిక యత్నంబున నూపురద్వయము గుర్తించె దృశాంరెంబునన్ 167

క॥ అవి తల్లి కాలికుంచెలు
నవి గుఱుతే నాకు చిన్న లామము చరణ
చ్ఛవిదీప్తములై కానిఁగెను
నవి రూపము చేతఁ గట్టమమ్మె గుఱుతిఁకన్ 168

గీ॥ సంజూను రెంట నా నమస్కారసరణి
నేను పదుమూఁడువర్షంబు లెఱిఁగియుంటి

నివి విడిగ నూపురములని యిప్పుడు తెలిసె
చేతము విభక్తికిని నింతెసేపు పట్టె 169

వ॥ నే నింకేమియు నెఱుఁగను నాకు తెలియు దనిన 170

క॥ స్మృతిమార్గాతీతంబై
ప్రతినుమహాధర్మశిఖరపర్యంతంబున్
మతి మానవ నృపనాగగ
కతఁ గని సుగ్రీవుమెన గగురయ్యె వెసన్ 171

గీ॥ అంత రాముఁడు బాష్పపర్యాకులేక్ష
ణుఁడు సుమి తాతనూజుఁ గన్గొంచుఁ దెల్ల
నైన మంజిడికన్నుల నాత్మయందు
నంగనారూపధేయంబు నరయునట్లు 721

చ॥ పృథివితనూజ తాను గనిపించక భూషలు కానిపించుటే
పృథుశకునంబు లగ్గునో యెగ్గునో తెలియంగరాదు సా
రథి కనిపించి మేఘములు క్రమ్మి రయొకింతన సూర్యుఁడున్ వియ
త్పథమునఁ గానిపింపమియు వాష్టిక వేళఁ గ్వచిత్స్వభావమే. 173

ఉ॥ తమ్ముఁడు నందెలే యెఱుఁగుఁ దమ్ముఁడుగా డొకదైవ మీతఁడీ
క్రమ్మినబాష్పరోధమునఁ గాంచఁగఁ జాలను భూషణచ్ఛవుల్
తమ్ముల నిచ్చెనాకు మఱి దైవము జానకి నిచ్చె నాకు నీ
తమ్ములు దేవతాసములు తల్లియు దైవతలోకరత్నమై 174

మ॥ తనసేమమ్మును దాను చూచుకొనఁగా ధైర్యంబులేకున్న చో
జనకక్ష్మాపతిపుత్రి యేమిటికి భూషల్ విప్పి యిచ్చోట నీ
తనకు న్నాకును బొందుగల్గుటయుఁ దద్భాగ్యప్రభావంబుపోం
తనయే నాకును దారిచెప్పుటయొ యేతత్స్వాతాత్పర్యమున్ 175

వ॥ అంత శ్రీరామచంద్రుండు తేరుకొని యిట్లనియె. 176

గీ॥ తాను పెద్దదైనతరువాతఁ జేయించి
నాఁడి వెల్లనగలు నాదుతండ్రి
మావిభూషలెల్ల మాకిచ్చి చన్నది
గాక సీత దైత్యలోకనీత 177

గీ॥ నాయనా! ఓయి నా లక్ష్మణా! నగలివి
చూచినంతన నాగుండె సురిగిపోవు
నీవియుఁ గనిపించకున్నముందే నయంబు
రీఢచే మొద్దువారి నిద్రించుచుండె. 178

మ॥ అవు నాతమ్మునకున్ నమస్కృతిసమర్హంబైన యీ నూపురం
బవు నే మోవ బుజాలపైఁ దల సమర్హించు భూమీసుతా
ధవుఁ డాయ దియలన్ బుజాలనిడి చింతామగ్నుఁడయ్యెన్ మనో
భవనైరాశ్యము భ్రూశరాసంతికాప్రహ్వాకృతిం దోఁచగన్ 179

వ॥ అట్లు చాలసేపు డి శ్రీరామచంద్రుండు సుగ్రీవునితో నిట్లనియె 180

ఉ॥ ఈ యొకమేలె చాలు సఖ! యిప్పటికిక భవత్కృతంబునై
పోయెను జానకిన్ వెదక పుస్తెవు పుచ్చవు నీచమూతతిన్
నాయెదయందు నీవయి పె నద్భుత యీకృతి బ్రహ్మలోకసౌ
ఖ్యాయతిగాఁ దవర్చినదయా! సదయాంశ పదారతానిధీ. 181

శా॥ ఆయంభోజదృశన్ బిశాచకనశన్ బ్రాణేశ్వరిన్ వీడి య
న్నా యీ ప్రాణము నిల్పునట్టులుగఁ గన్పట్టంగరా దీవునున్
మా యీ తమ్ముఁడు జానకిన్ వెంకి వేమ్రుంది పు డాపుష్టదై
తేయున్ జానకిఁ గోడఁ జెప్పుడు తెదద్ధభూతెమద్ద స్థితిన్. 182

ఉ॥ భూసుత స్త్రీజగత్తునకు భూషణ మామెకు భూషణంబులన్
భాసురమౌల్ కనుంగొనెడుభాగ్యముకంటెను భాగ్యమున్నదే
ఈ సొబగైన భూషణము లెవ్వఁడు చూపెను వాఁడె మిత్రమా
నీ సొబగైన భూషణము నెవ్వఁడు గుర్తిడె వాఁడె తమ్ముఁడో. 183

వ॥ అనుచున్నంత సుమిత్రాంజనాతనయు లొక్కరినొకరు చూచికొని హనుమదక్షిచాలననిబంధమ్మగ నొక్క వానరంబు తరుశాఖ నవత రించి శ్రీరామచంద్రుని ముందుకూర్చుండి జానకి నగలుతీసి కేయూ రంబు కంఠమున నూపురంబు గళంబునఁ గంకణంబు పాదమునఁ దొడివి కుండలంబు లేమిచేయవలయునో తెలియక నోటితో గొరుకఁబోవ శ్రీరామస్వామి పకాలున నవ్వి యిదియేమి సంచారి యనిన నందఱు నవ్వులందేలి సుగ్రీవుండు రాముని కిట్లనియె. 184

క॥ నీవంటివాఁడె యిటు మో
హావేశము పొందునేని యస్మాదృశులున్
ధీవిరహితు లేమి మరిం
గావలెఁ గాకుత్థ్సవంశకల్హారహితా. 185

క॥ మావగు సృష్టికి మరియును
నీవగు సృష్టికిని భేద నియమంబున్నన్
పైదలివలని వియోగజ
మౌ దుఃఖము మాకుమాత్ర మగ్గిమ్మో సఖా 186

ఉ॥ గుండియజారిపోవ్రుటకుఁ గోవిదమస్తకదేశరత్నమె
క్కొండు మహామహోజలధి కావలెనంచని యున్నదేమి యె
వ్వండునుజాలు శత్రుజనపాపభుజంగఘనాగ్రణీతపా
దుండును దుష్టశిక్షణకుఁ దూగనిచో జగమేమి కావలెన్. 187

చ॥ ఉవిదను బాసియుం బ్రదికియుంటినిగాపున నీవు సఖ్యసం
భవదఖిలోకధన్య సుఖ భాజనుఁడైతిని దీని చేత నా
యువిదను రాజ్యమున్ సురలనొందెద నంచనువట్టి ధైర్యముం
దవిలితి నేనుపోయిననునంతర నేమియొనర్తు నేనుగన్ 188

ఉ॥ ఇంతయిట్టి ధైర్యము వహించితె నీవును ధైర్య మూనినా
గొంతుకఁ బ్రాణముల్పయొఁ క్షోణిసుతన్ వెదకించి తెచ్చి యి

గను నాయన్నకు వాలికిం దెలియు రక్షస్సుండు క్షేమాలనో
జనకక్ష్మాపతిపుత్త్రి నెందునిచెనో చారైకవేద్యంబగుఁ. 203

ఉ॥ వాలిని బోయి నీవడుగ వాలికి వట్టి పరాక్రమైకదు
శ్శీలికి భోగశాలి కవశీకృతచిత్తునకుఁ భవత్ప్రభా
జాలము నీ వియోగభరసంగతమైన యుదాత్తభావము
ద్వేల మెఱుంగనైనదగు పేర్మియు నోర్మియు లేవు రాఘవా 204

వ॥ అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె. 205

మధ్యాక్కఱలు :—

నీవును హనుమయు వాలినింగూర్చి నిట్టపల్కెదర
ఆ వాలి యెవ్వఁడో వాని వ్యవహార మదియేల నాకు
నీవు నాచెలి వతఁడు నీనేల నెలఁత హరించె
నా వేల్పు నీతోడిచెలిమి నాడెన యతనితోఁ గాదు. 206

అతనికి నాతోడఁ గానునైన కార్యంబింత లేద
అతనిని జని నేనుగాని యాశ్రయమందిన యెడల
నతనికిఁ దేలికయగుదు నది శ్రేయ మతనికిఁగాదు
తతకర్మగతిఁబట్టి చెలిమి తగు సపత్నతయు ఘటిల్లు 207

అతఁడు నీకింతగాఁ జేసె నన్యాయ మనియు శిక్షార్హ
మతఁడో యపేక్షప్సుందు నతనికి నక్కట ! నాకు
జతనుగాఁ గలయికయనుచు సమకూరఁజనుట స్వభావ
గతికాదు దైవ మేంధమ్ముగాదు సంకల్పవిఘ్నమ్ము. 208

అది యట్లుజరిగిన దనఁగ నది యెప్పు డట్టులే జరుగు
మనెకి నూహింపఁగా వేయిమార్గముల్ మసలునే కాని
యవి కర్మనిర్ణీతమైన దా యొక్క యధ్వమే పోవు
నది మంచిదా చెడ్డదా యటంచనునది యొండె ప్రశ్న 209

క॥ నా కహితము స్ఫురియింపదు
నాకు హితముగాఁగఁ దోఁచినను దత్కాల
వ్యాకృతి శుభతమ పరిణా
మాకారకమై సుధర్మమై ఫలియించున్. 210

చ॥ కపిపరమేశ్వరుం డనియె క్ష్మాతనయాహృదయేశ ! నీదు జీ
వఁపుఁబొలినాటికూర్పు బలవత్తమ మూర్జితమయ్యె వట్టిని
స్త్రపము జగత్తు, భూతమయుతం దనురూషము, వాలి లోహశై
లపటుశరీరుఁ డాతనిబలంబు సచేతనపర్వతాభమున్ 211

చ॥ నిను మునుచూచి నీవు కడు స్నిగ్ధుఁడ వం చనుకొంటి వాలి పం
చెననుచు నెంచివాడ నిది చేతము చిత్రముగా మెలంగెడున్
సనదనదీధరిత్రీధరసాగర మీఁదునసిన్ ద్విధాప్రభే
దనమొనరింతు వేనెఱిఁగి తత్కపిభీతిఁ బోలంచజాలనున్ 212

సీ॥ హనుమకు నీకును నగ్నిహోత్రము వేళ
యైనది రేపు మాటాడవచ్చు
ననఁగ రాముఁడు మందహాసచాంద్రీముఖా
బ్జుండు మైత్రీసితాక్షుండు లేచె
లవలీలతాకిసాలభ్రాంతిఁ బరికాడు
తెసశాఖవోని పరిస్తరము చిదిమె
రమణీయసితచకోరభ్రాంతి గిజిగాడు
కొమ్మవేరెడు తనగూడు వదలె

ఋశ్యమూకధరాధర శృంగములును
నుర్వితెట్టెలుగాదోఁచెఁ బర్వచంద్ర
చంద్రికా వాహినీ పరిస్ఫార మృదు త
రంగరంగానుషంగ సారంగములుగ 213

మ॥ చనుదెంచెన్ విలసన్మతంగ మునిరాజప్రాణతేజశ్ఛటల్
చనుపల్ కై రవిణీసతీమధురలజ్జామందహాసచ్ఛటల్

వనసంభూతసితాంశుమూర్తి హిమరుక్పంచాస్యలోలత్సటల్
కనదంశూజ్జ్వలబుశ్యమూక గిరిశృంగస్విన్నచాంద్రీఘటల్ 214

ఉ॥ పేరిమి మౌనిరాజు తన బిడ్డల శిష్యులకంటెఁగూడ ము
ద్దారఁగఁ బెంచుకొన్న తరులందవుఁదీనలు సాగులాడి జ్యో
త్స్నారుచిరప్రభాశకలితచ్ఛవిగుచ్ఛము లూఁగులాడె గం
బూరయుఁ బచ్చకప్పురము బువ్వముబంతులయాటవోలికన్ 215

గీ॥ అరయఁ దెలిదీవిలోని యిల్లాండ్రయొక్క
తనుకుతలకట్టు సహజానదాత మరియు
నరయు, రాకానిశాదేవి మఱియు శ్వేత
వేగ నామెకుఁ దలసూపె వేఁగునరలు 216

గీ॥ చెడి పనికిరాకపోయిన శీతకిరణు
స్థూలకిరణంబులను ప్రాఁతదూలములను
గుట్టగాఁ బోసిరో యనఁ గొండవోని
యొక మహాస్థిపంజర సమీపోర్వియందు 217

వ॥ మంత్రులతో సుగ్రీవుండును సౌమిత్రితో శ్రీరామచంద్రుండును
దత్ప్రాతఃకాలంబున విహరించుచు రామచంద్రుండిట్లనియె. 218

చ॥ అరుదగు కొండవోని మహిమాకృతి రిక్తవసాత్వగస్థిపం
జరమిది ముగ్ధపత్రకకనేసాలయసూపమనోజ్ఞతా జలా
కరమగు బుశ్యమూకగిరికానవలక్ష్మి శరీరమందు పం
బురిపిడికాయనా వెగటుపుట్టఁగఁ జేసెడు చూడుకంటికిన్ 219

ఉ॥ ఎంతటి బ్రహ్మనిష్ఠుఁడో మహేశ్వరుఁడా ముని యంత భావుకుం
డింత యసహ్యమైనయది యిచ్చట నెట్టుల నోర్వగల్గె నీ
ప్రాంత ధరిత్రిశోభ కపవాదిది తాగ్రహమౌన్ నిరుద్ధమై
యింతట నుంచిపోయిన మునీశ్వరు ప్రీతిగొనుస్తు నిచ్చటన్ 220

వ॥ అని శ్రీరామచంద్రుడు కాలిబొట్టనవ్రేల నాకళేబరంబు లెలగా నెత్తి
విసరిన నదియాకాశంబున హిమగిరిశిఖరంబునాఁబోయి యెచ్చటనో

పడిన సుగ్రీవుని మంత్రులు వెనుచనుబోయి చూచివచ్చి పడినదవ్వ
పదియామడ యనిచెప్పిం. 221

గీ॥ అంత సుగ్రీవుఁ డిట్లనె నార్య! దీని
యునికి యిచ్చట మునిరాజు నోర్వలేద
యోర్వలేదు కావున నె నాయునికి యిచట
సంభవించెను వాలి రాఁజాలకిచట 222

ఉ॥ వీఁడొకరాక్షసుం డితనిపేరును దుందుభి దుందుభిస్వన
క్ష్వేఁడుడు వేయియేనుగుల చేవగలాడు జగద్భయంకర
క్రీడుఁడు దిఙ్మురాంచల వికీర్ణ విపన్నత మృత్పయోధర
క్రోడవిలాసవిష్ణుపదకుత్సితకాలక భావుఁడుగ్రుఁడై 223

చ॥ బలమనియున్నచో నొడల వాఁడునుగాని స్వభావదుష్టుఁడై
వెలసిన వాని నొంచెదను వీనిఁ గలంచెదనంచుఁ గారణం
బులకయి సర్వదా వెదకుఁ బొందనికారణముల్ ఘటించు గొం
దలపడు సవ్యపస్థితమనస్కుఁడు వానికి సౌఖ్యమున్నదే. 224

శా॥ పైఁగా నీతఁడు బ్రహ్మచేత వరముల్ ప్రాపించి తత్రాప్తిరే
ఖాగంధంబున మిన్నుమన్నుకయికోకన్ గొమ్ములం జిమ్ముచున్
వే గిట్టల్ బడి దున్నుచున్ బరిలురఁ ద్వీచిప్రచండాకృతిన్
చేగన్ సాగరరాజుఁడాఁకెఁ జని యక్షిప్రోజ్జ్వలవ్యూహ్నమై. 225

గీ॥ అంతమూర్తి సైకహస్యవాహన దహ్యా
మానుఁడైన జలధి మహిమసనుజ
క్రూరనేత్రినహ్నగోళవ్యాత్యమొంచి
యుండియున్నయటుల నుప్పఁగిడియె. 226

తు ధ్యా కర్ణ అ

కదలి విజృంభించి యటుల కాల్దువ్వి కహకహానిస్వ
యనియేమిరా సముద్రా ఘరాంతంబు నాసరించితివి

బెదరనేటికి నల్లుడుండె విష్ణునన్ పేరుపెట్టికొని
కొడుపయే సాయమ్ము తెచ్చికొమ్ము నాకొమ్మునఁ జెడక. 227

గీ॥ అంత చేతగానియశోండ వాకసమ్ము
తగిలి లేలిహానమువోలె నెగిరెదేల
యనిన భయపడి జలధిరా జంతయెత్తు
కెరటముల నొడ్డునన్ విరిగించుకొనియె. 228

క॥ కడలికడలి నీ ప్రళయాపు
విడివడుటలు చెప్పఁ బ్రజలు విరిసెదరయ్యో!
జడిసెదవేటికి నాతోఁ
దొడకుము కయ్యానికంచు దుందుభి మొరసెన్. 229

ఉ॥ ప్రస్నన వార్ధి యిట్లనియె రాక్షసరాజ! మరేమి నిన్ను నే
నన్నదిలేదు మున్నెఱిఁగి యాడుటయెట్టులు? నీదు క్ష్వేడముల్
విన్న చెవుల్ బడల్పడఁగ వెక్కసపాటయి కూడ, నింతలోఁ
తున్నది నేను నీపటిమయు న్నిజ మింతయెఱుంగ లేమికా! 230

ఉ॥ ధాతయు నిన్నువంటి సముదారభుజాపరిపాకదీపనో
పేతమహానిధానమును బృథ్వితలంబున సృష్టిచేసి క
ట్టా! తగువాని శౌర్యప్రకటత్వము కోసము సృష్టిచేయునే
కా తగునెవ్వఁడో వెదుకఁగావలె నెచ్చటనుండియుండునో 231

క॥ అదికాదు నేనదెప్పుడు
విదితంబుగఁ జెప్పికొనఁగ వినుటయె కానీ
కదలించ లేద యిట్టు, క
న్నదికా దాతనిఁ దుషారనగంరమేశున్. 232

గీ॥ అతఁడు బలశాలియందుర యౌషధీ స
మూహములచేతనేకాక మొనలులేని
మంచుచేఁగూడ బిగిసిన మల్లుఁడందు
రట్టిబిగువు గలానిపై నడుగవలయు 233

వ॥ దారి యెఱుఁగుదువుగదా యనఁ సరిగా నుత్తరమేకదా యని 234

చ॥ శరభమృగంబు చొచ్చిన యసాధ్యగజేంద్రఘటానుకారిగా
విరవిరలాడుచున్ విరిసె విస్ఫుటతన్నగపాదదేశప
స్తరము లుసత్యకాశిలలు జారుచు వ్రీలుచు దైత్యశృంగని
ర్భరతరఘోరదారణపురాణనిబంధపరిశ్లథంబులై 235

చ॥ బరుజుల దున్నకొమ్ములకుఁ బట్టిన యెఱ్ఱని మట్టి హైమభూ
ధరపతి దేహయష్టిగళితంబులు కండలవోలె నొప్పని
ర్జరతటినీఘటాకృతికచక్రము కాళ్లల మట్టగింపులై
బురదలపిండుగా నెగడె బుద్బుదమంథరరావబద్ధమై 236

శా॥ అంతం గాళ్లల ముంచ్చుగుచ్చుకొనునట్లై హైమభూమీధరం
బంతర్వ్యాపినుసన్వచేతనము ముద్దై మూర్తిగానై మహః
శాంతుం డంబుజపత్రశేఖరశిర స్త్రాణంబుగాఁ దోచి దు
శ్చింతుం దుందుభిఁ జూచె శృంగవిగళజ్జృంభచ్ఛిలాగహ్వరున్. 237

క॥ ఇటుచూడుము నీవెవ్వర
వటు కోరాడెద నసంగ ననునయము నాసా
పుట వమదగ్నిజ్వాలా
పటువికటాననుఁడు శీతనగముం గనియెన్. 233

శా॥ నేనా! దుందుభినాముఁడన్ దనుజకంఠేకాలుడన్ యుద్ధరం
గానన్ నాకెదురై నిలంబడను లేకం బోయి రత్నాకరుం
డీ నిన్ జెప్పె శిలానిబంధపటుతాహేవాకదోశ్శాలి వం
చీ నాతో నెదిరించి నిల్చుకొనుమీ యీ నీచుశోబంధమున్. 239

గీ॥ అనిన హిమవంతుఁ డనియె సురారి! యతని
కేంటు చెప్పిరో తెలియ దేనెప్పుడు యుద్ధ
మాడియెఱుఁగన యాడెదనువాఁడఁ గాను
నేను వతిఘుఖా ఋషులను నివాక గోడు. 240

గీ॥ అసుర పకపకనవ్వి కొండంత మేను
నందులోఁ జూడఁగా నలుసంత మనసు
పోవనీ ! నన్ను నెదిరించు పురుషుఁడున్న
నీ వెఱింగినఁ జెప్పెదవే యటన్న 241

క॥ ఎఱుఁగుదువా యని యెదవా
యెఱుఁగుదు ననుకొందుఁ గాని యిప్పుడు పోర
క్కఱగా నెంచడో యాతఁడు
గఱితల కౌగిల్లె మనికిగా మనుచుండెన్. 242

ఉ॥ ఐనను వెట్టిపుట్టినటులాడుమ యాపయి నీయదృష్ట మీ
నైనను పోయి వార్ధిని హిమాద్రినిఁ జూచుఫలంబు పండురే
లైనను నుండు మేల్కనియ యాతఁడు శీధురసోగ్రపాయి యా
పానము తూలనాడుము విపత్తును నెత్తికిఁదెచ్చికొంటివే 243

గీ॥ అనిన నతఁడంతవాఁడా యటంచు నసుర
వాని పేరును చెప్పినవాఁడవే మొ
కావనఁగ నవ్వుచును హిమగ్రావరాజు
వాలి, కిష్కింధపురి నేలు వానరుఁ డనె 244

వ॥ అంత దుందుభి దక్షిణాభిముఖంబుగ నార్చిన హిమగిరి యిట్లనియె. 245

క॥ నిన్నొక్కటి యర్థించెద
నిన్నాతఁడు కొమ్ములూని నింగిని విసరున్
నన్నుం జెప్పకు కోపము
నన్నామీఁదికిని విసరినన్ విసరుఁజుమీ 246

వ॥ అనిన దుందుభి హిమగిరిమీఁద మలుసంజవాఁకిన్నట్లు చూచి చని,
యది పున్నమరాత్రి, యమావాస్య దాడివెడలినట్లు కిష్కింధాపురి
గవనుద్వారము కొమ్ములతోఁ దాడించి చేసిన మహాధ్వనికి 247

గీ॥ వాలి పెదవివద్ద వనితాశిరోమణి
తార చేతనిడు నుదారశీధు
కనకపాత్ర జారి కాళ్లపై నొలికిన
గ్రొత్తవేఁడి వాలి నెత్తికెక్కె. 248

చ॥ మరల ఫెడేలుమం చసహమానము రాజగుహాముఖోగ్రప
త్త్రరపటుతాడనధ్వనియు సాగెను వాలియు లేచెఁ దీక్ష్ణుఁడై
కరమున భర్త నాపె చిఱుకన్నులఁ దారయు నల్లెసుంత ని
ల్చి రట ప్రఘూణఘూర్ణన విశీర్ణమహార్గళరావముల్ వినన్. 349

గీ। వాలి గవనికె లంఘించి ద్వారమైన
ఱాయి తొలఁగించి యెవ్వఁడురా యటంచుఁ
జూచె నిర్వ్యాతదక్షిణాక్షుతమువోని
కాసరమ్ము బర్హిశ్శిఖాకేసరంబు. 250

వ। అంత నేమందరము ద్వారదేశ మాశ్రయించి నిలంబడిన వందకాగ డాలవెలుతుసచే వెన్నెలలెజ్జినైన వికృతభయంకరాకృతి దుందుభి యిట్లనియె. 251

శా॥ ఆనీవేమొ మహాబలుండవట భూమ్యాకాశముల్ పట్టవం
టా నీరాకరమున్ హిమాద్రియును నిన్నాడంగ నిన్ దీవ్ర శృం
గానన్ దూఁపఁగ నూహచేసితివి నాకంటెన్ బలాఢ్యుండ టం
చీ నేలం గలడొక్కఁడుం డనెడు పల్కే నోర్వఁజుమ్మీ ! కపీ ! 252

శా॥ ఆవారాశి నెదిర్చి హుమ్మనుచు నేనార్వంగఁ గంపించి నా
నావిక్షేపముచందె నాతఁడు దురంతంబైన మచ్ఛౌర్యరే
ఖావిస్ఫూర్తిగ దున్నినాడ సికతాక్ష్మావీథి నా చాళ్లువీ
ళ్లై వచ్చెన్ బడి నుప్పుమళ్లుగను బాదాక్రాంతుఁడై నట్లుగన్ 253

మ॥ హిమశైలంబఁట తాను కాదఁట సరే లే ! యంచు నేనేగ నా
హిమశైలాధికిఁ జీమునెత్తుకులు లే వేచుండు నిల్పోల్ల ర

క్తములేనట్లుగఁ బాలిపోయె నిఁక నాకా ! వీనితోనా ! రుజా
శ్రమతీర్పంగను శాంతులున్ వ్రతములున్ సంతర్పణల్ తీర్పఁగా 254

గీ॥ మూలనున్నయట్టి ముసలమ్మఁ గొట్టెను
సాగి యాఱునెలలు సాముచేసి
యన్నయట్లుగాఁగ ననుకొంచునుండంగ
నతఁడు నిన్నుఁ జెప్ప నంతనంత. 255

వ॥ అంత దుందుభి యర్ధక్లిన్నఘూసంబంగిలినుండి దంతదేశమ్మునకుఁ
కురిమ్ముకొను పశువుపోలె నవ్వి 256

ఉ॥ వీరుడవే ! బలే బెదరుపెట్టితి చెట్టుకు మంచుగుట్టకున్
నేరక నిన్నుఁ జెప్పినది నీకును నెక్కుడఁ జెప్పిపోదునో
వారక నేనటం చతఁడు పడ్డభయంబును జిట్టలయ్యె నా
సారభుజాబలంబునకు సాటిగఁ జెప్పుటయున్ విచిత్రమై 257

క॥ కేవలబాహాస్పర్థయె
యూవెనుకను నీవటన్నది యిష్ట సురా
సేవాదుష్టుఁడ వీవని
నే విని ద్వేషమ్ముగాఁగ నెగడినది కపీ ! 258

మ॥ తొలినా డబ్ధిమథించుచో సురయు నుద్భూతంబుగా నద్ది వి
ష్వ్యాలతాసంజనకంబటం చనుమతింపంబోము సద్ధీకులై
తొలివేల్పుల్ మలివేల్పు లల్పధిషణాదుష్టప్రచారుల్ మదా
విలులై త్రావిరి త్రావువాఁడనిన నా వేరం బపారంబగున్ 259

ఉ॥ త్రావినవానికిన్ స్మృతిపథంబున యందుచుఁ గోఁతులాడు నా
త్రావుట కోతికైన యెడఁ దావినవానికిఁ దేలుకుట్టిన
ట్లౌ వెడబుద్ధియై యతఁడు నెంచడు తల్లిని దోడు, జూడ త్రే
దా ! విబుధుల్ సురాపులయినంతట దైత్యుల వెళ్లబుచ్చుటల్ 260

ఉ॥ "వాఁడెటువంటివాఁడయిన వాఁడనినట్టిది నిక్కువంబు వాఁ
డాడినయట్లు వాలియును నక్కట సోదరు వెళ్లఁబుచ్చె న"

న్నాడికలైనఁ బౌనవిషయంబున వాలిమహాగ్రహంబునన్
గోడిగ నిల్చి నిందయొలగోలగు కోసమొగంబు నవ్వులై 261

క॥ తనయాత్మనిగ్రహము మా
లినవానికిఁ దాగ్రికయును లేదు వ్యవస్థా
వినియతము మనోభావము
తనయింద్రియనిగ్రహము ప్రధాన మెనని కే౯ 262

ఉ॥ త్రాగనిమీరు దానవులు త్రావినవారె నయంబన౯ గుర్ధా
భోగులు మీరుచేయవలె భూమికి ధర్మవినిర్ణయంబు మీ
చేగయుఁ దెల్పి యెంతయినఁ జెప్పవలె౯ మరి దున్నపోతనై
యీగతివచ్చితే తెలుపు నేమిర! త్రావుటకూడఁ దప్పురా 263

గీ॥ కొంచె మాలోచనము చేసికొమ్ము నీదు
తెలివి స్పష్టమ్ముగా నీకె తెలియఁగలదు
ఎచట ఘోరాంబురాశి నీవెచట నెచట
హిమగిరీంద్రంబు నాప నీవెచట చూడు 264

క॥ పట్టి వెఱెపప్పుకింద్రం
గట్టెరి నిన్నుంచుఁ దార క్కై కైకొనిపో
నట్టె మగుడ దుందుభియును
గిట్టలతో మన్నుచిమ్మి కీశేశుపయి౯ 265

పంచచామరము :—

అరే చేతకాదేని యట్లాడి పోరా
బిరాన౯ సతీసంగభీరూ ! చనంగ౯
గిరీంద్రాంబురాసుల్ ప్రకృష్టాత్ములైన౯
మరిం బోయి తేఁబ్రు౯ జమత్కారమెల్ల౯. 266

మ॥ అనిన౯ వాలియు మోమునన్ బిగిసి తానచ్చోటనే నిల్చి యు
ల్లసియే౯ నీవిటనుండి వెళ్లినఁగదా యంభోధిశీతాద్రిలం

గనుటన్నన్ సురవైరి త్వాదృశులు నిక్కం బంగనాసన్నిధిన్
మొనగాండ్రింబలె మాటలాడెదర యంభోజాక్షు లాలింపఁగన్ 267

క॥ అను మాటవెంటఁ బౌరుష
ఖనివైనన్ నీవు ప్రథమకక్ష్యాగతుఁడౌ
దనినఁ గపిరాజు కాని
మ్మనినన్ దుందుభియు రమ్మటంచు వెనుజనెన్. 268

ఉ॥ తీక్ష్ణమరుత్ప్రవేగమున దెప్పరమై చనుదెంచుచున్ గుశ
శ్లక్ష్ణము కొమ్ముచేఁ బొడిచె జంతుఁడు. రక్కసిదున్న తన్మహా
భీక్ష్ణమునుగ్రమున్ కడిఁది బెట్టిదమైచను తాకునన్ గ్రుధా
తీక్ష్ణతఁ బూనెఁగాని మఱితీఁపడ యొక్కఁడుగాన వాలియున్ 269

గీ॥ ఏడుపర్వతమ్ము లెంత బర్వెంత బ
ద్ధ్యాని చివరికొండ యొరుగఁగలుగ
మొదటికొండ కెంత మోపైనదెబ్బ కా
వలయు నంతవలయు వాలి యొసగ 270

క॥ నేనెఱిగినంతవరకున్
దా నంతయులేద సగమొ దానన్ మరి పా
వైనను వేగము బలమును
బూనింపంగలుగు తీవ్రభుజుని ధరిత్రిన్ 271

శా॥ పక్ష్మభ్రాంతివిచిత్రచంక్రమణసంచారుండు రక్షోలలా
యక్ష్మాభర్తయు నట్టిబల్ విదిచె శృంగాగ్రగ్రభుగ్నక్రియన్
సూక్ష్మంబైచను రేఖయుం గదల డాశుక్రిధచేతన్ స్వపం
గక్ష్మాభర్తయు కొప్పెకొంచసున చక్రభ్రాంతినాటాడగన్ 272

క॥ ఒక నిట్టమెఱుపు మేఘ
మ్మొకఁడు పెనగువట్లు బిడుగు లుఱుములుగా, వా
రక పెనఁగి రిద్దఱక్షుల్
చకితములయ్యెన్ వియత్తు క్ష్మా చలియింపన్ 273

సీ॥ మహిషదనుజుఁ డంత మందేహుఁడై రక్త
దిగ్ధసాంధ్యజలద దేహుఁడయిఁ
గానిపించె నంతఁ గసులబంధుసితాబ్జ
కేసరాభధవళకిరణకాంతి. 374

క॥ శ్రమమెఱుఁగడు వాలి పరా
క్రమమొప్పడు వాలి వాని కాయ మనిర్భే
ద్యము లమరుఘుంర్ఘూపవమా
నము వానిఁ గదల్ప లేదు నలినాంతెదృశా 275

వ॥ అంత నవ్వాలి వాలం బసుర వెనుగాళ్లఁ దగిలించి లాగి కోలుకొక్క-
రగాఁ బడనొత్తి ప్రక్క-టెముకల మోఁకాటఁ దాఁపున విఱుగ బొడి
చిన నసుర మూరెడు నాలుక వెలికిజారఁ బుట్టెడు నెత్తురు క్రక్క-
కొని చచ్చిన వాని కళేబరంబున కటునిటు దూఁకి నిలఁబడి పకాలున
నవ్వి వానియిరుకొమ్ములు వాని యీయోజనదూరంబు నకు విసరి
వైచె. 276

శా॥ ఆవేగంబునఁ బెద్దగాలియును రివ్వై సాగి తద్వాయు ధా
రావిద్ధంబుగ దైత్యవక్త్రవిగళద్రక్తాపగా బిందువుల్
బోరివుల్ గాఁగను మౌని యీవనలతాపుష్పాగపత్రోపరి
సారివంబై మునిరాజు నాశ్రమగవాక్షస్యందిగా నై చనన్. 278

క॥ అపవిత్రస్పర్శఁ గ్రుధా
విపులంబగుచడక నిల్లువెడలి చని తపః
కృపమాలినయొడఁదఁ గపీన్
శపియించె మతంగమౌని సాకూత్తముఁగై 279

శా॥ ఈ నా యోజనమేర యాశ్రమములో నెందైనఁ గాఁబూదినం
డానై వాలి మృతింగనున్ మఱియునుం దన్మంత్రులీ యాశ్రమ
స్థానిన్ రేపటిదాఁక నిచ్చిలను బాషాణంబులైపోవ, వీ
రో నిక్షేపమునంటె పత్రికుసుమవ్యూహంబు ప్రత్యూహముల్ 280

క॥ అని స్నానమాడి హోమము
లను జేసి పునర్వినిర్మలత్వము శౌచం
బును బొందియుండ వాలియు
మునిఁ గన్గొనవచ్చి కృతనమోవాకముగన్ 281

క॥ ఈ నాయం దెపుడేనీ
హానుల కపకారమన్నమాటయుఁ గలదే
పూను భుజాబల మధికం
బైనది మీకంటె నన్న యజ్ఞుఁడఁ గానే 282

మ॥ అనినన్ హానియుఁ జీదరించుకొని యేమన్నానొ యన్నాను పో
కను నా యాశ్రమభూమికాని ధరణిం గాంతారమెంతున్న దం
దున నీ విక్రమమున్ వెలార్చుకొను నాతోటల్ప్రవేశింపకు
న్నను ప్రాణమ్ములు నీకు నిల్వవో యటన్నన్ వాలి జాలిం జనెన్ 283

వ॥ అంత శ్రీరామచంద్రుం డిట్లనియె 284

గీ॥ కనలి తిట్టుటయున్నది కాళ్ల వ్రేళ్లఁ
బడిన వెంబడి జాలిఁ జేపట్టుటున్న
దెందు హానులు వాలియం దేమి కలవొ
పరముఁడో ముని కోపంబు మరలకునికి 285

గీ॥ అనిన సుగ్రీవుఁ డిట్లనె నది యెఱుఁగను
వాలి లోకాన నెఱుఁగరెవ్వరును గాని
యితరు లేమనుకొందురో యేమొ యంచుఁ
జెట్ట యాధిక్యమును బ్రదర్శించుకొంచు 286

శా॥ ఆమారమ్మున సప్తనాలమది తాఁ నవ్వాలియొక్కొక్కటన్
గోదండంబు పయిందు నమ్మొసఁగి యాకులేడుల్బు నాచెట్టుపెం
పేదన్ సప్తకమంతొక్కటొకెనై యేయాకు లేకుండఁగా
నీ దర్పంబగుచేత యుత్సవముగా నేఁ జేటఁ గిష్కింధలో 287

ఉ॥ తూఁచినపట్టి వేగమును దోర్బలముఁ శరచారణాత్త శి
ల్పాచరణం బనన్యకృతమై యొకపుద్భుతమై కనంబడఁ
రాచినపట్టి యుత్సవపరంపర పెంపుఁజరాని క్రోఁతి గో
లై చివరల్ గ్రహించిన మహాముని యోహ్మె శ్లాధాభిముఖ్యమై 238

గీ॥ తుదకు నీ దైత్యతనుపాతఘూనవనమున
నెడఁద పిగులు ఘెల్లుమన బీటిచ్చియుండు
మఱియుఁ దుదిగాలిపార చేత మండునగ్ని
యూ వెనుకగాలు లాభిముఖ్యము నమర్ప 289

మ॥ కృతసంస్మేయుఁడు రామచంద్రుఁడనె సుగ్రీవా! మరిఁ జీవిపం
స్కృతి చిత్రంబగు మూలఘాతమగు దుష్కృత్యంబు పాపింబునం
దతుకఁ బాపిశి యొనర్చు సర్వమగుఁ గార్యంబందు దీపించుఁ బో
కృతుపౌ షూనులు సూక్ష్మదర్శులును దర్శింపగ మూలాఘుముఁ

చ॥ మఱియును నవ్వి శ్రీరఘుకుమారకుఁడాి ధనుర్ధరీంద్ర మీ
ధరణి మహావిచిత్రముగదా యుదెమీఁపను వాలి నేర్పటం
చునవడి నమ్మ్రమూసి పతి యొక్కటి చిత్రవిచిత్రవేగ బం
ధురతరతీవ్రచంక్రమణ ఘూనననైఖరి నేసెనంతటఁ 291

గీ॥ ఒక విచిత్రఖడ్గకకేళియో యనంగ
పుల్లపత్రావళిం దుల్పి బోవ నరకి
తీవ్ర ఝుంఝూ మహాముహ్రత్పెరకపఁగ
నా వెనుక ధాత్రి పెగలిచి యమ్మునూతె. 292

శా॥ సుగ్రీవుండును రామచంద్రుని పదక్షోణిం బ్రణామక్రియా
వ్యగ్రుండై "నుస్వామి నవ్వుచును బాహోద్పృష్టిగా లేపి హా
స గ్రంథిస్ఫుట ముగ్ధముగ్ధ వదనచ్ఛాయా మిళితాసంత్వనుం
డగ్రీయంబగు మాటనెత్తి మరి యేలయ్యా! భయంబందఁగ. 293

క॥ మరి యందుచేత వాలియుఁ
బరువడి నీ ఋశ్యమూకపర్వతధాత్రిం
జొరరాఁడుగాన నీకిది
యిరవుగ నైనయది యంతియే కదవయ్యా ! 294

క॥ ఎపుడా వాలికి నింతగు
నపకృతి చేసితివి నిన్ను నతఁ డద్దానం
గృపమాలి వెంబడింపఁగఁ
ద్రపమాలినయట్టు లన్నదమ్ముల మధ్యన్. 295

వ॥ అనిన సుగ్రీవుండు జానకీదేవుని యౌదార్యంబు కృపగా మాఱునన్న
భీతి నిట్లనియె. 296

క॥ ఒక యపకృతియని యాతని
కకటా ! నేఁ జేసినదుగదా యటులాడన్
వికృతమతి యతఁడు మనమే
యొకటియుఁ జేయకయ యట్టు లూహించుకొనున్. 297

క॥ బతిమాలితి బామాలితి
మతి సర్వస్వంబు తన్ను మన్నించుటయై
నుతిచేసితి నతిచేసితి
మతికిని నెక్కించుకొనడు మత్ప్రార్థనముల్. 298

ఉ॥ ఒక్కనిపై విరోధమును నొక్కనిపైఁ బ్రణయంబు లేద త్వా
దృక్కృతసర్వవిద్యులకు ధీపదముం దభిమానభావమున్
జిక్కఁగఁ బూన్చఁగావలయుఁ జెప్పిన సర్వము నాలకింపుమీ
అక్కడ నాది తప్పయిన నాతిసినే గ్రహియింపవే ప్రభూ ! 299

ఉ॥ లీలగ మీరు లోకమును లెక్కయొచేయరు మీరు సర్వముం
దేలికగాఁ గనంబడును తీర్పవి కార్యము తీర్చినట్లుగా
బోలు నపారశక్తిగల బుద్ధికి మాయెడ నట్లుగాదు ప్రా
ణాలును ప్రాప్తకార్యకరణంబును తూనికపట్టినట్లుగా 300

మ॥ మదవద్దుందుభి బంధువౌ నసుర యమ్మాయావి మాయావిశా
రదుఁడున్ దానొక యర్ధరాత్రమున ద్వారక్షోణిఁ గిష్కింధకుం
గదియన్ జేరి ప్రశాంతవాయువు కలంగన్ సింహనాదంబు దు
ర్మదుఁడై చేసిన నిద్ర మేలుకని ద్వారక్షోణి కే నేఁగఁగన్, 301

గీ॥ అర్ధరాత్రంబు కాక వేఱైనవేళ
పనికిరాదేమి వీరి కన్పగిది నన్న
ప్రళయకాలోగ్రరుద్రునిపగిది నున్న
నసుర చూచుచు గుండియ లావటిల్లి 302

చ॥ పరచిన వానివెంటఁబడి పట్టుకొనంగను సాఁగె నన్న యొం
టరిగను నన్న పోవుటకు నా మనసొప్పక నేను వెంబడిం
బఱచితిఁ ద్రోవ వెన్నెలచేఁ వాఱెను ముగ్గులుపోసినట్లు క
ప్పురములు చల్లినట్లు కనుమూతలు విప్పినయట్లు రాఘవా 303

క॥ మా యిద్దఱి యప్పటి స్థితి
యా యామినియందు నాకు ననిపించెను దై
తేయకుల మ్మఖిలంబును
మాయించియ యుందుమన్న యంటగ నుండెన్ 304

శా॥ ఆ మాయావి పలాయితుండగుచు దూరానేక కాంతారవీ
థీ మధ్యంబులఁ బాఱి పాఱి శతధాచ్ఛిన్నంబుగానైన క్షో
ణీ మధ్యంబున రాళ్లచప్పలగు నా నేలన్ మహాగహ్వర
వ్యామిశ్రంబు బిలాస్యమందుఁ జొరంబారెన్ జలం బారగన్ 305

చ॥ తెలతెలవారెఁ దూర్పు సతి తీర్చిన కుంకుమబొట్టుబోలెఁ ద
మ్ములచెలికాఁడు తోఁచె బిలముం జొరఁబారె ఘనాంధకారసం
కులముగ నంతలన్ దనుజకుంజరుఁ డంతరవర్తి దైత్యవి
హ్వలతర గాత్రమ్యాపృత్యకలితారవముల్ వినవచ్చుచుండగాన్ 306

శా॥ నీ విందుండుము నేను వచ్చెదను వానిం జంపి యం చన్న యుం
బోవం జూడగ నేను చెప్పితి బలంబున్ ఘోరవక్త్రంబు నా

లో విజ్ఞాతముకాని యాపదలు కాల్రిలుఁగా గాలిల వేకైక వీ
రావేశంబునఁ బోవనేమిటికిఁ గాలాధీనతం జూడఁగన్ 307

క॥ కయ్యంబందున నీవు న
జయ్యుండవ యనుము పట్టిశౌలిమ యేలా వాఁ
డొయ్యన యీపరి వచ్చినఁ
జయ్యనఁ బోకుండఁ బట్టి చంపఁగవచ్చున్ 308

మ॥ అని వారించిన వాలి కైకొనక నే నట్లాడకుండన్ మరిం
దనపై నొట్టిడుకొంచు దూఁకి చనెఁ బాతాళాధ్వదేశంబునన్
సను నా గహ్వరవక్త్రమున్ గదలకుండం జెప్పి నే నంద యుం
టిని సంవత్సర మానిశాదివముగా వ్యాగ్రైకనేత్రంబుగా 309

శా॥ నేరన్ లోనికిఁ బోయి చూతమనినన్ నే నొక్కత్రోవన్ జనన్
దా నిం కొక్కబిలాన వచ్చునయెడన్ దా నేను లేకున్కి నే
మైనానో యని దండడించునని నే నచ్చోటునందే ప్రతీ
క్షానైశిత్యము సర్వవృత్తియయి దీక్షావ్యగ్రుఁడై యుండఁగా 310

సీ॥ బిలముఖంబున నెత్తురేరులు స్రవించె
గహ్వరాంతరమున దైత్యఘటల వికృత
మోదకృత నర్తనారావములు వినఁబడెఁ
దొలుత నేమి చేయను నాకుఁ దోచలేదు 311

చ॥ కడువడి నన్నుఁ జంపి రదిగాక జయోన్మదవృత్తు లూరిపైఁ
బడియెద రేమొ దానవులు వచ్చి యటంచు గుహాముఖంబు చొ
ప్పడు నొక కొండవంటి పెనుబండను దైత్యులు తూల్చరానిదా
బెడఁదగుదానిఁ ద్రోసి పురవీథికి వచ్చితి నొచ్చితిన్ మదిన్ 312

చ॥ అతనికిఁ దర్పణాదికము లన్నియుఁ జేసితి నంత బిట్టు దుః
ఖితుఁడగు నన్నుఁ బ్రెగ్గడలు కీశధరిత్రి యరాజకంబుగా
నతికెడునట్లు చెప్పి మరి యానని చెప్పిరి రాజనైతి నీ
చతురుదధిప్రణీత కపిసంగతధాత్రికి శౌర్యధాత్రికిన్ 313

మ॥ ఒకనాఁ డేనును జేరి ప్రెగ్గడలు కొల్వుండంగ ద్వారంబునన్
వికటాస్యుండగు వాలి భీకరుఁడు కన్పించెన్ ఘురట్టోగ్రదం
తక నిష్పీడన రావఘూర్ణితసభాధాముండు లాంగూలవ
ల్గుకృతాస్ఫోట విశీర్ణభిత్తికకల క్షోదంబుగా ముందటన్ 314

శా॥ నా ప్రాణమ్ములు లేచివచ్చినవి యన్నం జూచినంతన్ మరిన్
పై ప్రాణమ్ములు పైనబోయినవి యవ్వాలిం గనన్ క్రోధరే
ఖా ప్రస్ఫీతుఁడుగాఁగ నున్నతని వంకంగాంచి సింహాసనం
బప్రార్థ్యంబు త్యజించి నే గురుని పాదాంభోజముల్ మ్రొక్కుచున్

చ॥ ప్రభువవు వచ్చినావు కపిరాజ్యరమా రమణీ మయూరివ
ల్లభ సుకుమార మోహన కలాపకమూర్తివి నన్నుఁ గాని పై
రిభ దనుజాతమర్ద్దను నరింపను ఘోరమహాపదబ్ధివీ
చి భరభుజాభుజాతరణ సింధురబంధుర పీఠుఁ జూచితిన్ 316

ఉ॥ నా పొరపాటు గాని భుజనాళవినిస్రుత దివ్యశౌర్యధా
రా పరిణామ దుర్ధర పరాక్రమవార్ధికి భంగ మున్న దే
యే పరమాభిముఖ్యమున నే నిముసంబు ప్రసన్నమానసో
యోప మెఱుఁగఁగాక మఱియు న్నినుఁ జూచితి నే యదృష్టమో

శా॥ రాజాంతఃపుర మెల్ల దుఃఖమయవారాశి ప్రకీర్ణాంబుధా
రా జీమూతమహాంధకారమయమై క్రుగ్గున్ భవద్దివ్యహా
తేజస్సంగతమూర్తిదర్శన హఠాద్దీప్తోరుమోదప్రభా
భ్రాజిష్ణుత్వము సంతరింపవె మహోవారాన్నిధీ! శ్రీనిధీ! 318

ఉ॥ ఏఁచిన మోదరేఖయయి యుర్లయి పొల్చిన నాయెడందఁ జం
ద్రోదయమైం దుజ్జ్వల గురూదయమ్మైనది మన్మనోవియ
ద్వేదికమీఁద సర్వకపివీరజగత్ప్రథమాక సూత్నమ
ర్యాదుడవైన నీదయిన రాక నిమిత్తముగాఁగ నగ్రజా 319

మ॥ అవివేకంబగునేమి నే నెఱుఁగ దోషాచారుఁడన్ గాను ని
న్ననమానించెదునంత దుష్టమతిఁగా నస్మత్పురాభక్తి నీ

వవలోకింపుము నీకు నీడవలెఁ దోడైటిన్ గదా సర్వథా
వ్యవసాయంబున నంతదాఁచుకొని తా నన్నాళ్లు లెట్టుండనా 320

వ॥ అనుచున్న నన్ను ముంగాలఁ బెడఁదోఁచి నామంత్రుల నదలించి
తొలి యొక్కనాఁడు సభామధ్యమ్మున నిట్లనియె. 321

గీ॥ అన్నదమ్ముల కొక తండ్రియగుటకంటె
నన్నదమ్ముల కొక తల్లియగుట కాదొ
ఋక్షరజసుని మరియాద యెంతొ తలచు
కొన్న నిప్పటికిని నాదుగుండె లవియు 322

చ॥ తెలియని యాపగల్ గలుగు తెన్నని చెప్పి బిలప్రవేశమున్
వలదనె నెంతొ తమ్ముఁడగువాని విధంబున నల్లె నైనచోఁ
దలఁప గురుండు చెప్పినది దాఁటుదురేమి యనిశ్చితార్థమౌ
ఫాలమునఁగాక తానగుచుఁ బోరడొ పోఁజడుకాని తమ్ముఁడై 323

చ॥ క్రమమునఁ జూడడా మహోషరాక్షసపర్వతదేహ ఘూనసం
బమరిన సప్తతాళదళనాద్భుతకృత్యము లోకజేతృవి
క్రమమునఁ బొల్చునట్టి దశకంధరుచేతను బాహ్యమాన వి
క్రమమును నేను చచ్చితినిగాఁ దలపం బసిబిడ్డ నేర్పడో 324

ఉ॥ ఎన్నడులేని ప్రేమ వెలయించుట యున్నది చాలచిత్రమై
కన్నులుకప్పఁగా నసెకర్మలు చేయుట చేసినన్ మృతిం
గన్నటులైననున్ ఫలముకన్నటులైనను పోల్చుఁ బ్రేతమున్
దిన్నది కాదు పాణియును దిన్నది కాదును కొత్తనేతిపై 325

చ॥ నెలవుంఁ జూచుచుండ మరణించిన నన్ను కాలుచేతులన్
జలుసలు కట్టెనో యనుచు నగ్గని సాంధరమాసనో యటం
చొలసిన తెల్లగుడ్డనో యను మాటలు ప్రేలకల్గు బం
ధులు బిలమందు నెట్టిడె తోఁచను లెక్కకు నచ్చె వాలయున్. 326

ఉ॥ ఆపనియే పొనర్చుటయు నచ్చట రక్షగ నుంచినందుకై
యే పని వాను చేయుదురో యేమొ ఘటించును భీతికల్గుటన్

బాప్పుగ నుంచినంత బిలవక్త్రము దైత్యులుగాని పూస్తురా
హా పరమార్థముల్ కతిపు లాత్మపదార్థపరార్థవిశ్లేషల్ 327

చ॥ అదిర ! నొంతుఁ దెల్పగను నాకులురాలిన వల్లిఁ జూచుట
న్నది యెఱుఁగంగ సత్యకథయు నాకు ఘటించెను దారయందు న
య్యదియుఁ బదాభిఘాతముల నా శిల విచ్చెనుగాని లేనియ
య్యదను దబ్బతేపగు యథార్థముపై నది యాప్తవాక్యమై 328

గీ॥ తార తెలివియేమి తన మనము మిక్కిలి
యుందకత్తె యంత యుందకత్తె
రాణి కానునలయు రాజు వేఱొక్కఁడు
అట్టి యందకత్తె యెట్లగును. 329

వ॥ అంత నతశిరస్కుండనై నిలుచున్న నా కిట్లు వినిపించె 330

వి జ య భ ద్ర సు :—

ఇది ఋక్షరజస్సుత హితవానరాభినుత
కపిలోకపరమేష్ఠి కదనభీకరముష్టి
విదళితాసురపాళి వినాహితలోకాళి
వాలిసుమహారాజవల్లభేందిరి యాజ్ఞ 331

త రు వో జ లు :—

మున్ను రాజునకుఁ దమ్ముండు సుగ్రీవుఁ
డున్నట్టి వానను నంప తెల్గెదను
చన్న రెండేండ్ల కిచ్చట నొక్కరాత్రి
దున్నరాకాసిపుత్త్రుని దాడిరాక.

వెన్నంటిచనె యొఁ బ్రగ్గోజాని రక్క
సు న్నిల్గఁ జేయగా సోరమూర్తాంచుఁ
ప న్నదయుండునఁ బ్రిసి యమ్మిగులుంచుచును
సన్నిచుండాను తమ్ముఁ డేగెఁ బెఱుంవ. 332

హరిగతి:—

అసురయుఁ దప్పించుకొనన్ బిలమునయందునఁ జొచ్చెన్ వెంబడి
కసిమసఁగంగా రాజుం బోవం గాంక్షింపంగా నీ తమ్ముండున్
మసలున్ ఘోరమహాపద లంచును మాన్పించుటకై యత్నముచేసెన్
ప్రసరద్బాహుమహాబలవిక్రమ వారింపగ రామి నెఱింగియునున్ 333

నీ విందుండి బిలద్వారంబును నిర్నిద్రముగా రక్షింపుమనన్
భూవలయంబున నాశం బొంటెన్ భూపతి చావును కల్పించుచు నన్
భూవిభు నాశముకల్గగ లోపలఁ బూడిచిపెట్టినయట్టులు ద్వారం
బీవల పెకలుప రాని ఘనశిలాపిహితముగాఁ గిష్కింధకు వచ్చెన్ 334

హరిగతి:—

రాజాజ్ఞోల్లంఘనమును మఱియును రాజద్రోహము నివి రెండగుచున్
రాజాజ్ఞోల్లంఘనమునకును గారాగృహవాసమ్ము విధింపఁబడెన్
రాజద్రోహమ్మునకును పైన శిరశ్ఛేదం బొండు విధింపఁబడెన్
తా జీవద్భ్రామిపతి కపరకర్మలుసేసి పదికశాఘాతంబుల్. 335

వ॥ అంత నపగమితరాజపురుషయోగ్య పత్త్రాభరణుండనయిన నన్ను రాజభటులు నిగ్రహింపరాఁ దక్కిన మన్త్రులు లవనతశిరస్కులుగా నీ హనుమంతుఁడు సభామధ్యంబున భయంకరమూర్తియై నిలుచుండిన సర్వకపిలోకంబు విహ్వలించె నంత వాలి యిట్లనియె. 336

ఉ॥ ఈతఁడు తమ్ముఁడౌట ప్రమియించితి మంతటి యుగ్రశిక్షలన్
జేతము సమ్మతింపదనివేయఁగఁ గాప్రా నిర్వాసింపఁగా
నీతని నేకవస్త్రుని బహిర్గతుఁ జేసితి ధాత్రినుండి వే
యీతని భార్యయైన రుమ నేను గ్రహించితి నింపు రాణిగా 337

వ॥ అని సింహాసనమునుండి లేచి నిష్క్రమించిన నేనున్నవాడ నున్న పాటుగాఁ గిష్కింధ పొలిమేరలకు వెడలింపఁబడితిని. కానిమ్ము నన్నంత నా బ్రిదుకు నన్ను బ్రిదుకనిచ్చెనా! . 338

ఉ॥ ఓయి రఘుప్రవీర ! కరుణోదధి ! ప్రాణసఖా ! జగత్ప్రభూ !
పాయనిచోటు పాసితిని పట్టెడునిద్దురనుండి లేచితిన్
పోయినచోట నిల్వను ప్రభూ ! సగమే తిని లేచి పారితిన్
మూయను కన్నుపాంశువధపాంబె మహాభయమగ్నవృత్తినై 339

వ॥ చిట్టచివరికీ మతంగాశ్రమము స్మృతికిఁ దగిలి యిచటఁ జేరితిని. నా మంత్రులును నన్ను వెదకుకొంచు వచ్చిరి. భయరహితముగ నిద్రాహారములు లభించుచున్నవి. అంతకు నూరకుండలేదు. మతంగాశ్రమపు పొలిమేరలయందు శిలావానరులను జూడుము. నేటికి 340

గీ॥ నవ ప్రతీక్షాపవిత్రమైనదగు శుక్తి
లోనఁ బడె స్వచ్ఛమౌ స్వాతివానచినుకు
నిన్ను సఖునిగ మన్నింతు నిన్ను దైవ
ముగను యజియింతు నీవె నేనుగ రమింతు 341

వ॥ అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె. 342

క॥ ప్రీతి చిన్నవిషయ మాలో
చితముం బొనరించి వాలి చేయును నీవో
ద్రుతమతివై భగవత్ప్రే
రితమై చన్నట్లుగఁ బొనరింతు కపీంద్రా 343

గీ॥ అతఁడు పురుషకారమం దధికాదరం
డీవు విశ్వసింతు దైవమందు
నతఁడు రాజభావమున దతితీక్ష్ణుఁడు
నీకు బంధుభావనే కడింది 344

క॥ పొసఁగించుటకైనను మరి
పొసఁగుదలకు నమరు మార్గముల నన్నింటిన్
విసిగించి కంపకొట్టెను
మసలుటకును వీలులేని మాదిరి నతఁడున్ 345

క॥ అతనిఁ వధించుటకాక మ
రితరము కనఁబడుటలేద యే నే హేతు
ప్రతతి కలిపించి చంపుట
యతఁడును తెలిసి యెదిరించ డఱుఁదెంచి ననున్ 346

వ॥ మఱియు సుగ్రీవుం డిట్లనియె. 347

చ॥ ఉబుసులఁ బట్టుపట్టి మును పొక్కొక రాఁడెడువేళలన్ సమా
న బలుల మేము నిద్దఱము నా కొకవేళను రొప్పవచ్చు వా
ని బరదుమే న్నడల్వఁడదు నిలిగినంతఁ బుసస్సమిద్ధమహా
చబుకువిధాన సాగి పరిచంక్రమణోజ్జ్వలదేహుఁడై చనున్ 348

గీ॥ నన్నుఁ దేలికగాఁ జూచు నాటినుండి
అందుచేత నాతో యుద్ధమాడు తరి న
తం డడంగిన వాని మదం బడంగుఁ
బూని సౌదర్యమర్యాద లేనివాఁడు. 349

గీ॥ అనిన రామచంద్రుఁ డనియె మీఁకు సగంబు
మృగములు నరులు పెఱసగము రెండు
ధర్మములు వహింపఁ దద్వృత్తులుం గన
శిక్ష రెండుగతులఁ జెందివచ్చు 350

శా॥ ఈ సర్వంబగు ధాత్రికిం బ్రభువులై యిక్ష్వాకువంశక్షమా
ధీశుల్ ధర్మపుగ్లానియై చెలఁగు నెం దెం దందు నందున్ సమా
జ్ఞాసంపన్నము న్నార్జనంబు నుపపన్నంబౌగతిన్ జేత తా
రాసూర్యంబగు నిత్యధర్మమయి నిత్యంబై విడంబించెడున్ 351

చ॥ అతని కెఱుంగఁ బుచ్చెదము నాహవమాడఁగ నీవు పిల్తు వే
ను తరువుచాటున న్నిలచి నూల్కొను బాణమునన్ వధింతు ను
ద్ధతమగు క్రూరజంతువు వధంబొనరించినయట్లు జంతునై
మృతిగనునో మరేమి యొనరించునొ మానవభావమేర్పడన్. 352

మ॥ ఉరువా కొండొక తీవ్రకామముబడిన్ వ్యూహంబు నిర్మించుకొం
దుఱ తానే తమచుట్టు కొందఱు మఱెందుం దోవ లేకుండ ని
ర్భరమౌఁ దుర్ధరమైన యాస్థితికి నే భంగంబు వాటిల్లినన్
మరణం బెంతయు బుద్ధిపూర్వకముగా మన్నించుటే మార్గమై 353

గీ॥ పరగెనేని యొకఁడు బంధురకామంబు
దురభిమాన మదియుఁ దోనఁ బెరుగు
దురభిమాన మొకఁడు మరణంబు రెండును
కవల లనఁగఁదగిన ఘనగుణములు 354

గీ॥ అతని కిచట రెండె యాచరణీయతా
యోగ్యములగు గుణము లూహసేయ
దురభిమానమూని మరణంబు పొందుటో
తాను సన్యసించి ధర వదలుటో ! 355

గీ॥ నీకు వానరావనీరాజ్య యువరాజ
పదము మరల నొసఁగి భ్రాతృభావ
సామరస్య మెసఁగు సర్వమార్గంబుల
నిప్పుపెట్టినాడు నిర్గుణుండు 356

మ॥ ధరణీరాజ్యము నీ కొసంగి మునివృత్తిం బూనునో లేక ని
ర్భరుఁడై నన్నెదిరింప వచ్చునొ మహాబాహుండు తా వచ్చినన్
గోరమై తాను కబంధుఁడో మరి విరాధుండో యగున్ రాక సో
దరునిన్ నిన్నును నింత చేసిన మహోద్యత్క్రోధముం బండెడున్ 357

వ॥ అనిన సుగ్రీవుం డిట్లనియె 358

గీ॥ ఇది యతనితోడఁ జెప్పఁగా నెవరు సాహ
సింప రొక యంగదునితోడఁ జెప్పవలయు
నాతఁడైనను దల్లితో నాడు నామె
క్ష్మాపతికి నిద్ది చెప్పుట సంభవించు 359

గీ॥ అతని మరణంబు నిశ్చయమైన పిదప
నతఁడు నీకు క్ష్మాపతియయ్యె ననియె స్వామి
యంత సుగ్రీవుఁ డాస్యంబునందు విరిసి
వెలతెలంబోవు నవ్వున విహ్వలించె 360

మ॥ తనకుం బ్రత్యయ మింతయుం గలుగమిం దా రాముఁ డెంతే గ్రహిం
చెను దత్ప్రత్యయముం ఘటించుటకునై చేసెన్ మహాశ్చర్యముల్
కొనగోటన్ విదలించె దుందుభితనూగోళంబు కంకాళమున్
దన బాణంబున సప్తతాళదళనోద్యత్కేళి నిర్మించుచున్ 361

గీ॥ సర్వజీవహృదయ సంగతపరిసూక్ష్మ
భావవేత్తయే మొ ప్రభు వితండు
సుప్రసన్నుఁడైనఁ జొచ్చి యీ పనిచేయు
నిద్ది చేయడనుచు నెంచలేము. 362

క॥ ఒక పర్వతశిఖరంబును
బెకలింపంబడి లయోగ్రభీకర ఝుంఝా
ప్రకరముచేఁ దాఁకిన వా
లికి నా వీసఁ డడుగుం జలింపడు కానీ 363

గీ॥ తాను సప్తతాళదళనంబు చేయఁగాఁ
బంపఁబడిన రామబాణమునకు
లిప్తలోన నంత సప్తమారుతవేగ
మందుకొనినదాని కాగ లేదు. 364

॥ మానసకాసార యానాభిముఖరాజ
హంసపక్షచ్ఛాయ లవఘళించి
అనిలధూతారగ్వధావని జాతప
ల్లవమాలికాకాంతి నవదరించి

సంగతాస్కందితాజానేయ చూడాగ్రి
సితచ్ఛామరప్రభ చెంగలించి
పరిస్ఫోటనాంచల ప్లవమానగోధూమ
కింశారుసుషమలఁ గేరిసేసి

బాలఖర్జూరికా శిరోభాగగర్భ
తోఽర్ధనిర్గత నవదళాహంయువులయి
బాలలవలీకిసాలయ ప్రభల నోరసి
స్పర్శసహములు సూర్యాతపములు కాచె. 365

సీ॥ శ్రీభావగత పుండరీకాగ్రకింజల్క
కాశ్మీరకాంతులు కందళించి
ఆతామతరు శేఖరానీతమధురకి
సాలయామణిమము లందగించి
రాజత్కుజాగ్ర నిష్కూజ స్తిమితకోకి
లాంగనానేత్రాంశు లనుగమించి
మధ్యాహ్నసంధ్యా సమాత్తదృష్టాదృష్ట
సూక్ష్మారుణాంశురించోళి బెరసి

పృథివిధరపార్శ్వ ధాతుచ్ఛవిపరితాడి
తారుణాతపచక్రమ్ము లభిచరించి
పరికృతిగతమైన యొక నిత్యరక్తకుల్య
జాలువారినయట్లుగా జాలువారె. 366

శా॥ ప్రభువై హేళి వియత్త్రికోష్ఠమున హేరాళాంశుమాలా దహ
త్ప్రభలం జిమ్మిన సూర్యకాంతశిల శౌర్యప్రౌఢవహ్నిచ్ఛటా
స్వభువై నిప్పులు పుక్కిలించెను దదచ్ఛస్వాదుకోష్ణాంబులన్
ప్రభువై వెచ్చని నీటిబుగ్గలను నాస్వాదించె మార్తాండుడున్. 367

వ॥ అంత వనంబుల దూరానఁ బోవు నంగదుని నీలుండు పిలిచి యత్తఁ
డిష్టంబులేకుండ నాగి యెందుకన నేమియు లేదని నీలుం డిట్లనియె 368

చ॥ మన వనదేశమం దసహమానపరాక్రమవహ్ని కోసలే
శుని తనయుండు రాముఁడను శూరుఁడు సౌర్యుఁడు ధర్మభంగకో
పనమతి చాపధూర్జటి ప్రభాజలజాప్తుఁడు తాదృశానుజుం
డును మరి తాఁ జరించెడుఁ గనుంగొనినావె వనాంతవీథులన్ 369

వ॥ అనిన నంగదుండు సరేయని పోవుచుండ నీలుం డిట్లనియె 370

క॥ వట్టి సరే కా దాయన
ముట్టిన బాణంబు వేగమునఁ గ్రౌంచాద్రిం
ఘట్టించిన భార్గవశర
పట్టాభిషవణము వ్రయ్యపరచినది సుమీ 371

వ॥ మరికొంతదవ్వున నలుం డంగదుని నిలిపి యిట్లనియె. 372

గీ॥ నీవు వినినావొ యిచటి వనీతలముల
రాముఁడనువాఁడు ఘోరసంగ్రామదహనుఁ
డుగ్రతేజుఁడు తిరుగుచున్నవాఁడు
కార్ముకియు భగవంతుఁడో స్కందుఁడట్లు 373

గీ॥ మఱియు నొకమాట యాయన మహితమూర్తి
మన వివేకము మన్నించు మఱియు మనల
సగము మృగములుగాఁ జూచుఁ జాటునుండి
మనలఁ జంపనువచ్చును మాటుపెట్టి 374

గీ॥ వనమున కుపద్రవంబైన వ్యాఘ్రమైన
వానరేశుండు వాలి కాఁచుచ్చుఁ జూడు
తనకు మాటుగ మీ పినతండ్రి కలడు
విభుఁడు రాముఁడు శూరుఁడో పేటకాడు 375

వ॥ అనిన దుర్ధరంబగు కోపంబును నిర్భరంబగు భయంబును గా బాలుం
డైన యంగదుండు మొగమడ్డంబు ద్రిప్పికొని పోగా మరికొంత
దవ్వునఁ దారుండు కనిపించి యిట్లనియె. 376

ఉ॥ నీ కొకమాట చెప్పటకు నే నిటనిల్చితి రాముఁడన్నవాఁ
డాకుటిలోగ్ర భూమి భుజగాభుఁడు నీ పినతండ్రితోడ నే
స్తై కరముల్ కరమ్ములును నగ్గియు సాక్షిగాఁగఁ గట్టినా
రా కపిలోకరాక్షసుఁ డహంయువు నీపిత యేమి కానగున్ 377

గీ॥ వాలి దుందుభిదనుజ శవంబును నిరు
గేలఁ బూని యోజనదవ్వు తూలనేసె.
కాలిబొట్టనవ్రేలఁ గంకాళ మతని
దలఘుఁ డాయన పదియోజనలకు విసరె 378

గీ॥ వాలి యొక్కొక్క బాణాన సాలశాఖ
లేడునేడు సాకులుగ దూయించుచుండు
రాముఁ డొకబాణముననె పత్రములు దూసి
మొదలు కొమ్మలు విదళితంబులు పొనర్చె 379

గీ॥ సగము మనిసి మృగము సగమైన మనజాతి
యందు రామచంద్రుఁ డట్లెచూచు
రెండుజాతులయును వృత్తసౌఖ్యము లంది
రెండునైన శిక్షలుండ వెల్లు 380

క॥ వే నవమర్యాద బడిన్
తానై యెదిరించునొక్క తమ్ముని పగకున్
వానరమర్యాదంబడి
పాణము పాయునొ వికల్పభావము పొంకెన్ 381

వ॥ నేడో రేపో సుగ్రీవుఁ డాహవమునకుఁ బిల్వకమున్న నిర్ణయించు
కొనవలయును. నేను తేనిటం దభిమానముకలవాఁడనుగానఁ జెప్పి
తిని. నీవు వెంటనే తండ్రికిఁ దెలుపుఁడయు మన సంగదుండు తీవ్రా
లోచనాముగ్రితె నపనుఁడై పనన 382

శా॥ సప్తప్రాల్ విపులాంబుసంగి విడి భాస్వద్దేహకార్యార్థిపై
దీప్తిం బోయెద రేమొ వాలిదెస సద్ధింపంగఁ గిష్కింధ నా

దృప్తాకారులు బద్ధచూడులు సమాధివ్యగ్రవృక్సారణుల్
సప్తాంభోధులు మూని యాశ్రమపరిస్పందంబు లైనట్లుగన్. 383

మ॥ అల వ్యాయామముచేసి చన్న పదినా ళ్లాసూర్యపుత్రుండు ను
జ్జ్వలబాహాసవదండమండలు డుదంసక్షోణిభృచ్ఛేఖరుం
డు, లఘుప్లావితజంఘుఁ డున్నమితకంధరుం డుజ్జ్వలన్నేత్రుఁడై
వెలలెన్ సాంధ్యశరత్పయోధర వియద్వీథీచలత్క్రీడగా 384

మ॥ హరువౌ నాస్యము జానకీవిరహవేళాయాస భావస్ఫుర
త్పరిదీనాసిత నేత్రకోణములుగా వర్షాంతవేళాపరి
స్ఫురితాంభోజముగాఁ గనంబడ భుజామోఘస్థితేష్వాసనో
ద్ధురతూణీరుఁడు రామమూర్తి నడచెన్ దుంగాద్రిసానుక్రియన్. 385

చ॥ తన యెదయెల్ల రామపదతామరసంబులఁ జిక్కి యంజనా
తనయుఁడు పోయె నానడక తత్పదకోమలభావ మంత ప్రి
న్ననివగు సీలమండల కనత్ప్రభ మోహము నెల్ల గుత్తకొం
చును జనినట్లు తోఁపగ విశుద్ధహృదంతరదివ్యభావుఁడై 386

చ॥ తాదృశుఁడైన యాభరతుఁ దానుగ పూర్వము సంశయించె నా
హా! దయమాలి లోకమున నందఱు నన్నలు రామచంద్రులై
పోదురొ! కానుగల్గుదురొ! భూతనయాపతి వాలిమీఁద ని
ట్లై దయమాలు టక్కతము నంచును లక్ష్మణుఁ డెంచుచుం జనెన్

గీ॥ సప్తతాళదళన సమయంబునందునఁ
జూచె మరల నేడు చూడవలయు
రామశరపు దుర్ధరము వేగమంచును
నడచె నీలు డల్ల పుడమి యదర. 388

గీ॥ నడుమఁజొచ్చె నలుఁడు నవ్వుచు లోలోన
నగము మృగము నగము చంపవలయు
మనిసితనము కూడ మడియించుటకుఁగదా
అంగదుండు చెప్పెనా యటంచు. 389

మధ్యాక్కర :—

తారుఁడు తాఁ జివురెత్తుతనువు నుత్తాలంబు చూచి
దూరాన వాలియు రాముతోఁ బోర దూఁకివచ్చె నా య
పారాభిమానుఁ డంచుఁ దనుపొరగాఁ బాఱగాఁ జూచు
వారితో నడువఁగా వెన్కఁబడి తోన పరువెత్తి కలియు 390

శా॥ కిష్కింధాపుర మేగుదెంచెఁ బరితఃకీర్ణోర్విజాతోల్లతా
పౌష్కల్యంబునఁ జూపఁగావలసి సంబద్ధోగ్రభూభృద్దరీ
కిష్కుప్రాంగణమాత్రలక్ష్య మగుచుం గ్రేణించి లోకైకధా
నుష్కుండౌ రఘురామమూర్తి కనెఁ గన్నుల్ సూదులై మోవఁగన్

శా॥ సుగ్రీవుండును మందయానమున నాశుప్రస్ఖలత్కంఠుఁడై
యుగ్రీయుండయి చేరి కోట్టముఖసింహద్వారదేశంబు క్రూ
రోగ్రాట్టంబుగ సింహనాదమును వీరుండై పౌనర్వ్య దిశల్
ప్రగ్రాహోద్వమనంబుగా విరిచె దూరాకారముల్ ధ్వానముల్ 392

మధ్యాక్కరలు :—

అంతట నాకాశమందు నండజాతానీక మురిసె
ప్రాంతకిష్కింధాపురాగ్రభవన భూభాగంబులందుఁ
జింతయిపుల్లైన కనుల చెందిర చిఱువన్నె లొలయ
గంతులు నఱపులు తక్క కపిచమూకాండమ్ము నిలచె 393

వాలి మహాంభోధిభంగభయద దోఃపాడిత్యశీలి
వ్రాలి యుద్ధినోగ్రయాన పరిలముల్లవమాన కేళి
తూలి సుగ్రీవునిఁ జూచి-దుష్టుడా! దోఃక్రీడ నేలి
వాలి నెదుర్పంగ నీవు వచ్చితివా బుద్ధిమాలి 394

పదరి వారిద్దఱుఁ గలియఁబడి మహాభయదనఖాళి
చిదురిపలై కండలు వదనసీమలు చీలుచుకొంచు

నదిరదిర యంచు బిట్టునొచ్చుచు నలముభుజాస
మద నినదరేఖ రంగమధ్యధర్మ్రంబులు చెవక 385

త్రోచిన త్రోచును, వాలి దుమికిన దుముకును బెర్రిగి
యేచిన నేచును, వాలి యెగిరిన నెగురును నిప్పు
చూచినఁ జూచును వాలి చొచ్చినఁ జొచ్చును సమతఁ
గాంచిన శూరుఁడై చెలఁగెఁ గదనానఁ గమలాప్తసుతుఁడు 396

రెండు భూధరములవోలె రెండు వారిధరంబులట్లు
రెండు వరాహములనగ రెండేచు మృగరాజులట్లు
రెండు వాహినులట్లు రెండు వార్నిధులన్నయట్లు
దండి వీరులు పోరి రన్నదమ్ము లుద్ధతశౌర్యనిధులు 397

వడ్లు దంపినరీతిగాఁగఁ బటుముష్టిపాతరావములు
గొడ్లు త్రొక్కినరీతిగాఁగ క్షుణ్ణమై క్షోణిదేశంబు
గ్రుడ్లు వెళ్లుకవచ్చునట్లు గ్రుద్దుచుఁ గుములఁ బొడ్చుచును
యొడ్లు నేరనిరీతిఁగాఁగ నుద్ధతయుద్ధపండితులు 398

ఒకకొంతవేళకు డస్సి యుగ్రత యుడిగి సుగ్రీవుఁ
డకట ! శ్రీరామబాణమ్ము నరుదెంచునం చెదు-రరసి
యొకగడియయు నొక్కగడియ యురువేది యొక్క నిమేష
మొకనిమేషము నొక్కలిప్త యొకలిప్తయును జూడఁజూడ 399

అనుకొంచు రామచంద్రుండు నగ్రజుఁ డనుజుం డటంచు
ననుజుండు నగ్రజుఁడన్నయట్లుగా నతఁడితఁ డౌచుఁ
గనుముక్కుతీరును సంధిఘటన చంక్రమణవైఖరియు
ఘనసింహనాదంబు నొకటిగా విడిగా నెఱుంగకయు 400

నిస్తబ్ధుఁడై నిల్చిపోయె నిర్వ్యాజనిభృతాననుండు
శస్త్రహా ఋక్షరజసుని సద్భావసంగతి మెచ్చు
చస్తోకమైనట్టి వారి యాకృతులందు సామ్యమున
మస్తకకంప మోహానుఁడు మహిజాతమానసహేళి. 401

ఇఁక నాగలేక సుగ్రీవుఁ డ్జెట్టెట్లో యింతనంతటను
చకితుఁడై పోరుచు నాశ సన్నసై జారిపోవంగ
నొక యింత నిల్వగా లేక యురియుచు నూడనిబాడె
వికృతాననుఁడు వాలి వ్రిదిచి కవ్వించి నవ్వంగ 402

= ఖ ం డా ం త ము =

గీ॥ ఇద్ది నూపురఖండ మహీపరివృఢ ప
దాగ్రి నూపుర ! ము క్తీలయవనిపతికి
నీ సపత్నినామునకుఁ బండించిపెట్టు
నవఘుశోభూమి వంకసన్నాలు స్వామి !

ఉ॥ నా యెదలోన నుంటి వయినన్ వెనుచూడనులేదు కన్ను సా
ధీయము మంగళం బుభయదృష్టి యెఱుంగదు కన్ను మిన్నవాఁ
డై యెసలారు నీశిరసునంజలి తుంపురుగుంపు సోకి తం
డ్రి యొక చెమ్మ యింత ఘటియింపవె కంటికి వెన్కతట్టునన్

తో ద క ము :—

ఆహ్వాతసంయమి హారితపోర్త్రై !
యాహతనాద విహారిశిరోగ్లా !
మోహవియుక్త విభూతిమనోభూ !
ధీహ్వాతిసంగత దీప్తిమహశ్రీ !

# గజపుష్పిఖండము

క॥ శ్రీయోజనాపగతమతి
ప్రియశ్చిత్తాభిధాన ! ఫణిరాజగ్రి
వేయశిరోమణికాంతి
వ్యాయామవిదీర్ణకంధరాసితకాంతీ !!

మధ్యాక్కఱలు :—

అవనతవదనుఁడై యనియె నంబురుహాప్తసుతుండు.
తవిలి నీ బాణవేగమ్ము తత్పరతం జూచిచూచి
అవుర ! నీవిటఁ జాలవంచు నందునా యగ్నిసాక్షికము
నవు చెల్మి నీవు మన్నించవందునా ! అగ్నిహోత్రివయి. 1

గడియయు నిముసమ్ము లిప్తగాఁగ లెక్కలు చూచుకొంచు
వడి నాతనికిఁ జిక్కఁబోక బరిమీఁదఁ బాముగా శరము
విడిచెద విప్పుడిప్పుడని వ్రేఁగయి విహ్వాలించితిని.
జడుఁడు పొమ్మని నన్ను జాలిచేఁ జంపక విడిచె 2

ప్రభునై యతఁడు పారిపోయి ప్రాణాల రానిచ్చినాడు
నిభబలుఁ డాతండు వెంట నేతెంచి యింతంతఁ గాని, శ
లభమువోలికఁ గాలరాచి లాఁచి యిలాస్థలిఁ బెట్ట
సభయుఁడ దిక్కేమి నాకు చాపశిక్షానీలకంఠ ! 3

వ॥ సుగ్రీవపలాయనానంతరమున ఋశ్యమూకగిరిశేఖరంబునఁ దత్స్త్రీక
సమావేశంబున సుగ్రీవుఁ డిట్లు పరిదేవనంబుచేయ శ్రీరామచంద్రుఁ
డిట్లనియె. 4

గీ॥ నను దురర్థము చేసికొన్నావు నీవు
నతఁడు నిను వెంబడించిన నపుడె వాని
హృదయనిర్భేదముగ సంహరించియుండు
సడలి నవ్వేఁడువానినిఁ జంపుటెట్లు 5

ఉ॥ నీవు విచిత్రచంక్రమణనిర్భరవృత్తి మెలంగ నేను నీ
వే విను! వాలివంచు నెద నెంచితి నమ్మను దూసినాను కా
నావల నీవలై మెఱుపులై చరియింపఁగ మీరలిద్దఱున్
నీవొ యతండొ యెవ్వరని నిర్ణయముం బొనరింతు వాలిగన్. 6

గీ॥ కవలుకా కింతయైన యాకారసామ్య
మునకు మీతల్లి కివియ నమోవచస్సు
లంతగా నామె స్వచ్ఛదివ్యాంతరంగ
పొగుచుకొనె నెంతగాఁ బతిమూర్తిముద్ర 7

క॥ మీతండ్రి ఋక్షరజసుఁడు
చేతఃపావిత్ర్యపరమసిద్ధుఁడు కృతియున్
మీ తల్లి చిత్తశుద్ధి
స్ఫీతహృదంతర, పతిప్రవిష్టాత్మయునున్ 8

మధ్యాక్కర:—

అనినంత సుగ్రీవునకును నానందమై బాధ మఱచి
తన తల్లియును దండ్రియైన తపము నుత్తమము కొండాడ
మనుకులేశుఁడు లేఁతనవ్వు మసలఁగా మఱియు నిట్లనియె.
నిను నీవటంచు నేనెఱుఁగ నిజముగా నేరగాఁడలయు 9

వ॥ అంత శ్రీరామచంద్రుండు సౌమిత్రిం గాంచి యయ్యా! లక్ష్మణ!
అడవియెల్లఁ గన్నులువిచ్చినట్లున్న యీగజపుష్పి గుత్తగా సుగ్రీవుని
కంఠమందుంచుమన నతండు పోయి యాపూలు తెంచి మాలగా
నిర్మించి సూర్యసూతి కంఠదేశముం దమర్చిన 10

సీ॥ సితబాలపత్త్రి భూషితనాగవల్లి హా
రాకృతిఁ బ్రాఁకిన యతసినోలె
ఇరుపేటగా నైన శరదంబుధరరేఖ
యల్లుకొన్నట్టి జాబిల్లివోలె
పుష్పాటవిం జొచ్చి పోవఁ దద్వల్లికా
రచితహారము మృగరాజువోలె
సితబలాకా సమాశ్లిష్టవర్షామిల
త్సంధ్యా పయోధరస్వామివోలె
వెల్లకొట్టిన బురుజుల విభవ మెసఁగి
దూరధాత్రి సంజ్ఞాతమహా దుర్గమట్లు
కంఠగత గజపుష్పిప్రకాశమానుఁ
డంబుజాప్తసుతుండు పెల్లందగించె 11

మ॥ మధుమాసోజ్జ్వల పుష్పకేసరమిళన్మాంజిష్ఠవర్ణుండు సా
రథి వీర్యేందిరకున్ శ్రమాపనయనప్రారంభణోద్యోగి శై
లధునీసంగత భంగకుట్మిత హేలాహేతుశృంగారవా
ర్నిధి మందానిలుఁ డేగుదెంచె సుమనోహృచ్చోరుఁ డారాద్వనిన్ 12

క॥ శకలితమణి పార్శ్వచ్ఛవి
నికాయముల కాణయాచి నిభృతతరులతా
పరికరదళోపరి శంశ్లథ
చకితము తరుణాతపంబు జాలులుకట్టెన్. 13

గీ॥ బేడిసలు పైకి నెగిరెడు విమలవాహి
నీ విధంబున నిభృతముల్ నేత్రకాంతు
లురల హరిణీచయంబు వనోర్వియందు
సాగెఁ గాంతులపైఁ దరుచ్ఛాయలారఁ. 14

చ॥ తన గజపుష్పిమాలఁ గని తామరసాప్తసుతుండు కోర్కెమై
తన మఱునాటిదైన కపిధాత్రిపతిత్వపు లక్షణంబుగాఁ

దనుపట నెంచె నన్నియును దా రఘురాముఁడకున్ వచించెఁ బో
ల్కిని వచియించియుండెనను గేవల మిప్పుడె కే ప్రభుండగున్. 15

మ॥ తొలి వర్షాసమయంబునం దసితవృత్తుల్ తాముగా నాచుఁ ద
మ్ములకుం జేసిన కీడు మాపె శరదంభోదంబు లంతన్ మరిన్
జెలిమిన్ నిల్పఁ డటాకహాసమున నచ్చెం ధాత్రికిం దాము ను
జ్జ్వలుఁడౌ రాజున కింతమాత్రమును సౌజన్యంబు లేదాయెఁగా 16

క॥ హనుమంతుని సుగ్రీవుని
గనులకుఁ గరయుగము నీడగా నిడి కనుచున్
వనిలో శాఖామృగములు
తునిఁగి కనుచుఁ జనియె దూరదూరంబులకున్ 17

ఉ॥ వ్రాలి మనుష్యవిహ్వలిత వాసనపట్టుచు గాలిపాట, శా
ర్దూలములున్ మృగేంద్రములు దూరపునేలఁ దొలంగిపోఁ దదు
ద్వేలములైన గుత్తులు నుదీర్ణలతాహతి గుప్తపెట్టుకొం
చోలి ఖగంబులుం గపు లొకొక్కఁడు పిల్పులుపెట్టుచుండఁగన్ 18

ఉ॥ తన్నెదిరింపఁగా భయగతంబగు చిత్తముతోడ వాలియున్
మిన్నకయుండె మున్న తనమీఁద శరంబును వ్రాలకున్కికిన్
దన్ను వధించు టెంతయు నధర్మముగాఁగఁ దలంచియుండునం
చెన్నెనొ ధర్మసూక్ష్మము వహింపదు స్వార్థము పట్టుచోటులన్ 19

గీ॥ అని తలంచుచు గాఢబాహావలీఢ
ఘనభుజోత్తుంగ మూర్తియై చనియె స్వామి
యుభయపార్శ్వ వనీతరు లూహచేయు
చమ్ముతుది వాడె వ్రేళ్లల నంటుకొంచు 20

శా॥ శ్రీఫుల్లంబులు గంధసారతరురాజి న్యగ్రిచక్షుశ్శ్రవ
శ్రీఘ్రాతృత్కారసమోన్నిర తృపిమళచ్ఛిన్నైకభాగంబుగా
శేఫాలీసుమమాలికా విదళనస్నిగ్ధంబు కాంతారవీ
థీ ఫల్గూచ్ఛలనంబు తావి తెర యేతెంచెన్ సమాఘ్రాతమై 21

గీ॥ అంచదమ రేఁదిరా గుంఫితాగ్ద్రి యావ
నం బనెడి పున్గుకాయగంధంబు గుబులు
కొనఁగ విచ్చినయట్లుగా గుమ్ములగుచు
నొక్క పరిమళవీచిక యొడ్డువిరిగె. 22

ఉ॥ అంచితమైన యాపరిమళానిలసంహతి వెంటనంటి తో
తెంచెను కేళినర్తనగతిస్ఫురితామరలోక కామినీ
చంచలమధ్య తాళకృతిసంగతపాణి నటత్పదాంగుళీ
కాంచివినూత్నరత్నమయ కంకణనూపురకింకిణీధ్వనుల్ 23

క॥ మొలనూలు పసిఁడిగంటల
సలలిత మవ్యాప్తరవము చరణాబ్జయుగీ
చలితనవకాంస్యకింకిణు
లులివును మినుమన్ను గంగలో యన సాఁగెన్. 24

గీ॥ ఎలమిమీఱ దధీచి వెన్నెముక కథలు
మధురమవు గొంతుసవ్వడుల్ మక్కళించి
పాల్కడలిలోనఁ జిలుకు కవ్వంపుఁగొండ
యంచు లులివుగాఁ బాడిరి యచ్చరలును 25

క॥ అమరాంగన యొక్కర్తుక
యమరసభా దేశిరాగ మాలాపింపన్
గమలాక్షుఁడైన రాముఁడు
కమలాక్షాంతముల సుంతగాఁ జెమరించెన్ 26

ఉ॥ ఏవిను రొప్ప వాలి వధియింపఁగ నేగిరొ మొన్న మొన్న నీ
త్రోవనె రాముతో డెడమఁ దోఁటను జాడను నేదు తచ్ఛిఖా
కేవలనిర్గతంబులయి గీతసుధల్ కలితాప్సరోజన
శ్రీవిభవాత్తభూషణవిశేష నినాదములున్ స్ఫురించెడున్. 27

శా॥ ఆ మిన్నంటునఁ బక్షి యాడదు గొరుద్వ్యాపారపారీణమై
యీ మన్నందున జంతువుల్ తిరుగ వాహిండక్రియాదక్షమై

భూమీజంబుల శేఖరాళి నటదంభోదంబు మూర్ధంగికా
శ్రీమీమాంసకగర్జల న్నిరవుఁబో నృత్యానుకూలంబుగన్. 28

శా॥ ప్రాతఃకాల తుషారధూరరుణమృత్ప్రత్యంత భూమీధరో
త్ఖాతక్రీడన రమ్యకాననకరీంద్రారక్షమాంజిష్ఠమై
యాతోద్యస్వనరమ్యమై యెసఁగె సంస్యంద్యండవేళామరా
ళీ తీవ్రోదరవర్ణమై పరినటల్లీలాంబువాహం బొగిన్ 29

శా॥ తాచ్ఛీల్యప్రవిభాస్వరంబుగ సముద్యద్రూపమై యేకదే
శచ్ఛత్రింబుగ నేకదేశపటహస్కంధంబుగా నేకదే
శచ్ఛిన్నాంబుకణాత్త మూక్తికసరస్సంవ్యానభృత్కాయమూ
నచ్ఛాయంబుగ నందముల్ వెలిచె నన్నా! వారివాహంబొగిన్ 30

గీ॥ ఓయి సుగ్రీవ! యీతోఁట యునికి చూడ
మనికి చరితార్థమైనట్లు మదికరంగు
నిచ్చటి విశేష మేదియో యెఱుఁగఁజెప్పుమ
తిరుగ నీ దారినే పడదేమొ మరల 31

వ॥ అనిన సుగ్రీవుం డిట్లనియె. ఓయి రఘుప్రవీర! యీవనంబెల్ల నీ సప్తజనాఖ్యులైన ఋషులయు మతంగమూనియు మహత్త్వంబున నిత్య వసంతంబు. ఇది తుది గ్రీష్మంబయ్యును పంపాసరస్సాదిఁ గిష్కింధాంతమువరకు నీ వనంబెల్ల వసంతస్తవే. 32

మ॥ శతవర్షంబులుగాఁగ స్వర్గపదవీ సంప్రాప్తులైనారు స
న్నుతులై సప్తజనాఖ్యులైన ముని లిందున్ వారు మున్నాశ్రమ
స్థితియై యుండి రథశ్శిఖల్ పరిణతశ్రీకుల్ తపోభాగసం
గతనానామహిమల్ తపోవనకృతాకాంక్షామహాశ్లాఘ్యులై 33

ఉ॥ వారు త్యజించిపోయినను వారి తపోవనదేశ మీవృశో
దారవిచిత్రభోగమహితంబయి యొప్పుచునుండు నిద్దియె

ద్వారికి నప్రవేశ్య మొకవంకను జొచ్చిన వేఁడు సాహస
ప్రారభమాణుఁడై తిరిగివచ్చుటయున్నది లేదు రాఘవా 34

ఉ॥ ఈ పరమర్షి దేశమున కెత్తిన జోతలుగాఁగ మస్తకా
రోపితహస్తయుగ్మునకు రూపముపొందున యెల్లకోరికల్
దీపితభక్తివై యనుమతింపుము నీవను రాఘవా! ధరన్
మోపిన శీర్ష మెత్తు నదనుంబడి సర్వశుభంబు లాడెదున్. 36

గీ॥ అనిన రాముఁడు మొన్న నీ యధ్వముననె
పోయితిమొ యన్న నిట్లనే పోయితి మనఁ
జూడు మద్దాననే కపిక్షోణిపతివి
నా సఖుఁడ వీవు నేడు నైనావు కావు 36

ఉ॥ మిత్రజనానుకూలుఁడు నమేయభుజాబలశాలియున్ ససౌ
మిత్రి రఘూద్వహుండు ఋషిమేదినికిం దలవంచుచున్ నమ
ద్గాత్రుఁడు నంజలించె ఋషికానన నిర్గమితాప్సరోసధూ
మాత్రపరిస్ఫురద్వ్రత మంజులగీతిక లాలకించుచున్ 37

శా॥ అంతన్ స్నాతుని యజ్ఞపూరుషుని చూడాంతంబునా నాశ్రమ
ప్రాంతాకాశపథాంతరాజ్యకృతధారాపూతసాంనాయ్యప
ర్యంతాసారిత ధూమరేఖ చెలఁగెన్ రాజీవనేత్రింబులన్
శాంతం బద్భుతముం బెనంగాన రఘుస్వాముల్ విలోకింపగన్ 38

శా॥ అధ్వంబంతటఁ గోమలాతపసహంబై పార్శ్వ భూమీలతా
సాధ్వారామముసై మనోజ్ఞకదళీ సంచారరమ్యంబునై
ప్రధ్వస్తశ్రమవారివాహ నివహోపాత్తంబు శీఘ్రంబుగా
మాధ్వీకప్రసవోపరి ప్రవిచలన్మందానిలాపూర్ణమై 39

క॥ కనుచూపుమేరఁ గనిపిం
చెను కిష్కింధాపురంబు ఛిన్నదుమథా
త్రిని భూధరకందరధా
త్రినిఁ బటువానరచమూ ప్రదీపితధాత్రిన్ 40

వ॥ అంతం గటిబద్ధోత్తరీయులు సజ్యకార్ముకులు యుద్ధసన్నద్ధులైన రామ-
లక్ష్మణులం గాంచి సుగ్రీవుండు సింహనాదంబు సేసిన 41

మధ్యాక్కఱ :—

తమతమ పనులలోం గపులు తలలెత్తి తా ర్వెనుదిరిగి
కమలాప్తతనయుండు సింహగర్జము కావించు టరసి
యమకేంద్రసుతునకుం జెప్ప సరిగినా రందుం గొందఱును
కమలాప్తకులులను దవ్వుగాం జూచి కదలి రందఱును 42

వ॥ మఱియు సుగ్రీవుం డిట్లనియె 43

ఉ॥ ఓయి మహాప్రభూ ! రఘుకులోదధిపూర్ణశశాంక ! వచ్చినా
మీయెడ కిర్ది యింద్రజకపీశ్వరగుప్తము వానరోగ్రసే
నాయుతరక్షితంబు నిఖిలాసురదుర్జయమూ పురంబు న
న్నీయెడ కీవు తెచ్చితివి నేనె భవత్పరిరక్ష వచ్చితిన్. 44

క॥ తన నేర్చిన విద్యంగా
కను నితరోపజ్ఞకంబు కళ నాధారం
బునుగాం గైకొని కయ్యం
బునకుం గాల్ద్రివ్వువాండె మూర్ఖుండు ధరణిన్. 45

శా॥ తాదృఙ్మూర్ఖశిరోఽవతంసమను నాథా నన్ను శాసింపవే
కోదండోగ్రశరాభిపాతమున నాకుం దెన్ను చూపింపవే
నీ దీప్తోరుశరంబు సాగరహిమానీశైలపర్యంతధా
త్రీదర్పప్రవిభేదనోగ్రము మదారిప్లోషణేచ్ఛుచ్ఛటా ! 46

క॥ ఈసారికిరాఁడ సామీ
భాసురముగ సుస్తుపట్టంబడకుంటిని బో
నీ సుగ్రీవునకు జలము
చేసేతన్ వదలుకొమ్ము చేతఃప్రభువా ! 47

శా॥ సేగిన్ రక్షణచేసికొందు గజపుష్పింగంరమం దో ప్రభూ !
సాగించుం గుదియించుఁ గర్షణవిధాచండుండు నవ్వాలి బా
హాగోళంబుల దండ్రతెంచిన నతం డౌ దేను గుర్తింప నీ
ప్రాగల్భ్యంబును నా యదృష్టము ద్విధాపర్యేషణాదుష్టమై 48

మ ధ్యా క్క అ :—

ఆ వాలి వచ్చెడులోన నాశ నిరాశలు తేల్చు
మావిష్కృతదయాసముద్ర ! యంబుజాతాక్ష ! శ్రీరామ !
నీవు నన్నే మొ యాదుకొని నిజముగా నిలువనెంచెదవా
నీవు కేళీవిలాసివి వనీదేశనిర్యాతుఁడైతో ? 49

గీ॥ వేగ నా చేతిలోఁ జేయివేసి కాని
నేను పోనయ్య ప్రియసఖా నేను పోను
కాదయేనియు ఋశ్యమూకంబు గలదు
పరమమునిదత్త వాలిశాపంబు కలదు 50

మ॥ అనినన్ శ్రీరఘురామమూర్తి దరహాసాంకూర మంకాంతసం
జనితజ్యోత్స్నయుగా శశాంకవదనచ్ఛాయా సనాథంబుగా
ననియెన్ నమ్మకమన్నయట్టి దిను సాహో ! స్వచ్ఛమైకూడ నే
చిన వక్రంబగు సన్నివేశమున వంచింపంబడున్ స్వచ్ఛతన్ 51

గీ॥ మొన్నఁ జంపకపోవుటయు న్నిజంబు
బాగుగనె యున్నయది సుమీ వాలి తార
చేత వారింపఁబడవచ్చుఁ జేతమందు
మరియు నూహించుకొని, పోరు మానవచ్చు 52

చ॥ పగ యెదఁ దీసివేసికొని భ్రాతృత నిన్ యువరాజుఁ జేసినన్
బగయె ప్రధానమా మనకు వానరరాజ్యము నేలనిమ్ము, తాఁ
దెగి కపిసేనతో నెదుకుతీర్చిన లక్ష్మణు చేతిలోపలం
దెగు నది నేను వాలిని వధింతును నీకును రాజ్యమేర్పడున్ 53

శా॥ ఆలోచించి పౌనర్ప రే పనియు మోహాగ్రస్తులై జీవు ల
వ్వాలిం జూచిననైన నల్లె కనిపింపంజొచ్చెఁ గానిమ్ము యీ
గోలాంగూలధరాతలేశ్వరుని మత్కోదండనిర్యచ్ఛర
జ్వాలాదగ్ధశరీరుఁ జేసెదు దెసన్ సందేహ మేలా పడన్ 54

ఉ॥ నీ వొకవేళ మెత్తపడి నీదగు నన్నయెడన్ సమార్ద్రుఁడై
కావు మటంచు నన్నడుగఁగాఁ జెలికారముచేఁ గృతాఘునిం
గావక తప్పదంచు నెదఁ గ్రాఁగుచు నూహపొనర్చుచుంటిఁ గా
నీ విను నీకొసంగుటకు నేలను నమ్మున గురిచ్చియుంచితిన్ 55

శా॥ మందేహాసురరక్తదిగ్ధము దివామాంజిష్ఠభోగంబు మే
లొందన్ వేచెడు నగ్నిహోత్రివలె నిన్నూహింతు నిన్నింకఁ జే
రుం దీరంబునుపోలె రాజ్యరమ ఖడ్గాదుస్సహాభీలబా
హుం దేవాధిపసూతిఁ గర్కశమతివ్యాహూత్మ మన్నించకన్ 56

గీ॥ ఇంతలోఁ జూచెదవు నవాసృక్పిహితుని
ధారుణీశయాను నతని సంధ్యామహోగ్రి
నటమురజనిస్వనము సింహనాదమునకు
నిలు వెడలి వాలి యేతెంచు నెంతలోన 57

వ॥ అనిన సుగ్రీవుండు దిగ్భిత్తికల బెత్తికలూడిపడ రణాహ్వానంబు సేసి
కిష్కింధా ద్వారనికటధాత్రి కేగి శ్రీరామచంద్రాదులు వృక్షా
దులచేతఁ దిరోహితులై ప్రతీక్షించుచుండ

గీ॥ వాలి సుగ్రీవకృతము రావంబును విని
మండిపడి లేచి యీ సిగ్గుమాలినతని
వేగ వధియించి కాని యీవిసుగు తెగ ద
టంచు నడుమునఁ గాసె బిగించికట్టి 59

క॥ సన్నద్ధంపడఁ దారయుఁ
గన్నుంగొనలందు భీతిగా నిట్లనియెన్

మొన్న విరిగి దిక్కు—టి తాఁ
జన్నయతని నేటిరాక చను హాస్యంబై .60

గీ॥ అనిన వాలియు నిట్లనె నంబుజాక్షి
యోడినకొలందిఁ గొందటి యురిసిపోక
యిట్లనే యుండు ననఁ దార యిట్టులనియె
మున్ను నిను యుద్ధమాడ రాఁబోనివాఁడు. 61

శా॥ పాెంచన్నితిపథపరిమాణధిషణాభావుండు తానై విచా
రించున్ జేయకమున్న సర్వమును సుగ్రీవుండు నీముందుఁ దా
నంచున్ నిల్వఁగలే డెటింగియును నేలా వచ్చెఁ గర్వించుచున్
గించిత్తైనను జేయఁ డాతఁడు వృథాకృత్యమ్మనుత్యంబుగన్ 62

గీ॥ మొన్న లేదా విచారణ నిన్న నేట
వచ్చెనా యన్న నామొన్న వచ్చినపుడె
యద్ది యున్నది యున్నదం చంగదునకు
నీల నల తారు లాడిన నీ వెఱుఁగుదు 63

శా॥ ఆయేదో యది మొన్న నేమిటికిఁ జేయంజూడలేదన్న న
జ్ఞేయం బేమి ఘటిల్లెనో యచట నీ నేడీగతిన్ వచ్చుటే
ఆయేదో కలదన్నమాట ఋజువౌ నా రాముఁ డారామను
జ్ఞాయాంతానిలపోతముల్ సయితి మహాయాదుఁ దవ్చార్యముల్ 64

మ॥ మును విన్నాము భార్గవుండయిన రామున్ విన్న రామాహ్వయం
బునఁ దవ్చార్యము శైవభక్తియు మనంబున్ ముట్టి మెచ్చించు, నీ
తని పేర్వెన్న హృదంతరంబున విచిత్రంబైన యాకర్షణం
బును దీపించెడుఁ దత్స్వభావము సమంబున్ దాటు నూహింపఁగా. 65

మ॥ మరియున్ నీవునుగాని యెవ్వఁడయినన్ మన్నింతువే వానిపై
నురుకంబోయిన యుందు వీవరకె యా యుల్లోకపూజన్యవి
స్ఫురితాత్మాఖ్యుడు రామచంద్రుఁడు మరిన్ సుగ్రీవుతో మైత్రికిన్
దొరకెన్ వాని యదృష్ట మంతనొరకెన్ దూఁకెన్ సమిద్భూమికిన్.

ఉ॥ ఆకడ రామశౌర్యమహిమాదులమాట యటుంచినిమ్మ యి
క్ష్వాకులబిడ్డ యేనేడు రసాతలసర్వరసాభిరక్తి ని
క్ష్వాకులు సూర్యదీక్షితిభవంబగు తేజము జీవలోక భ
ర్మాకృతి పూర్వకల్పనిభమై గ్రహియించి యనాటినుండియున్. 67

ఉ॥ ఈయన యేమొ సూర్యులకు నెల్లర కాదిమసూర్యుడైనయ
ట్లాయతధర్మమూర్తి ప్రభువై పితృవాక్యరహస్యచాలనం
బై యనిదెంచెబో స్మృతిగతార్థము స్పష్టము చేసినట్లుగా
నాయెడ వేదమార్గముల కర్థము చెప్ప మహర్షికల్పుడై 68

ఉ॥ తాదృశులైనవారలు పృథాధరణీతలరాజ్యమేటికిం
గాదని వత్తు రెచ్చట సకామ మధర్మము గూడుకట్టె నా
పాదులు పెల్లగించుటకు వత్తురుగాని యధర్మలక్షణం
బాదిమమూర్తు లావిభువులైన నెఱుంగుదు రంతియేసుమీ 69

శా॥ లోకం బాపని యీపనిం బొనరుచున్ లోకుల్ ప్రమాణంబుగా
నాకార్యంబులె ధర్మమంచు గాని దేశాచారమైనట్లు న
స్తోకంబౌ పరిపాటి ధర్మమని యెంచున్ ధర్మమో నిత్యమో
త్సాకారాభిముఖంబుగా నడచు జీవాద్వైతసూక్ష్మస్థితిన్. 70

శా॥ ఆరాముండును దొల్తగా నిటకు రాడాయెన్ సఖిత్వంబు నీ
తో రాణించదు సూర్యసూతి కది యేత్రోవన్ లభించెన్ మహో
దారుం డాతడటంచు నెవ్వడు వచించున్ నిన్ను గాదంచు నో
రారా ! కర్మపథంబు నిట్టిదని యేర్పాటున్న దే యిద్ధరన్ 71

మ॥ అతడేమేమి వచించెనో యనియు యాథార్థ్యంబు లన్వించు స
న్మతియున్ దొల్తగ విన్నదాన నభిమానంబూను నీకున్ నిరా
దృతి నీవై యనుకొన్న దే నిజము సుగ్రీవుండునుం దోషిగా
మతికిం దోచిన నంతియే యితని యేమాట న్నిజం బెన్నకన్ 72

ఉ॥ ఊహయొనర్ప మంత్రబల మున్నది పెద్దయు సూర్యసూతికిన్
బాహుబలంబు నున్నయది పండితలోక శిఖావిభూషణం

బా హనుమంతుఁ డుజ్జ్వలమహామతి తానె రఘుప్రవీరుతో
స్నేహము కల్పియుండును గణించవు నీవు మరంత వానినిన్ 73

ఉ॥ భ్రాతృత నిల్పి వాని యువరాజపదంబును వానికిచ్చి ధా
త్రీతలనాథుఁడైన రఘుదేవుని రాకయె నేరనట్లుగా
నీతిని నిల్పు నిన్నును గణింపడు నీవు గణింప వాతనిన్
సీతను బొంద నింక నెదిచేయునొ కాననవీథులంబడిన్ 74

మ॥ మనముల్ వారి విధాన నుంటిమికదా మాటాడి యూహించి ధీ
ఘనహా మానవవృత్తముల్ నడిపి శాఖావృత్తి మొక్కండు క
ల్గిన దోసాన మృగాలహాదుమె శరక్రీడాసమారూఢదు
ర్జనరేఖావ్యసనుండుకాక హితకార్యక్లేశవృత్తుండునై 75

ఉ॥ నీవు కులాచలేంద్రసమనిశ్చలదేహబలుండ వద్రి నీ
పై విసరన్ మరిం గదలఁబారవు తాదృశుఁడయ్యుఁగూడ నో
హో వెస సప్తతాళదళనోగ్రము బాణము నెంచ గుండెలో
నావులు తేసు నిల్వఁగలవా! రఘురాముని యంపరివ్వనన్. 76

శా॥ నీవే యుద్ధము చేయఁబోయినను గానీ నేను భీతిల్ల సు
గ్రీవుల్ వందలువచ్చినన్ భయపడన్ శ్రీరాముఁ డచ్చోట నే
దో వృక్షంబును జాటుచేసికొని దూయున్ బాణ మేవేళనో
ఆవేళ న్నిను గాచుకోఁగలుగు నూహంజేయ లేనయ్యెదన్ 77

శా॥ ఏ దైవంబులు వచ్చి సాయపడఁగా నేనిప్డు డర్థింతు నా
నాదైవంబులు మూటకట్టికొని యైనా డామహాస్వామి పెం
పేదం బౌరుష మ్మాశ్రయించి చనఁగా నేమాను శ్రీరాఘవుం
గోదండోగ్రుని ముందు నిల్చుటకు నీకున్ సాధ్యమా చెప్పుమా 78

శా॥ ఏనొక్కండు వచింతు నిశ్చితముగా నేర్పాటుగా శౌర్యహా
రీణంబైనది వచ్చి పిల్చినది సుగ్రీవుండె యావెన్కనే
డో నారాచనిగూఢుఁ డుండికద యాయూఁతంబడిన్ వచ్చెఁ డాఁ
గానన్ వాని నెదుర్చ మూఁతను బరిష్కారంబుగా సర్వమున్. 79

మ॥ ఇవి రెండే తుదకున్ వినిశ్చితములై యేపారు సుగ్రీవునిన్
యువరాజుం బొనరించి శత్రుతకు స్వస్త్యత్యాంతులం జెప్పటో
ప్రవిభక్తంబగు శౌర్యదీపనముగా రామున్ ఘనశ్యాము నా
హవరంగంబునయం దెదిర్చుటయొ వీరానీకసంశ్లాఘ్యమై 80

మ॥ అదియున్ నీకును రామచంద్రునకుఁ బ్రత్యక్షంబు వైరంబులే
దెదురై పోరడు దాన రాముఁ డటులే యీవున్, మరే చెట్టునో
మఱుగై నిన్ను వధించు దాని కదియున్ మర్యాదయై పొల్చు తా
నదియే హేతువుగాఁగ నీ వతనిమాఱై పోరవచ్చుంజుమీ. 81

క॥ ఈ మాటలు సుగ్రీవుని
తో మాటాడును బహిర్గతుండగు నతఁడున్
రాముం డేమనునో సు
త్రామసుతా ! యిల్లు పోవఁదగ దెవ్వరికిన్ 82

గీ॥ అనిన వాలి మందహాసాస్యుఁ డిట్లనె
నింత సూక్ష్మబుద్ధి నెవరు చెప్ప
రైన నింతకంటె నతిసూక్ష్మ మున్నది
తగవు నీకుఁ జెప్పెదను లతాంగి 83

ఉ॥ ఏనెదిరింతు నాతని సరే యెదిరించుట లేదు చూడ, నే
నైనను మల్లహస్తముల నాహవమాడుదుఁ జాపహస్తుఁడై
తా నెదిరించు నన్నతఁడు దానికి దీనికిఁ బొత్తులేదు వి
న్నేనును బూని యేగ నతఁ డెక్కడ నెక్కడ నేను తన్విరో 84

శా॥ నాకోస మ్మతఁ డేమొ మల్లువిధానన్ వచ్చునా దూరమం
దే కోదండవినిర్గతాశుగములన్ దీవ్యత్తనుం జేయుఁ గా
దీ కైపట్టులఁ బట్టి రమ్మనుమనా యెవ్వాఁడునున్ స్వస్వభా
వైకౌన్నత్యము నాయుధంబున సమిత్సానీకముం దూల్చెడున్ 85

ఉ॥ అతఁ డఖిలాస్త్రవేది యొకయమ్మున ఝంఝను బెట్టెనో సహా
హీతలయవహ్ని గూర్చెనో మహేంద్రుని బ్రహ్మను సంతరించునో
యతనికిఁ జాపపాణి కెదురై చనుటన్నది లేదు మల్లుఁడై
యతఁడును రాఁ డహో యసమనైనది యీవిషమంపుఁ గార్యముల్

క॥ నా కస్త్రబాధ యన్నది
లేకుండగ వరములైన లే వాతనికిన్
జేకోఁ జేకోను శరా
ళీకృత గుంఫన మెడమ్ము లేదు లతాంగీ 87

ఉ॥ దుందుభుఁడాది రాక్షసులు దోర్బలసాధ్యులు వారి వేగమం
దొందు నెపమ్ము నిర్మథనయోగ్యముగా మరి శక్తిక్షీణతం
జెందును గొంతసేపటికిఁ జెందదు నా కధికత్వ మద్దియై
పొందును రామునం దదియుఁ బొందెను నాకధికత్వ మొప్పగా 88

ఉ॥ ఆతని సప్తతాళదళనాత్మక దుందుభికీకసోగ్రమా
లాతనుధూననాత్మక విలాసమహాబలకార్యముల్ వినం
జేతమునం దతండు పయిచేయిగ నెంచితి నాకు మల్లయు
ద్ధాతతకేళి నిత్యకలితాభ్యసనం బొకఁ డున్న దంగనా ! 89

గీ॥ పైన నెగిరి నల్గడ దూఁకగానుగలను
చేతులకుఁ దోడు వాలమ్ము చేతఁ గూడఁ
గర్షణాకుంచనంబులు గడపఁగలను
నఖములం జీల్పఁగల నేలనాగ నేను. 90

మ॥ సమయుద్ధానఁ బరాజయంబొ జయమో సంధిల్లు దుఃఖంబు లే
దమరేంద్రాత్మజుఁడై మృగంబువలెఁ గట్టా ! బాణపాతంబుచే
త మృతిం జెందుట కష్టమైనయది యింతన్ వాఁడు సుగ్రీవుఁడీ
సమరోదంతము తెచ్చిపెట్టినది నేఁ జంపన్ వలెన్ వానినిన్ 91

క॥ నే గుహలో నున్నప్పుడు
ఆ గుట్టలు పేర్చి కందరాముఖమందున్

డా గురు పిలిగినాడని
వేఁగి యెడఁద ద్రుమగ్గినంట వీఁడట బళిరే. 92

క॥ మృగములకును మనుజులకును
దగు భేదము బుద్ధిబలము తగ బుద్ధిబలం
బగుపడియెడు మనయందున
మృగబుద్ధిం జేయు టేమి నే రఘుపతికిన్ 93

క॥ నిన్నొక్కఁడు బోరికి ర
మ్మన్నను నీవెనుక నున్నయాతని మును ర
మ్మన్నను మును నాతోరా !
నన్నెదిరించి బ్రదికినం జూతు ననున్ 94

గీ॥ గొంతులో నాకుఁ బ్రాణ మున్నంతవఱకు
వీనిచే నంతమాట యన్పించుకోను
అతని నెదిరించుటన్నది యసలు లేద
యీ వెలితిమాట యేటికే యిందువదన 95

ఉ॥ రాము నెదుర్చ్చు టాపగిది రాజముఖీ ! అది యెట్లొ చెప్పితిన్
రాముని నేస్తు వాని యువరాజుగఁ జేయుటయన్న దెట్టిదో
నీమది నీవ చూడు మతనిన్, యువరాజును జేతు నిన్ను ర
మ్మా మనలోపలన్ మనకు నంత విరోధ మదేల నన్నచో 96

మ। అతఁడేమంచు వచించునో తెలియునా అన్నన్న యెన్నాళ్ళకీ
మతి సౌభ్రాత్రము ప్రేమ యొడ్డిగిలెదున్ మాయన్న యేమన్న మ
న్నతినున్ నాడును నేడటంచు నెఱచిందుల్ ద్రొక్కుఁ బోఁ తాడఁ బి
ల్చితి నీవో మరి నేనొ యంచుఁ బలుకున్ లేనట్టి శౌర్యంబునన్ 97

క॥ వానిని నేను నెఱుంగుదు
వానిని నీవెఱుఁగుదువును వాఁడా ! చలముం
బూనిన బ్రహ్మాచలం బది
మానిని ! మాజన్మ కింతె మది వెఱపేలా 98

శా॥ ఆ యీ చెప్పిన యెల్లన్యాయ్యముల నైయర్థ్యమ్ము రూపింపఁగా
నే యుద్ధంబున కేఁగుటొండె మిగిలెన్ నీవింక నేమందు విం
తై యాశాంకుర మొక్కఁడున్న యది తానై రాముఁ డన్యాయముల్
జేయం బోఁడను నమ్మకంబు మరి యా స్నేహం బికేమై చనున్ 99

గీ॥ ఎంత యాలోచనముచేసి యంతమునకు
నద్దియే నిశ్చయంబన నంబుజాక్షి
తార ప్రాభాత హైమపాతమున సరసిఁ
బోలెఁ జెల్వేది పరిదీనమూర్తి యగుచు 100

వ॥ ఆవురుమని కుప్పగూల వాలి యామె నెత్తి కవుంగిలించి యోదార్చి

మ॥ సమరాహూతుఁడనౌచు శూరజనభాస్వద్ధర్మముం బుణ్యము
త్తమముం జేయఁగ నేను పోవుతరిఁ జింతంబొందుటేలే సకీ!
భ్రమ బేల్పోకుము నొక్కబొట్టు నిడ నాపై నొట్టు కన్నీటి ము
త్తములం జేర్చుట వీరపత్నికి నుదాత్తశ్రీ కయోగ్యంబగున్ 102

వ॥ అనిన తార యతనికి సమంత్రంబు శ్రేయసంబాడి ప్రదక్షిణించి
గవనుద్వారంబుదాఁకఁ దోడు నడచి దుఃఖమూర్తి యంతిపుర
మేగిన నిట సుగ్రీవాదులు వాలి తడయుటకుఁ జాలదవ్వ ప్రతీక్షాతీ
క్ష్ణులయి వెక్కసపడుచు నతండు రా వ్యగ్రతంగన్న వాలి యుత్త
రీయంబు బంధించి నిశ్చలపురోన్యస్తదృష్టియయి నడచుచు సుగ్రీవు
ముందరఁ గాంచి యురికి యిట్లనియె. 103

క॥ ఈయొక్క ముష్టిపాతము
తో యమలోకమున కేగుదు దురాచారా!
నా యేకోదరుఁ డగుటకు
నాయెద నిప్పులను బెట్టినావు దురాత్మా 104

క॥ అనుచున్న వాలి కన్నులఁ
గనఁబడియెన్ రామబాణకథ సర్వంబున్

దనుజారిసూతి యెఱిఁగిన-
సునిశితతీవ్రత్వమెల్ల సుగ్రీవునకున్. 105

క॥ ఆ ముష్టిఘాతమునకున్
రాముం డెదఁ దల్లడిల్లె రవిసుతు ప్రాణ
గ్రామమ్ము దక్షిణేశ
గ్రామము పొలిమేరలందుఁ గదలునో యంచున్ 106

చ॥ గిలగిలలాడి యంతఁ బయికిం జనుదెంచెడు వాలిఁ దప్పుకోఁ
దెలిసి ప్రచండుఁడై నికటదేశమునందలి పెద్దవృక్షమున్
జలమునఁ బీకి వాలి నొక చాపున మోదిన వాలి తూలి వి
హ్వలుఁడయి యిద్దఱిద్దఱు మహాగ్రహవృత్తులు క్రూరచిత్తులున్ 107

వై తా ళీ య ము ,—

ఎగిరియెగిరి హేళి మార్గముల్
చిగిరిచి చిగిరిచి చీల్చుకొంచునున్
తగిలి తగిలి దండనోగ్రులై
రగులుచు రగులుచుఁ బ్రౌఢవహ్నులై 108

ఆ పా త లి క :—

కడఁగి కడఁగి క్రమ్ముదు రుగ్రిల్
సుడియక సుడియక చొత్తు రుదారుల్
కడచి కడచి ఘాతలు గాఁగన్
బొడుతురు విడుతురు భూరిభుజోగ్రిల్ 109

మ హా స్ర గ్ధ ర :—

గజమున్ వ్యాఘ్రింబు రెండున్ గదిసి మలఁగి ఘీంకారగర్జా వియద్దే
శజరద్రేఖాపథంబై చటులకరనఖర్వ్యామహాకర్షణాసృ
క్స్రుజనిక్రూరవ్రణంబై వన జగతిఁ బ్రతిధ్వానదర్పోద్ధతంబై
గజ మొగ్గన్ వ్యాఘ్రము మిగ్గన్ గదన మొనరుచుంగాఁగ సుగ్రీవవాలుల్

లయగ్రాహి :—

ఱొమ్ములను గ్రుద్దుచును గ్రుమ్ముకొను బాహువుల
గ్రమ్ముకొను చిద్దఱు గజమ్ములవిధానన్
ఱెమ్ముకొను కండలుగ దిమ్ముకొను పోటులుగ
దుమ్ము దివి లేచు పెనుదొమ్మి చెలరేగన్
సమ్ముఖము వేచుచును ఝుమ్మని హుంకృతిగఁ
గ్రుమ్మి పెనుగర్జగ నభమ్మొగుసు చట్లా
కుమ్మడిగఁ బర్వతబలమ్ము మృగరాజుల చ
లమ్ము గొని పోరిరి బలమ్మినుమడింపన్ 111

లయహారి :—

పిడుగు లురలినగతిని బొడుచుచును నడచుచును
బెడిదముగ విదలుచుచు విడివడనిపట్టున్
నడగికులు వెడదకులు విడులుకొను పెనుగరుల
సుడివడిన యులివులను పొడుచుకొనురీతిన్
తొడలుతొడలు విద్రుచుచు మెడలుమెడలు విరుచుచు
నొడలునొడలు కుములగఁ బొడుచుచు మహోగ్రుల్
విడివడిన కనలు వెలువడిన పెనుపరిచలము
కడవ నొకఁడొకఁడు పెనవడినగతి పోరన్ 112

ప్రహేయము :—

అమరపతిసుత ప్రాలంబబాహు
భ్రమణచటులధూఃపాతంబు
కమలవిమలసూకాలయుంబు గ్లానిన్
జెమరిచి కలఁగెన్ జేతంబు తూలన్. 113

స్వగ్విణి :—

వాలి బాహామహాపాతనోగ్రత్వమై
తూలి సుగ్రీవుఁడున్ దూఁగలే కాహావా

భీలరంగంబునన్ బిట్టుగా నొడ్డుకొం
చాలమున్ జాగుచేయన్ ఛలాకాయుఁడై 114

త్రిభంగి:—

బలి, కపిపతి, కరతలముఁ జమరఁగ, బలమఱి యంతట
సుగ్రీవుఁ డపగ్రీవుండయి దృగ్గ్రీ
తులు కళవళపడఁ దూలఁగుచు మలఁగుచు, ఛలపరచెన్ మరి
వాలిన్ ధృతమాలిన్ సంగరకేళిన్
నిలిచిన యదనున నిలువక పదమున, సలలితవేగగ
తుండై వినయుండై హాసరతుండై
కలఁచును నిలుచును వెలుచును వెలిఁజను బలమిగు పోటులు
• తప్పన్ జవమొప్పన్ లాఘవమొప్పన్ 115

శా॥ శ్రీరాముండును దూరమందునని సుగ్రీవున్ విలోకించి బా
హారూక్షత్వము సన్నగిల్లి రిపుబాహాఘాతముల్ తప్పకొం
చాయూర్ధిన్ లఘుభావలంఘనవిధావ్యాజత్వ మొక్కండె యా
ధారంబై రణభూమి నిల్చెనని చిత్తంబందు దీపింపఁగా 116

మ॥ ప్రభుహస్తాంతమునన్ దిశాగగనకంపం బుద్భవిల్లెన్ మహో
ఋభులోకంబులు తల్లడిల్లె భయసధ్రీచీనముల్ హ్రీణముల్
రభసారావవిదీర్ణకర్ణకుహర ప్రాంతమ్ములై దిగ్గజ
ప్రభువుల్ మొగ్గతిలం బడెన్ రఘుపతిప్రాశోగ్రమౌర్వీధ్వనిన్ 117

ఉ॥ కామనికామభావమును గర్వగుణం బభిమాన మింద్రియ
గ్రామమునం బ్రభుత్వమును గల్గఁగఁజేయు నొకొక్కయప్డు శ్రీ
రాముని చండబాణగుణరావము దిక్కునఁ జూడలేదు సు
త్రామసుతుండు వాలి పటుదర్పమహోగ్రవిలోచనాంతుఁడై 118

ఉ॥ ఆశర మిట్లు వచ్చెనని యైన నెఱుంగఁగరానియట్లుగా
కీశధరాతలేశ్వరుని కేవలవక్షమునందుఁ జొచ్చె ఘో
రాశనిపాత మంతపటువై చనుదెంచన యంత వేదనా
వేశము నూన దంత పరివేగము తాల్చద యంత కాల్చదున్ 119

గీ॥ ఒక మహాశనిచేఁ గనకోర్వీధరము
సానువున వ్రీస్యలై ధాతుసంగతారు
ణాంబువులతోడి బుగ్గ వెల్లార్చి కొట్టి
నట్లు కనిపించె వాలి మహాపఘనము 120

గీ॥ ఎట్టవెన్నెల లుమిసెడు హిమనవాంశు
బింబసంగతైరావణ విమలదంత
మూడిపడినట్లుగా ధాత్రి నొప్పె వాలి
శ్రీమనవాసృగ్జలౌఘ కర్దమతనుండు 121

గీ॥ వాలి ధాత్రిప్రపతితుఁ డుజ్జ్వలుఁడు తోఁచెఁ
బడియగా నొక్కచోట నేర్పడిన నీట
నింబుమీర నేకాకియౌ నెఱ్ఱకలువ
యూటిచనిన గంగానది యొడ్డువోలె 122

గీ॥ మఘవదత్తము మౌక్తికమణిసరంబు
వక్షమునయందు దీపింప వాలి యొప్పె
నింద్రచాపంబుచేతఁ బ్రావృషము సాంధ్య
దరనవారుణమగు జలదంబువోలె 123

శా॥ ఏడో దైవము శాపదగ్ధుఁడయి తానీ భూమిఖండాన స
మ్రాదుర్జ్వాలలక్షణాంకితుఁడునై వ్రాలెన్ దివఃఖండమున్
వీడంబారి దృఢోరసుండు నవనావిఖ్యాతదివ్యార్చిషం
డీడంబోయిన దేవతామహిమమై హ్రీతాత్మతేజస్కుఁడై 124

శా॥ బంధూకారుణదారుణాతపములుం బారాడెఁ జీరాడి కి
ష్కింధాపట్టణ గోపురోపరిపద క్రీడాప్రచండంబులై
సింధుస్వామియు నింకె చప్ప సికతాక్షేత్రంబుగా నై ప్రవా
హాంధంబైనది యూర్ధ్వరీతావిరహితంబై ధూతమై భీతమై 125

క॥ తన పాదధూళి తలఁ దా
ల్చెను పూర్వంబునను నిచటి క్షితిమృత్త్రాత్మృ

త్తును దానిపుడు తలం దా,
ల్చెను దేహంబెల్ల దానిచేఁ బిహితముగా 127

ఉ॥ తాదృశదుస్థితిం బడియుఁ దా నయనంబున రాచరివియుం
బోదు ముఖాంబుజాతమునఁ బుట్టదు దైన్యము దేహకాంతి మ
ర్యాదయుఁ బాయ దామరవనాంతర కల్పకశాఖ యొక్కఁ డు
త్పాదితఝుంఝుచేఁ జెదరివచ్చి ధరిత్రిని బడ్డయట్టులై 128

క॥ పరమేశ్వర నిర్మాల్యము
పురాణసంతానరమ్య పుష్పస్రజమున్
ధరణిం ద్రోసిరొ యనఁగను
సురరాజసుతుండు వాలి క్షోణిం దోఁచెన్ 129

మ॥ ధరణిం దాఁకియుఁ బాతకాలకలితోద్యత్కాంతివారంబు వీ
సర వోకుండినయట్టిదౌ గగననక్షత్రైకఖండంబు నాన్
బరమోదారవిచిత్ర భాసురమహః పర్యాప్తదేహుండు ది
వ్యరమం బొల్చెన యశ్మకుట్టనవ్రతుండౌ యోగిచందంబునన్ 130

వ॥ అంత లక్ష్మణసహితుండై శ్రీరామచంద్రుండు ధరణీశయానుండయిన
వాలి నుపసర్పణంబుచేయఁగా వాలి శ్రీరామచంద్రునిఁ దీక్ష్ణనేత్ర
ముల నిలువెల్లఁ జూచి మొగము త్రిప్పికొని నిట్టూర్చి యుస్సురంచు
నిట్లనుకొన్నట్లు వచియింప నారంభించె 131

శా॥ ఓహో యెంతటి సౌమ్యమూర్తి ప్రవిలోకానందపర్యాప్తహా
దేహచ్ఛాయయుఁ జంద్రమోవిమలసందీప్తాస్య మంభోరుహ
స్నేహం బొప్పెడు నేత్రయుగ్మము మరి న్నిర్వ్యాజసౌందర్యమున్
దేహాతీత మచింత్యవైభవ మహోదివ్యప్రభారేఖయున్ 132

క॥ నీవేమిటి శ్రీరామా !
యీ విమలేతరము కార్యమేమిటి రామా !

నే విన్నదాని కెంతో
పై వెలసిన దీ మహానుభావత చూడన్ 133

క॥ ఇది యేమి చేసినాడవు
త్రిదివాయోగ్యంబు కర్మ దెప్పరమున్ బె
ట్టిదమును నింద్యంబును దు
ర్మదు లస్వర్గ్యాలు పొనర్చు మలినంపుఁ గృతిన్ 134

ఉ॥ ఉన్న పరిస్థితుల్ సకల మూహపొనర్చితి నొక్క ధైర్యమై
యున్నది దాని మాపితి వయోగ్యముగాఁ బొనరించి, త్వాదృశుల్
సన్నుతులే యధర్మపథసంగతులైనెడ నింక నేమి ది
క్కున్నది ధర్మదేవత కహో విపరీతమయైన సృష్టిలో 135

మ॥ సొరిదిం జెప్పెను తార పోవలదటంచున్ నీ మహాధర్మసుం
దరశీలంబునయందుఁ బొల్చిన మహాధైర్యంబుతో వచ్చితిన్
బరమోదాత్తుఁడ విట్లు చేసితివి నీ పాపంబు నీచేత సా
కిరియై వానరరాజ్యలోభమతి సుగ్రీవుండు చేయింపఁగా 136

శా॥ అయ్యో! రాఘవ యేమి జేసితివయా! ఆచంద్రతారంబుగా
నొయ్యన్ నీదెస మచ్చ చెప్పఁ బని యేఁడో వాఁడు దుర్మార్గుఁడై
ముయ్యోరై చను నీ యుదాత్తచరితంబున్ ఖండదేశంబునన్
జియ్యంబట్టు మతిక్ విసంబు కలిపించెన్ భాగలుబ్ధాత్ముఁడై 137

మ॥ ఇదిగో వీనికి రాజ్య మిమ్మనిన నే నిత్తున్ గదా నన్ను నే
పొదలన్ గుట్టలఁ గానలన్ వెలుగులన్ బొమ్మన్నఁ బోదుంగదా
అదియుం జూడుమ యాతఁడైనదియు నీకా నేను కాకున్న య
ట్టిది యేమున్నది భూసుతన్ వెదకుపొంటెన్ నీకుఁ గార్యంబుగా 138

క॥ అలఘుభుజాబలసారో
జ్జ్వలుఁడై విదలించి సప్తసాగరములలో
పల ముంచి యెత్తఁగల్గుదుఁ
గలితమహాకేళిఁ బంక్తికంధరు నేనై 139

శా॥ ఘోరంబుం బొనరింపనైన పనియున్ గొడ్డంటఁ దీర్పంగనున్
నేరంగల్గుటయే విచిత్రమగు నీ నీచంబు కార్యంబు నీ
వారంభించుట యిద్ది యిట్లనుచు నీ కాచెప్పువారుండి రే
వారింగూరిచి చెప్పగావలయుఁ దద్వైదగ్ధ్యసంభారముల్ 140

ఉ॥ కోమలమూర్తి నిన్నుఁ గని కోపమువచ్చుటలేదు గాని నీ
యీ మలినంపుఁ గార్యమున కేమియుఁ జేసినఁ జేయవచ్చు ని
న్నామెయి నన్నెదిర్చి రణమాడవుగాని రణంబులోపలన్
నీ మృదుదేహమున్ మెదిపి నిర్మథనం బొనరించియుండనే 141

క॥ ఔరా! ఆ యిక్ష్వాకువు
నా రఘువును నా దిలీపుఁ డా దశరథుఁడున్
వారల ప్రతిష్ఠ యేమిటి
వీరుఁడ వీ చెట్టుచాటు వెలిపని యేమీ 142

క॥ మా మాంసము తినియెదరో
మీ మానవు లయిన పతులు మేము నభక్ష్యం
బౌ మృగపంచకమం దు
న్నామయ్యా! రామ! పంచనఖములయందున్ 143

మ॥ నలువౌ లక్ష్యము సుంతయున్ నిలువకుండన్ లిప్తలిప్తన్ మహో
జ్జ్వలధారాపరివేగుఁడై బహుదిశాస్పందోగ్రదేహుండనై
చెలఁగ న్నేనును నీకు లక్ష్య మెటునిల్చెన్ సూటిగా గుండెలో
పలఁ గాలాణువునందె లక్ష్యశరసంపాతంబు లెట్లొప్పెడిన్ 144

చ॥ ఇదియు మహాద్భుతంబగు సుమీ! రఘునాయక! నీగుణధ్వనుల్
కదలినతోననేఁ బెడముఖంబయి పూర్వము పార్శ్వవర్తినై
మొదలితి నీదు లక్ష్య మది మేలుగ వక్షముమీఁద నేగతిం
బొదలిన దమ్ము వచ్చి యెదఁ బుచ్చిన సూటియు వేళ యెట్టిదో 145

గీ॥ బాణ మేగు వేగపటిమ యెంతైనను
బయలుదేరుటకును బ్రాప్తి కెంత

లేదటన్న నైన లిప్తైక దేశంబు
కావలయున దాని కలిమి లేదె 146

శా॥ ఆ నీ చేసిన సప్తతాళదళనవ్యాపార మాశ్చర్యహే
లాని స్తంద్రముగాఁగ నాడుటది యేలా! నాదు వక్షంబునం
దీ నారాచము క్రిమ్మ టబ్బురముపై నెంతేని నబ్రంబు హే
లానారాయణుఁడై సుదర్శనసముల్లాసాభ శార్ఙక్రియన్ 147

శా॥ ఈ హేరాముశరంబుతీర్పు కులమం దేపారు నవ్విద్య యే
బాహాబాహి పెనంగ వాలి నెదిరింపంజూడ వచ్చెనచో
నీ హేవాక మదప్పు డుండెడిది యీ నీ జోమ్ము దోర్యగ్రసం
ధ్యాహిక్కల్బణకంఠరావమున డిందంజేసియుందుం జుమీ 148

మ॥ మరి యింకేమనుమందు వింధునవశంపా యజ్ఞసూత్రంబు గన్
సరసాషాఢమనోజ్ఞనీరదతనుం జంపంగ నిన్నప్డు దు
ర్భరమైయుండును నాకు నిట్లు జరిగెన్ బ్రారబ్ధ మీ నీ కహో
పరమంబౌ నపకీర్తి ధాత నొసఁటన్ వ్రాసెన్ బ్రమాణంబు గన్ 149

శా॥ నే నింకొక్కఁడు చెప్పెదన్ రఘుపతీ! నే నింత సౌజన్యరే
ఖానిష్పత్తిగఁ బల్కుచుంటి నను లే కానీ హృదంతస్స్థితిన్
నూనంబై యది యెంతకోపముగ నుండున్ ద్వత్కృతిప్రక్రియన్
దా నంతన్నది యేమి నిన్ననుటకుం దా జిహ్వ రాకున్నదిన్ 150

గీ॥ దేవగురునకుఁ జంద్రుని దీప్తిహోలె
నేయి యని బ్రాపుటకును నూనె యని తలకుఁ
బోసికొనుటకుఁ గావైతి మోహనాకృ
తివి దురాచారకుటిలవృత్తివియు రామ! 151

క॥ నాకంటెఁగూడఁ దారకు
నీ కథ తెలియును జుమీ మనీషీతరవృ
త్తీ! కలితదృశామృతవ
ర్తీ! కోదండకర నవపతితసమవర్తీ! 152

చ॥ ఎవఁడును మధ్యవర్తియయి యెప్పుడు సంధినిఁజేయ యత్నముం
దవిలి పొనర్పఁ ద్రొత్త నది దాఁటినచోఁ దన కంత యిష్టమౌ
చు వెలయుఁ బక్షమందునను జొచ్చినఁ జొచ్చునుగాక యీ గతిన్
వివరములేనిదౌ కలహవృత్త మసాధుపదంబు దూష్యమున్ 153

ఉ॥ నీ బహుశూరకృత్యములు నిర్భరమోదమునన్ వినంగ నీ
యే బవరం బధర్మమగువృత్తము కల్మి యెఱుంగరాద యిం
దే బహిపెట్టు నీ కుటిలవృత్తము చూపుట నా యదృష్టమో
యో బహుమానభావకలశోదధి యిద్ది యిటన్ ఘటింపఁగన్ 154

ఉ॥ ఊపిరి యున్నయందనుక నూరక నిట్లనుచుండు నెద్దియో
ఆపయి సర్వమున్ దనదె యంచును నీ సఖుఁడూహచేయు నా
శాపరమానుకూలపథసంగతభావుఁడుగానఁ, గాని యా
హా! పరలోక మున్నయది యక్కట! పాపముఁ బుణ్య మున్నవిన్

ఉ॥ చిన్నతనంబునుండియును జేవయుఁ దక్కువవాఁడు నాకుఁ దా
నిన్ననుగాక మొన్న నని నిల్వనులేక పలాయమానుఁడై
చన్నటువంటివాఁడును వెసన్ జనుదెంచినఁ బ్రొద్దుటన్ సుఖా
సన్నుఁడ వీవుకాక తనశక్తి యటం చనుకొందునా మతిన్ 156

గీ॥ తెలిసియే వచ్చినాడ నీ తీరిదెల్ల
దెలిపియే చచ్చుచున్నాడ దేశములకు
కాలమునకును నెల్ల లోకంబులకును
నాకు నష్టంబులేదయ్య నాథ నాథ ! 157

గీ॥ అంత సుగ్రీవు మొగమునయందుఁ జూడ
నొక్క నెత్తురుచుక్క లే దుపలవిగ్ర
హంబువోలిక నిశ్చలంబైన యంగ
కములఁ గన్నుల వాలిని గంచు నిలచె 158

గీ॥ రెండుజాములుదాఁటె మార్తాండుఁ డొకఁడు
లక్ష్మణుం డొక్కరుండు వేళానిగూఢ

గమనమూర్తులు కదలిన కదలికయును
కనఁబడనియట్లు కాలసంకల్పదృఢులు 159

గీ॥ హనుమదాదులు దూరంబునందు నుండి
నికటదేశంబునకు వచ్చి నిలచి కనిరి
హాలహాలపానవేళామహానుభావు
నీలలోహితువలె యోగనిభృతు వాలి 160

వ॥ అంత యుద్ధ మారంభించినవేళ సుగ్రీవుండు వాలిపై విసరిన వృక్ష
మందుఁ బడియుండ శ్రీరామచంద్రుండు దానిపై నాసీనుండై
యిట్లనియె. 161

శా॥ తాతా ! యూరక కోపగించకువె యీ ధర్మాధ్వ మీవంచుఁగా
దే! తాత్పర్యవినిర్ణయంబునను బ్రహ్మేంద్రాదులుం జాల రే
నా ! తత్సర్వమునందుఁ జాలుదును బైనం జాలుదుర్ మోహముం
జేతోవీధిఁ దొలంచుకొమ్ము మరియుర్ సిద్ధించుఁ బెల్లర్థముల్ 162

గీ॥ కాలమునకును నెల్లలోకంబునకును
దెలియఁజేసి చచ్చెదవు నాతీరు నీవు
నీవలెనె గాఢమోహసంభావితాత్మ
లెలమి నెవరికిఁ గ్రొత్తగాఁ దెలుపవలయు 163

గీ॥ ఎవ్వఁడెవ్వఁడు తన కర్మ మెంతయెంతొ
యనుభవింపఁగవలయున యంతయంత
తదనుభూతిలో వాని చిత్తప్రవృత్తి
కొంతభాగము తెలియుని యంతవరకు 164

గీ॥ కర్మఫలదాత యెవ్వఁడు కర్మభోక్త
యవు నెవండు వ్యాపారసమాశ్రియుండు
కర్మచేయుచు నెవనినిఁ గర్మయంట
దీ వివేకంబు కృచ్ఛ్రము ఋషులకైన 165

చ॥ వదులుగ నున్న రాతిపయి బావికి నొడ్డునఁ గూరుచుండి యే
యదనునఁ దీవ్రభాషణకృతాభినయాహతి నట్లు తూలునో
మదినెఱుఁగండు సుంతయును మానవుఁడుం బెఱవారి వృత్తమా
స్పదముగఁ దర్కవైఖరికిఁ జర్చయొనర్చుచునుండు మూఢుఁడై 166

క॥ ధర్మార్థకామలౌకిక
మర్మంబులు తెలియనట్టి మందపుబుద్ధిన్
ధార్మికుల యుపన్యాసము
లర్మిలిఁ బలికెదవు దూషితాచారుఁడవై 167

ఉ॥ మన్యువుదక్క యాపదల మధ్యమునందున జీవకోటి సౌ
జన్యమునందు నప్పటికి సాధువె యెవ్వఁడు గాని మత్తధీ
జన్యము పూర్వకాలిక మసాధువు వాని చరిత్రఁ బొల్చినన్
వన్యమృగంబులున్ నయము వానికి, లోనికిఁగాని పై పొరల్ 168

శా॥ ఏమృత్యూపచయంబు సన్నిహితమై యిష్టంత సౌజన్యమో
యామృత్యూపచయంబు నిత్యకృత భావాపన్నమై ధర్మర
థ్యామృష్టంబగు వృత్త, మప్పటికిఁ దా నాపత్తియైనప్డు నీ
వేమీ యెవ్వఁడుగాని ధర్మకలితాహీనోహభాగుండగున్ 169

ఉ॥ ఏ పురుషార్థమున్ విమలవృత్తిని సాత్త్వికవృత్తి ధారణా
దీపితబుద్ధిచే ననుమతింగనుఁ దామసరాజసంబులై
యేపునఁ బొందెనేని తపమేని యుపాసనయేని రాక్షసం
బై పరిణామమందు విలయంబు ఘటించుట యొండె లాభమై 170

క॥ మీరును మానవులన్నం
గాఁ దాయెను వృత్తిమాత్రగతవర్ణంబై
వారక వృత్త్యనుకూలో
దారము ధర్మంబు నడపఁ దగు మీచేతన్. 171

ఉ॥ చోదితదేవతాంశములు చొప్పడి జన్మల మానవత్వము
ర్వ్యాదయు నార్యవృత్తము తదాగతధర్మము మీకుఁగాని సం

పాదితమయ్యెఁ గొందఱకు మానవులందె యకర్మమార్గ లిం
పేదగ ధర్మహీనులయి యెందఱొ మీరును వట్టి ప్రాణులై 172

గీ॥ శ్రీవిశేషధర్మంబులు లేవు మీకు
వట్టి ప్రాణిధర్మంబులు వఱలుచుండు
జంతుధర్మంబులందున సాధులక్ష
ణంబు సర్వోత్తమంబు వానరకులేశ ! 173

క॥ ఆ సాధుత్వము నీదెస
భాసించనె లేద మొన్నవరకును ననుజుం
డౌ సూర్యాత్మజచటకము
వేసడమై యెంత ఛిద్రవెట్టితివి కపీ ! 174

చ॥ అతిబలశాలివౌట సహజాగతి కోప మనన్యసాధ్యక
ర్మతతిఁ బొనర్పఁగల్గు నభిమానము వెంబడినంత నంత యే
కృతియునుఁ జేయఁజొచ్చి యొనరించినదంతయు ధర్మమంచు దు
ర్మతియగు నాత్మనిగ్రహసమాధులు లుప్తములయ్యె నీదెసన్ 175

ఉ॥ రాజ్యముకాని రాజ్యమున రాజవు నీకును వానరప్రజా
పూజ్యత యెట్లు నీదయిన భూభరణక్రియ యెట్టి లక్షణ
ప్రాజ్యత కల్గు నింద్రపరిపాలితవృక్షఫలంబు లేవులే
యిజ్యయు దాన భాగమున నేమి విచిత్రపు టర్థ మేచెడున్. 176

క॥ మెకములకుఁ దమకు మివులు న
ధికబలజంతువుల భీతి దీపించును నా
యకుఁ డట్టులైతి రాజవు
ప్రకటితరంజనముపొందు రాజగును కపీ 177

చ॥ అల నలఁ గొమ్మలం దిరుగుటై సహజంబగు నుంఛవృత్తియా
నల కపిజాతియందున షడంశము నీపరిరక్ష యేగతిం
గలిగి గ్రహింతు వింద విడిగాఁ బురుషార్థము పల్కు నర్థముం
బలుకగ ధర్మసమ్మితము పల్కఁగ నేమియులేక యేగతిన్ 178

గీ॥ ఇద్ది కొట్టుకతినుటలో నేదొ కట్టు
అలఘుపురుషార్థ మెఱుఁగని కలిసికట్టు
తనము భయభీతజంతులక్షణము దాని
యందు నేల రాజ్యమ్ము రాజన్న పేర్లు 179

గీ॥ వేదహితనాగరకతలో విభుఁడు మనువు
నిహపరంబుల రెంటిని నేకపరచెఁ
బారలౌకిక సంపత్తి వదలి జంతు
సములు గ్రహియించి దాని దుష్టతఁ జరింప 180

శా॥ ఏకత్రస్థితముల్ పరస్పరము సౌహిత్యంబు దీపించు న
స్తోకంబౌ సహజస్వభావబలమై తోరంబుగా జంతువుల్
కా కే కొంచెమొ పైనిమెట్టునఁ జెలంగన్ మీరు సౌహిత్యమా .
హా ! కన్పించద యేకగర్భజనితుండౌ తమ్మునందేనియున్ 181

క॥ అది యేమిరాజ్యరమ తా
నది తమ్ముఁడు దొంగిలించెనంచు దురాశా
మదవృత్తి నేమి చేసితి
తదనుచితంబగు నకాండతాండవము కపీ ! 182

గీ॥ ధరణికొఱకును దండ్రి సోదరులనెల్లఁ
జంపుటన్నది యుండు మ్లేచ్ఛజనవృత్తి
మంత్రిజనుల యిష్టంబుగా మహిని దమ్ముఁ
డైనఁ బొందఁగఁ జనుట యార్యజనవృత్తి 183

క॥ ఒకవేళఁ గాదు తమ్ముఁడు
ప్రకటితముగ రాజ్యవాంఛ ప్రచరించిన వా
నికి రాజ్యమిచ్చి యున్నయు.
నకటా ! పోనేల రావొ యడవులయందున్ 184

శా॥ ఆ సుగ్రీవుని మంత్రశక్తియును నూహాపక్రియా వైఖరుల్
ధీసామగ్రియు నార్యబుద్ధియు ధరిత్రీజానికిన్ యోగ్యముల్
నీ సంపన్నత బాహువిక్రమమునన్ నీవో చమూనాయకుం
డై సోదర్యుని రాజ్యరక్షణకళావ్యాపారయోగ్యుండవున్ 185

గీ॥ ధర్మరహితంబులైన యర్థంబు కామ
మెలమి సారథిలేని రెండెడ్లు సుమ్ము
బండి తలక్రిందులై పడుఁ బల్లమందు
మడియు నెడ్లును మెడలఁ బట్టెడలు బిగిసి 186

గీ॥ కర్మమార్గాఁనబోని దుర్గతుల నెపుడు
నర్థకామంబు లీరెండె యనుమతించు
నొకని నర్థపిశాచికి నొకనిఁ గామ
రాక్షసికి నుగ్రమైన యుగ్రాణములుగ. 187

గీ॥ స్త్రీ ప్రజార్థము కావుట శిష్టవేద
మార్గమగు ధర్మయుతము కామంబు కొఱకుఁ
గావుట పురాణపథ మిట్లు కామి యధము
జంతులక్షణమోయి కీశకులనాథ 188

శా॥ నీ కామాధ్వ మధర్మమై నెగడెఁ దూష్ణీంభావదూరంబుగన్
నీ కాయమ్ము మృగంబు జీవమయమై నిల్చెన్ సురాంశంబు శి
క్షా కాండం బఖిలంబు దేహమునకున్ సంబంధియై పొల్చు నీ
సాకల్యంబగు సూక్ష్మధర్మమున శిక్షావీధి యిట్లొప్పెడున్ 189

క॥ దోసము జీవకృతంబగు
భాసురమగు శిక్ష దేహబద్ధంబగు శి
క్షాసమయమ్ము తదాత్మ
వ్యాసక్తతనూపరిమాణమై యొప్పారున్ 190

గీ॥ కూఁతువంటిది తమ్ముని కోమలాంగి
తదభిగమన మ్మధర్మవిద్ధంబు కర్మ

మరణశిక్షయె యట్టి పాప్మంబునకును
జంతువులుచేయు నవిమృష్టసంగమంబు 191

ఉ॥ ఆ యనుజుండునుర్ మరణమందిన నాతని భార్య దేవర
న్యాయముచేతఁ బొందనగు నంతియకాని యిదేమి న్యాయ మీ
త్రోయము రాజకీయమగు దోషము చూపి తదంగనారతా
ర్థ్యాయముసేఁతర్ మరుగుటమ్మున నేయుట శిక్షయై తగుర్ 192

గీ॥ తమ్మునందున రాజకీయమ్ము దోష
మట్లు చూపించి తద్భార్య నిట్లు పొంగి
లించితివి వానితో యుద్ధ మట్లు చూపి
యిట్లు శరమున నిను వధియించుటకును 193

ఉ॥ ప్రస్తుత మీ ధరావహనభారము కైకయి పుత్రునందు న
భ్యస్తముగాఁగ నున్నయది వానికి నే నధికారినైతి ప్రి
ధ్వస్తము కాకయుండ మనుధర్మము నిల్పితి నింద్యదుష్కృతి
ప్రిస్తర మెప్పుడేసియును బ్రిద్దలుకాకయ తప్పదో కపీ! 194

గీ॥ రాజు దండ్యుని నెదిరించి రణముచేయు
నన్న ధర్మంబులేదె యట్లున్న నీవు
మున్ను సుగ్రీవునిం దేశమునను వెడల
నడచినప్పుడు మరి యుద్ధమాడవేమి 195

మ॥ ఒక యే కార్యము చేయఁగల్గుదునటం చుండుంజుమీ సుంత వా
నికిస్సైత మ్మది తత్ప్రవేశమును గానీ యున్నఁ దద్విద్యలో
అకటా! త్వాదృశుఁడైనవానికిని దానట్లున్కిల్లోఁ దప్పు లే
దు కదా యుద్ధమునందు నన్నెదుర శక్తుండంచు నన్గొన్నచో 196

శా॥ ఈ నిర్ జంపకముందుకూడ మది నిట్లే తీర్చుకొన్నావొ ము
న్నీ నన్నుర్ వినినప్డు నీ మనసు నిట్లే తీర్చుకొన్నావొ యే
మైనర్ బర్వతనిశ్చలుండవని నిన్నన్నాడు సుగ్రీవుఁ డా
హా నారాచ మొకండు తాఁకిననె యిట్లైనావు చిత్రంబుగా 197

మ॥ నిను మన్నించితినోయి వాలి ! యదియుక్తా నీ కంత ఘోరమ్ముత్తరిం
చను నీ కాయ మదెచ్చటో విసరఁ జంచత్ఖండఖండమ్ములై
చన భేదించను నీ యసుప్రచయమున్ సద్యస్సముత్క్రాంతిప
ల్లనముం జేయన యెంతో యంతయగు శిక్షాబుద్ధి మన్నించుచున్ 198

క॥ అల భరతర్షాజునకు నా
తలవర్తితన మ్మంత తప్పఁచి తాల్చితి వాలీ !
తెలిసికొని తప్పు శిక్షయు
నలఘుమతియు స్వర్గసీమ లందేగుఁ జుమీ 199

మధ్యాక్కఱలు :—

రఘుకులక్షీరాబ్ధిచంద్ర ! రాజీవరమణీయనేత్ర !
యఘునాశిగుణరాశి ! మోహనాంభోధరానీల గాత్ర !
మఘవమాణిక్యాంశు మంజుమంజుల మధురతోరణ స
రఘుమాలికారమమాణ రమ్యాంశురథ్యాశరీర ! 200

ఆనందవీథీవిహార ! అఖిలలోకైకధానుష్క !
పూని వారించెను దార పోవద్దు పోరికం చతివ
నేనె వచ్చితినయ్య మోహనీహారనీరేజబంధు !
నా నిండుకోరిక పండినది నీదు నారాచముక్తి 201

వ॥ నాకు దిగులు లేదు. సుఖముగాఁ జనిపోవుచుంటి నన్న వాలిం
గాంచి శ్రీరామచంద్రుం డిట్లనియె 202

శా॥ తాతా ! ఆగుమా ! నా శరం బమృతదిగ్ధం బీవు మాహేంద్రిలో
కాతిథ్యంబును స్వీకరించుటకుఁ బోనెంచుమున్న నీ కోర్కెలున్
నాతోఁ జెప్పుము చెప్పనక్కఱయునైనన్ లేదు లోకానఁ బ్రి
ఖ్యాతంబైనవె యెల్లకోరికలు మోహాధీనచిత్తత్వమై 203

చ॥ కొడుకయినట్టి యంగదునిగూర్చి యక్కఱ లేదు చింత నే
రడు పసివాఁడటం చేడఁధ రాపిడి చెందకు సూర్యసూతికిం

గడువడి వాఁడటన్న మమకారము నాతనిమీఁద బిట్టు ప్రే
ముడి గలఁ డెంధు నీ ముద్దులు పోవునె రక్తపుస్పర్శ యున్నచో 204

గీ॥ అన్నయన్న విరోధంబ యున్నకొడుకు
లన్నఁ బడిచచ్చుటయు నున్నదయ్య జగతి
నంగములను వ్రణగ్రస్తమైన యదియె
ఛేద్య మితరంబు సమభిలషితము కాదె 205

గీ॥ అంగదునకును బ్రేమతో నబ్జబంధు
సుతుఁడు యువరాజపదము నిచ్చుం దనంత
నంత యీయక్షపోయిన నతఁడు నా మ
తం బెఱిఁగి దాఁటిపోవునా దాఁటిపోడు 206

చ॥ మరియును దారఁ గూర్చి యనుమానము లేదను మంత్రిక్తన్న నం
బుజహితాత్మజుం డెపుడు పూనడు కోపము తారగూర్చియుం
గొరకొర లేద యంగదునిగూర్చియు నీదెసఁగూడ గౌరవ
స్ఫురణము లేక పల్కఁ డొకసూడునుతీర్చుట యట్లెపెట్టినన్ 208

ఉ॥ నీతరువాత భద్రముగ నీదగు రాజ్యము నిల్వనెంచినన్
నీ తనయుండు నంగదుఁడు నీయనుజన్ముని పిమ్మటన్ ధరి
త్రీతలనాథుఁ డౌటయును ధీపదమం దభిలాషయేనిఁ దా
నాతఁడు తార నేమియన డాయమ ధీగతగౌరవంబునన్ 208

ఉ॥ తారనుగూర్చి నే వినినదానినిబట్టి వచింతుఁ దద్వివే
కారభమాణమై జరుగు నన్నియు మీ కపిరాజ్యమందునన్
దారనుగూర్చి నీదు నెఁడదన్ భయమింతయుఁ బెట్టుకోకు తా
తా! రుమ నీ కొకందుకును దార యొకందుకు సూర్యసూతికిన్

ఉ॥ ఈమొఱు నీవు గాని చను నెచ్చటో యాయమ యేమియైన నీ
కేమి ? మనుష్యజాతియు వహించుఁ గపిత్వము బుద్ధియందు మీ
రో మతియందు దేహమున యుగ్మమునందు వహించుచుండి రీ
ప్రేమలు శాశ్వతంబని జరింతురు ప్రాణముపోవునప్పుడున్ 210

మ॥ అమృతాసేచన మైనయట్లు కపిరా జస్మత్పురానేకపు
ణ్యములుం బండిన వీ విధాన రఘురామా ! శాంతకామా ! వికుం
ఠమహాధామ ! వధించుటే కరుణయన్నన్ స్వామి ! నీయందె సా
ర్థముగానైనది శ్రీదయాగుణసముద్రా ! రామభద్రా ! ప్రభూ !

వ॥ అని మరణాయాసంబుతోడి చిఱునవ్వున మఱియు నిట్లనియె 312

మ॥ కమలాంతర్మృదుకేసరాభ నయనాగ్ర స్వాదుకాంతీ ! హృద
బ్జమిళచ్ఛాంతి ! సమీకభూమ్యపగతశ్రాంతీ ! రఘుస్వామి ! చి
త్రము నీ చేత వధింపఁగాఁబడుటయున్ దానొక్క యర్చా విశే
షముగాఁ గన్పడు నిక్కమా ! రఘుపతీ ! సంతోషరోచిర్మతీ! 213

గీ॥ అనిన శ్రీరామచంద్రుఁ డిట్లనుకొనియెను
చిత్రమీ జీవలోకంబు చెలఁగి బయటి
కెంత గర్వాది నిలయమో అంత లోన
ముగ్ధమును దీనమును స్పృహాస్నిగ్ధము నని 214

ఉ॥ లీలగ మృత్యువొందు విదలించును సర్వము కాక పట్టఁ బ
గ్గాలవి యుండునే బ్రదుకఁగానగు వేళను బొంగిపొంగి యు
త్తాలమహోగ్రవార్నిధివిధంబున నొక్కొకఁ డేమియేమి పం
తాలు దురంతముల్ మతికృతప్రళయంబులు చేయఁజొచ్చెడున్ 215

ఉ॥ వ్రాత్యునికన్న వ్రాత్యుఁడగు వాఁడయి వాని కిరాతకృత్యముల్
మత్యనుమేయతావధికమానము ముట్టుచునుండ నేగుచున్
మృత్యువు రాన్ దహద్గృహసమీప ధరాస్థశిరీషవృక్షప
త్రాత్యతిదీనమై మఱియు నంతటిలోపల గ్లానిపొందెడున్ 216

ఉ॥ అత్తఱి వాలి నెంజలిఁ గృతాంజలి రామ ! రమేశ ! మోహవి
చ్ఛిత్తి పొనర్చి తింకఁ గృపసేసి యనుజ్ఞ నొసంగవే యనన్
గ్రొత్తళమందుఁ బెద్ద యెలగోలయి యచ్చటఁ జూచె సాధులో
కోత్తరుఁడైన స్వామి యసితోత్పలముల్ వికసించినట్లుగన్ 217

సీ॥ ఉత్తాలచూడా చలత్తాలతరువు శ
రీరమ్మునఁ దిరస్కరించువాఁడు
ఆభోగవిస్తృతి రేఖాభోగఫణి, ధను
ర్విధృతకోటి నధఃకరించువాఁడు
ఆఖేటశబర మాలాఖేటమతి, సమా
దృతచిత్తతఁ బురస్కరించువాఁడు
ఒకఁడు లయాంతకుం డుగ్రుండు మానిసి
దిండి పెన్ వ్యాఘ్రు మేతెంచినాఁడు

సకలవానర మారణచండుఁ డగుచు
జ్యానినాదవిదీర్ణ దిశాకరీంద్ర
కర్ణకుహరుండు క్రూరదృక్కర్ణ ఫణ వి
దీర్ణమాళి జటాజూట దృప్తుఁ డొకఁడు 218

ఉ॥ క్రొత్తడముల్ త్యజించకుడు కోట కవాటములన్ బిగించుడు
ద్వ్రాత్తినిగోటమీఁది కరుదెంచునయేనియు మీరలెల్ల నా
యత్తపడుండు దుర్గపు రహస్యబిలంబుల శైలకాననా
వృత్తిపలాయమాను లగుడీ! లగుడాహతులైనయట్లుగన్ 219

చ॥ మన రా జింతటివాఁడు ధాత్రిఁగలఁడా మాహేంద్రవజ్రాభుఁ డం
చనుకోనైనటువంటివాఁ డతని ప్రాణాకర్షణప్రక్రియా
ఖననక్రూర పృషత్కకర్మసమలంకర్మీణుఁ డెందైన నే
గినఁ బ్రాణంబులు నిల్చు నీర్వదులుకోఁ గిష్కింధకున్ రోజులై 220

మ॥ అని గగ్గోల్పడుచున్ బిశంగనయనాంతావర్తమానాంశు వ
ల్గననిర్మాతృ త్రియామకాల దినకృత్కాషాయవర్ణాతపా
యనులై యట్టిటు కోటలోఁ దిరుగుచున్నంతన్ దురంతంబు వా
ర్తను విన్నట్టిది తార దారహతు భర్తం జూడ రాఁగోరెనన్ 221

క॥ వారించుచు వానరచము
వారారా! యేమి సాహసాధీనము నీ

ప్రారంభ మచటి కేగిన
నూరికి మరి తిరిగివచ్చు టూరక యగునే 222

గీ॥ ఏము మగవాండ్ర మచ్చటి కేగ లేక
నిలువు గ్రుడ్లుగా నుంటిమి నీ మగండు
సకలరాక్షససంహార చటులభుజుఁడు
నట్టులయ్యె నిదేమి సాహసము రాణి ! 223

శా॥ నీ వున్నావు సమస్తవానరచమూ నిర్వ్యాజరక్షాకళా
ప్రావీణ్యోజ్జ్వల ధీధురీణ వని మా ప్రాణంబులు న్నీపయిం
గా వర్తిల్లుచునుంటి మీవు నచటం గాల్వెట్ట మా జీవితా
శావర్ణాటుత మెట్టఁబట్టినది సంజ్ఞావృత్తిగా నిద్దియున్ 224

శా॥ ఈ దేశంబును వీడి పోవుదము తల్లీ ! యెందో దూరాట్వి
నీదౌ బుద్ధియు నీకుమారుని భుజానిర్వాహకత్వంబుగా
మీ దాసేరులమై చరింతుము కృపామిధ్యాత్వరూపుండు నా
కోదండోగ్రుని చెంత కేగకువె నీకున్ వేయి మ్రొక్కుల్ సతీ 225

వ॥ ఇట్లు వాపించు వారిఁ దొలంగి వచ్చు తారం గని వానరసేన
యెలుగెత్తె 226

గీ॥ అకట ! పరికాడు చచ్చిన నావటిలుచు
వచ్చుచున్న కరేణుకా ప్రసభగతియుఁ
జంద్రుడస్తంగమించిన సమయదుఃఖ
నిభృతదీననిశాసతీదీనముఖియు 227

గీ॥ ప్రియసహచర వియోగాగ్నిభీత చలిత
శీర్ణహృత్కోక కామినీ చ్ఛిన్నరవయు
ప్రాణనాయక మృతశరీర పరిసర వి
చర కపోతికా ధూతపక్షయును దార 228

చ॥ ఒక విసుపైనఁ దూలిపడునో కసుగందెడు కాలితమ్మియై
ఒక మసురైన నొడ్డుకొనునో పయికెత్తిన కేలుజంటయై

ఒక తరగొత్తి యొడ్డిగిలునో పెనుదుఃఖపు శేటి నావయై
సకియ విముక్తనూపుర విచారమనోహర తార వచ్చెచున్  229

వ॥ రామసుగ్రీవాదుల నందఱను దాఁటి వాలి పడియున్న చోటికిఁ బోయి
యతనిమీఁదఁ బడి యింతసేపేడ్చి  230

శా॥ రాముండన్న యముండు కాఁచికొనె భర్తా పోకుమయ్యా! మహా
క్షామంబైనది ధర్మయుద్ధమున కీ సంగ్రామ మా పూర్వసం
గ్రామంబుల్ బలెఁ గాదటంచుఁ బలుకంగా నీవు విన్నావు కా
దీ మాద్రిం జనుదెంచి కొంపకును నీ వీ నిప్పు ముట్టింపగన్  231

ఉ॥ నెత్తిన నోరువెట్టికొని నేనటుపోరఁగ నాదు మాటలన్
జిత్తమునందునన్ గణనచేయవు కాలవశాత్మబుద్ధివై
యిత్తరి నేమికావలయు నేనును నీ కొడు కిట్టి సాహసా
యత్తము జీవితాని కెప్పుడైన నిదిట్టిది యుండె నంచనన్  232

ఉ॥ అంధువునందు దూకినట్లైనది కన్నులుమూసికొంచు నా
బంధువ! యెన్ని తిప్పలయి వచ్చిన నీ చనిపోయినట్టి కి
ష్కింధకు వచ్చెఁ దిప్పలయి కీశచమూతతి ఘోరశైలసం
బంధులుగాఁగ నేగెదవొ పాడుగఁ బెట్టుచు నీ పురంబదిన్  233

చ॥ రుమకును భర్తతో విరహదుఃఖము దుస్థితి చేసినందుకుం
గమలభవుండు నీదుప్రియకాంతకు భర్తృవియోగరోగదుః
ఖము సమకూర్చె నెచ్చిన సుఖంబును దుఃఖము చేసిపెట్టుకొం
డుము డుముదాపులాచు నని నూతనకర్మచమూశిరంబునన్  234

చ॥ అలుపపువాని భార్య తదనంతరమా స్థితియందుఁ బెద్దయున్
దొలి స్థితికంటె భేదమయి తోచద యెప్పుడు పేదరాలె, భూ
తలపతిభార్య రాణి తొలుతన్ మరి యిప్పుడు దాసి నిన్న నం
దలమును నేడు జోలెయును నాన్ విపరీతవిధిప్రదూషితా!  235

ఉ॥ గాలికి లేచిపోయినది గంధగజోన్నతశౌర్య ! కష్టక
ష్టాలనుబిడ్డ యేమగుదు రంచుఁ దలంచితి వీరుఁడైన నీ
యాలగునప్పుడే తెలియనైనది యీ విధవాత్వ మయ్యయో
వ్రాలియుఁగూడ నీను ముఖవర్ణము మారద యేమి చెప్పుదున్ 236

ఉ॥ అ మ్మిటులట్లు గాయమునయందునఁ బార్శ్వము లొత్తుకొంచు దుః
ఖమ్మగు బాధకల్గునని కైజతఁ గ్రుమ్ముకొనంగనైన దే
హమ్మునయందు వ్రాలుటకునైనను జాలని యేమి భాగధే
యమ్మును బొందినావు మగడా ! బెగ డింతగఁ దెచ్చిపెట్టుచున్ 237

చ॥ వెస దశకంఠరాక్షసుని భీతి శమించెను సర్వదుష్టరా
క్షసకులమందు వెక్కసము శాంతి వహించెను వీరలోకసా
ధ్వసమును బాసిపోయినది వచ్చి సమస్తభయంబు లుగ్రక
ర్మసముదయప్రదూషితను మానినిఁ దాకను నన్నుఁ బొందఁగా 238

ఉ॥ నీవు యమాశఁగూర్చి చన నిర్భరశీతలవాతపోతముల్
రా వటనుండి కాలమును రాచిచనంగను నీవు చైత్రవే
ళావిమలోజ్జ్వలత్వపు హళాహళి కల్గదు చల్లవెన్నెలల్
ఠా వికముందు నీవు కపిరాజవు మింటఁ జరింపఁ బోవఁగాన్ 239

గీ॥ అయ్యో ! నా ప్రాణములయందు నగ్గివెట్టి
యెచ్చటికిఁ బోవుచున్నావొ యీవు గాని
కయ్యమున కేగవద్దనె కాంత యనుచు
మచ్చరము పూన నేటికి మామకీన 240

వ॥ అని వివేకదుఃఖంబు పొందుచున్న తారక న్నంగదునిమీఁదఁ బడి
యెలుంగెత్తి చేతులు చాచి కొడుకుఁ గౌగిలించుకొని యిట్లు పగులఁ
బడియె. 241

ఉ॥ చూచితివయ్య తండ్రి ! రిపుసూదనుఁడై చను నీదు తండ్రి యా
హా చనిపోవుచుండెఁగదరా ! మన నోటను దుమ్ముకొట్టి నా

యీ చనివన్నినాళ్ల బ్రదు కేగతి సాగెడునయ్య నాకు నీ
రాచఱికంపుఁ బెంపకము రాపిడిపొందిన దీ విధంబుగన్ 242

మ॥ పితృపైతామహమైన రాజ్యము మహావీరుండు తా నేలి త
త్సుతుఁ డీ వౌదువు రాజటంచనుకొనన్ దోదూయమానక్రియా
హతుఁడై నీ పిత యిట్టు లయ్యెనుగదయ్యా! దయ్య మిట్లెంచి వం
చితమా రాజ్యవివాద పెంచికొని చచ్చెం దాను నన్ జంపుచున్ 243

చ॥ చటులమహాహవంబులను శత్రులు వీచు నగాభిపాతవి
స్ఫుటములు కాయమైన కిణమున్ పెను దిమ్మలుగాగ నైన ను
త్కటముగ రోమరాజియును గ్రమ్మిన నీ పితరొమ్ము పద్మసం
పుటములు శైవలంబులుగఁ బొల్చిన మానసచింత కూర్చెడున్ 244

ఉ॥ ఆడగ నింత కాననపదాంతరవీధుల నేగఁ బిల్లవాఁ
డేఁడి యటంచు నన్నడుగు నెప్పుడు నీ జనకుండు వీఁడు స
మానిడభిరామవక్షుఁడు ధరాతలసంవహనైకదక్షుఁ డీ
వాఁడిశరంబు తాఁకి యమవాటిక కేగుచునుండె నాయనా! 245

ఉ॥ వాలిని జూడు నా బ్రిదుకు పైనను నిప్పులుపోసి పోయినాఁ
డాలముసేఁత కిచ్చుటికి నాగముసేఁతకు వచ్చినాఁడు నా
భీలుఁడు పృథ్విరక్షకుఁడు పృథ్వీశయానుఁడు దీనుఁడై యసృ
గ్జాలములోపలన్ మృగయు జాలములోపలఁ జిక్కియుండెడున్ 246

ఉ॥ తేలి యదృశ్యమా మన యదృష్టముకాకను లోకమందు రా
జ్యాలునుగల్గుఁ దత్కృతమహాహవముల్ ఘటియిల్లుచుండుఁ గో
పాలును గల్గుఁ దత్కృతకృపారహిత క్రియలుం ఘటిల్లుఁ బా
పాలును గల్గుఁ గ్రూరనరపాలకశిక్షలు సంఘటిల్లెడున్ 247

ఉ॥ అంచితమైన పాల్యజన మచ్చట చేయు నఘంబు రాజు శి
క్షించును భూమిపాలకుఁడు చేసినపాపము దైవమొండు శి
క్షించును దైవముం దిరిగి చేసినదానికిఁ గర్మమొండు శి
క్షించును గర్మజన్మలను జెందెడు దైవమనుష్యసంహతిన్ 248

ఉ॥ శ్రీహాసనక్రియా పరవశీకృతచిత్తులు కొంద ఱుగ్రదుః
ఖాహృతకోపవేగ నిహతాత్ములు కొందఱు నందఱుర్ మతి
వ్యాహకపాయకర్మకలనోగ్రులె యీ ధరయందు మందస
న్నాహము పొందె నీదెసను నాదెస నేటి కదృష్టరేఖయుర్ 249

వ॥ అనుచున్న తారా నిరూఢ నిగూఢ దుఃఖోల్బణజనిత వాక్యసంజా తమ్మునకు రామసుగ్రీవులు వెఱఁగొందుచుండ హనుమంతుఁ డామెతో నిట్లనియె. 250

చ॥ అతితరదుఃఖవేగ నిహతాత్మవు పండితురాల వీదృశో
ద్గతపరితాపతప్తియును దావకపూర్వవివేక భావనా
స్ఫురితమతియుం బరస్పరవిరుద్ధములైనవి వేని కెవ్వరీ
క్షితితలమందుఁ గన్పడుచుఁ జెందుచుఁ జిందుచు బుద్బుదింబులై

ఉ॥ సొంపటి నీవు దీనవును శోచ్యవు దీనుఁడు శోచ్యుఁ డెవ్వఁ డీ
తెంపున వానికోసమయి దీనత శోకము నీవు పొందఁగా
సంపుటి ఛిన్నభిన్నమయి చాల్పడి దేని కదై చనర్ బ్రవా
హంపు వియుక్తకాష్ఠకలనాద్భుతవృత్తికి నావటెల్లుచుర్ 252

చ॥ అరయ నశోచ్యమైన విషయంబున శోకము పొందుచున్కికిర్
మరియు నదీనమై చనిన మార్గమునందున స్రుక్కిపోవుచుర్
వెఱఁగు భజింపనైనయెడ బిట్టగు కోపము శోకమందుచుర్
బరువడి విజ్ఞులై జనులు పామరులంబలె నోదు రేలొకో 253

చ॥ వికటపు మృత్యువీథి పలవింపఁగ నేటికిఁ దప్పనట్లు వే
ఱొకసమయంబునందున మఱొక్కవిధంబుననైనఁ గల్గుఁబా
యక భ్రమపొంది యెప్పటికి నప్పుడె యిప్పుడు కాదటంచు ని
త్యకలితమాయ నేద్వరనునట్టిది యున్నదె మొక్కుకొన్నటుల్ 254

గీ॥ ఈ మహాపయోరాశిలో నెన్నియెన్ని
బిందువులు సూర్యరశ్మి నిపీతములగు

నెన్నియెన్ని బిందువులు వర్షించిరా ని
బద్ధకంచుక జలధరోద్ధ్వాంతములగు 255

ఉ॥ ఆయనకేమి వాలి సహసాద్భుత సాహసశూరకార్యుఁడై
పోయెను ధాత్రి యేలి బహుభోగములం గనె వానికోసమై
యీ యుపలాప మేమిటికి నే యుపలాపములాడి వచ్చునా
పోయినవారికై పొగిలిపోవుట నీకనుగాదు ధీనిధీ ! 256

మ॥ పసివాఁ డంగదుఁడుండె వానికి ధరాభారంబు కల్పించి బు
ద్ధిసమున్మేషణ రాజకార్యకరణాధీనాత్మ వీ వుండి వె
న్క సముల్లాసితభావ మింత యెసగంగాఁ జూచుకోలేక వె
క్కసపాటందెదు నీ మతిస్థితి కయోగ్యంబైన దైన్యంబునన్ 257

ఉ॥ అంగదుఁడున్ భుజాబలసమంచితుఁడైనను నేర్పుమీర రా
జ్యాంగము చూచుకోఁ గలుగునట్టి వయస్సనుభూతి లేవ, యు
న్నం గడు నీవలెం గలుగునా ! కపిరాజ్యము నీవు ముందు ని
ల్వంగను వెన్కఁ దక్కిన బలంబు కలట్టిది కాని ధీమతీ ! 258

చ॥ పొదలు ప్రవాహమందుఁ బడిపోవుట యిష్టమయ్యె నొడ్డు చే
రుదమని కోర్కిలేదు మరి స్రోతసి యట్టుల లాగు నిట్లు లా
గుఁ దివియు లేవగొట్టునని కుందఁగ నేటికి దాని లక్షణం
బది, వలెనంచుఁ గోరికొనునట్టిది యందొకవై పనిష్టమా ? 259

గీ॥ తూగి సౌఖ్యమ్ము వాంఛించి దుఃఖబహుళ
మైన జన్మంబునందుట యబ్బురంబు
సాధుపానీయవాంఛమై క్షారజల ని
ధి ప్రవాహంబునందు నీదెడు విధాన 260

వ॥ అనినఁ దార నిమేషైకభాగంబున నూరకుండి హనుమంతుని వంకఁ
గాంచి దుఃఖంబులో నవ్వి యిట్లనియె. 261

మ॥ అవునయ్యా! హనుమా! ప్రవాహమునయందావర్తమైరాణ్బయో
వివరంబందునఁ జొచ్చుచుంటిని శుచావీరావఘోరంబుగా

నవు దుఃఖంబును దత్ప్రవాహసహజంబౌ లక్షణంబే మనో
ధవుఁ డిట్లైనెడ నొడ్డుచేర నికఁ జింతాసాగరం బీదెదన్ 262

క॥ పెనిమిటి స్వారాజ్య మతివకుఁ
దనయుఁడు పరరాజ్య మేచు తన రాజ్యము పో
యిన దానను సుగ్రీవున
కును నెక్కువయైనయట్లు కొల్పుడుదానన్ 263

ఉ॥ వానికి రాజ్యముం దిరిగివచ్చెను నాకున్ను వచ్చునన్న యా
శానతమూలలేశమును త్ర్యాకుహారంబునఁ బెల్లగిల్లగా
వాని ధరాధిపత్యమున బాలకుఁ డంగదుఁ డేటికిన్ రిపు
స్థానము గల్గ నీ తరముచాలక పైన ననుశ్రితంబుగన్ 264

క॥ ఒకవంద యంగదులు మా
మకదుఃఖము పాపలేరు మహనీయమతీ !
ఒకవేయి నీతివాక్యము
లకు నొక్క యథార్థవాగ్బలం బుండనటుల్ 265

గీ॥ వాన కురియంగవలయును వసుధ పండ
వలయుఁ బండుటకుంగాని వసుధ దేని
కవు వసుధలేని వానయేమవు నటన్న
వానయన నీర మది సృష్టిప్రథమమూర్తి 266

ఆ॥ మిన్ను పగిలి ప్రళయమేఘగర్జలు మహా
నిలము లశనిపాతములును జేయు
భూమికూడఁ బగిలి భూకంపములు మహా
ప్రళయములను జేయు బలము కలదు 267

చ॥ సబహుమతిప్రగల్భ మృదుసాంత్వనవాక్కలితాదరా! సురా
రిబహుళమర్దనక్షముఁడు శ్రీనిధి వాలి మనోజ్ఞమేఘమై
గుబురుల సస్యముల్ వెలుచు క్షోణిని నేనయి సృష్టికార్యమం
దబలనుగాక రాజ్యమున నంగదు నిల్పుబలంబు లేకనా 268

గీ॥ ఆగ్రహముపూని యాహవ మాడఁగల్గు
దున యెవనికోసమై యాడుదును కపీంద్ర !
యెవనికోసమో వాఁడు మహీశయానుఁ
డుగ్రశోచ్యస్థితిం బడియున్న వాఁడు 269

గీ॥ వారివారి ప్రతిజ్ఞలు వారివారి
నిర్వహణశక్తులు తెలియనివెలఁది విక
టీకృతముసేఁతగా బొమిడికము కొడుకు
నకు నొసంగి నిప్పులు చెరిగికొననేల 270

గీ॥ నడుమ కంబమ్ము నాటిన నల్లచెఱువుఁ
బోలెఁ బడియున్న వాలిలో మునుకలిడుదు
కూడి యన్నింటి కతఁడె యున్నాడు నన్నుఁ
జంపినాతఁడు తీవ్రభాస్కరసుతుండు 271

వ॥ అనుచుఁ దార చేతులు వాలిపై నుంచి తొడలపైఁ బడియున్న వాలి
చేసన్న సుగ్రీవునిఁ జేరఁ బిలచి యిట్లనియె. 272

చ॥ నిజముగ రామచంద్రునకు నీవలె సాయము చేసియుందునే
యజిరము చేరినన్ రఘుకులాంబుధిచంద్రుఁడు గర్వబుద్ధినై
వృజినములాడియుందు నొకవేళను జంపినఁ జంపియుందు నీ
రజదళచారులోచనుఁడు రాముఁడు నన్నిది యెప్పుడున్నదే 273

మ॥ ననుఁ జంపించెదునంతదాఁకఁ జనియున్నన్ నీదు కోపంబు పొం
దని యీ నాళుల పొందియున్న సమయానన్ నీ స్వభావంబులో
తున నాయందలి నీదు గౌరవమునందున్ దీని చిన్నెల్ కనుం
గొనరాకుండఁగ నుండియుండునుగదా గూఢప్రమాణంబుగన్ 274

మ॥ కడు నీకోపపు మూలభూతపు టహంకారంబు నీ చిన్నయ
ప్పుడు నట్లున్నది రాజ్యపాలనము నీవున్ జేయఁగాఁ గల్గు దే
క్కుడు నాకన్న నటంచు నున్నయది నీకున్ దాని నేనెప్డొ గు
ర్తిడితిన్ గానఁ దలంచుచుంటి నిను దూరేత్యుం బొనర్పన్ మతిన్

మ॥ నిను వేఁటాడితి నేల నాల్గుచెఱఁగుల్ నే నద్దియే యొండు చే
సినదోసంబును నీకుఁగూడ నదియే చెందించెఁ దా నింతయా
కనలుక్ నీ కనుకూలమైనది సుమీ కాలంబు కాలంబు వి
ప్పిన వృత్తంబు కనంబడుక్ బుధపదోర్వీస్ఫారకృత్యంబుగక్ 276

ఉ॥ కాలము పండఁగావలయుఁ గాని యొకానొక యెండుమోడు ని
ర్వేలవసంతసంపదురరీకృతి భూషితమైన యప్సరో
జాలము హేలనవ్వులను జాలవు నా సుమనోమనోహర
శ్రీలకుఁ దావలంబగును చెందిన కాలముపంట పంటగా 277

ఉ॥ తల్లి వరంబు కోరుటయుఁ దా వనసీమల సంచరించు టీ
యెల్ల భవద్విలాసపుటదృష్టము సాధుఫలాభిముఖ్యమై
ఫుల్లముకావుతే యిహము పోవఁగనిమ్ము పరంబు చూడుమీ
కొల్లలుగాఁగ ముక్తిసతికొప్పున నుంచిన పూలదండలై 278

క॥ అరయ నిజమైన ప్రేమము
పరస్పరవిమర్శ చేయఁ బాల్పరచదు సో
దను శీలంబున నీ నా
విశుద్ధము జనుస్స్వభావవిభవము కాకక్ 279

క॥ ఏకైకదోషకారియుఁ
బ్రాకటగతి రాజశిక్షఁ బడసి జనుడు న
స్తోకస్వర్గసుఖపరీ
పాకాకృతి పరిమళించుఁ బ్రామాణికమై 280

ఉ॥ సంగడికాని సూర్యకులచంద్రుని గుర్తిడుకొమ్ము కుఱ్ఱవాఁ
డంగదుఁ డీవు వానిదెస న్యాయ్యముకానిది చేయఁబోకు మీ
యంగన దుఃఖపుక్ వ్రిణము నంతకొ యింతకొ మానుపట్టు రా
జ్యాంగములందు నీకును సహాయపడుక్ గుణలుబ్ధుఁడైనచో 281

ఉ॥ ఎన్నడుఁగాని రాజ్యరమ యీగతిఁ జేకుఱె నీకు నెత్తికిం
గన్నులువచ్చెఁబో మఱపుకల్గును భోగనికాయకృష్టిచే

క్రొన్నెలవింటి కోరయయి గోదుమతాఁచు సుమిత్రబిడ్డ నీ
కన్నులు కార యా రఘుకులాంబుధిచంద్రులు రామలక్ష్మణుల్ 282

ఉ॥ కాదనుకొమ్ము నీయెడదఁ గ్రమ్మిన భావముసందు నాకు నీ
పై దయలేద యంచనుట వాస్తవమే యనుకొమ్ము కొంత నే
మోదుగు విచ్చినా విరియఁబూచితి రాఘవతర్పణంబుగా
నే దయమాట యేమిటికి నెవ్వరిన్యాయము వారు చేయఁగా 283

క॥ నాదాఁక వచ్చినప్పుడు
కా దీ న్యాయంబుమాట కలితహరిధను
శ్ఛేదపరిదీప్తజలధర
పాదాపఘనుండు రామభద్రునివలనన్ 284

గీ॥ నేను నీదెసఁ దీక్ష్ణుఁడ నీవు పాల్య
కపిజనమ్ములయందు దీక్ష్ణత భజింతు
స్వామి చెప్పినగతి నుంచసహాజవృత్తి
యా జనంబునఁ జేయకు మాగ్రహంబు 285

వ॥ అని తన మెడలోని బంగారుదండ తీసి సుగ్రీవున కందీయ నతఁడు
బెరుకు కన్నులతో దానిని స్వీకరింప వాలి యంగదునితో నిట్లనియె.

గీ॥ అతనికి న్నాకుఁ బొరుపు లేనట్టినాళ్ల
నీవు పిననాన్న పిననాన్న నెజీ నతండు
నెపుడు నబ్బాయి యబ్బాయి యీ విధమున
నుండి రిప్పుడారీతినే యుండు డింక 287

చ॥ కపిధరణీపతిత్వసుముఖంబగు లక్షణ మర్మిలిన్ ద్రిలో
కపతి మహేంద్రుఁ డిచ్చినది కాంచనమాల యెవం డిదిన్ భుజా
విపులుఁడు తాల్చు నాతఁడు కపిప్రభుఁ డాతని సర్వవానరా
'ధిపులును నేతగా ననుమతింతురు భక్తి ననుశ్రితంబుగన్ 288

శా॥ నాకుం గొంచెముతక్క వంతే యసమానప్రౌఢబాహాబలుం
డీ కోదండసఖుండు పైన సఖుఁ డంతే వీఁడు సుగ్రీవుఁడ
స్తోకప్రాభవవార్నిధానము ధరాశుద్ధాంతకాంతావయః
స్వీకారార్హుఁడు నీవు చూడు మితనిం బిన్నయ్య యున్నయ్యగన్

క॥ నా కడుపునఁ బుట్టిన బి
డ్డై కోలను తండ్రి నీతఁడై యేయించెన్
సీ ! కుటిలుఁడంచు నుండున
యా కొంచెము లేకయుండ నరయుము వీనిన్ 290

ఉ॥ ఎయ్యది తప్పువెట్టి శరమేసెనొ శ్రీరఘురామమూర్తి తా
నయ్యది తప్పు కాదనుటయన్నది యున్నదె కాన నీవు పి
న్నయ్యయెడన్ మరేవొవిధ మందుట న్యాయముకాదు నాయనా !
కయ్యలుకోయుచుం జనెడు కర్మపుకాలువ యడ్డుపెవ్వరే. 291

మ॥ కొదవై యీయొక మోహముం దొలఁచికోఁ గుర్రా! మదిం జాలన
య్యెద భార్యాధరణీగతంబయిన దిక్లే త్రెంచితిన్ రామచం
ద్రదయావంచితుఁడౌచు నీదెసను బుత్రప్రేమకుం జాలన
య్యెదఁ దా నయ్యెదలోని మోహమున కీవే కోటియున్నట్లుగన్ 292

శా॥ లంకెల్ సుమ్మి జగంబు సర్వమును గోలాంగూలరాజ్యాంగ మా
తంకం బింతయులేక సాగుటకు నీతల్లిన్ ధరానీతి ని
శ్శంకం జూడకతప్ప దాతఁడు నుదంచద్బుద్ధి సుగ్రీవుఁడా
వంకం జూడకతప్పదు న్నిను భుజాప్రౌఢున్ గుణాంభోనిధిన్ 293

గీ॥ పెద్దపని పెట్టుకొన్నార యిద్దఱును మ
హాభుజాభీలు నిన్నుఁ గాదనను లేరు
అద్దియనుగాక సుగ్రీవుఁ డడ్డగోలు
మనిసి కాదని నే నెఱింగినది కుఱ్ఱ ! 294

చ॥ పరునొకనిన్ సహాయముగఁ బట్టుకవచ్చి ననున్ వధించె ని
ర్భరతరవైరభావమున వాఁ డని నిందను మోపి చెప్ప మా

యిరువురియందు వేఁడెవని కెక్కువ చేసెనురయ్య వేని యం
బురుహదళాయతాక్షి బలముం గొని వేఁడు గ్రహించెరా సుతా 295

శా॥ అట నేఁడాది గతించె రక్తముల కుల్యల్ వారె రక్షోముదా
ర్భటు లేతెంచె మరేమి తా ననుకొనున్ రాజైనదిన్ మంత్రి లో
కట్టిగాఁ జేసిన దేను సమ్మనిది నాగర్వంబు కాకం బరి
స్ఫుటమై యాతని శుద్ధభావము కరంబుం బొల్చె లోకంబునన్ 296

ఉ॥ ఈకథ విన్న రామునకు నేటికిఁ గోపమురాదు నాపయిన్
గాక సతీవియోగజము కాక యెఱింగినవాఁడు వానిఁ గై
కోక మఱేట్టులుండు ననుకోక చరింపుము వానియందు న్యా
య్యాకృతి సూర్యసూతి వలయాకృతి లోకపుభాగధేయముల్ 297

చ॥ అతని బహిష్కరించితిన యంతకు నూరకయుండలేద యీ
క్షితిసకలంబు త్రిప్పితిని చెప్పనఁ జెప్పన నీళ్లు త్రాఁపి శ్రీ
మతియు మతంగమౌని నను మాన్చెనుగాకను ఋశ్యమూకసం
గతిఁ గన నయ్యె శ్రీప్రభుని కార్య మిదిప్పటి కేమికావలెన్ 298

క॥ ఒకవంక వైరభావ
ప్రకటితముగఁ దరిమినట్టి పని దాని కదే
యొకవంక మతంగౠషి
ప్రకరంబున బ్రదుకు ననఁగఁ బ్రమదంపడితిన్ 299

వ॥ అని చాలసేపు మాటాడితిని మాట వచ్చుటలేదని యాయాసంపడి
యేదో చెప్పఁబోయి చెప్పలేక కన్నీళ్లతో నంగదుని చేయి తీసి
సుగ్రీవుని చేత నిడినంత సుగ్రీవుండు భళ్లునఁబగిల్చి వాలి కాళ్లపైఁబడి
రోదించి లేచి యంగదునిఁ గౌగిలించికొని యేడ్చుచుండ 300

గీ॥ అన్నదమ్ముల వ్యవహారమందు జోక్య
మింత కలిగించుకొన్న తానెవరొ తనకె
తెలియదాయెను లక్ష్మణువలనఁ జూచి
యొక్క చిఱునవ్వు నవ్వినట్లుండె స్వామి 301

చ॥ ఇమ్ముగ దవ్వునేలకును నిచ్చటిదెల్లఁ గనం గుటుంబడుః
ఖమ్మగు సన్నలై వెలుఁగుగా మెలమెల్లగఁ గొట్టవప్రదే
శమ్ములు డిగ్గి వానరులు సన్నగ సన్నగఁ జేరి రచ్చటన్
గ్రిమ్మగఁబోవు చీఁకటుల క్రింతలు చీల్చిన తెల్లవెన్నెలన్ 302

గీ॥ అమితదంష్ట్రాకరాళ గహ్వరమువోని
నోరు తెఱచెను వాలియుఁ దార నాభి
గతపవనసంచలన మూగి కంఠదేశ
నిభృతభావమ్ము గుర్తించి నేలఁ గూలి 303

సీ॥ హాహా! సురారిబాహాహారి నీహార
కరహాళిసమ పరాక్రమవిహారి!
హాహా! కపీంద్రలోకేహా సుపర్యాప్త
ధారుణీవహనసంధాబలారి!
హాహా! మహాతుషారాహారపతికీర్తి
నీయసంగరనైపుణీపరికారి!
హాహాయటంచుఁ దా నావటిల్లినఁ దార
బడి కపిసైన్యంబు పల్లటిల్లె

నంత నస్తంగతుండైన యంబుజాప్త
సముపసంహృత కిరణస్రజంబుతోడ
సాధుకాంతి యర్ధాధికచంద్రబింబ
మాకసము నడుచక్కియం దందగించె 304

మధ్యాక్కర :—

అంతట వానరచమువు హర్షభావాపేతముఖులు
ప్రాంతధాత్రికిఁ బోయి చూచి ప్రణమిల్లి బాష్పలోచనులు
చెంతకు మలఁగి నిల్చి నతశేఖరుల్ శ్రేయోనిధానుఁ
జింతించుచుండిరి వాలి శ్రితభుజాశ్రీచండకేళి. 305

గీ॥ వేయి కాగడాల వెలుతురులోపల
వాలి మేను కానఁబడియెఁ దాను
నిగ్రహంబు పాసి నింగిఁ దోచిన గ్రహ
వితతి వంగియున్న వింజమట్లు 306

మ ధ్యా క్క ఱ :—

వెన్నెలనీడలు దివ్వెవెలుఁగుల వెనుక నీడలును
చిన్ని భూజముల నీడలును చిక్కని చెలఁగు నీడలును
కన్నులకుం దోచె ధాత్రి కాలకింకరు లేగుదెంచి
సన్నగాఁ దిరుగాడుచున్న సన్నగా సన్నగాగ్రమున 307

ఆ॥ వాలిమేనినుండి బాణమ్ము పెకలింపఁ
బడియె మరి పెకల్పఁబడిన యమ్ము
నల్ల త్రిపురసంగరాంతంబునందున
శివుఁడు బండియిరుసు చీల్చినట్లు 308

మ ధ్యా క్క ఱ :—

ఈదృశబాణమ్ము చూడనేలేద యెవ్వరు నెపుడు
పాదలిప్తై ధాత్రిపైకిఁ బట్టిన బంగారుకంటి
యా దైత్యు కోఱయో యిద్ది యానాడు హరియించి దాఁచి
యీ దిట్టయమ్ముగా మలచి యిన్నాళ్ల కీతఁడు తెచ్చె. 309

గీ॥ అమ్ము పెరుకఁబడిన యవ్వాలి పెనుఱొమ్ము
చెక్క తెగిన భూమిభృత్తు కొమ్ము
చిలికిచిలికి యెఱ్ఱజీరలై మందర
పర్వతమ్ము నెత్తు పాలవెల్లి 310

వ॥ అంత శ్రీరామచంద్రుండు సలక్ష్మణుండు దవ్వుచని విశ్రమించి
యుండఁ గపిలోకమ్ము గుంపులుగుంపులై 311

మ ధ్యా క్క ఱ :—

అయ్యయ్యో కిష్కింధ యింక నాంధ్యమ్మునందు మున్గినది
వ్రయ్యలైనది పురిశోభ వనములఁ వాహ్యాళిసొబఁగు
కయ్యకోసినది వైతరణి కపిలోకకనకదుర్గమున
ప్రయ్యవెట్టిరి మమ్ముఁ గోపపటువులు భాగ్యదేవతలు 312

పదునైదు సంవత్సరములు పవలురేల్ బవరమ్ముచేసి
కుదియించి కుదియించి చంపెఁ గుటిలుని గోలభనాము
మదధూర్త గంధర్వపతిని మా వాలి మహా శూర జేత
యది వేఱె యెచ్చట దొరకు నట్టి మహారాజు మాకు 313

తనరారి తనరారి సప్తతాళకదళనోత్సవములు
చనుదెంచి చనుదెంచి దైత్యసంహారసమయోత్సవములు
వెనువచ్చి మునువచ్చి యుఱక వెలయించు వీరోత్సవములు
వెనుకఁబడ్డవి మనకును కపిజగతీవీకుండు పోవ 314

గోఘృతకృతదీపము నిదిగో పుటుక్కున నార్పివేసె
తాఘోరకర్మనిపుణుఁడు ధాత మా ధామమ్ములందు
నోఘంబులుగఁ గట్టి వచ్చుచున్నట్టి యుజ్జ్వలలక్ష్మి
నీ ఘోరకలి చేసి దుష్టుఁ డిట్లె మాయించె విధాత 315

గీ॥ అకట ! యీ రాముఁడని చెప్పవట్టివాఁడు
నీ మహాకపిరాజ్యశౌర్యేందిరా మ
హోజ్జ్వలప్రవాహం బెల్ల నోడ్చిపెట్టె
కపిజగన్నాథు ఱొమ్మున గండికొట్టె 316

వ॥ అనుచుఁ గపిలోకంబెల్లఁ బ్రొద్దుపోయినకొలంది నొకొక్కఁడు నిదుర
కొగ్గ నంగదుఁడును సుంత కునుకఁ దారాసుగ్రీవు లిద్దఱే తెల్లవార
లట్లే యుండిరి 317

గీ॥ అది యెదో యిట్టులైనదం చైనఁగాని
యెగచి తన్నాడునంచైన నెదుక చూచుఁ

గెరలి యొకమాట యనఁదు సుగ్రీవుఁ డాక
వదినెతోఁ బల్కె నాతఁడు భయమునుగాంచు 318

గీ॥ తార తనలోనె తా సముద్రాలు త్రవ్వి
పెళ్ళపెళ్ళలుగాఁగఁ ద్రిప్పుకొనుచుండె
నొక్కపుడు ముగ్ధరమ్మ లింకొక్కయపుడు
పరికుపితాకాశచుంబితోర్మికలు గాఁగ. 319

క॥ తూరుపున నుషోరాగము
చేరికఁగనె నంచతెక్క చెదురికలు నాఁ
వీరకపులు జాగ్రచ్చో
కారూఢి సమంబుగాఁగ నక్షులు విప్పన్ 320

వ॥ అంత దార తూరుపుదిక్కునందుఁ జూచుచు నిట్లనియె. 321

గీ॥ ఎంతమంది లేరో యీ జగమ్మునయందు
వచ్చివచ్చి కమలబాంధవుఁడు
తనకులంబువానిఁ దనబిడ్డఁ దన శిష్యు
నద్ది నామొగానఁ బ్రొద్దుపొడిచె 322

గీ॥ మగని కస లిష్టమేదియో మదికిఁ దెలిసె
మొదల నే నిష్టమనుకొంటి బిదప రాజ్య
లక్ష్మి యది యిష్టమనుకొంటిఁ బక్ష్మమాల
నమున సుఖపడు నేల యన్నదని యిప్డు 323

మ॥ ప్రథిత శ్రీపరివాహమూర్తియని తారం జెప్పికో దక్షిణా
పథసమ్మర్దముగాఁగ నా సకలసౌభాగ్యంబు మృగ్యంబుగా
మథితంబై సిరియెల్ల నిప్పటికి సామాన్యంపు స్త్రీనైతిఁ గా
దధమస్త్రీ నయితిన్ సుమంగలులలో నంశంబు ధ్వంసంబుగన్ 324

శా॥ ఓహో రాత్రియెల్లనున్ బ్రదికియే యున్నాను నే నీ పవల్
దేహం బేటికిఁ దాల్చియుండెను సమర్థింపంగ లేలుంబన

ళ్లిహోదుష్టత నిల్లియుండెదన యా యీహోస్వరూపంబె నా
కాహా తోచదుగాక దేహగతమోహభ్రాంతి యిట్లుండునా 325

ఉ॥ ఇవియుఁ దమంత తా మసువు లేటికిఁ బోవు మనోజ్ఞసుమేలనం
బవు నొక గాఢసంస్కృతివిహారము మాలిన గుండె కాక, చి
త్తవిహృతి యాత్మ కిష్టమును దారులు రెండును రెండుగా వృథా
భవమిది శిష్టమైన పరిపాకము పొందని మొండికట్టెయై 326

క॥ బలవంతపుఁ జావు మహా
విలము నరకహేతువన్న విధమగు టెల్లన్
బొలసిన దుఃఖములన్నియు
వలపోఁతగ ననుభవింపవలసినయట్టుల్ 327

శా॥ ఉద్దీప్తాంబకకాలరుద్రుఁ డతఁడోహో ! స్వామి యచ్చోటు పో
వద్దయ్యా యని యెంతచెప్పినను నా వాక్యంబు పాటింప కీ
షద్దోశ్శీలము శౌర్యధర్మము ముముక్షాబుద్ధిఁ బాలించి తే
మొద్దుం జేసితి నన్ వసంతవిదళద్భూమీరుహశ్రేణికన్ 328

క॥ ఆ వాలి చచ్చిపోఁగా
నీ వనితయు తార బ్రతికి యెట్లున్నదనన్
దా వర్షఋతువు పోఁగా
నో విభు ! పొగగుంపు మబ్బు లుండవె మింటన్ 329

మ॥ ఇది యేదో యొక మృత్యుతాపముగ సామీ ! వచ్చు లోనుండి త
ప్పదు నిన్నుంబడి వచ్చుచుంటిని వియత్పర్యాప్తమార్గంబునన్
హ్రదమావర్తము గూఢవార్నివహసంరావంబు సర్వంబు నా
యెదలోఁ బుట్టె నికొక్క దించుకొనుటే యీ వేగ కాత్రోవలో

వ॥ అని గ్రుడ్లు తేలవేయుచున్నంతలో నంగదుం డమ్మాయని యఱచి
కౌగిలించుకోఁగాఁ దార నుడిగుండంబునుండి పైకి తేలి తెప్పిరి కొడుకు
మెడమీఁద వ్రాలి యేడ్చి యేడ్చి మరలఁ దన్నుఁ దా సంబాళించు
కొని చీరచెఱంగునఁ గన్నులుతుడిచికొని కుమిలిపోవు కొడుకు నాదు

కొని తండ్రీ ! లేదులేదు నేను బ్రతికియే యున్నానుగా యని
యోదార్చి యంగదుఁడును దేరుకొనఁగా నిట్లనియె. 331

ఉ॥ అక్కట ! కాననాంతమున నాడఁగఁబోయినవానిఁ బిల్లవాఁ
డెక్కడికేగెనం చడిగె దెప్పుడు వానిని వేయికన్నులం
జక్కఁగఁ జూచుకొందు క్షితిశాసకుఁడౌనని వాఁడు చూడు కా
త్రొక్కెడు వానియందు దయబూనవె వానరలోకనాయకా 332

ఉ॥ దోహలరాజ్యలక్ష్మియుతదోర్బలశాలివి రాజకార్యని
ర్వాహకుఁడైన నీకుఁ బసివాఁడుగ వెక్కనె యుండిపోయె ధీ
సాహస మింతలేకయ భుజాబలవిక్రమవంతుఁడయ్యె రా
జా ! హరిలోకసంచయసురాలయభూజ ! యనుగ్రహింపవే 333

క॥ అమ్మయ్యో ! యిట్టి బిడ్డను
ఓమ్మనఁ గట్టుకొని వనులఁ గ్రుమ్మరుదునొ శౌ
ర్యమ్ము బలమ్ముండియు రా
జ్యమ్మున సాహసము సేఁత చాలనిబిడ్డన్ 334

గీ॥ ఎవనిఁ జూచిన సర్వలోకేశ్వరత్వ
మందినట్టుల సంతోష మందుచుందు
వా కుమారకు నంగదు నంతికమున
శోకవార్ధినిమగ్నునిఁ జూడుమయ్య 335

శా॥ నిన్నుం దాగుమటంచుఁ బిల్చితిని మన్నీడా ! సమస్తంబుగా
సన్నాహంపడి దుఃఖపున్సుడి నధస్సంచారిణిన్ వచ్చుచో
నన్నుం దోడుకొనెన్ సుతుండు పయికిన్ నాస్వామి ! నీవెంట రా
నన్నా నంచనుకోకు ముంటి సుతరక్షార్థంబు శత్రుంజయా 336

శా॥ ఓహో వీరచమూసమూహము! శుచావ్యాప్తాత్మయా తార సం
దేహింపన్ మది నెంచఁబోకుడు ధరిత్రీజానిపుత్త్రిన్ జమూ
వ్యూహాప్రాజితఁ దల్లిదండ్రులకుఁ గాకుండం గనన్ లేని మం
దేహన్ జావకయుండుచుంటిని సుమీ యీ నన్ను మన్నింపుడీ 337

మ॥ ఇదిగో చూడుడు మీరె యెట్లదుముకొం చీబిడ్డ యున్నాడో భీ
సదనుల్ కౌఁగిటఁబూనినన్ నిలువరించంజాలగా నైనయ
ట్లదయంబౌ విధి ప్రాణముల్ తిగుచు చో నాపత్తు నిర్నాయికం
బది చేయించును హాస్యకర్మములు దేహాధీనవృత్తంబులై 338

గీ॥ అని మరల వాలిపై వ్రాలి యంబుజాక్షి
యక్షికోణంబులందు బాష్పాంబులహరి
విహరదూర్జదవశ్యాయ బిందువులుగఁ
గలఁగఁజొచ్చె నుపస్తటాకంబువోలె 339

స్రగ్విణి :—

తార దుఃఖోగ్రసంతాప మీమాత్రఁ జ
ల్లారునం చెంచగా నంత కంతంత దు
ర్వారమై ఘోరమై వచ్చి వారింపఁగా
నేరనట్లయ్యె సందీప్తమై యెవ్వరున్ 340

గీ॥ అల్ల ఖండితయైన ఛాయాలతాంగి
తాను గనిపించఁగా దవ్వుదవ్వు పోవఁ
బతియు ధూర్తుండునై పైకిపైకిఁ బోయి
క్రమముగా లాగికోఁ జొచ్చెఁ గౌఁగిటికిని 341

గీ॥ మొదలుపెట్టుచే బిట్టెండ మొదలుపెట్టె
నకట మాధవుఁడును గ్రీష్మునంత పెళుసు
చివురు నెజ్జన మెత్తన చెప్పుచుండె
వాని కాఠిన్యమును మార్దవంబు కలిపి 342

గీ॥ అంబుజాతాళి వికసనాధ్యాపకములు
జలజహితశిలాశౌర్య శిక్షాగురువులు
శిష్టమాఘ్యప్రసూన విశీర్ణపటువు
లంతఁ జెరలాడె సూర్యబాలాతపములు 343

గీ॥ మెట్టయైన కిష్కింధ సమీపధాత్రి
సమముగానున్న యటవి వృక్షముల తలలుఁ
జివురులం దరుణాతపశ్రీ వహించె
వాలిపై నెత్తురులు జాలువారినట్లు 344

గీ॥ చిఱుత తెలిమబ్బులచ్చట జీరువారి
పశ్చిమాశాలతాంగి సంవ్యానకములు
నచట మార్తాండుఁ డుదయించినట్లుగాఁగ
భాగ్యవన్నెత్రికాంతులు ప్రస్తరించె 345

గీ॥ దైన్యమునఁ జేసి యచటి యందఱును బొమల
యందు జిట్లించికొని చూడ నాతపాధ్వ
ములనె వెలుగుంగరములు గుమ్ములుగఁ దోఁచె
యముఁడు కొనిపోవు వాలి ప్రాణములువోలె 346

గీ॥ వాలి మైనుండి పెకలింపబడిన శరము
దూరమున నుండ వానరస్తోమ మొకఁడు
దాని దగ్గరకుం బోడు దాని వంక
బెళుకులగు తెప్పకిలించి చూపులు నిగుడ్చు 347

గీ॥ ఋశ్యమూకాటవీ తాళవృక్షశేఖ
రములు రక్తజపాతోరణములు గాఁగ
సితజలదపంక్తి ప్రతిబింబ సిద్ధి వాలి
గాయమును బ్రదర్శించెడుగతిఁ దలిర్చె 348

స్రగ్విణి :—

తార దుఃఖోగ్రసంతాప మింతేని చ
ల్లారు సంచెంచగా నంత కంతంత దు
ర్వారమై ఘోరమై వచ్చి వారింపగా
నేరనట్లయ్యె సందీప్తమై యెవ్వరుఁ 349

వ॥ అంతఁ బరమదీనుండైన సుగ్రీవుండు శ్రీరామచంద్రుని వెదకు
కొనుచుఁ బోయి యడవిలో నాయనను గాంచి యిట్లనియె. 350

గీ॥ నీ ప్రతిజ్ఞయేమొ నీవు చెల్లించితి
నా ప్రతిజ్ఞ నేను నలిననేత్ర
చిత్తవీధియందుఁ జింతింపఁ జెల్లింపఁ
గలుగునంత పటిమ కానరాదు 351

గీ॥ నీవు దండ్యుని దండించినావు రాజ
వేను చేసినపని యేమి యీశ్వరా ! మ
హానుభావునిఁ జంపించినాను సర్వ
కపి జగత్పరమేశు నగ్రజుని రాజు 352

ఉ॥ ఆబిడ దుఃఖముం గనిన నక్కట ! నా పొనరించు తప్పునే
లైై బహులక్షకోటిగుణమై కనిపించెడు బుద్ధి లేదు నా
యీ బవరంబుసేత సుజనావలిగర్హ్యము దేవనింద్య మా
హా ! బహివెట్టునట్టిది కులాగతవృద్ధజనంబు విన్నచో 353

శా॥ నాకుఁ రాజ్యము పాడు వద్దు ప్రభువా! నా మిత్రమా! రామ! పూ
ర్వాకస్థానము ఋశ్యమూకగిరియందట్లే చరింతుఁ ధరి
త్రీకన్యామణి వానరుల్ కలరు మైత్రీరమ్యులు న్నాకు న
స్తోకప్రాభులు వారిచేత వెదకింతుఁ దిక్కుడుంగమ్ములఁ 354

ఉ॥ సాగి విరోధముఁ జనకజాప్రభు ! హృద్గతకోపజన్యహిం
సాగుణమూ విరోధఫలసంగతి కల్గకమున్న వేఱు న
న్నా ! గుడుసై ఫలించినయనంతర మింకొకఁ డాదిఁ గోపముఁ
సాగిన దుఃఖముఁ హృదయశాంతియుఁ దృప్తియు రెంట దూరమై

చ॥ కళవెళలైన దుఃఖములు క్రమ్మగఁ దారయు నంగదుండు ని
ర్దళితములైన గుండియలఁ దాళగ నోచుఁ బతిఁ బితఁ శుచా
ప్రళయముపొంది చూచుటకు వచ్చిరి దుర్గమునందె యుండి క్రో
త్తళములు లగ్గలెత్తి చలితంబుగ నిల్వరుకాక పోరికై 356

శా॥ అట్టుల్ సేసిన నేమి చేయగలనయ్యా ! యన్నతోఁ బాటుగాఁ
బట్టెన్ బట్టపురాణి బంధువులనుం బట్టించి చంపింతునా
కోట్టాగ్రంబున నుంగ పెట్టి వ్యవధాకూలంకషప్రౌఢిమైఁ
జిట్టల్ రాజ్యదురాశ యే యఘములం జేయించ దాకుంచనన్ 357

క॥ ఆ యన్నయు నా వదినెయు
త్వన్మ యధిపతి నేనటంచుఁ జాటిరి పుత్రుం
డై యంగదుండు పోయెను
నా యెద వారి యెద తెలిసెనా స్పష్టముగా 358

శా॥ నిత్యోద్వేగిని గ్రూరకర్ముఁడను మందీభూతధీసూక్ష్మనై
శిత్యాగూహాతుఁడన్ వృథాప్రకుపితాక్షిప్రాంతరాత్ముండ సా
మృత్యంబన్నది పర్వతాభమగు దౌర్మత్యంబు నాదిట్లు తా
మత్యంతంబు జగంబునం దెలిసె నేనై పాపభాగిన్ బ్రభూ 359

గీ॥ ఇంటిలోఁ జీమ లెక్కువం చెవఁడో యవి హ
రించుటకుఁ గొంపచూరు ముట్టించెనంట
అట్టులున్నది నా చేసినట్టి కర్మ
సాధుజనశిరోమణి నన్నుఁ జంపినాను. 360

శా॥ నాస్వామీ! రఘురామ! యీ యఘము నానాజన్మలన్ వచ్చు నా
అస్వర్గ్యం బిది సర్వపుణ్యముల కడ్డై కట్టగా నిల్చునా
నిస్స్వార్థంబుగ ధాత్రిపాలనకళా నిర్ణేతగాఁ జేసెఁ దాన్
నే స్వార్థంబున వానిఁ జంపితిని దండ్రింబోలు నన్నన్ మరిన్ 361

చ॥ అతఁడు పరాక్రమాంబునిధి యంగదుఁ డాతని కింతచేసి నే
బ్రతనుమతిన్ మరేమొ యువరాజును జేసిన ధాత్రియందు వం
చితుఁడయి లోన విప్లవముచేయుచు నుండిన నేమి యౌను నీ
క్షితిసుత కానిపించుపయిఁ జేయునొ లోనన చేయునో మరిన్ 362

మ॥ మదిలో నన్నును సాగనిచ్చినది యామాత్రంబుగానైన నం
గదునిం జూచియె యన్న నాయొడి మెలంగన్ నా బుజం బూనగన్

గదియన్ మోమును మోము నవ్వుకొనఁగాఁ గంఠంబులం గ్రచ్చకో
నది తా నంతటి ప్రేమ వానికిని గట్టా! యిట్లుగాఁ జేసితిన్ 363

ఉ॥ పాపముపుణ్య మంటని స్వభావమహేశ్వరుఁ డీవు పాపపు
ణ్యాపతితోగ్ర జన్మమరణాది పరంపరుఁ డేను రామచం
ద్రా! పరమాఘ మియ్యదియు నద్ది నిజంబగు చివ్వకాదు ని
న్నీ పరు వెన్కఁదాచి వధియించితిఁ బాపములోనఁ బాపమై 364

చ॥ మొగి నఘముం బొనర్పకయమున్న మహాంధ్య మదంత యున్న దే
తగ నఘముంబొనర్చుపయి దట్టపుఁజీఁకటి యింత గ్రమ్ముకొం
చెగచుచునున్న దన్న వెఱగేటికిఁ గోటికిరాతరూపుఁడన్
సొగసగు నీ మొగంబొకటి చూచి సమస్తము నోర్చికొంటగా 365

శా॥ జీవత్కాలమునందుఁ గొందఱు పరిక్షిప్తాత్మలైనట్లు క్రో
ధావిష్టుల్బలెఁ జేష్టమానపటుకామాధీనులంబోలె స్వ
ర్భావుల్ కన్పడి మృత్యువేళఁ బరిలుప్తక్లిష్టదుర్లోకికాం
హోవిస్ఫూర్తులు తోఁచుచుండెదర యంచొక్కండు మా యన్నయై

ఉ॥ శ్రీరఘురామచంద్ర! అతసీకుసుమాభశరీర! కేకికే
కా రమణీయరావలతికా పరిహాసిమనోజ్ఞషడ్జ మహా
ర్వీరవ! చాపసంపదురరీకృత దుష్కృతజీవకర్మమా
ర్గా! రుచిరాత్మ! మత్కృత మఘౌఘపు నిష్కృతి యేమి చెప్పవే 367

శా॥ నాకున్ ధాత్రిరమావిధాత వొకఁడేనా! చిత్తసంశోధన
వ్యాకృద్దేశిక దివ్యమూర్తివిని నీవై నన్ను మన్నింపవే
కాకీ సంశయదుఃఖవార్నిధి తరంగమ్ముల్ ననున్ ముంచున
ట్లై కూర్చున్నవి మందహాసరుచిమాలా దీపితాత్మద్యుతీ 36౮

మధ్యాక్కఱలు :—

మొల్లమ్ము చెడని నల్లవిసెపూవు వంపున వ్రాలు నాగ
వల్లీసితానూన బాలపత్త్రశోభా రమ్యభావ

ముల్లోలపరివాహ మదరి యుపరెనో యూగునో యనిన
మెల్లని మందహాసములనేలు నా మేలు నారయుత ! 369

సన్నని గులకరా క్రీడజరిగెడు సైకతస్థలుల
చిన్నారి సెలయేటి సన్న జీరాడు చిఱునీటిపైని
సన్నసన్నని యలల్ కదలు చాయగా సాగు నీ సెలవు
లన్నీటు లాలికెడు నవ్వులన్ వెన్నెలల్ నాకు రక్ష 370

వ॥ అనిన శ్రీరామచంద్రుండు ససౌమిత్రి సమాదృతమైత్రి సకోదండుం డాలంబిత సుగ్రీవబాహాదండుండు వాలివధదేశంబు కించిత్తీక్ష్ణాతప పరికాశంబు చేరిన నచట వాలి చుట్టాలైన పెద్దలు తారను జబ్బ లూని లేపిన నామె శ్రీరామచంద్రునిం జూచి గుర్తించి కోపదుఃఖ గౌరవనిరాదరణ భావంబులు నేత్రాంతమ్ముల నుద్దీప్తంబులుగా నిట్లనియె. 371

క॥ మా మా దుఃఖమ్ములు మరి
మీ మీ మృదుమందహాస మేదురవీథుల్
మా మానవప్రాణహార్తిన్
మైమఱపులు మీకు కేళిమందస్మితముల్ 372

ఉ॥ నీవు త్రియీమహార్థ పరినిష్ఠితబుద్ధివి కోమలాంబుద
శ్రీవలమాన మోహనశరీరుఁడ వీవు సమస్తధాత్రిర
క్షావిభుభారసంగత భుజానతమూర్తివి సర్వదూషితాం
హోవివృతిక్రియా విదళనోత్సుకభావ ధృతేషు రాజవిన్ 373

క॥ అల్పాల్పకార్యధిషణా
జల్పులు నల్పాల్పకార్యచరణాలపనా
కల్పులు మరి త్వాదృశులు న
నల్పులు మీ శ్వేదధర్మ మాకృతిఁ గొనగా 374

సీ॥ సగముచేసి మఱియు సగము మానపుగదా
త్వాదృశులు సమస్తద్భు లగుచు

నల్పులేమొ యింతయంతగాఁ బొనరించి
సగమునందె విడిచిచన్నయట్లు 375

మధ్యాక్కర :—

నీవు సమస్తధర్మములు నేర్చిన నేరుపుకాడ
వీవు సమస్తశిక్షలను నేర్చెడు నేరుపుకాడ
వీ వేపనియును మిగుల్చ వెత్తినయిషువును మాన
వావిష్కృతత్రియీధర్మ ! యానందహాసోర్మిమర్మ ! 375

స్రగ్విణి :—

నీ త్రయీవేత్తృతా నిశ్చలజ్ఞానముల్
సత్రపామూర్తి నేఁ జాలనే చెప్పఁగా
గాత్రమం దర్ధముల్ ఖండితంబై చనన్
పాత్రిమా శిష్టమా భాగ మిందుంచగాన్ 377

సీ॥ ధరణీసుతా పయోధరలగ్నకస్తూరి
కాలేపసంరూషితాసితాంగ !
ఖరదూషణాంగనా కజ్జలానీలదూ
షితబాష్పజలఝురాసితశరీర !
అఖిలవేదార్థ రథ్యాశారదికచంద్రి
కాలవలీలతికాసుహాస !
అఖిలలోకాపదాహాకారదర్శన
శ్రవణజన్యానన్నాబ్జాతహాస !
సగము పొనరించి మిగిలించి సగము త్వాదృ
శులు పొనర్పరుగద మహాశయు లవనిఁ
బురుషునకు నర్ధదేహంబు పూవుఁ బోఁడి
వేదములయందు నిద్దె చెప్పినదికాదె 378

పంచచామరము :—

భవత్కీర్తిదీప్తుల్ ప్రభావంబు లొప్పూ
ర్ణ విశ్వప్రతాపస్ఫురత్కార్యజాలం

బు విన్నింతు స్వర్గాదిభూమిన్ శరాంత
వ్యవచ్ఛిన్న దేహున్ గృపంజేయవే నన్. 379

గీ॥ అనుచు మోాయలేక యట వాలి నేసిన
యమ్ము తెచ్చి చూపి యనియె నిట్లు
ఇన్నినాళ్లదాఁక నే నెఱుంగను సుంద
రాతిసుందరుం డటంచు యముని 380

గీ॥ ధనువు నక్కఱలే దల్లెత్రాడు వలదు
పుచ్చుకొను మంతె పూచికముల్లువోలె
గ్రుచ్చుకొని నేనె చత్తు వికుంఠశౌర్య !
తనుఫు నక్కఱలేదు చింతయును లేదు. 381

చ॥ అని పరిదీనమూర్తియు హృదంతరదుఃఖయు గూఢకోపయున్
వనజదళాయతాక్షుఁ గని పల్కిన రాముని గూర్చి తార, యి
మ్మనఁగొని చేతిలోని శరముం బ్రభుఁ డార్ద్రిపయోదమూర్తి ప
ల్కెను గినుకం ద్యజింపు కలికీ! అది చూడుము శోకహేతువౌ

మ॥ తొలుతన్ దుఃఖమె మోహజన్యముగదా తోరంబుగా దానిలో
పలి దీ కోపము దుఃఖ మాంధ్యమయినం బాటించి తజ్జన్య ము
జ్జ్వలమా! మోహముకంటె మోహమిదియున్ సంధ్యాపయోదారుణో
జ్జ్వలనేత్రాంచల రజ్యమానసుషమా! చాలింపు మీ మోహమున్

గీ॥ ఎవరు నెవరిని దెచ్చిన దేమొ లేదు
నేండ్లుగాఁ బూండ్లుగా నేడ్చి యేడ్చి యతివ !
చచ్చినన్ దుఃఖమేటికి జన్మమంది
నపుడు దుఃఖింపవలయుఁగా కంబుజాక్షి ! 384

ఉ॥ కాలముగాని కాలమునఁ గాలము వచ్చునె కానివేళలోఁ
గాలము కోరి మృత్యుముఖగహ్వరమందునఁ జొచ్చినన్ నుగిం

గాలము నోకిలించుకొని క్రక్కును గాలవివేకమేదు దు
శ్శీలము జంతులక్షణము శేముషిమాలిన మోహవృత్తియై 385

ఉ॥ చచ్చిన భర్తవెంటఁబడి స్వర్గము నేగెదనన్న భర్తయై
చచ్చినవాఁడు తానుచనె స్వర్గమటన్నది నిశ్చయంబు లే
దచ్చట నీవు పోదువనునట్టిది యంతకుమున్నె లేదు స్వ
స్వేచ్ఛయకర్మమార్గముల నొక్కరికొక్కరి కెవ్వ రంగనా 386

శా॥ ఆ కించిత్పవమాన మేగినను దేహం బుగ్రకల్మాషరే
ఖాకూలంకషదుష్టమై దహనసంస్కారేతరాయోగ్యమా
సీ ! కామోల్బణమోహవృత్తి హసన(శ్రీ)భూమి జన్మాంతర
ప్రాకామ్యంబగు జీవకామమున స్త్రీత్వమ్మున్నదా నీకునుఁ 387

క॥ తత్కాలభావరమణము
సత్కార్యము దుఃఖ మిది యసత్కార్య మ్మా
పత్కామవివశతఁ సద
సత్కేవలభావచర్చ సాగదుసుమ్మా 388

శా॥ ఆ సన్నామకమా పదార్థకమనీయాభిజ్ఞ కల్గఁ సదా
వ్యాసంగస్థితిమూలమై నియమ మేకారాధ్యమా లోకయా
త్రాసమ్యక్స్థితి సర్వముఁ నియమబద్ధం బీపదాశాలతా
భాసాభాసము దేహి సౌఖ్యము దురభ్యాసంబు దుఃఖాకృతీ ! 389

సీ॥ నియతినియతంబు సర్వావనీభరంబు
బ్రహ్మలోకాదికముగాఁగఁ బడఁతిఁ నియమ
రహితమైనది నరకమార్గంబు నియమ
రహితమార్గాన దుఃఖంబు ప్రథమదళము 390

క॥ అనుచున్న రామచంద్రుని
వినిభృతగళరవము మేఘవిస్ఫారవిఘూ
ర్ణన మందరగర్జా మో
హనరావము వినుచుఁ దార యచ్చే నిలచెఁ 391

క॥ ఆయువు కోపము దుఃఖము
నాయువు సోత్ర్పాస మఖిల మంతర్హితమై
శ్రీయుతుని రామచంద్రుని
ప్రేయః కంఠస్వరంబు వినుచు న్నిలచెన్ 392

వ॥ అంత లక్ష్మణుండు తారునిం జూచి నీవు పురంబులోనికిం బోయి వలసిన పదార్థసంగ్రహణంబుచేసి మీ యాచారానుకూల సర్వ పరియత్నంబులు సిద్ధంబుచేసి కైకొనిరమ్మని పంచి సుగ్రీవాంగదులం జూచి యిట్లనియె 393

గీ॥ వయసుమీరినవాఁడును వయసుమీర
నట్టివాఁడును నొకరీతియై మెలంగ
జరుగవలసినకార్యంబు జరుగఁగలుగు
నొక్కొ యిట్లు పెట్టుకొని కూర్చుండు రేమి ? 394

ఉ॥ ఓలిన బోలెడంతపని యున్నది యేడ్చుచు నిల్చి యుండుచున్
జాలముచేయఁ దీక్ష్ణకరజాలమువాఁ డపరాశఁజేరు నీ
వేళనె వచ్చుఁ దారుఁడును వెళ్లినవాఁడు వివేకహీనదీ
నాలపనంబు సేతురని యన్నయుఁ దండ్రియు లేచివచ్చునా ? 395

వ॥ అనినంతఁ దారాంగదసుగ్రీవులు లక్ష్మణునివంక బెరుకుబెరుకు చూపులు చూచుచుఁ బరిశమితదుఃఖులన్నట్లుండఁ దారుండు సర్వ సంభారములతో నరుదెంచినవాలి కళేబరంబు వాహకులు శిబికా రోహణంబుసేయించినఁ దార యిట్లనియె. 396

మ ధ్యా క్క ర :—

ఓ మహారాజ ! యీ నీకు నొకనాటి యువిదను నాకు
స్వామి ! తీరెబుణంబు నీవు చనినావు స్వర్గభూములకు
నా మనోనాథ ! కాకుత్స్థనాథదుర్నారాచ శేఖ
రామేయనప్నిదగ్ధా ! మహావీర ! అతిలోకశౌర్య ! 397

వ॥ అంతఁ బసింఁడిబొమిడికంబుకలది యష్టాపదమణిమయ స్తంభం బంత
ర్నిర్మిత దేవాసురయుద్ధచిత్రణంబు శిబిక సాగి మసనంబు దరిసి, సం
స్కారానంతరంబున వాలిదేహంబు చితారోహణంబు నేసి యగ్ని
ముట్టించినఁ దార యిట్లనియె. 398

మధ్యాక్కఱ:—

గోలభదుందుభిముఖులు కూళలౌ కుటిలశత్రువుల
లీలగాఁ బరిమార్చి దేహళీసుమాలికాహారమట్లు
హేలగా నిల్చి నాతార ఏ నిదె యేగుదెంచితిని
బాలాయనుచుఁ బిల్చు నాశుభము చితపై మండిపోవు 399

వ॥ అని బిట్టు విలాపించిన నందఱు నోదార్చినంత నంగదుండు కర్మ
శేషంబు పూర్తిచేసి గృహాభిముఖుండైన వేళ నందే చదికిలంబడి
చేతులు మొగంబున నిడి యిట్లు విలపించె. 400

మధ్యాక్కఱ:—

ఆయనయన్నచో నా భయంబున కవధి లేదాయె
ఆయన కేమొ నాయందు నగు ప్రేమ కవధి లేదాయె
ఆయనయొక్కఁడే ప్రాభవాంభోమహారాశి యనిన
నాయన యనుకొన్నఁజాలు నావంటి నలుసైన జీవి 401

వ॥ అట్లున్న యంగదుని నోదార్చి యోదార్చి యోదార్చలేక సుగ్రీవుం
డుస్సురని తుదకుఁ దన్నుఁదాఁ బట్టుకొనలేక కొడుకుప్రక్కఁ
గూర్చుండి పగిలిపోవు చిట్లనియె 402

మధ్యాక్కఱ:—

ఆయన పోయెనం చక్కటా! దుఃఖమందిన నేను
మాయురే నలువురు నవ్వమాదిరి మలినకృత్యంబు
చేయించి చంపి యేడ్చుటను జేయుదు సిగ్గుమాలినటు
నా యీ మహాఘంబు తీరునా వేయి నాటి లింగములు 403

వ॥ ఈదృశప్రవర్తమాన దుఃఖవారిరాశి నిర్మథనజనితాప్సరశకదంబవియ
ద్వీథీ సంగీతకం బట్లు నిట్లు వినిపించె 404

మధ్యాక్కఅలు :—

రఘుకులక్ష్మీరాబ్ధిచంద్ర। రాజీవరమణీయనేత్ర !
అఘునాశిగుణరాశి ! మోహనాంభోదరానీలగాత్ర !
మఘవమాణిక్యాంశు మంజుమంజుల మధురతోరణ స
రఘుమాలికారమమాణ రమ్యాంశురథ్యాశరీర ! 405

ఆనందవీథివిహార ! అఖిలలోకైకథానుష్క !
పూని వారించెను దార పోవద్దు పోరికం చతివ !
నేనె వచ్చితినయ్య ! మోహనీహారనీరేజబంధు !
నా నిండుకోరిక పండినది నీదు నారాచముక్తి. 406

= ఖండాంతము =

గీ॥ ఇద్ది గజపుష్పి ఖండ మాహేయహేయ
భానవిదళన భూషణాభ్యాసభాస !
చంద్రమౌళి ధరాపాలచంద్ర ధవళ
కీర్తికాంతాతనూచ్ఛవి క్రీతవపుష !

చ॥ లివలివలాడు నుప్పుకడలింబలె నైన హృషీకరాశిలో
దవశిఖ రేగగాఁ దఱచెరఁగ దయతో నిది నీవు కుత్తుకఁ
సవరనఁ దాల్చుకున్న యెడ స్వామి ! తనూదహనంబుగల్గు నా
కవుదువా కావా తేల్చఁగదవయ్య ! సుధాహరణాభిలాషికిఁ.

జలదము :—

ఆశ్రితపారిజాతకుసుమాకృతి ! యో
గాశ్రవచిత్తవీధినిహితాదృతి ! లో
కాశ్రుతపాపకార్యచరణాధమ వృ
త్తిశ్రమణాసితాధ్వనికృతిప్రతిఘా !

# నియమపాలనఖండము.

క॥ శ్రీగంధవాహమూర్తీ
సొగసుకస్తూరిపరిమళావధికగళా !
పూగీవల్లీముగ్ధత
నాగిరితనయానుషక్త నూతనవక్షా !

శ్లో॥ నాఽహం చతుర్దశసమాః పరమపవిత్రస్థః
గచ్ఛామ్యహో కమపి పట్టణ మగ్ర్యభోగం
అంబావరప్రకటభావ ముపేత్య తస్యాః
వాక్యే ప్రణిక్షితమనాః పరిహీణభోగః

క॥ అనఁగా స్వామి హనూమం
తునితో నతఁ డేమి యనియెనో పూర్తిగఁ దో
చని కపిరాణ్మంత్రులు రా
ముని చుట్టుం జేరి కేళ్లు మొగిడిచి భక్తిన్ 2

మ॥ కృతదోషుండని యన్నగారి వధ సుగ్రీవుండు రాజానభి
ష్టుతనైక్లబ్యము పొందియుండెను మహాశోకంబునన్ గ్లిన్నమహా
మతి మేమెయ్యది చెప్పనన్ వినుచునే మన్నింపఁ డీరాజ్యప
ద్ధతి, చాపంబున నప్పుడిప్పుడును హస్తంబందు నీ వశ్యమై 3

శా॥ క్లిష్టంబై వ్యవహార మున్నయది సుగ్రీవుండు రాజైన వి
స్పష్టంబై చని చిక్కులన్నియు విడన్ సందేహభాజంబుగాఁ
గష్టంబైనది రాజ్యపాలనవిధాకార్యంబు తారేయుఁడున్
దుష్టుండౌ గద తండ్రికంటెను ధరాధూర్వాహకత్వంబునన్ 4

శా॥ తేజోమూర్తియు వాలి యట్లు దివిషద్దీధిత్యనూనుండుగా
భ్రాజిష్ణున్ నిను సన్నుతింప విని యుబ్బింబంది తారేయుఁడు

ర్వ్యజానిత్వ మదేమియైన సరి సుగ్రీవుండె పొందందగుం
గా జీవాతువు పట్టుపట్టుక కడంకం గూర్చుచుండెం బ్రభూ ! 5

గీ॥ భద్ర మూనిన క్షీరసముద్రములు న
భద్ర మెంచినఁ బ్రళయసముద్రములును
నీవు నీ తమ్ముఁడును రమణీయభావ
మూని యీ ధర యెవరిపాలో మహాత్మ 6

వ॥ తాను పురప్రవేశంబు చేసిన సుగ్రీవుం డనుసరించి వచ్చునని శ్రీరామచంద్రుని వానరమంత్రు లడిగించి తామిట్లు చెప్పిన శ్రీరామచంద్రుఁడు సుగ్రీవునితో నిట్లనియె 7

చ॥ సఖా! కపిలోకరాజ్యబలశాసన! యంగదుఁడేమొ చిన్నవాఁ
డు ఖిలముకాకయుండఁగఁ గడుంగడు వానరరాజ్యలక్ష్మి నీ
తి ఖనివి నీవు ధాత్రియువతీనవతీవ్రవియోగహారివై
సుఖపడఁజేయుమయ్య ! రిపుసూదన ! సర్వజగత్ప్రియంబుగన్ 8

శా॥ బంధుత్వంబును శత్రుభావమును విస్పష్టంబుగానైన యీ
సంధిన్ దేహగతిప్రమాధనముగా శత్రుత్వ మచ్చెక్కునై
బంధుత్వం బిపుడెక్కునై తతమనోబాధాసిధానంబుగా
సంధుక్షంబగు దేహయాత్రఁ గలదా శాంతస్వభావం బహో 9

క॥ సజ్యమతివి కావయ్యా
రాజ్యంబును గొంచు యౌవరాజ్యమ్ము గుణ
ప్రాజ్యున కిమ్మంగదునకుఁ
దా జ్యాయాంసునకు నివ్వి తప్పవు ధరణిన్ 10

ఉ॥ ఆపదలున్ సుఖంబులును నైనెడ లొంగను బొంగఁ జిత్తవి
క్షేపము నింతపొందిన సిషేవణరమ్యుఁడుగాడు జీవుఁడీ
యేపున జ్ఞానమార్గమున నెవ్వని కెవ్వఁడు గాడు లోకయా
త్రాపరమంపు ధర్మపుఁ బథంబున నందటి కందఱో సఖా ! 11

ఉ॥ వాఁడు వివేకశాలి గుణవంతుఁడు సర్వవిదాంవరుండు నె
వ్వాఁడయి తామరాకుపయి వారికణంబువిధానఁ గూడియుం
గూడకయుండు నీరములకుం బుడిసిళ్లను ద్రావ దొన్నెయై
యోడికలైన వారి యిటనుండనె లేదను కేవలత్వమై 12

గీ॥ అనుపసంహార్య మీ సృష్టి యాత్మభావ
వివృతిసంవృతిరూప సంవేశభూమి
వివృతిలో నిండియున్న సంవృతి నెఱింగి
నడచువాఁ డాత్మయందునఁ జెడనివాఁడు 13

చ॥ వివృతిపథంబునందుఁ గలిపించిన సంవృతిభావమన్నఁ దా
నెవఁడును నాత్మధర్మపథ మింతయుఁ దప్పక సంచరించుటే
యవును విషాదదుఃఖవికలాత్ముఁడు ధర్మము సేయలేడు ధ
ర్మవిరహితుం డిహమ్మునఁ బరమ్మున రెంటికిఁ జెడ్డ రేవడై 14

క॥ నా పొనరించినదానికి
నీ వొందిన యఘము కల్గునే మరి పుణ్యం
బో పాపంబో కర్తది
చాపము సాధనము చాపసదృశుఁడ వీవున్ 15

వ॥ అంత సంతోషసూచి సముత్తాలవాలగోలాంగూల మహామాత్రకేలీ
లఘులంఘనగమనంబుగా సుగ్రీవుండు కిష్కింధాపురప్రవేశంబు చేసిన

క॥ భేరీపటహమృదంగ
స్ఫారనినాదముల దిశలు బధిరితములుగాఁ
దోరణమాలారమ్య
ద్వారము కిష్కింధ ప్రముదితంబయి యొప్పెన్ 17

క॥ ఒక కొంతవేళకున్ మును
ముకుళిత జలజాతసవిధమున సవిషాదం
బొక తేటి ప్రొద్దుపొడిచిన
మొకరి వనంబెల్ల గీతిముగ్ధము చేసెన్ 18

సీ॥ ఒక కృష్ణపక్షాంత మొక శుక్లపక్షాది
యును గూడియున్నట్టు లొప్పెఁ బురము
ఒక శిశిరర్త్వంత మొకవసంతర్త్వాది
తనరెఁ గిష్కింధ గూడిన విధాన
గుడికట్టు చంద్రుకై నడి నొక్కయెలనాగ
మొగమున దుఃఖాన ముదము తోఁచె
వెలిమబ్బులోని జాబిల్లిలో మచ్చగా
ముదములో దుఃఖమ్ము పొదలె నొకట
నంతలోఁ దీసి మరియు నల్లంతలోన
పోసికొను కొండసెలయేటిపోల్కిఁ గాఁగ
నంతలోనఁ గిష్కింధ శోకాంధకార
మంతలోన నానందచంద్రాతపంబు. 19

ఉ॥ మాసినగుడ్డ యద్దకముమాదిరి నొప్పెఁ బురీప్రమోద మి
ష్వాసము వంగి మెల్ల ఋజుభావము పొందినయట్లుగా నభో
మాసము పోయి యాశ్వయుజమాసము వచ్చినయట్లు సంగతా
శ్వాసము తానుతాన కని సాళగమేళనయుక్తరాగమై 20

క॥ ఊరూరంతయు ముక్తా
తోరణములు గ్రుమ్ము లొకటిశో నొకడు విచు
ద్ధారఃఖల విద్యుదుద్య
త్స్ఫురమణుల కలిమి గూర్చె స్థల నాడెఁ 21

మ॥ ధరణీశుం గని సంతతానతకృతోత్థానుల్ కపీశాను లా
భరణప్రాంచిత కంఠబాహులతికా ప్రావారహేమావృతుల్
పరమోదాపు వసంతు మందపవనప్రోత్కృష్టముక్తాగ ది
వ్యరమాపుష్పితశాఖలంబలె సపర్యాఘుర్యమర్యాదులై 22

గీ॥ అంత సుగ్రీవుఁడును నేగె నన్న యంతి
పురము దౌవారికులు బరాబరులు చేయ

నవనిపత్యానుభవయోగ్యమైన వస్తు
వితతి స్పృశియించె సాధనావీథి గాఁగ 23

ఉ॥ విస్తృతనేత్రయుగ్మమున విస్ఫుటమైన ముదంబుగాఁ దనూ
నిస్తులవల్లియైన రుమ నిర్మలభూషణసూనరమ్యయై
ప్రస్తుతశీల తార తన బాహువునన్ గైకొని భర్తృసన్నిధిన్
స్వస్తిపురస్సరంబుగను బంపఁగఁ జేసెఁ బ్రణామమంతటన్ 24

గీ॥ తిరిగివచ్చిన నవభూపతిం గపీంద్రు
లెల్లరును బరివేష్టించి యొల్లముగను
దనుకు భక్తిని నతనిఁ గదల్చికొని న
డచిరి పట్టాభిషేకమండపమునకును 25

విజయభద్రము :—

జయ ఋక్షరజస్సుత ! జయ వానరాభినుత !
కపిలోకపరమేష్ఠి ! కదనభీకరముష్టి !
జయ జితానుగపాళి ! జయ ప్రహితలోకాళి !
వానరమహారాజ వల్లభేంద్ర ! జయ జయ !
జయ రఘుక్షీరాబ్ధిచంద్రిమఃప్రియసఖా !
హనుమన్మహామంత్రిహార్దిక్యసుపరిఖా !
జయ జయ జయ యటంచుఁ జదివె మాగధకులము
మరి వెండిబెత్తాల మణికాంతులు వెలుంగ 26

అజితప్రతాపము :—

కపిలోకమంత్రులు సుఖం బెసఁగన్
విపులపీఠమునఁ బెట్టి యాతనిన్
కపురారతుల్ చెలఁగఁ గంజముఖీ
సుపరిదీప్తకర శుభ్రికాంతులన్ 27

వ॥ పసిండి వెల్లగొడుగు పట్టిరి బంగరుపిడులుకల తెల్లని చమరితోఁకల
వ్యజనములు వీచిరి. సర్వరత్నములను సర్వబీజౌషధులును చెట్లపా

లును పూలును, తెలిజరీపుట్టంబులును వెలిగందమును తావికల మెట్ట తామరపూలును వన్యబహుగంధంబులును అష్టాపదంబును మధు గంధసర్పిస్సులును పెనుగు పులితోలు పందిచర్మపు పాదుకలును సుమ నశ్శిలయును సంతరించిరి. పదునాఱ్వురు వయసుకత్తెలు వచ్చిరి. అంత యథావిధిగ బ్రాహ్మణులను రత్నవస్త్రభోజనమ్ముల సంతోష పరచి కుశపరిస్తీర్ణమైన యుజ్జ్వలవహ్నియందు మంత్రపూతమైన హవిస్సు వేల్చి 28

ఆ॥ గజుఁడు గవయశరభగంధమాదనగవా
క్షులును ద్వివిదమైందు లలఘుమూర్తి
హనుమ జాంబవంతుఁడును నళుండును నీల
తారు లంబుకలశధార లొప్ప 29

మంగళమహాశ్రీ:—

హేమమయసౌధమున నెత్తయిన కొమ్మపయి
హింగుళమృదుచ్ఛవుల చోటఁ
హేమవిమలాస్తరణ హీరమణిమాల్యమయ
హిజ్జలమనోజ్ఞమగు పీఠిఁ
శ్రీమహిత సర్వనదసింధుజలకుంభముల
సీరపధరిత్రి నభిషేక
వ్యామిళితశేఖరుని వాలి యనుజాతు క్షితి
పాలకునిగాఁగ నొనరింపఁ 30

తోఁక లెగిరించుచును దూఁకుచును వానరులు
తోరముగ దంతముల హీహీ
పాకముగ నవ్వుచును బాహువుల నొకొ్కకరిఁ
బట్టుకొనుచుఁ ముదము పట్టఁ

రాక మెలఁగోలు జయరావములు సల్పుచును
రాజ్యరమ నేడును సనాథ
త్వాకృతిగఁ బొల్చెనని యార్భటియు నారజము
నారడము మీరఁ జెలరేఁగ౯ 31

సీ॥ ఇట్లు పట్టాభిషిక్తుఁడై హేళిసూతి
కేళిదూతివిధాపరిష్కృతసుహాస
మంజులచ్ఛవిఁ గాంచె రుమ౯ నమన్మ
నోజ్ఞలజ్జాముఖాబ్జ సంతోషమంది 32

వ॥ మంత్రులవంకఁ జూచి యంగదునివంకఁ జూచి శ్రీరామచంద్రుని
వాక్యసరణి మనసులో నూహించి యిట్లనియె. 33

శా॥ ఈ నా రాజుతనంబు మీ దయిన సౌహిత్యంబుచేఁ గల్గె నా
యేనోభావము విస్మరించితిరి మీ క్ష్మారాళధారాళధీ
స్థానంబుల్ పతి మీకుఁ గావలయు నీ తారేయుఁ డట్లైనన్
నే నైతి౯ యువరాజు కావలయుగా నేడంగదుం డింతయే 34

మ॥ మును పెంతున్నదొ అంత లేద యిపుడు౯ భూమీశభావంబునం
దున వాంఛాబల మొక్క హేతువున నిందు౯ రాజు నైతింజుడీ
వనజాతాక్షుఁడు రామచంద్రున కహో వాదోడు చేదోడుగా
జనకక్ష్మాసుత నెందుఁగాని వెదకించ౯ స్వామిఁ బొందించఁగా 35

క॥ అది కారణంబు నే నం
గదునకుఁ గా దన్న ధాత్రిఁ గైకొనఁగా నం
గదుఁ డందుచేత యువరా
ట్పద మందిన నాయెడంద బరువు తొలంగు౯ 34

క॥ ఈ యుత్సవంబులోనె నె
యీయుత్సవముం ఘటింపుడన మంత్రులు మో
దాయత్తచిత్తవీధులు
మాయురె యని యుబ్బపడిరి మరి యతనిదెస౯ 37

క॥ అంతట సుగ్రీవుండును
సంతుష్టమనస్కుఁ డగ్రజాతసుతునకున్
శాంతమహాశౌర్యధురా
వంతునకున్ యౌవరాజ్యపట్టము కట్టెన్ 38

సీ॥ ఇంకఁ బాగడినార యెల్లకిష్కింధయు
మంచివాఁడనంగ మంచివాఁడు
నిక్కమముగ ధాత్రి నొక్కసుగ్రీవుఁడే
యంచుఁ దోటఁదోటఁ బంచఁబంచ 39

వ॥ తత్సంబంధపర్వోత్సవములు పూర్తియైన నొక్క వినీతప్రాతస్సంధ్యా సమయమున సుగ్రీవుం డపనీతరాజలాంఛనుండు సాంజనేయుండు శ్రీరామచంద్రదర్శనంబునకు రాఁగా నందఱు నుపవిష్టులై స్వామి యిట్లనియె. 40

ఉ॥ ఏటికిఁ రాజలాంఛనము లీగతి నూరక తీసివేయఁగాఁ
గోటితశోభఁ బెండ్లికొడుకుంబలెఁ గన్పడుచుంటి విప్పుడున్
నేటికి సర్వభోగయుతు నిన్నును జూచి ముదంబు పొందితిన్
లోటొకయింత లేకయ తలోదరి నీవు సుఖంబుపొందుఁడీ 41

క॥ నీరాజ్యలక్ష్మి యాశశి
తారార్కముగాఁగ నుండుతన్ ప్రియసఖుఁడా!
దారపునర్లాభ నవర
మారూఢున్ నిన్ గనినను నర్మెలఁచెదన్ 42

ఆ॥ నీకు భోగకాలమో కపివరనేశ
సతిని వెదుకఁగాని జైత్రయాత్ర
పోవఁగాని కాలము నయోగ్య మియ్యది
వచ్చుచున్నయదియు వర్షఋతువు 43

మ॥ నదులుం దీవ్రతరంగసంహతుల నైనం దాఁటఁగానీవు, భూ
మి దరస్ఫుక్షుటుపంకకచ్చరము కంపించుం జమూరాజి శా

రదవేళంబల సౌఖ్యయానసముదారత్వంబు దీపించఁబో
దిదిగో నీకును క్రొత్త ధారుణియు శ్రీహేలావరారోహయున్ 44

ఉ॥ కంపితచిత్తవృత్తియును గానిది యెవ్వనికైన నాఁడు దుః
ఖంపడ నీకుఁ జెప్పితినిగాదె సమస్తవిధాల నేఁడు సౌ
ఖ్యంపడువేళ నద్దియె మదాశిషమున్ హితమున్ దనంత నై
లింపము భోగ మబ్బినను లేదుసుమీ పరితోష మింతయున్ 45

క॥ ఇది భేదంబగు మైత్రీ
పదమందున నాకును బెఱవాని కనిష్టం
బౌదవి చెడును పెఱవారికిఁ
జెదరిన ధర్మమయి నాకుఁ జెడు సఖ్యంబున్ 46

మ॥ అన సుగ్రీవుఁడు మందహాసనిభృతంబౌ మోమునన్ రామచం
ద్రునిఁ గన్గొంచును నిన్ను నే నెఱుఁగనా దోషజ్ఞచూడామణీ
నిను లంఘించెడు నంతదాఁకఁ గలదా నేర్పి భవద్దాసభా
వన కైకొన్నటువంటి నాకు సఖితాపర్యంతదత్తేష్టికిన్ 47

మ॥ ఒగి సింహాసనమందు నేనపుడు కూర్చున్నంతసేపున్ మరిన్
మొగముంగట్టినయట్లు నీ విమలహా మో మచ్చునం గ్రుద్దిన
ట్లుగ భాసించెను నాకు వట్టి కఱకుట్లుం దిందు రే కమ్మ వేఁ
చిన యుత్తప్తశశాలిమిషాన్నము పరిస్తీర్ణంబుగాఁ బొల్చియున్ 48

గీ॥ ఆకసంబునయందు వర్షాంబుదములు
పలపలై యంతనంతనఁ దొలఁగిపోవు
జనకజాన్వేషణాపరిస్పందితంబు
క్షితితలంబున వానరసేన నడచు 49

గీ॥ మీరు కిష్కింధలోనికి రారు నాల్గు
నెలలు ఋశ్యమూకమున నా నెలవునందు
నుందురా యన్నఁ బతి తలయూచి కాదు
నా నెలవు సేతుఁ బ్రస్రవణమున నంచు 50

వ॥ తోడ వచ్చు నందఱేఁ బంపించి యన్నదమ్ము లిద్దఱౌ పోయి సమీప
పరిసరివణగిరికందరాభాగమ్ము లన్నియుఁ బరిశీలించి చూచి తుద
కొక్క రమ్యగుహాదేశంబు చూచి సౌమిత్రితో నిట్లనియె. 51

చ॥ నతపరమాణురూపమృదునాగరకల్ పరమస్వభావదే
వతలు గుహావినిర్మితిని వాస్తువుమాచి మనోహరత్వము
న్నతముగ వాయువీచిచలనం బనుకూలముగాఁగ వెల్గు నా
గతి కలుగంగఁ జేసిరనుకైవడి నున్నది వాసయోగ్యమై 52

ఉ॥ ఆయతసర్వదోషపరిహారముగాఁగను చూడు పశ్చిమా
గ్నేయములందు నున్నతము నేలయు ముంగిట నీ విశాలమా
రాయి వితర్దికంబలెను బ్రాంతధరిత్రి మహామహీరుహ
చ్ఛాయయు నన్నివీళ్లులను సంతనపెట్టినయట్లు పొల్చెడున్ 53

ఉ॥ కష్టము లేక యక్కఱయుఁ గల్గినయప్పుడె తెచ్చికోను నీ
యిష్టమువచ్చినన్ని కుశ లిచ్చటనున్నవి కోసి తెచ్చుచున్
బుష్టిగ నల్లి శయ్యలుగఁ బూన్పఁగ వచ్చును పైఁ బయఃపరి
క్లిష్టత లేద పార్శ్వవిమలీకృతవాహినిఁ జూడు లక్ష్మణా! 54

మ॥ చెలువొప్పంగను బర్వతోత్తరదిశాశృంగమ్ము నీలాంబుదో
జ్జ్వలచూడాకమనీయమై పొలుచు వర్షాలక్ష్మి యీ కొండలో
పలఁ గూర్చుండినయట్లుగా నుభయపార్శ్వస్వల్పలీలాఝరం
బులు బాహుల్ బలెనై గుహానివసనంబుం గౌగిటం బట్టెనా 55

మ॥ విశదంబై జలజాతబంధుఁ బ్రతిబింబింపంగనై దక్షిణా
దిశఁ గన్పించెడు శృంగ మిద్ది సితదీధిత్యుజ్జ్వలానూన స
ర్వశ ఆదర్శముగాఁ గనంబడు వనీబాలావియుల్లక్ష్ము ల
గ్థశ ఉన్మీలితమైన స్వీయములు సౌందర్యంబులం జూచికో 56

క॥ గిరిలక్ష్మి నృత్యవేళా
పరిచంక్రమణంబునందుఁ బ్రావారము సుం

దరజఘనంబునయందున
దిరిగెడుగతి చూఁడు మీ నదీవలయంబుల్. 57

మ॥ గుహకుం దూరుపుదిక్కునం బరిననహంత్యాలంకప్రక్రియన్
తుహినాంబుప్రవణంబుగా విమలపాథోవక్రలీలాకృతిన్
విహరించున్ లహరీతరంగనివహావిష్కారగోత్రాగ్రని
ష్కుహమై యంగిటఁ బారు దేవతటినీశుభ్రాంబుసందోహమై 58

క॥ అతిశీతల మత్యుష్ణము
వితతము మనదైన భూమి వింధ్యోత్తర మీ
క్షితి సమసుఖోష్ణశీతము
నతపవనము వింధ్యదక్షిణాదేశమునన్ 59

చ॥ మన వనవాసపూ తుదిసమల్ పది వింధ్యనగేంద్రదక్షిణా
వనిఁ జరియించి యీ మృదులవాయుసుఖంబు నెఱింగి యెంతో యు
న్నను నివి క్రొత్తక్రొత్త పవనంబులుగాఁ గనిపించుఁ గొండఁ గొం
డను విమలౌషధీగుణగణ ప్రవిభక్తతరంగసంతతిన్. 60

శా॥ ఈ యుత్తాలములైన వృక్షములు నా యీ సైకతశ్రేణు లా
యీ యుగ్రోపలముల్ కపిప్రతతికై యేర్పాటుగాఁ జేసెనో
యీ యజ్ఞాతభవుండు నూగుటకునై యందందుఁ దారాడఁగాఁ
బాయంగా దొరలింపఁ జంచలతమప్రారంభసంరంభముల్ 61

క॥ భగవంతుఁడు చూపించెను
బాగసగు దేశంబు నపుడు చూడనువలెఁ గ్రొ
మ్మొగిళులగమి కొండంచుల
నెగచెదు రెన్నెలలనాఁటి సిభృతశ్రీశోభన్ 62

ఉ॥ నా ప్రియు మాచరించుటకు నాయన! లక్ష్మణ! వానరేశుఁ డెం
తో ప్రియ మొప్పఁ బంపిన వినూతనకుంభము లంటుకోక యెం
తో ప్రియ మొప్ప నమ్ముల పొదుల్ జలపాత్రలుగాఁగ వాడె దీ
దీపితభక్తి నీ యెడఁదఁ దెచ్చిన దెచ్చుట యచ్చెపామ్ముగా! 63

క॥ నేఁడీ కాఁచిన యెండకుఁ
బోఁడిమి గుహ కనుక బ్రదికిపోయితి మంతః
క్రీడచ్ఛిశిరాంబువులుగఁ
గూడిన చిఱునీటికుండఁ గూర్చున్నదై 64

మ॥ పవళుల్ ఘెల్లన నెండకాఁచి విదళింపం బ్రొద్దువాటారగా
నినతాళించిన గాలి క్రొత్తరగతై హేలాసరోజాతసం
భవముల్ తావులు గుప్పుగా విసరె. బ్రేమం బెల్లఁ బ్రొద్దుండగా
నె వెసన్ దీపము చక్కఁబెట్టుకొను మన్నీతిం బ్రవర్తించుచున్ 65

చ॥ కనుగొను మీ తపప్రతతి కాననమందున వెఱ్ఱిగాఁగఁ బూ
చినయది కామినీవిరహసింహము నిమగ్నుఁడనైనఁ బైకి వ
చ్చిన బుడగల్ బలెన్ మునుఁగఁ జేయుని జూచి గ్రహింతు రింతలో
తున వనరాజ నన్నడఁగఁద్రొక్కుడు నుక్కిరిబిక్కిరై చనన్. 66

చ॥ చివురులతోడ నెఱ్ఱవడి చిందిన యగ్నికణంబులై పువుల్
నవములు జ్వాలలై యుమియునా వన మింకను జొల్లు నిప్పులై
యివమయి పొల్చె రాత్రిగుహ యెప్పుడు పైమెఱుఁగుల్ కలట్టివా
రవమును దుష్టచిత్తు లొకఁ డాడి మఱొక్కఁడు చేయుచుం జనుల్ 67

మ॥ మన మిచ్చోటికి వచ్చినప్పుడు సమున్మత్తాకృతుల్ వానరుల్
కళఁగా పందలువేలు వృక్షతతులం గప్పింపవయ్యోంగదా
కనుమీ యొక్కఁడు లేదు వాలివధయుంగా భీతముల్ లేచిపో
యెను దా నర్థము నిల్లు చేసికొనుసుమ్మీ లోక నేకార్యమున్ 68

మ॥ ఇదెగో జానకి యేమిచేసెదనయా యీ గాలి కాదేవి నా
యెదలో నిండిన వెచ్చనై విసరు పైత్ర్యేందున్ దశాస్యున్ మదిన్
మదిలో నెంచినయంతఁ జ్వరదడు నా మాత్రంబు నీ గాలిఁ దా
నదియేదో భయపెట్టుచుండుఁజుమి దౌరాత్మ్యం బనూహ్యంబుగన్

చ॥ అనుదినముం బ్రభాతసమయంబుల వానరనృత్యమర్దళ
స్వనము వినంబడుం బ్రభువు వచ్చిన క్రొత్తయు నింకఁబోదు తా
జనినను మాసముం బయిగ సంతసమందుట కే యతించు నెం
దనుకను జీవుఁ డచ్చపుముదంబునయందుఁ దనంత భ్రష్టుఁడై 70

శా॥ క్షోణీకన్యక నాకు నిక్కము లభించుం దాను రక్షఃపతి
ప్రాణంబుల్ హరియింతు నే నని తలంపన్ దక్షిణాంసంబు ని
ద్రాణంబైనది మేలుకొన్నటుల స్పందంబేచు నిక్కంబుగా
క్షోణీకన్యకఁ జంపలేదుకద యా క్షుద్రుం డనాక్రాంతిమై 71

గీ॥ అన్న ! నిన్ను నొక్కఁ డడిగెదను బ్రదికి
యున్నవారు దివికిఁజన్నవారు
స్వప్నమందు నొక్కసారి తోతురె ! నాకు
జానకియును దండ్రి కానఁబడిరి 72

మ॥ నిభృతాక్షంబుల సర్వకాననమృగానీకంబు వీక్షించు సై
రిభముల్ వ్యాఘ్రము రోహితంబు వృకముల్ ఋక్షంబు సర్వంబు వీ
తభయాకారముగాఁగ నయ్యది మృగేంద్రంబట్టులే వానర
ప్రభులం దెవ్వఁడు చెప్పు పోల్చెడు మహాజాధిరాజాకృతిన్ 73

శా॥ మేలై సీతయు నీవు వచ్చితిరి నామీఁదన్ బ్రియంబొప్పంగన్
మీలో సీత హరింపఁగాఁబడియెనుమ్మా ! అద్ది నీవైనచో
నేలా నా బ్రదు కేమికావలయు నీ యీ సేయు ధారాసప
ర్యాలాభంబున నేమి కూర్పఁగలదన్నా ! సీతయున్ భీతయై 74

గీ॥ గాలి కీరీతి నూరక కదలిపోదు
వాఁడు కైలాస మెత్తినవాఁడు వాని
నోర్వఁగలనన నవ్విపోదో జగంబు
ముగ్ధుడవు నీవగుట సరిపోయెఁగాక 75

మ॥ మరియుం జూడుము మంపువెన్నెలల గ్రీష్మంబౌట నీ రాళ్లు ని
ర్భరతీక్ష్ణాతపతప్తముల్ పవలు రే ల్తద్వహ్నులం జమ్మెడున్

ధరణీ కన్యకతో వియోగభరమై తాపంబు కల్పింపఁబో
వరయన్ గొండను డిగ్గిచూడు శిశిరాహ్లాదంబు కల్పించునో 76

ఉ॥ కార్ముకసాధ్యమైన పని క్ష్మాసుత నాకును నప్పుడిప్పుడున్
మర్మ మెఱుంగజాలని యమాయికుఁడన్ దొలినాటి శైవహా
కార్ముకమందె యీకెటుకు గట్టు నెఱుంగఁగ లేకపోయితిన్
శర్మము లేదటం చిపుడు జాలినహించిన లాభ మేమిఁకన్ 77

క॥ నావలనఁ జచ్చెఁ దాటక
నావలననె మంధరా మన స్సురిసిపడెన్
రావణుభగిని యమైనది
స్త్రీవధదోషంబు నన్నుఁ జెందినదయ్యా ! 78

చ॥ తనసతి విప్రయోగమునఁ దాత గతించె గతించెఁ దండ్రియున్
దనయవియోగతాపమునఁ దాదృశనిర్భరగాఢశీలుడై
చను కులమందు నాదయిన జన్మము కష్టము నేనునేనుగా
మనియెద నాకుఁ దండ్రియును మానిని యీగతి లేవు బంధముల్ 79

వ॥ ఇట్లు శ్రీరామచంద్రుండును 80

చ॥ చిలగడదుంప లియ్యవియుఁ జెల్వుగఁ గుమ్మునఁబెట్టి తెచ్చితిన్
సలలిత హేమవల్లులివి సంగతముల్ మధురేక్షుఖండముల్
పొలుపుగఁ జెక్కుతీసిసని ముక్కలుచేసితిఁ దామరాకు దొ
న్నెల జలముల్ గ్రహించితిని నిర్మలమంజులవాహినీలఘుల్ 81

ఉ॥ నీవు వశిష్ఠశిష్యుఁడవు నీ వఖిలజ్ఞుఁడ వాత్మవేత్తవున్
నీవు చరాచరాఖిలము నిల్పితి కార్ముకల స్తకంబునన్
నీవును మూర్తిమంతుఁడవు నిర్మలవైదికధర్మరాజికిన్
నీవు మదాత్మచంద్రుఁడవు నేటికి భోజన మారగింపవే 82

మ॥ నదులుం గాలున లడ్డుకొన్నటుల నన్నా నీవు సుగ్రీవు పై
మదిలోఁ బ్రేమముకల్గినన్ గడువుగా మన్నించితీ మాసముల్

ప్రదరానేకవిదారితాఖిల దిశాపర్యంతరోదోఽంతరా
స్పదుఁడై కాలము సాగనిచ్చెదవు భాస్వల్లోకధర్మంబుగన్ 83

మ॥ ఇది రే విచ్చటనే దిగన్వలయు స్వామీ ! నా బుజంబందు నా
ప్పిదమా బాహువు సాచవే రఘుకులాబ్ధిస్ఫారచంద్రోదయా
కదియున్ భీతములై ద్రుతోచ్చలితలంఘుస్ఫాలనోడ్డీన స
మ్మద పరిస్ఫీతపయోవిహంగమ గరుద్భ్రాజిష్ణువుల్ నీరముల్ 84

ఉ॥ అగ్రజుతో విరోధమయినప్పుడు నంతునుపంతులేని కో
ప్రగ్రహణంబుగా మనినవాఁడును వాలివధాంతమందునన్
శిగ్రువువోలె మెత్తపడి చెందినదుఃఖ మదింత కాదయా
యగ్రజుపుత్రుఁ డన్నయెడఁ బ్రాణములైనను వీడునట్లుగా 85

శా॥ తాదృక్ఛలుడు నేడు చెందిన సముద్యద్రాజభావంబునన్
మీఁదౌఁ గ్రిందగు నీదుకార్యమును విస్మృత్యధ్వ మందించినన్
గాదానంటకు వీలులే దటులనే కానిమ్ము నష్టమ్మునన్
లే దున్నాఁడొక శూరసాధువు భుజాలీలామహేశానుఁడై 86

సీ॥ నడచుచో నీవు నీ నడకయందయము జాన
కీదేవివోలె నగ్గించిచూచు
పలుకుచో నీవు నీ పలుకు సవ్వడిలోని
పొలుపున భరతునివోలెఁ జొక్కు
కనినచో నీవు నీ కనులకాంతులయందు
మునిసమూహమువోలె మునుకలాడు
నవ్వుచో నీవు నీ నవ్వువెల్గులయందు
దాత సుమంత్రునిరీతి పెనుగు

అతఁడు పుంరూప బ్రహ్మచర్యంబు మూర్తి
మంతమగు భక్తి పాండిత్యమహితమూర్తి
అతడు జానకి వెద్దకుఁ దా నతఁడుకాక
వెదుకఁగలవాఁడు వేఱొండు పృథ్వి లేదు 87

మ॥ అతఁడున్ నేనును గల్గ నీకును నసాధ్యంబంచు లేదిద్ధరన్
దితిజాతుల్ పదికోట్లమందిని సమర్దింపగ నీవాదువున్
క్షితిజాతంగనిరా నతండు గొనిరాన్ శ్రీమూర్తి వీ వున్నతో
న్నతు లింకేమిని నిద్రపోఁగదవె యన్నా ! రాత్రియైపోయెడున్ 88

ఉ॥ లాలితమూర్తులై యతిబలాబలలుండిరి భోజనంబు ని
దాలిలవమున్ దొలంగినను దానికినేమి సుషుప్తిఁ గాంచినన్
భూలలనాసుతన్ మఱచిపోదువు కొంచెముసేపు నిద్రలోఁ
గ్రాలిన నింద్రియోపరతి కాదది నీకుఁ బ్రమాప్రమాణమై 89

ఉ॥ భాగ్య పుమాకృతుల్ కరుణవాదులు కర్మఠు లప్రతిక్రియా
యోగ్యములైన యాపదల నొందిరి తాతయుఁ దండ్రియున్ మనో
యుగ్యపు పగ్గముల్ విడిచి యూరక జాలిమెయిన్ బ్రతిక్రియా
యోగ్యము నీకు వచ్చినది యొప్పగ నీవును నాత్మవాదివిన్ 90

గీ॥ అంత యుపకార మందినయట్టివాఁడు
అంత సంతోష మందినయట్టివాఁడు
తాఁ గృతఘ్నుఁడు కాడు మార్తాండసూతి
యాదుకొనుఁ గష్టమున మనకైనవాఁడు 91

మ॥ కపిసైన్యంబు చనున్ సముద్రవిలురత్కల్లోలమాలాకృతిన్
విపులాశా సకలస్థలంబులను నన్వేషించు సీరధ్వజా
ధిపకన్యామణిఁ జూచివత్తురు మరిన్ దృష్టాసులైవట్టి య
సిపులం జంపెదు సీతఁ బొందెదు ధరారాజ్యమ్ము కై సేతువున్ 92

చ॥ దశరథరాజువోలె నుదార సహస్రములైన వర్షముల్
పరిశమితదుఃఖ ధాత్రి పరిపాలనసేసెదు నచ్ఛధర్మమున్
విశదముగాఁగ నింపెదవు విశ్వజగద్రమణీయరూప స
ర్వశుభమనోజ్ఞమూర్తివి ధరాసుత తప్పక వచ్చు నీగతిన్ 93

సీ॥ మన మనుష్యయత్నంబున మహితనూజ
కనఁబడదయేని యెల్లలోకంబులకును

గుమ్మువెట్టెడునట్టి నీ కోపవహ్నిఁ
దాళుకొనఁగలరయ్య రుద్రాదిసురలు ? 94

శా॥ వల్లీసక్తదళాకృతిన్ విధుతమై పాల్పంచుకోఁచుండె నీ
ముల్లోకంబును నీదు దుఃఖమున నా ముమ్మూర్తులున్ శారదా
వల్లీ సాగరకన్యకా గిరిసుతాంబా విప్రయోగవ్యథా
కల్లోలాకృతులై జరింతురేఁక దుఃఖంబేల నీకిచ్చటన్. 95

వ॥ ఇట్లుగా లక్ష్మణుండును జరించుచుండ గ్రీష్మంబు ముదిరి 96

గీ॥ అతితరోష్ణతాజనిత నిర్యాసకముగ
ప్రస్రవణశైలగత వృక్షపంక్తి వ్రస్సె
జానకీవిప్రయోగ నిశ్వాసకముగ
గండశిలలందు రామచంద్రుండు డస్సె 97

గీ॥ సమదసామజబృంహితచ్ఛటలు లేక
కాననంబులు నిశ్శబ్దకంబు లయ్యె
నిశ్వసత్సుప్త భుజగరాణ్ణికరమునను
కందరాభూములు సశబ్దకంబులయ్యె 98

గీ॥ ఎచ్చటో కానకోనలో నెండిపోని
పడియడొక్కలో మృగరాజు పవ్వళించె
సిమసిమచ్ఛటా బాష్పవిక్షేపముగను
ధూర్వహము సూర్యకాంతమ్ము నిర్వమించె 99

గీ॥ పైన సలసలఁ గ్రాఁగి లోపలను శిశిర
నిభృతముగ నుండె శైవాలినీభరంబు
లోన సలసలఁగ్రాఁగుచుఁ బైన శిశిర
చాయవుగనుండె శ్రీరామచంద్రమూర్తి 100

క॥ ఒకచోట నుఱిమె మరి యిం
కొకచోటను మబ్బుపట్టె నొకచో మెఱసెన్

జికిలి యొకమబ్బు విరిసి యె
సకమేచెను వనవరాహసంసారమనన్ 101

క॥ ఏఁకినవి దూదిపింజెలు
నాకాశముదాఁకఁ గుప్పలయిన ట్లుండెన్
మూఁకలుగ దక్షిణాశా
నీకాశ సుధాకసాంద్ర నీరదచయముల్ 102

సీ॥ వక్షేందిరయుఁ గేశపాశమ్మునందలి
మెఱుపుఁబూవులు చూపె మేదినికిని
ధారుణీసతియు నందముమెచ్చినట్లు చి
క్కని కుక్కగొడుగులుగాఁగ నవ్వె
నెక్కడికక్కడి కెండించి తరురాజిఁ
గానలోపలఁ గానరానిదొంగ
పసిమియంతయు నేడు బయటఁబెట్టి వియత్తు
గుర్తించికొని పట్టుకొనెఁ గుభృత్తు

ఎడమొగము పెడమొగమైన యిలయు మిన్ను
లయు పునస్సమాగమము పుల్కలగ నిలయుఁ
జాటు మంజులవ్యాహారసరసవర్ష
ణములుగా మిన్నులయును బంధములు చెలఁగె 103

సీ॥ గజదైత్యు పచ్చిరక్తపు కళాసము కాన
నయ్యె సంధ్యోగ్రనాట్యములయందు
విస్పష్టముగఁ గానిపించెఁ దోమాలియ
పలువన్నెపూల్ విష్ణుపదమునందు
అష్టదిగ్గజరాజ హారిఘీంకారముల్
వినసయ్యె నఖిలదిగ్వీథులందు
గనులకుఁ గనిపించెఁ గడుఁ గ్రొంణవిఘుత మా
యారజ్జువులును నోదోటంతరమున

వర్ష ఋతురాజు శిశిరసంభారములు ప
యోధరంబులు హరిధను స్సుమముల గమి
వానధారలు వేళాభవంబు లగుచు
గనులకు నతీంద్రియపుశక్తి కలుగఁజేసె. 104

చ॥ తొణికిసలాడు నందములతో విచువీధికి వచ్చి తానునున్
మిఁణుకుచునున్న భార్యయును మేఘుఁడు జంటగనున్న రామల
క్షణులనుఁ జూచి యామెఱుపుఁజక్కఁగఁ బిక్కఁగఁదూఁగిరమ్మ్య నాన్
రణితముచేయఁగాఁ గలసి రాదది జానకిలేని సామ్యమై 105

సీ॥ ఆ కొండరాళ్లను నా తాటి మొవ్వలో
నా గిరిశృంగమ్ము నా మొయిళ్లు
మెట్లవు మొయిళుల మీఁదుగా విద్యుత్తు
కడుఁదేలికైన మార్గంబు కలుగ
అర్చిస్సహస్సు పక్షాయసంబులును సం
వత్సర రవిచంద్రమసులు గాఁగ
క్లిష్టమార్గంబు కల్పించిరి సాంపరా
యేతరంబయ్యు బ్రహ్మష్టిఁ గలుగ

వర్షఋతురాజు సుఖభసోపానపంక్తి
రసమయాపరిచ్ఛిన్న సామ్రాజ్యమునకు
నవనవమ్ము విద్యుద్దర్శనంబు గలుగుఁ
దతగవాక్షంబులందున దంపతులకు 106

చ॥ దళముగ వానపాటు గిరిత్రట్టునఁ బట్టిన తేనెపట్టుపై
నళికుల ముద్భ్రమద్భ్రమణమై మరి వ్రాలఁగఁబోయి వారికం
దళములతాపుచేఁ జెదరి పంజను జుమ్మను మ్రోఁత వర్షమ
ర్దళరవయుక్త వేణునినదంబులకున్ శ్రుతిపోసె నాఁ జనెన్ 107

క॥ అలనాటి స్వాతిబిందులు
మొలకలుగా జలధి ముత్యములుగా నెనక

వలి నేటి యార్ద్రబిందులు
పులకలుగానయ్యె నడవిమొల్లలు గాఁగన్ 108

క॥ ఆమిడిసిపాటు నెండల
లో మిన్ జను వార్ధిజలములోఁ జిక్కినవో
సౌమిత్రిజటాభారము
పై ముత్యము లొలుకఁబోసె వారిదచయముల్ 109

ఉ॥ ప్రోషితభర్తృకల్ వనరుహుల్ నిన మొన్నఁ బ్రసన్నమూర్తులున్
వేషసితాంబరల్ వినయవిస్తృతభావలు సాధుగమ్యలున్
ఘోషలు వేగముల్ వికటకూలము లుగ్రకషాయరూపశై
వాలు నేడు, ధూర్తమగు లోకము మంచిదినాలు వచ్చినన్. 110

ఉ॥ గాలికి గంధవత్త్వమును క్ష్మాకును జల్లని స్పర్శ నీటిమే
ఘాలను తేజ మా మెఱుపుగా నగు నగ్నిని శైత్యభావము
న్మీలితసృష్టిభూతగుణ మిశ్రత కీ ఋతురాజె గౌరవో
ద్వేలుడు వీనితో మొదలుపెట్టెఁడయుండును కల్పకల్పమున్ 111

శా॥ కేలించెన్ బసిపచ్చపాగకొనపై గేదంగికుచ్చుల్ విడన్
లీలన్ వన్నియకావి గోర్పడను తాల్చెన్ వ్రాలు నున్నంజలన్
గ్రాలన్ దర్దురనూపురంబులును ధారాకంకణంబుల్ వనీ
కేళీముగ్ధకిరాతుఁ డీ యెవఁడో సాగెన్ వర్షమాసాకృతిన్ 112

క॥ పవమానుఁడై యసలుపె
క్కువవాఁగులఁ గాంచి నేర్చికొనినాఁడో వా
యువు తరగతరగ బురదై
సివమెత్తినయట్లుగా నసేవ్యుం డయ్యెన్ 113

ఉ॥ గాడినకొండపార్శ్వపు టఖాతపు టెల్లను మబ్బుగుంపులున్
బూడిదివేయ నేల యను బుద్ధి మహాభుజగంబు వర్షపుం

డాడనబాధ మారుతద్రుతంబుగ దూఁకెను నాగలోకపు
పాడలు చేరఁగాఁజనిన వర్షమహోజ్జ్వల మూలధార నాఁ  114

ఉ॥ భూమికి డిగ్గి యింద్రధనువుల్ పరికీర్ణములైనయట్లుగా
సామజదంతకాంతులు ప్రసారితసారమయూరపింఛముల్
హేమసవర్ణమౌ పువుల నెఱ్ఱనికాంతులపూలఁ దంగెడుల్
కోమలతానిధానములు గుంటలఁ బూచిన నీటిప్రబ్బలుల్  115

సీ॥ ఒకమబ్బు గిరిశృంగనికటమ్ము విడిపోదు
తన్మాధరేంద్రు నికంటఁగాఁగినట్లు
ఒకమబ్బు గిరిపాదనికటానఁ జేరాడు
మన్నింపఁ బ్రార్థించుచున్నయట్లు
ఒకమబ్బు గిరిమహాశకటిస్థ యూఁగాడు
సంభోగశృంగార చలితయట్లు
ఒకమబ్బు గిరిపంచ నూరక తిరుగు ని
రాకృత యాస నల్లాడునట్లు
తానొ యేడాది కొకసారి కానిపించు
నవమనోజ్ఞుడు దక్షిణనాయకుండు
మబ్బుకన్నె లిట్లొందుట యబ్బురంబె
పరమశృంగారమూర్తియౌఁ బ్రస్రవణుఁడు  116

శా॥ ఆకీర్ణాంబుసటాకవాఘ్ఘర మృగేంద్రారావమున్ కేకిరా
క్కేకారావము మత్తసామజఘటా ఘీంకారమున్ వాన హో
రేకాకారముగాగ నున్నతపు స్థాయిఁ రాగముం బాడున
ట్లై కన్పించెను మేఘరంజనిని వర్షానేహ ముత్కంఠితయై  117

గీ॥ అన్నితలుపులు మూసికొన్నట్టి యింట
నప్పుడప్పుడు సుంత గవాక్షములను
దెరచినట్టులు పడమటఁ దెఱపియిచ్చి
యెఱ్ఱవెలుఁగులు సంజల నేగుదెంచు  118

గీ॥ తన గుహాప్రాంగణంబునందుననె నిలచి
యంచునం జారు వాన హస్తాంగుళులను
జూచి భయమున శ్రీరామచంద్రమూర్తి
వెనుకకుం దీసికొనె చేయి వెచ్చ నగుట. 119

గీ॥ కమలినీకాంత కన్నులు కనులకలక
వచ్చినట్టులు తెలుపుడు పడకపోయె
మండుటెండలు తొలినాడు మరలినపుడె
ధాత్రి నణగారినది బ్రహ్మదండిమొక్క 120

ఆ॥ వస్సి సగము నేల రాలిన నేరేడు
పండు కానిపించెఁ బాంసురాశి
మద్విరచేత నూత్నమాంజిష్ఠకాంతుల
కనులతోడి శబరకన్యవోలె 121

శా॥ జంబూపక్వఫలంబు లర్ధదళనశ్యామారుణంబుల్ ధరా
సంబాధంబు లమృత్స్నవ్రశంబుల నొగిన్ సౌమిత్రి తా నేరి శు
ద్ధాంబుప్లావితముల్ పొనర్చి కొనిరా నార్యుండు సేవించె నే
త్రంబుల్ చల్లన తియ్యనైన రుచు లందంబెల్ల దీపింపఁగన్ 122

గీ॥ స్వామి ప్రియమువిూఱ జంబూఫలంబులు
నారగించి నవ్వినంతఁ జూడ
ధరణితనయతోడఁ దాంబూలసేవనం
బాచరించినట్టు లయ్యె మొగము 123

గీ॥ చిదికి వందలువేల్పండ్లు చితచితలుగ
ముసరుకొంచును భసలముల్ మూగుచుండ
ఘనసవర్ణాంబు పంకంబుకలఁచ, నమృత
హృతమథనభూమి యయ్యె నేరేళ్ళక్రింద 124

ఉ॥ మబ్బులలోనఁ గ్రమ్మబడి ఘ్నాధరముల్ గనరాకయున్నదా
అబ్బురమంద ముక్కలయి యవ్వియు జంగమభావమంది పె

ల్లుబ్బిన గంధవారణమహోన్నతరూపమునం జరించు నా
మబ్బులు విచ్చిపోవలయు క్ష్మాధర మున్నదో లేదో చూడఁగా 125

సీ॥ జీరాడుమట్టలు జీబులుఁ గంఠదే
శములందుఁ బులిగోళ్లు చర్మములుగ
మౌళిభాగములందు మహితపత్రంబులు
విస్తీర్ణరమ్యముల్ పింఛములుగ
కంఠదేశములదాఁక నపత్రకములౌటఁ
బాహ్యవారపరిహీణ భావముగను
పండిముగ్గినయట్టి పండ్లగెలల్ గళ
స్థములైన గాజుపూసలునుగాఁగ
తాళవనములు శబరసంతానములుగ
నంబుదవ్యాజ వనవరాహముల వేఁట
నిలచి భావించుచున్నట్లు నెగడె వాన
కాళ్లలను బల్లెములు గ్రుచ్చి గాడనేసి. 126

మ॥ ప్రకటాంభోదర శైలవాహిను లభివ్యాప్తంబుగా గిర్యుప
త్యకయందొప్పిన యింద్రకార్ముకము నంతంబందు సౌమిత్రి నీ
ళ్లకునై వాహినియందు డిగ్గి నవహేలామూర్తి భాసించె మ
స్తకరత్నాంశులు మింటిదాఁక విహరించం బొల్చు శేషాహి నాన్

క॥ ఎఱపచ్చడంబు ముక్కలు
కఱుదున వేణ్యంతములను గైసేసినటుల్
చిఱుతసెలయేఱు లంచుల
ముఱకముగాఁ గొండగోఁగు పూవులు పూచెన్ 128

క॥ గిరిధాతుపార్శ్వమేఘో
దరరక్తచ్ఛవులు చూచి దావాగ్నిమతిన్
విరియించిన పింఛమ్మును
మరలన్ ముడుచుక మయూరమహీపతి సోలసెన్ 129

మ॥ తమకుం గల్గిన మేలు లేదనులకుం దాఁపైన కీడెంచి మో
దమునుం గాంతురు కొంద ఱీ కలువ లుద్యచ్చంద్రమోదర్శనం
బమరం బోదు సరోజషండములకౌ నాపత్తి వీక్షించి చి
త్రముగాఁ గేల్చువ లొక్కచో ప్రమదధారాశ్రీవికాసంబులౌ 130

ఉ॥ వానరభల్లుకంబులును వర్షము రోమచయంబు చొచ్చినన్
మేను విదల్చికొంచుఁ గుసుమించిన నవ్వులు సీదరింపులుం
గా నటనామనోజ్ఞపరికల్పిత లంఘనకుంచనంబులన్
గానల సంచరించెఁ దనుకాండములందుఁ బొనరాచుచున్ 131

చ॥ అడవుల జామ్రుక్రిందట జలాహరణార్థము వచ్చి నష్టు నం
దడుగుల లోఁతునం జనెడు నా ఝరి యిప్పుడు కొండమట్టమై
విఢివడి పాఱుచున్నయది వెక్కసమయ్యె సుమిత్రబిడ్డకున్
గడువడి నేఁగి పత్రపుటికల్ వెస నింపుకవచ్చునంతలో 132

గీ॥ వానజోరునఁ గురియుచోఁ బక్షులెల్ల
నెచటి వచటివి తమగూళ్ల నొకమెసఁగ
గూడు లేనిది కాఁబోలుఁ గొమ్మకొమ్మ
గాఁగ నరచెడు నొక్క యేకాకి కాకి 133

చ॥ అల హరిణీవశానుగములై చను రోహితవారణంబులన్
చలితనతోన్నతాధర లసత్కరకామయమానవృత్తులన్
మెలఁగ గుహానివాసపు సమీపధరాస్థలిఁ బారఁద్రోలు ద
వ్వులకును లక్ష్మణుండు రఘుపుంగవుఁడుం గనునన్న భీతిచే 134

గీ॥ అసలు తేనియ త్రావిన భసలచయము
కామచరణమ్ము పట్టఁ బగ్గాలులేవు
కడిమిపూఁదావి చిమ్మిన గాలిచేతఁ
గామపరవశమయ్యెను గానవంబె 135

మ॥ ధరణీదేవిసుతామనోహరుఁడు ముగ్ధస్వాదుభావుండు సుం
దరుఁడౌ శ్రీరఘురామమూర్తి యసమానంబైన యొప్పానెని

ర్భరవర్షాజలరాశి క్రమ్ముకొన దుర్గప్రౌఢజీవుండు త
త్పరిచర్యాపరమార్థరూపము సుమిత్రాసూతి వహించుగాన్ 136

చ॥ మొలచెనొ లేదొ పెల్లడవిముస్తెలు ముట్టెల దున్నిపోయఁ బం
దులు మలువానలుం గురియ నూత్నవనార్థము ప్రాంతవిత్తనం
బులు తలలెత్తెడుం గడిమి మోదుగు తంగెడు నన్నివృక్షముల్
తొలి హరిపోత్రి ధాత్రివలెఁ దోఁటల నెత్తుచు నీ వరాహముల్ 137

చ॥ గిరిగుహయందు బిట్టయిన గ్రీష్మమునందునఁ జల్లనై సదా
విరిసినయట్టి వర్షముల వెచ్చనయై సుఖమయ్యె స్వామికిన్
పరమమహాస్త్రదేవతలు పాలితకాంతులు దివ్వెలై రహిం
తురు గుహ రామచంద్రుని తనూచ్ఛవి కమ్ముడుపోయినట్టివై 138

క॥ ఎంతటి మబ్బులు క్రమ్మినఁ
గొంత యెచటొ మిన్ను తెఱచుకొనియే యుండున్
వింతవెలుఁగైన కిష్కిం
ధాంతఃపురి దీపకాంతులైనను జిమ్మన్ 139

గీ॥ అంత శబ్దరహిత మర్ధరాత్రంబుల
రెండు సవ్వడులు చరించుచుండు
నుర్వియందు మేఘు నుకముల మ్రోఁతయు
మింట రాము ననుజు వింటిమ్రోఁత 140

వ॥ వర్షర్తువున శ్రీరామచంద్రుడు మేఘమ్ములోని మెఱుపుగాంచి
రావణాపనీయ మానయైన సీతయంచుఁ దరురాజి జార్చు నీటిబొట్లు
సీత కన్నీరంచు నేలవ్రాలు బలాకామాల తదపనీత ముక్తాహార
మంచుఁ బ్రాదేశమాత్ర ప్రదేశపుంజీభూతశక్రగోపంబులు సీత తల
లోని రాగిడియంచుఁ బరిపరివిధంబులఁ బ్రలపించి సౌమిత్రిచేత
స్మారయమాణయోగవిద్యాగురుండయి యిట్లనియె. 141

గీ॥ అధ్యయనకాలమియ్యది యదియును గు
హోమముఖంబులఁ జేయు వేదాధ్యయనము

రహి నుదాత్తానుదాత్తస్వరంబు లొప్ప
వానధారలఁ జందెముల్ వేసుకొంచు 142

క॥ పితృదేవతల సమభ్య
ర్చితులం గావించుచుండుఁ బృథ్వీపతి స
న్మతి భరతుఁడు మాతృగణా
ర్పితుఁడై సమ్యక్క్రియాపరీక్షణమందున్ 143

ఉ॥ కైకమ యెంతచేసె నుపకారము బ్రాహ్మణకర్మమందు న
స్తోకముగాఁగ రక్కసులతోఁ గ్రిక్కిడివై చను దక్షిణాపథం
బాకులమయ్యె దైవతవిహారము సాగెడు నేడు నద్దియుం
గాక దివాకరాత్మజుఁడు కామినితో సఖుఁడున్ సుఖించెడున్. 144

క॥ మనవలన నంత యుపకృతి
కనినాడుకదయ్య మరలఁ గావింపడటం
చనియెదవా ! అబ్బ ! కృత
ఘ్నుని చనులోకములు గుత్తగొను నిరయములై 145

శా॥ ఓయీ రావణుఁ డెంతయేనియును దుష్టోద్యోగి వాఁడెచ్చటో
ఆయున్నట్టిస్థలంబునుం దెలియఁగా నైనంత సాయంబునుం
జేయంజాలడో నన్ను జానకి యదాక్షిణ్యంబునం బాయుచుం
బోయెంగాని నిజంబుగాఁ గపికులంబుం బోయి యాచింతునా 146

గీ॥ నాల్గునెల లింతదుఃఖంబునకును సిద్ధ
పడితినన నాతఁడనుదెంచి ప్రణతుఁడైన
యపుడు చూడలేదా వాని యాస్య మద్ది
చూచు చనలేకపోయితి సుమ్ము నేను 147

గీ॥ అమృతమయ ప్రియసీతనుయష్టిమథన
సులభజనితజ్వాలన పరిశుష్యమాణ
శిశిరభావుండు ఋతురాజశేఖరుండు
వర్ష ఋతు వాతనిన్ సుఖంపడగనిమ్ము 148

మ॥ అవనీదేవిసుతాసమాగమన పర్యంతోగ్రభావుండు వీఁ
డవు వర్షర్తువు జానకీవిరహభావాంభోధినిష్ఠుండు ఘో
రవిషాకారుఁడు రెణ్నెలల్ గడచి యారా! యేమిసేయున్ సఖుం
డవు సుగ్రీవుఁడు నింతలోఁ బనుచు సైన్యంబుల్ దిశావీథులన్ 149

మ॥ విన్నతాస్యుండయి లక్ష్మణుం డనియె నుర్వీరక్షణాబ్ధీ! సఖుం
డవు సుగ్రీవుఁడు నింతలోఁ బనుచు సైన్యంబుల్ దిశావీథులం
దవనీకన్యక నీవు తెత్తువు దిగంతాశారకీర్తిప్రభా
నవముగ్ధాకృతి నీవు కాదటె యనంతాధర్మమార్గాకృతీ 150

మ॥ అనుచున్నంత మెఱుఙ్లు మింట నవకుల్యాల్ ధాత్రియందుం దమం
తన నంభ్వారక విచ్చిపోయెను వియన్మధ్యస్థలిం బాసి మె
ల్లన దూరాశలు చేరఁజొచ్చినవి యల్పంబుల్ పయోదాళి చి
క్కినవై యేల్లను బంకమెల్ల దిగఁద్రొక్కెన్ దీరదృశ్యంబుగా 151

గీ॥ ఉఱుమదు వినీలకాంతులు విరియదు రవి
శశుల యుదయాస్తమయములు చాదుకోదు
అల్పజలదంబు లుబ్బగా నాదుకోదు
సద్దుమణఁగారినది యాకసంబు తాను 152

ఉ॥ రాచిన క్రీడనోత్సవపరంపరగా రవిచంద్రులంత దోఁ
బూచులనాడి రంబుజసమూహముతో నునుకల్వపూలతో
వాచి మొగంబు పెక్కువగు వర్షపునాళ్లల మోహనాతప
శ్రీ చెలువారు వెగ్గుల హసించుచు సంచితకామభావులై 153

ఆ॥ నదదమోఘములయు నదులయు సెలయేళ్ల
యొండు విరిగి కాము మొండువిఱుగు
సూచనంబు లేక సుగ్రీవుఁ డేపారె
నిలయుఁ గ్రొత్త కామినులును గ్రొత్త 154

ఉ॥ తారకు వాలి బాహుబలదర్పమునందున నెట్టి బుద్ధియో
నీరజబంధుసూతి మతి నీతిపదంబున నట్టి బుద్ధి యె

వ్వారికి జీవభావమునుబట్టి యొకానొక కోర్కెయుండు నా
కోరిక రాజనీతి మదకుంజరయానయునైన తారకన్. 155

ఉ॥ ఆయెడ సన్న పోయిన ననంతరసోదరుఁ బొందు దేవర
న్యాయము నంత ధర్మముగ నంగదునిన్ యువరాజుసేత ధా
త్రీయుతనీతిపాలన కృతిప్రవణాభిహితార్థనా సమా
ధేయత యన్నియుం గలిసి తెచ్చిన యొప్పిదలయ్యె తారకన్ 156

క॥ అటు రుమయును నిటు తారయు
ఘటియించినయట్టి మోహగంధమ్ములుగా
నటియించెను సుగ్రీవుఁడు
రటన మఱిన కామవాగురా మధ్యమునన్ 157

చ॥ కడఁగి యతండు సేయు నుపకారము పెక్కచే నతండు మి
త్రుఁడనిన బుద్ధి పెక్కనయి రోషముదెట్టులనుండుఁ దా నెఱుం
గడు రఘురామునందుఁ బ్రభుకమ్రఖాబ్జము స్నిగ్ధభావమే
కడు నెఱుఁగున్ రఘూద్వహుని కార్యమునందుఁ బ్రమత్తుఁడౌటకున్

చ॥ చెలువల కుంకుమార్ద్రముఖసీమలయందున రెండుసంధ్యలున్
లలనల పచ్చకప్పురపు లాహిరినవ్వుల రేలఁ జందనం
బుల మెయిపూఁతయందు దివముల్ గడపున్ ధరణీభరంబు మం
త్రుల నిడి కామతంత్రవిధురుండయి నీతికళావిదూరుఁడై 159

శా॥ ఆనీతంబులు నర్ధరాత్రములయం దాభీలముల్ లక్ష్మణ
జ్యానిస్స్వానము లందఱున్ వినెద రేకాకారమోహాపగా
శ్రీనిర్మజ్జితమస్తకుండయిన సుగ్రీవుండు తా నొక్కఁడే
గానీ యంతటి యూహనంచున వినంగా లేనివాఁ డుండకన్. 160

ఉ॥ సమ్ముఖమందుఁ బోవుటకుఁ జాలక యాజ్ఞయు లేమిచే నల
భ్యమ్మగు రాజదర్శనకృతార్థులు మంత్రులు రామచంద్రకా

ర్యమ్మున వ్యగ్రబుద్ధులు భయాత్ములు రాజయినా డనంగ మో
దమ్మును లేకయుండెదరు తామరసాప్తసుతేద్భశస్థితిన్. 161

చ॥ అతికరుణాపయోనిధి యహర్పతిశిష్యుఁడు సర్వకార్యసం
గతిచతురుండు మారుతియు క్ష్మాతనయాహృదయేశకార్యసం
గతమతి తానుగాఁ జనియె క్ష్మాపతి యంతిపురంబులోనికిన్
హతకరణప్రవృత్తిఁ బ్రతిహారులు కాదనలేక యుండఁగన్. 162

శా॥ గేహాంతస్థితిడోలికాగతుఁడు సుగ్రీవుండు తారా రుమా
బాహాలగ్నశరీరయష్టి మదిరాబంధూకనేత్రుండు ని
ర్వ్యాహాశ్రేణిక జారుచుండగ శిరస్సూగించుచున్ నర్తకీ
సేహాగీతిక లాలకించుచును బొల్చెన్ గామదేవాకృతిన్ 163

వ॥ అంత హనుమంతుఁ గంతువైరియంతటివానిఁ గాంచి సేహాగీతిక లాగి
పోయి నర్తకీశ్రేణి పీఁగిపోయి తారాహస్తచాలనంబున వా రాచోటు
బాసిపోయిరి. రుమయు నంతరాంతఃపురంబునకుఁ జనిన నాంజనే
యుం డిట్లనియె. 164

గీ॥ బయట సంధ్యలు తిరిగెడుఁ బక్షములును
దిరుగుచున్నవి మాసముల్ తిరుగుచుండె
వార్షికములైన మాసముల్ వదలిపోయి
కదలుచున్నవి శారదికములు నెలలు 165

చ॥ సతియు జయంబు తత్కృతము సౌఖ్యము కీర్తియునుం గులక్రమా
గతమగు ధాత్రి యన్నియును గల్గెను గల్గిన వే ప్రమాణసం
గతి నుపయోగపెట్టబడఁగావలె దాని నెఱింగి సేఁత యూ
ర్జిత మధికంబుకాఁగలుగు చేఁత తదన్యము చెట్టసేఁతయై 166

చ॥ కలిసిన యిద్దఱైన చెలికాండ్రు పరస్పరకార్యకారకో
జ్జ్వలసమయంబు లాడికొని వాఁడొకరుండు స్వభాగమందుఁ బ్ర
జ్వలితముగాఁగఁ జేయఁ బెఱవాఁడును శిష్టమునం బ్రమత్తతం
జెలఁగఁ గృతఘ్నుఁ డాతఁడని చెప్పను జేయఁనుగాదె యేరికిన్ 167

గీ॥ కడు నతీతమైన కాలంబు కలిసిరా
దున్నవేళ మేలుకొన్ననైన
నొక్కొకపుడు ఫలము నుండదు తరి నిద్ర
యుడిగి మేలుకనియ యుండవలయు 168

ఉ॥ ఎంతయొ దాఁటిపోయినది యిప్పటికైనను లేదు మిక్కిలిం
గాంతముగాఁగ మేలుకొను కాలము దాఁటును వాహినుల్ తట
ప్రాంతములందు గేదఁగులకై నడిఁ దెల్లవడెన్ దిగంతముల్
నంత వినీలమేఘములు నూపెడు స్వల్పతటిద్విళక్షముల్ 169

మ॥ తమ చాపాంతములన్ దిగంతములు సంతాపింపఁగా జేయు దు
ర్దమ బాణబలధుర్యులై యొకఁడు మిత్రత్వంబు నీకింత భ
ద్రముగా నీయెడఁ జేసినారు తమకై తాఁరు బయోరాశినీ
రము నింకింతురు ఘూర్జీనవిశీర్యన్మార్గణానర్గళుల్ 170

శా॥ నీయందాయన కింత జాలి ధరయున్ నీరేజపత్రాక్షియున్
భూయోనూతనముల్ సుఖంపఁడఁగనీ పొమ్మంచు మిత్రత్వరే
ఖాయత్తంబగు బుద్ధి నాల్గునెల లాహా భూసుతాయల్లక
వ్యాయామంబున డస్సిపోవుటకునే నంగీకృతిం జేయఁగా 171

గీ॥ ఎవఁడు మిత్రకార్య మొసుబుజంబులఁ దాల్చు
నాదిభోగిపడగ నవనిఁబోలె
నతఁడు పరమయోగి యతఁడె విద్వాంసుఁడు
నతఁడె సర్వజీవనౌషధంబు 172

ఉ॥ వీరులు వానరుల్ గలరు విజ్ఞులు నీ కనుసన్న వేచుచు
న్నా రఖిలావనీభరమునన్ ధరణీతనయాగవేషణో
దారమనీష విక్రమశతాకులు వేగవియత్తగాత్తసం
చారులు నీరజాప్తకులచంద్రమహాః కలితాదరాంబుధుల్ 173

క॥ నే నుంటి కలద యష్టది
శానేకపచండబాహు వగు చముపు నృపా

జ్ఞానిర్భరతీవ్ర ప్రతీ
క్షానిశితాస్త్రము సహస్రశఃకలితంబై 174

ఉ॥ పుణ్యము నీకువచ్చు శివపుంగవు మైతెలిడాలుగా యశో
గణ్యత నీకుఁగల్గు హితకార్యము సేయుట లగ్గుగాదె యా
పుణ్యము వేల్పువీటికిని నిచ్చెనవంటిది రామచంద్రుఁ డా
రణ్యకుఁ డౌచు నీకును శరణ్యుఁడుకావుట యెంత భాగ్యమో! 175

వ॥ అట్లు వినుచున్న సుగ్రీవుండు క్రమవర్ధమానశ్రద్ధాకుండయి తారా
-భుజాగ్రంబుననున్న హస్తాగ్రంబు తీసి కంటిమంకెనవన్నె నందివర్ధని
వన్నియకా నీవిప్పుడు వచ్చినవాఁడ వెప్పుడు రారా దంతకాంతం
బైన మేల్కొనుకాల మ్మేల దాఁటిపోనిచ్చితివి. శ్రీరామ
చంద్రుని సఖ్యంబు నీ సేఁత తత్కార్యనిర్వహణంబు నీసేఁత కాదే
ఆ యన్నదమ్ముల ధనుఃకళాపాండిత్యమ్ము నే నెఱుఁగనా యని
యిట్లనియె. 176

శా॥ హాలాపానము, తార, శత్రుదళనం బాయన్న కీనూఁడె స్వ
ర్వేలాభోగము లీ కపీంద్రచలితోర్వీ దేశిసంగీతముల్
హేలామోహనవానరీనటనసాహిత్యంబులుం బట్టవు
ద్వేలాకారము బూజుపట్టినది యీ విద్యాప్రపంచంబునన్ 177

మ ధ్యా క్క ర లు :—

అని నీలుఁ బిలిపించి చతురు నఖిలకార్యంబులయందు
మన సేన లెన్ని దిక్కులను మసలునో మరి యంత పాలు
రనుగూడి మన వీడు చేరరాను వారం బిద్ది గడువు
గను నాసంగితి రానివాని కంఠంబు ఖడ్గకృత్తమగు 178

అని హనూమంతు నారసి మహామంత్రి ! యంగదుం డీవు
చనుదెంచు సర్వసైన్యంబు సవదరించను వీళ్లు సేయఁ
దనరార దుముదాగులకను దళవాయి తండంబులకును
ననయ మనీకినీపతుల కాజ్ఞగా నరయంగవలయు 179

జనకరాట్కన్యామణీ లసద్గవేషణకోస మెపుడు
వినిపించు నాజ్ఞామహోగ్రభేరి వెన్వెంటనే కదలఁ
జనునట్లు నెల్లెడ సర్వసైన్యంబు శాసింపవలయు
ననుచు సుగ్రీవుండు చనియె నంతఃపురాంతస్స్థలంబు 180

ఉ॥ అంతకుమున్నె శ్రీరఘుకులాంబుధిచంద్రుఁడు విచ్చుమబ్బులున్
బ్రాంతవళక్షవాహినులు భాసివికాసిసరోజషండముల్
కాంతములైన దిక్కులను గన్గొనెఁ జీకటినుండి వెల్తురౌ
ప్రాంతము చేరినట్టులుగ ప్రాణము తీరిక చెందినట్టులున్ 181

చ॥ వెలయఁగ నంతకంటె నునువెన్నెల లెక్కవకాని యాతపం
బులు సుకుమారముల్ వెలుఁగు మొత్తము లచ్చనిపచ్చకప్పురం
బులు పొడిచేసి దిక్కులను బోసినయట్టులఁ బొల్చె రాచయం
చల గమి మానసంబు కలుషంబయి దక్షిణదిక్కు వచ్చెనాఁ 182

మ॥ తెలిమబ్బుల్ మినువాక నుర్వులన నేతెంచెన్ మనోజ్ఞాకృతుల్
తెలియంచల్ తెలియిఱ్ఱికానలును గుండేర్లెన్ మరి జంతువుల్
పలితంబుల్ గొని ముచ్చెరంగిడని పూర్వం బారగాఁబెట్టిన
ట్టులు సూర్యాతపవీథులం దునిచినట్టుల్ పొల్చె నందంబులై 183

మ॥ చలిశోఁగ్రానిలధూతపాతితములై స్వస్నప్తపర్ణీవచం
బుల లేఁతాకులు తూలిపోయినయటుల్ పొల్పేది వర్షాదినం
బుల స్వాశ్రిత్రీ ల్వాలిపంబులుం దడిసిపోఁ బొల్పార బాలాతపం
బులలో వాసిని నారఁబెట్టిరనఁగాఁ బొల్చెన్ సితాంభోదముల్ 184

గీ॥ స్థూలములు బాధపెట్టును స్థూలములుగ
సూక్ష్మములు బాధపెట్టును సూక్ష్మములుగ
వర్షకాలాఖవులు స్థూల భావములును
శారదికములు పరమసూక్ష్మములు చూడ 185

వ॥ అట్టి శరత్తునందు శ్రీరామచంద్రుండు ప్రతీక్షాభావతీవ్రంబులైన
కన్నులతో నిట్లనియె. 186

క॥ మన మున్నామో లేమో
కనుగొనుటయుఁ బట్టలేదు కపిరాజునకున్
దనదగు మనపని యేమో
యెనో మన మిచ్చోటనుండి యేమైనామో 187

ఉ॥ దిక్కులకేమొ తెల్వియరుదెంచెను వానికి వచ్చినట్టులే
దక్కట ! భార్యతో సుఖము నందుచునుండిన యప్పుడైనఁ దా
నొక్కతలంపు రాఁదగునె యుర్విజఁగూరిచి వానరోజులన్
జిక్కనికౌఁగిళుల్ విడున సేగియ యందము నేటి కేమగున్ 188

గీ॥ నిజముగాఁ గ్రొత్తబిచ్చగానికిని బ్రొద్దు
తెలియదన్నట్టు లున్నదీ తీరుచూడ
శరదృతువు సాగివచ్చె భాస్వరముగాఁగ
సాగి సుగ్రీవుఁ డరుదెంచు జాడలేదు. 189

క॥ పగ యడగించి ధరిత్రియు
ముగురయు ననుదాని కధికముగఁ జేసితి నా
కగుపడ దయగారిం జే
యఁగఁబోయినఁ దుదకుఁ గోఁతి యైనట్లుండెన్ 190

గీ॥ అగ్నిసాక్షికముగఁ జేసినట్టి చెలిమి
కోరి తామింతగా నొప్పుకొందు రేమి
నిప్పుతోఁ జెలిలాటలు నిక్కవముగఁ
గొంపమీఁదుగనై తెచ్చికోలుగాక. 191

చ॥ భృశపరిణామదుష్టముగఁ బెద్దయు నేర్చు మనంబు తత్కృత
ఘ్నశవ మయో పిశాచములునుం జని తాఁకవు వానిచన్న క
ర్కశనిరయంబునం జనవు కాకులు గ్రద్దలు వానికంటె బా
లిశపరముండు ధాత్రిపయి లేడు తలంతన మూలదైత్యుఁడై 192

చ॥ కడుఁ దనకైనవారికిని గాక పురంబున నుండి తండ్రిచే
నడవుల కంపఁగాఁబడి కులాంగనఁ బాసి మరేమొ గొప్పరా

యుఁడు తను నాశ్రయించి పెటంచును లోఁకువన్మైత్రి వానికిన్
నడచుమఁ జూచి యెవ్వనిని నమ్మవలెన్ గపిత్వాలసప్టులన్ 193

శా॥ వాలిం జంపిన యంపకజ్జకు సమీపంబందు నేగన్ భయం
బీలోకంబున కింతగర్వమిచ్చు నైపెంత్సైన యశ్రద్ధ నే
నేలా యప్పుడు జాలిపొందవలె నీ యిష్టే విచారంబు నే
నేలా పొందవలెన్ దయాగుణఫలం బేనాటి కిప్లెందునే ? 194

క॥ నావంటి యమాయకుఁ డెవ్వ
డీవిధమునఁ జేసికొంచునే యుండును నా
యే వేధను నాయంతట
గోవిదమణి నేను జేసికోనో చెప్పమా 195

వ॥ ఇట్లు శ్రీరామచంద్రుండు శ్వేతవెన్నెలలు పరివారంబునందుండి గ్రుచ్చుకొంచున్న పూచికముల్లులుగా బాలాతపంబులు జటాభారంబున భుజంబులఁ బ్రాకుచున్న యరుణపిపీలికలుగా వెక్కసంపడుచు నిట్లనియె 196

ఉ॥ ముక్కలుముక్కలై యమర భోగచయం బవదాతవర్ణమే
దిక్కునయందు రాలిపడుతీరున నున్నవి రాజహంసముల్
ముక్కుల చెక్కలం దరుణారుణ్ మరి చేతనులన్నయట్లుగా
నక్కట ! తున్గినప్పుడు నవాధికరక్తము క్రమ్మినట్లుగా. 197

మధ్యాక్కఅ :—

ఓసి మదమరాళగమన ! యువిదా ! పయోదాసితాల
కా ! సౌరకార్ముకభ్రు ! సుప్రకాశితాకాశావలగ్న !
ఓసి మత్ప్రాణాధికా ! మహోగ్రదైత్యోత్ప్రేనాఘుండు
సాసూయుఁడై వ్యర్థకోపజడుఁడు నిన్ జంపలేదుకద ! 198

మ॥ తనయుం బోషణఁ బుట్టినింటవలె నుద్యత్స్వాస్థ్యలన్ గ్రొత్తవ
చ్చినదా యౌవనమంమనన్ గనిసరశ్రీజంఘుదఘ్నాంబులం

దున బంగారపు వన్నెయై కలమవేన్నల్ పొల్చె కింశారుమో
హానముల్ పచ్చనిసంజలన్ నలిచి నూగారున్ పయోదేహముల్ 199

తరలము :—

కలమజంఘు ధరిత్రిసంభవ కంజలోచన మోహనో
జ్జ్వలితచారుతనూవిలాసిని బంభరాయతవేణి నా
వలను బాసి మరెందు బోయెనొ వర్ష వేళ వియోగినీ
జ్వలనవేళ మరేమి యయ్యెనొ చండరాక్షసకోటిలో 200

ఉ॥ ఈ నది తీరభూమి నసితేతరమోహనకాశసూనసం
తానము విచ్చెఁ గాలవసుధాపతి పోయెడు జైత్రయాత్ర హే
లానది శంబరాశ్వికదళవ్రజ మస్తకలగ్నచామర
శ్రీనిభృతంబులై పరవశీకృతబాలనవాతపంబులై 201

అశ్వగతి :—

కాశసుమాభదృగంచల క్ష్మాత్మజయామణి నా
కాశమునందున రక్కసి కైకొని యేగెఁగదా
యీశుఁడు కాలధరాపతి యెట్లుఁ జనున్ మిథిలా
ధీశుని కూఁతు జయించి దితిప్రజఁ దెచ్చునొకో 202

చ॥ పతులకు నాఁడటన్ గుసుమపాత్రలఁ దేనెలనింపి యిచ్చు నా
పతులను సంతసంపడఁగ బంధురగీతిక లాలపించు గీ
శ్చతురలు సర్వమైన పరిచర్యలు చేయును దేటికాంత లా
పతులకుఁ గాపురమ్మునకు వచ్చిన క్రొత్తదనాల మక్కువన్. 203

మధ్యాక్కర :—

మత్పరిచర్యామహాబ్ధి మహిజాత మైథిలేశ్వరుని
సత్పుత్రి నాసేవలెల్ల షట్పదీసదృశ చేసెడిని
హృత్పుటస్థితమధుకుల్య యెంతయేని ప్రేమమీఱ
మత్పరాకృతకర్మ నిట్లు మహిజాత మాయమైపోయె. 204

శా॥ వల్మీకంబుల లీనమై చనిన యీ వర్షాదినంబుల్ లతా
గుల్మాచ్ఛాదితముల్ శరద్దినములన్ గుంభీనసస్త్రీల్కృతే
హా ల్మందానిలసంచరత్పరిమళవ్యాసక్త లయ్యెన్ శర
ద్ఘుల్మవ్యాజవినీలమేఘవిహరత్ క్షోణీస్థసౌదామినుల్ 205

కవిరాజవిరాజితము :—

అహిపతివేణిక యామవచంద్రిక హారితనూలతఁ బ్రాణపదన్
ముహురసనీతను భూమిసుతామణిఁ బొందుదునా యసువుల్ గలుగన్
విహృతిపునర్చెడు విస్ఫుటవహ్నిక విద్ధహృదంతరవీధులలో
బహువిరహబాధలు పొరిచసంగను బ్రాణములైనను బాయవుగా 206

చ॥ కహకహ నవ్వి యీ బకము క్ష్మాతనయామణి విప్రయోగసం
దహిదమృతాత్మ నన్ను గగనంబున నిల్వక పారుచుండె నీ
విహగము దైత్యజాతి కను వే చిఱుమీనును ముక్కునన్ గ్రహిం
చి హనన బుద్ధినేగెడు విశృంఖలమై మఱి నేను చూడఁగన్ 207

రుగ్మవతి :—

మీనదృశన్ నామీఁదను గోపం
బూని చనన్ నే నోఁదుట యెట్లో
తా నవశన్ దైత్యాంబుధిమగ్నన్
గానభగ్నన్ గాంచివలగ్నన్ 208

ఉ॥ ఏ ముని సీతకున్ జనకు తొట్టిలో అట్టులు ప్రేమగౌరవ
శ్రీమహనీయమూర్తి హరిచెందని తూణములన్ ధనుస్సు తా
నే ముని యిచ్చె నాకుఁ బరమేశ్వరుఁ డేముని దక్షిణాశయం
దా మునితోఁ జెందుం గలుషితాంబుచికిత్సకుఁ డప్రమేయుఁడై 209

నారీనుతము :—

ఓ సీతా ! కుంభోద్భవోద్యన్మునీంద్ర
వ్యాసక్తచిత్తా యిటు వచ్చినావే

వే సాధ్వీ ! వద్దన్న విన్నావు కాదే
ఆసన్నమా నాపద యట్లు ద్రోయఁగ. 210

వ॥ వర్షర్తుభావంబు కాలంబును వదలి తన్నుఁబూనినట్లు వినీలకుటిలభ్రువు, సితదంతపంక్తియు శబలజటాభారుండు నైన లక్ష్మణుండు మాటి మాటికిఁ గిష్కింధత్రోవ చూచుచుఁ దదనుకూలాస్త్ర దేవతా భావనావిశేషంబున శ్రీరామచంద్ర విరహోద్దీపకవస్తుచయంబుల నిశితత్వంబు తగ్గించుచు నిట్లనియె. 211

క॥ త్రివ్వినకొలంది దుఃఖము
త్రివ్వక లే దింతయును ధరామృత్తునలెన్
నివ్వటిలుచున్న దుఃఖము
దవ్వులకును జోపవలయుఁ ద్వాదృశులు ప్రభూ ! 212

గీ॥ చంద్రునకు వెన్నెలంబోలె జనకదుహిత
నీకు ననపాయిని మహావనీమహేశ !
అవనియును మిథిలాయోధ్య లడవి దైత్య
వసతియును నల్పములు తదావాసములుగ 213

ఉ॥ నీవు వశిష్ఠశిష్యుఁడవు నీవు సమస్తతపస్విరాట్తపః
శేవధి వెల్లదేవతలు చెందిరి నీ మనమందు యోగవి
ద్యావధియైన సృష్టి భవదద్భుతదేహము నీకు దుఃఖరే
ఖావివశత్వ మేమిటికి గాఢసమాధిపరిచ్యుతంబుగన్ 214

ఉ॥ ఉంరన మేదు యోగపదలుబ్ధకు సీతకు సేఁగిలేదు నై
కుంరముసందు నున్న రమకుం ఘటియించిననైనఁ గాని నై
కుంయునియందు స్రింసనము, క్షోణిసుతామణి కెందు నీదెసన్
కుంరముగాని సుస్థితికిఁ గొంచెపుఁబాటు ఘటిల్లదెన్నఁడున్ 215

వ॥ పార్వతీపరమేశ్వరులు సీతారాము లన్నవి దాఁటి సృష్టిలో నిజమైన ద్వంద్వసమసనము లేదు. ప్రభూ ! మన్నింపవే యని మరియు నిది చూడుము 216

మ॥ పదునాల్గేండ్ల వనంబు కొన్ని నెలలన్ బర్యాప్తి రేఖాసమా
స్పద మీ లోపుననే దశాస్యమథనత్త్వాకన్యకాయోగ సం
పదయోధ్యాగమనంబులుం జరుగుఁ దప్పంబోదు త్వాదృఙ్మహా
స్పదనప్రౌఢచరిత్ర యింకొకగతిన్ సంఘింపఁబో దెన్నఁడున్ 217

ఉ॥ చిత్తయమంబు హ్రాసమును జెందగనీయకువే సహాయసం
పత్తియు నేర్పుమైఁ బొసఁగుమాదిరిఁ జూడుము కల్గియున్న దే
క్రొత్తయుగాఁగ నన్నియును గ్రొఁత్తతనంబును గల్గెఁగాని తా
నుత్తముఁ డాతఁ డేది మఱియుం ఘటియిల్లునొ దానఁ గ్రొత్తయై

గీ॥ అన్నియును జెప్పి తనయును నన్నగారి
పైన యాకృతిసామ్యంబు నవసరంబు
మాటనడ యొండు చెప్పుట మఱచినాఁడు
మఱపు మిక్కిలి నంతియే మంచివాఁడె 219

క॥ అనినన్ రాముఁడు నాస్యం
బున నూతనమందహాసముల కందళముల్
కనిపింప మరల నురిమెడు
ఘనమై యీరీతిఁ జెప్పగా దొరకొనియెన్ 220

చ॥ వెలయు మయూరముక్తములఁ బింఛములన్ వనమెల్ల దోఁచు మ
చ్చలపులివోలెఁ గాననము సన్నగ లోఁతువచేసె నన్ను ని
మ్మలధరణీజ నన్ను విడిపోయినఁ గామినివంక చుట్టముల్
వెలఁదియు వీడిపోయినను వీను చరింతును కానియట్టులన్ 221

గీ॥ అక్కటా పనీసతుల రజోఽవకీర్ణ
పులిన జఘనంబులందునఁ బొందియుండె
నచ్ఛమూర్తులు మానసహంసరాజి
పరగు కామమ్మునకు హద్దుపద్దు లేదు 222

మ॥ శరదాజ్జ్వల్యవిభాసి వక్షపరితశ్శాఖాసమూలాంత భా
సురపత్రాంతరవీథికా వినిసరత్సూర్యాతపక్రామణో

పరిశుష్కంబులు వన్యభల్లుకమహావ్యాఘ్రాది జంతూజ్జ్వల
త్ఖురఘట్టానుపదాల్పగర్తములు పాదూహీను బాధించెడున్ 223

ఉ॥ గవ్వలు పూని పందెములు కచ్చుటకై తొలిజాము వేళ తా
రివ్వనఁ జేతిలో గలపరించినటుల్ కల వింక సంతతుల్
మవ్వముగాఁగఁ జంక్రమణమండలవైఖరిఁ బర్యటించెడున్
గ్రువ్విన చిన్నిసంకువుల గోలకహారము నూచినట్టులున్ 224

ఉ॥ స్నానముచేసి శుద్ధవసనంబులు తాలిచి సంజవన్నె బొ
ట్టూని విపక్వశాలివన ముజ్జ్వలమోహనపారిజాతపుష్
సూనములూని కాలపురుషుండును శ్రీహరి మేలుకొంటకై
తానయి వేచియుండె సముదారసమర్చ పొనర్చ నెంచుచున్ 225

మ॥ ప్రకటోర్వీజ సితప్రసూనభరసంభారోజ్జ్వలద్వేణి చం
ద్రికయన్ సన్నని తెల్లచీరను మెయిం దీర్చెన్ మనోజ్ఞంబుగా
రకపూ చందనవాయులిప్తయు వియత్ప్రావారశుక్లాభిసా
రిక యీ యామిని యెందు బోయెడిని నారీరత్న మీయత్నమై

ఉ॥ ఈతఁడు నేను దేవతలనే పరిపోషణచేయుచుందు మ
ల్లె తనయందు నేనుచు మరీతఁడు నాదెస మైత్రి పూనెనోఁ
జేతమునందు నాకు దయచేయడు చంద్రుఁడు వర్షవేళయం
దీతనితో సమానముగనే పరితప్తుఁడనైతి నేనునున్ 227

ఉ॥ మ్రోఁతలుపెట్టు బంభరసమూహపుఁ దేనియ జల్లువాఁడు సం
భూతలతాంతపుష్ మెఱుపు మొత్తమువాఁ డసితాంగుఁ డుద్వహ
ద్వాతనిశాతధారుఁడు లతాంతధనుష్కుఁడు వీఁడొకండు ని
ర్యాతుఁడు క్రొత్త వర్షఋతురాజువలెన్ శరదాగమంబునన్ 228

గీ॥ చంద్ర హంసలు సితమేఘ శైవలినులు
తారకాసూనములును జ్యోత్స్న విపక్వ
శాలికాస్తంబములు నాకసంబు ధాత్రి
తెల్లనై సత్త్వగుణమె సందీప్తమయ్యె 229

శా॥ పరమోద్దీప్తభుజాపరాక్రమనిధుల్ వైరాయమాణుల్ పర
స్పరబద్ధస్ఫుటమత్సరుల్ నరపతుల్ సాధింపఁగా నొక్కరొ
క్కరిపైఁ బోయెదు కాలమియ్యది నదీకాండంబు తార్యంబుగా
ధరణీభాగము సైన్యఘట్టనసహత్వం బూని యేపారెడున్ 230

గీ॥ ఇంతవరకును జాడలే దేమనవలె
నేను చెప్పినదే మరి నిజము కాను
వలయు లేకున్న యెడల నీపాటికైన
రావలయుఁగాదె యెన్నున్న రాచపనులు. 231

మ॥ టకటాం కాతసకోసనై యెదురు చూడంజూడ నాకున్ నిమే
షకముల్ కూడ యుగంబులై చనెడు వర్షావేళయుం దే ప్రతీ
క్షకు నాలోపల నున్న యోర్పఖిలమున్ సంస్రావణం బందె నా
యెకిమీఁ డెంతటి జాగుచేసెనను దా నీపాటికే రావలెన్ 232

ఉ॥ నిక్కము గాఁగఁ జూచినను నేఁ బడు తొందరకంటె నాతఁడే
యెక్కువగాఁ బడన్వలయు నీతఁడు సర్వగుణాకరుండటం
చొక్కఁడు వాఁడు చెప్పె మతియొప్పని ముక్కుమొగంబు లేని వాఁ
డక్కట! నేను నమ్మితిన యంత వృథాచనె నాల్గు మాసముల్ 233

చ॥ గతము గతమ్మ వాఁ డవును గా దనునట్టిది తేల్చుకోవలెన్
ద్రుతమతి నీవు పోయి యొకత్రోవను వచ్చునొ రాఁడొ కార్యస
న్నుతమతిపూని వెంటనె కనుంగొని రమ్ము విచిత్రమౌ పరి
స్థితి ననుఁ బెట్టినాఁడు వ్యథచెందెదఁ బోయినకాల మెంచుచున్ 234

చ॥ ననుఁ గృపఁ జూడుమంచు గసినాథునకున్ వచియింపుమయ్య నేఁ
దనకును రాజ్యమిచ్చితిని దన్వినిఁ గూర్చిపెట్టినాడ న
మ్మినఁ జెఱుపంగ నాకమును మెచ్చదు నీకును గూడి రామ రా
మునకును గోపముం బరచి మొందుకురా డెవఁడున్ ధరిత్రిలో 235

గీ॥ అన్నకా దెట్లు తా నయ్యె నట్లె మరియు
దానుకా దన్నకొడుకగు దండనీతి

నదియ ధర్మమార్గంబు శిక్షార్హ మేను
భరతభూపతి కార్యనిర్వాహకుఁడను 236

చ॥ ఉపకృతిపొంది దానిఫల మూర్జితభోగము నందుచుండి ప్ర
త్యుపకృతి చేయవచ్చునరి కుప్పరమున్ గనుచుంట యింత న్యా
యఁపుఁబనికాదు నాఁ దెలుపుమీ ! రిపుమారణచాపహస్తు ని
ష్కృపునిఁ బొనర్చికొనకు మనుమీ ! వినిమీలితచిత్తవృత్తియై 237

క॥ ధర్మపరిభ్రష్టంబగు
కర్మ సమస్తంబు మంటఁగలుపుటకు ధను
ష్కార్మారంభము నాదియ
ధర్మము లవమైనఁ గాదు తానని చెపుమీ 238

చ॥ సఖితకు సాక్షిగానగు నుషర్బుధుఁ జూచి క్షమించితిన్ వియో
గ ఖరవిదారణోగ్రతయుఁగాఁ బొనరించినయట్టిదానికిన్
ముఖమును నద్ద మున్నయవి పొల్చుగఁ జూచుకొనంగవచ్చు న
ప్ప ! ఖరుఁడు దూషణుండు తమ వాలియు వారిని జూడవచ్చునున్

గీ॥ ఎదిరిపక్షమ్ము సాధువై యొసఁగెనేని
వందరెల్లు సాధువులము వారికంటె
ఎదిరిపక్ష మసాధువై యొసఁగెనేని
వందరెల్లసాధువులము వారికంటె 240

వ॥ అదివరకుఁ దానెన్నఁడెఱుఁగనంతటి యీయన్నగారి కోపంబు చూచి సౌమిత్రి జానకీవిరహాగ్ని తీవ్రత నెఱింగి సుగ్రీవునందుఁ బట్టరానంత కోపంబు రా "వానరుఁడు సాధువృత్తమునందు లేడు కర్మఫలానుషంగము లెఱుఁగడు, బుద్ధిమాలి గ్రామ్యసుఖములందు మరగి యున్నాడు, ఇదిగో నేను వానిఁ బోయి వధింతును" అని ధనుస్సు బూని యల్లెత్రాడు మ్రోయించి. 241

మ॥ కనలుంగన్నులఁ దోఁకత్రొక్కిన భుజంగంబట్లు నిల్వంగ నం
తన గాంతారనివాసదేవత లనంతప్రౌఢకోపుం గనుం

గాని భీతాకృతులైనటుల్ పవనసంఘట్టాగ్రిశాఖింయుగాఁ
జనియెఁ మిన్నులయందు లో నద్రుచు భాస్వత్స్వాంతఘూర్ణంబుగా

చ॥ కడువడి రామచంద్రుఁ దశకంఠునిపైఁజను జైత్రయాత్ర చా
ప్పుడు ననుకూలతాకలన భంగములేమి యెఱింగి వార్త ప్రు
చ్చెదు పనిమీఁద నవ్వాల నసింపఁగ నింద్రుఁడు పంచినట్టి హె
గ్గడులు తలంచి రంతిపురిఁ గన్గెన దోసమె మేలు నా మదిఁ 243

చ॥ పరిభువగు రామచంద్రునకు వచ్చినఁ గోపము భూతసంతతుల్
విభుఁడు హరింపని మ్మనుచు వెక్కసపాటొకయింత లేక శాం
త భృతమనస్కులై చను నశంతవిధామతి లక్ష్మణుం గనన్
సభయతఁ గంప మొందును విషణ్ణమనస్కుఁడు తొంచు భూతముల్

మ॥ తనకున్ వచ్చినకోపమేమొ యెఱుఁగున్ దా నంతకోపమ్మునం
దున నీ సృష్టియెడన్ దయాగుణసమున్నత్యుజ్జ్వలాత్ముం డగున్
జనకక్ష్మాతనయా మనోహరుఁడు శిష్టంబైన లోకంబు వ
చ్చినకోపంబున విస్మరించెదవు సృష్టిన్ దత్సమాకృష్టులై 245

గీ॥ అందుచే రామచంద్రుఁ డిట్లనియె నాయ
నా! యదింత కోపపడకోయి మఱియు
నేగి నిజముగాఁ జంపెదవేమి! మనకు
మనకుఁ గలిగిన స్నేహంబుమాట చూచు 246

ఉ॥ ఆ భరతుండు నీవును మహానియతాత్ములు సోదరుల్ ధరి
త్రీభరమందుఁ గామనిరతిం గన రెవ్వరు, చూడఁగా నతీ
లోభము చాలచెడ్డది తలోదరి దూరగయై మరింబున
శ్లాఘముగల్గు కాలపుబలంబున కాగుటయంచు నున్నదే 247

గీ॥ చతురుపాయంబు లనుటలోఁ జరమమునులు వృ
థా సమస్తంబు సామసాధ్యంబె యగున
•బుద్ధిపూర్వకముగ ధర్మబుద్ధి పరిహ
రించు టొక్కటె యది విస్మరించు టొకటి 248

క॥ ఆ హనుమకు నాతనిపై
మోహమ్మున్నది ప్లవంగభూపతియంచున్
మోహమ్మున్నది నీకును
నా హనుమపయిన్ విచిత్ర మనుబంధముగన్ 249

శా॥ ఈ కాంతారమునందు వానరభటం బిన్నాళ్ళుగా లేదు శా
ఖాకీర్ణమ్ముగ వ్రేలుచున్నయవి నేఁడా భీతియున్ మాసెనో
కా కిచ్చోటికిఁ గ్రొత్తవేమయిన రాఁగా నైనవో పోయిర
మ్మా కిష్కింధ యథార్థముం దెలియు కేలా గుబ్బిసల్ పొందఁగన్ 250

ఉ॥ అంగలు వేసికొంచుఁ గుపితాకృతియైన సుమిత్రబిడ్డ సా
రంగమృగేంద్ర భల్లుకధురా భయభాగపసర్పణంబుగా
సంగతరామకోపఘురసారణివోలెఁ బ్రదీప్తకార్ముకో
త్తుంగభుజుండుగాఁ బురముత్రోవఁ జనెన్ ధరణీవికంపనన్ 251

ఉ॥ క్రూరముఖోగ్రకార్ముకము కొప్పును గాంచి వనీభుజంగసం
వారము వేఁడో వైరి తమపై కురగేశ్వరుఁ డెత్తివచ్చునా
దూరధరిత్రిదేశములఁ దోఁకలపై నిలుచుండి దూరముల్
చేరినయంత నూఁపులు చెందు ధరానమితోత్తమాంగముల్ 252

వ॥ అంత భూరుహప్రస్తరంబులు హస్తంబులఁ గీలించి కిష్కింధాపురీ ముఖద్వారోభయపార్శ్వస్థ గిరిశేఖరంబుల మహావానరంబులు విహ్వాలించిన సాజ్యాహుతసమగ్రహవ్యవాహనుంబోలె సౌమిత్రి పులకితజటాశేఖరుండై జ్యాప్రసారితహస్తుండైన నవి పారిపోయి 253

మ॥ భయసందానితధీకులాచు విని పింపంబోయి సుగ్రీవు, వి
స్మయి, మైరేయవిఘూర్ణమాన నయనచ్ఛాయాసనాథున్ మనో
హయనిష్ప్రగ్రహవేగు వార్త కతఁ డప్రాప్యుండుగా నయ్యె న
క్షయసంగీతక నాట్యమర్దళ మహాస్వానాబ్ధి దూరేత్యుఁడై 254

శా॥ వాలిప్రాణమహాభుజంగమము చాపప్రోషకోట్యుత్ఫణా
భీలుం డుండెనె వానితమ్ముఁ డితఁ డా వీసుండుకా దౌను ప్రి

జ్వాలాభీలుఁడు వానికంటె విషసర్పం బేగుదెంచెన్ బురిన్
బాలస్త్రీజనవృద్ధులందఱు గుహాభాగంబులన్ దాగుడీ 255

ఉ॥ గుబ్బిసలాడుకొంచుఁ జిఱుగుంపులొకొక్కరిఁ జెప్పికొంచు నీ
రుబ్బిన చెర్వులోఁ దబకలూగిసలాడినయట్లు సర్వముల్
లిబ్బి హరింపఁగాఁబడినలీల నితస్తత ఉద్భ్రమంతులై
కబ్బిలులట్లుగా మెలఁగఁగాఁ బురి పొల్చె విలీనమూర్తియై 256

శా॥ లీలన్ వాలినిఁ జంపె నంతబలశాలిం జూడ నెట్లుండునో
శైలాభుండు పరాక్రమాబ్ధి యని యెంచన్ వాని తమ్ముండు ని
ర్వేలాశీవిషమూర్తి భ్రాత్రధికుఁ డీ వీకుండు నేతెంచె నం
చోళిన్ గొందఱు చూడవచ్చిరి బలాఢ్యుల్ వానరుల్ లక్ష్మణున్

ఉ॥ చూచిరి రామసోదరుని సుందరకర్బురవర్ణ దేహునిన్
జూచిరి రామసోదరుని శూరజనావళి మౌళిరత్నమున్
జూచిరి రామసోదరుని క్షుబ్ధలతాభ్రుకుటి ప్రచండునిన్
జూచినయంత శౌర్యపు విశుద్ధసముత్సుకభావ మేర్పడన్ 258

ఉ॥ చేసిన వీనితోడ నని సేయవలెన్ మదియందు గెల్పుపై
నాసకుఁగాదు నాహవమునాడితి మీతనితోడ నన్న సం
తోసముకోసమై కడిమితో బరిమీఁదఁ జలించు పాముగా
నీ సుకుమార దేహుఁడు వహించెడు నేపు చూచుకోసమై 259

క॥ మరి గోలాంగూలచమూ
పరివృఢులు శిలామహీజపాణులు దంతో
ద్ధురవికటహాస రేఖా
పరాక్రమాభిముఖు లైన వారిం గంచున్ 260

శా॥ అంతన్ లక్ష్మణుఁ డుజ్జ్వలద్విఘురకోపానూనపాత్రై, శ్రవః
ప్రాంతాకృష్టగుణాభిమర్శన మహాస్వానోగ్ర రేఖావెగం

తాంతస్ఫారపరిస్వనుండయిన భీస్వాంతంబు కల్గన్ శిలా
సంతానంబులు పారవేసి చని రాశ్చర్యపరిహాసాస్యులై 261

గీ॥ ఒక్కొఁడొక్కఁడు కపిరాజు లుగ్రబలులు
కొందఱకుఁ గల్గు పందయేన్గుల బలంబు
కొందఱకుఁ గల్గు వేయియేన్గుల బలంబు
వికృతదంష్ట్రాననులు మహావీర్యనిధులు 262

క॥ నానాబీభత్సముగా
నైనం గిష్కింధ చూచి యంగదుఁడు భయ
స్థానమ్ము కోట వెల్వడి
యానతశిరుఁ డంజలించి యరుదేరంగా 263

వ॥ లక్ష్మణుండు చూచి "వత్సా ! సర్వజగన్నాథుం డయిన శ్రీరామ
చంద్రుని తమ్ముండు పరవీరహుండు సౌమిత్రి వచ్చి ద్వారమున
వేచియున్నాడని నీ తండ్రితోఁ జెప్పుమన నంగదుండు "తండ్రి
తోనా" యనిన 264

గీ॥ సరగ నంగదు లోచనాంచలములందుఁ
బొరిపుగాంచి కన్నీరు గిరుమని తిరిగె
సరగ లక్ష్మణు మానసాంచలమునందు
వాలివధవార్త సూక్ష్మవిభ్రాంతిఁ దిరిగె 265

ఉ॥ అంగదుఁ డేగి తండ్రి చరణాంబుజయుగ్మపదంబునందు సా
ష్టాంగముగాఁ బ్రణామకలితాననుఁడై తన తల్లికిన్ నమ
స్సంగతశీర్షుఁడై రుమకుఁ జాగిలి మ్రొక్కి సమీపధాత్రి ని
ల్చెం గొడుకుం గనుంగొనినఁ జిన్నరికన్నులఁ దార యాతఁడున్

శా॥ ద్వారంబందున నిస్వనద్గుణసముద్యత్కాలపాథోధిగం
భీరారావుని నిల్చియున్న యల సౌమిత్రిన్ గనుంగొంచహో
యూరెల్లన్ భయలీనమైనయది వ్యాఘోరస్కుఁడా లక్ష్మణుం
డాగూఢోజ్జ్వలకోపవహ్ని నను నిట్లాడెన్ శితాక్షంబుగన్ 267

క॥ నీ తండ్రి తోడఁ జెప్పుము
సీతాపతి పంప ద్వారసీమ న్నిలుచున్
దూతాకృతి లక్ష్మణుఁడన
వే తెలుపగవచ్చినాడఁ బృథ్వీపతితో 268

క॥ కుణుకింకిణీక నవమధు
కణగణసంపాతరావకంబులు గీతా
చణ గళమర్దళదళని
క్వణములు వేణుస్వరారకంబులు తిరుగన్ 269

గీ॥ సకల పశుభాన సామ్రాజ్యచక్రవర్తి
యమితమైరేయపాన విహ్వాలముఖుండు
సర్వపుష్పశరుండు దించని ధనువున
నెడ తెగని నారిమ్రోఁత మ్రోయించుచుండె 270

క॥ అంతఃపురాన సుగ్రీవున
కింతయు వినిపించలేద యేమనెనో పద
ప్రాంతస్థుఁ డంగదుఁడు తా
నంతట గనిపించలేద యక్షుల కచటన్ 271

గీ॥ కిలకిలారావములుచేసెఁ గీశవితతి
పొరిది హర్షాన సౌమిత్రిచుట్టు చేరి
తన్మహాధ్వానమును విమత్తలము చేరి
గుమ్ముకొనిచొచ్చె నంతఃపురమ్మునందు 272

వ॥ అమ్మహాధ్వానంబునకు సుగ్రీవునకు మెలఁకువ గలిగి కనులలోఁ దెలివివచ్చి చెదరిన హారంబులు సవరించుకొన నయ్యెదను చూచి యంగదుండు చెప్పిన మాటలు విని ప్లక్షప్రభావులను నిద్దఱు మంత్రులు సుగ్రీవున కిష్టులు ధర్మనిర్ణేతలు రాజుతో 273

ఉ॥ నీయెదుటన్ నిలంబడియె నీ ప్రియపుత్త్రుఁడు దీప్రభక్తిరే
ఖాయుతుఁ డంగదుండు కడకన్నులఁ జూడుము సుప్రసన్నరే

ఖాయతి నేఁడో చెప్పుటకుఁగాఁ జనుదెంచినయట్టులుండెఁ దా
నై యువరాజు రాజ్యవిషయంబునఁ బొందర యేమిక ల్గెనో 274

క॥ ఏదో రాజ్యాభయంబు
త్వాదిల్లినయట్లుగాఁగఁ బలికెదు సఖుఁడా
కోదండితమ్ముఁడుగ్రుఁడు
కోదండముపూని నిలచుఁ గోట్లమ్ముఖమునన్ 275

వ॥ మరి వినీతుఁడై సుషేణుం డిట్లనియె 276

ఉ॥ త్రావిన రామ్మొ గ్రుద్దినవిధంబునఁ జేయుట లగ్గుగాదు నీ
భూవలయాధిపత్యమును బొందిన కారణమున్ నిరాధృతి
శ్రీ వెలయంగఁజేయుట నిషిద్ధపుఁగార్యము వేల్పుపిండు తె
న్నైన వినుతించరానిది సురాధికసేవనదుష్టమై చనున్ - 277

వ॥ మరి నలుం డిట్లనియె. 278

క॥ నీచేతఁ బంపఁబడి బా
హాచతురుని రామచంద్రు నంగదుతోడన్
వాచించితి మప్పుడు నీ
కై చెప్పించుకొనుట తగునా! యీవేళన్. 279

వ॥ అంత నీలుండు శీఘ్రుంబుగా నిట్లు చెప్పె 280

మ॥ నలుఁడున్ నేనును తారుఁడున్ హనుమ భూనాథుండు నీవాట మి
క్కిలిగాఁ గోరితి మా మహామహునితోఁ గెలించి నేస్తంబు తా
నలఘుం డాయన మాటపై నిలుచు బ్రహ్మాండంబు క్రిందైనఁ దా
నలఘుం డాయన వింటిపై నిలుచు బ్రహ్మాండంబు మీఁదైనన్ 281

వ॥ మరియుఁ బులకితతనూమంతుండైన హనూమంతుం డిట్లనియె 282

మధ్యాక్కర :—

పరమధర్మాత్ములు సత్యభాషులు బద్ధసఖ్యులును
ధరణి మహాభారవహనదక్షులు దళితాఘచయులు

నరరే! తండ్రి యొసండు ధాత్రి త్యజియింపుమన్నఁ ద్యజించు
నరయంగ నెనఁ డన్న వెంట నడవిలో ననుగమించెదును 283

శా॥ ఔదార్యాభినవాభిరామగుణ మర్యాదాస్వరూపుల్ మహా
మోదాచ్ఛాంబుసరస్సరోజవదనుల్ పుంభావసంవిత్తు లో
హో! దివ్యన్మఘురావలోకనులు ధర్మోదారవాగ్గుంఫనుల్
సౌదర్యోజ్జ్వలతానిధానులు భవత్సఖ్యప్రసందీపితుల్ 284

క॥ ని న్నాశ్రయించి రగ్గిరి
నున్నప్పుడు మనము, వేచియుండిరి నీకై
యన్నట్టిమాట నిలుపుకొ
న న్నీకును నేఁటి కాగిపది కపిరాజా 285

గీ॥ వాలిలోఁ దమ్ముఁ డొకరుండు ద్వారసీమ
నిలచియున్నాడు నేడు జ్యానిస్వనమున
నిఖిలదిక్కటాహముల ఘూర్ణిల్లఁజేయు
చిన్నినాళ్లుగ మనకోస మెదురుచూచి 286

మ॥ కడఁకన్ నేనును బోయి యా ప్రభులకున్ గాన్పించుకోలేద నా
యొడయండో భవదాజ్ఞ లేక మరి తా నొక్కండు దుర్వారుఁడై
గుడుసౌ విల్లును బూని వచ్చి నిలచెన్ గోట్టాగ్రభాగంబునన్
వడిగాఁ గాయమొ పండొ తేల్చుకొని పోవన్ వచ్చియుండుంజుమీ

మ॥ భ్రుకుటీజ్వాలల రోదసీకుహరమున్ ముట్టించునో యన్నటుల్
వికటాస్యుండును విస్ఫురద్వదనుఁడున్ విస్ఫారకోపోగ్రవ
హ్నికదిక్పర్ణకుటీరనీవ్రములు మండించున్ ధనుర్జ్యానినా
దకవల్లీమయవాగురానిపతితుల్ తారాడఁగా వానరుల్ 288

క॥ తనకుం దెలిసిన విషయము
జననాథునకున్ వచింపఁజను మంత్రులు ల
క్ష్మణు కోపతాపములు రా
మునియవి సౌమిత్రి సహజముగ యోగి యగున్ 289

గీ॥ తనకుఁగలిగిన కోపంబు జనుఁడు తనకుఁ
దానె యుపసంహృతిం జేసికొనువచ్చు
పరుని కోపపరిభావంబుఁ బడయనగు జ
నమ్మునకును నాత్మాధికారమ్ము లేదు 290

గీ॥ మూలభూతునిదగు కోపమునకు హేతు
వపనయింపంగఁబడుటయే యవధి దాని
కద్దమునయందుఁ గిరణంబు లక్షులందుఁ
బొడుచుగతి సూర్యకిరణముల్ పొడువలేవు 291

ఉ॥ క్రిమ్మిన కోపమొప్ప యువరాజును జెప్పెను దాను వచ్చి ద్వా
రమ్మునయందు నుంటినని రాజునకున్ వచియింపుమంచు నీ
సమ్ముఖమందునన్ మనవిసల్పెడు నీ ప్రియసూనుఁ డంగదుం
డిమ్ముగఁ గన్నువిప్పి కనుమీ! వినయాన్వితునిం గపీశ్వరా 292

చ॥ చని తలతోఁ బ్రణామమును సల్పి సుమిత్రసుతున్ బ్రసాదభా
వ నిభృతుఁజేసి నీ వనిన వాక్యము నిల్పుకొనంగఁ జూడు రా
మునిదెస వాక్యపాలన మమోఘఫలంబగు వేరు వాక్యపా
లనమునఁ గల్గనైనది ఫలంబున కిబ్బడిముబ్బడై చనున్ 293

వ॥ అనిన సుగ్రీవుం డంగదునివంకఁ జూచిన నంగదుం డిట్లనియె. 294

శా॥ ద్వారంబందున నిస్వనద్గుణసముద్యత్కాలపాధోధిగం
భీరారావుని నిల్చియున్న యల సౌమిత్రిం గనుంగొం చహో
యూరెల్లన్ భయలీనమైనయది వ్యూఢోరస్కుఁడౌ లక్ష్మణుం
డాహాఘోజ్జ్వలకోపవహ్ని నను నిట్లాడెం బ్రచండాక్షులన్ 295

క॥ నీ తండ్రితోడఁ జెప్పుము
సీతాపతి పంప ద్వారసీమను నిలచున్
దూతాకృతి లక్ష్మణుఁడని
వే తెలుపఁగవచ్చినాడఁ బృథ్వీపతితో 296

వ॥ అది విని సుగ్రీవుండు తన యాసనంబు డిగ్గి హనుమువద్దకుఁ బోయి
యాతని చేతులు పూని యిట్లనియె 297

క॥ అచ్చముగ నంతకోపము
వచ్చుటకును సూర్యసూతివలనను దోషం
బచ్చుపడ నుండవలెనా
వచ్చినదన వచ్చెననుట వాక్యపుఁదగవా ? 298

గీ॥ దుష్టపో తీనిన దనంగ దూడఁగట్టి
వేయుమన్నట్టు లున్న దీ విధమునూడ
నొక్కమాట నే నన్నది యున్నదా ! యె
కంత చెడునూహనూడ రానట్టివాఁడ 299

ఉ॥ తమ్ముఁడుకాక రాఘవపదద్వితయంబునయందు భక్తిభా
వమ్మున నాకు నెక్కుడె సవసుమిత్రాత్ముఁడు లక్ష్మణుండు నా
తమ్మునియందు గౌరవము తక్కువకా దది నాకు నింతకో
పమ్ము నతండు నాదెసను బట్టుట యర్థముకాదు నాకిటన్ 300

గీ॥ ఏరొ నేనన్నఁ గిట్టనివారు పోయి
నాపయిన నేమిచెప్పిరో నాథుతోడ
నాపయినఁ గోపమును వచ్చునా ! రఘుపతి
కకట ! స్నేహమ్ము నమ్ముటయనుచు లేదె 301

శా॥ నాయం దింతగఁ గోపమందుటకు నేనా ! సీతఁ గొంపోయి యెం
దో యేరాళపు దాఁపుడుంచితిని ? తా నుర్వీజ నాయింటిలో
నా యెందున్నదొ చూచుకొమ్మనుము భూపాళుల్ మరిన్ మున్నె య
న్నా యిందంచును చేతఁబెట్టితిని నేనై దాఁచుకొన్నానయా ! 302

గీ॥ అతఁడు వచ్చి నన్ను నాశ్రయించెనకాని
యతని నేను పోయి యాశ్రయించ
నతఁడు చూచిన జగదధికుఁడు కావచ్చు
దా నధర్మ మంత ధర్మ మనె 303

క॥ రాముఁడు కావచ్చును మరి
సౌమిత్రియుఁ గానువచ్చుఁ జలియింప భయం
బేమీ నాకును జెప్పిన
యామాటకు వెనుకఁబోయి నప్పుడుకాకన్. 304

గీ॥ మనసు చంచలంబు మైత్రి నిల్చునె యెందు
నగ్నిసాక్షిగాఁగ నయ్యుఁ గూడ
వారిపనిని ముందుఁ దీరిచి యాపైన
జూచికొంద మాత్మశుద్ధిమాట. 305

వ॥ అనిన మంత్రకుశలుండైన సుగ్రీవునకు వాక్యకుశలుండైన హనుమ 306

శా॥ నీ వాగ్దానము విస్మరింపవనుటే నీ యాత్మసౌభాగ్యరే
ఖావిస్తారత చాటిచెప్పెడును నీకంటెన్ సుహృన్మౌళియున్
సేవాదక్షుఁడు సజ్జనోత్తముఁడు దాక్షిణ్యంపుఁబ్రోవుం డీ
భావం బచ్చపుఁబైఁడి ధర్మధిషణాపారీణ ! కీశేశ్వరా. 307

క॥ తా హృతదారుఁడు వర్షా
నేహంబులు మేఘవాహినీ దుస్సహముల్
స్నేహపురస్సరకోప
వ్యాహారము లాడియుండవచ్చును బ్రభువై 308

ఉ॥ తెలుపులుకట్టెఁ జొక్కపునదీసతు లంచలపూలచీర ది
క్కులు సవరించె తెల్లులు మొగుల్లుఁ బరస్పరమా జిగీషచేఁ
బలె హంసమాళిచామరవిభారమణీయసితాతపత్రమం
జులత వహించె నీవు దయచూడవు రాముఁడు నిల్వజాలునే ? 309

చ॥ కురవకనామముల్ కుటిలగుల్మకముల్ పరిణామదీపనాం
తరరుణవర్ణముల్ తెలిసినల్ కుహనాకృతి విచ్చెఁ దెల్లనె
త్తురు చిఱుచుక్కలై యుబికి తోఁచెడుపోలిక సాగివచ్చె నీ
శరదృతు వీవు సేనఁగొని సాగవు కోపము రాదె స్వామికిన్ ? 310

గీ॥ తెలివయున్న యునికి తెలిసి జీవితము భ
ద్రమ్మటంచు నెఱిఁగి తత్ప్రయత్న
మందు జాగు నైన నగుఁగాక యిట్లు ని
శ్చయమునందుఁ జాలు స్వామి యొకఁడె 311

ఉ॥ నాలుగుమాసముల్ నిలచినాడు కృపారసమూర్తి లిప్తయుం
జాల డెవండు నంత జలజంబులు విచ్చి లతాంగికన్నులం
దాలు స్మరించి విస్మృతిపదంబున సాగిన యాతనాశర
ద్వేళకుఁ గోపమందుటయు వెక్కసమా నటవే కపీశ్వరా 312

క॥ దానికి నీ వేమియు నను
గోనేరా దాయనకును గోపము గలుగన్
బైనను గోపము మిత్రుని
పైనం గా కెవరిపైన వచ్చును జెప్పుమా. 313

శా॥ మరియుం గోపమువచ్చి పంపెను సమున్మత్తారికుంభస్థలీ
ప్రసరదద్దారణ దంష్ట్రికానఖ సటాపంచాస్య మా స్వామి యు
ద్ధురుఁడౌ తమ్ముని మంచివాఁడుగనుకన్ దోసంబు విస్పష్టమై
పరఁగుంబో మనయందు స్వామికిని గోపంబెంతయున్ న్యాయమై

శా॥ నూల్కొ నీవు కృతజ్ఞలోకమునయందున్ శేఖరీభూతుఁడౌ
దల్కంబొందిన స్వామి యల్క నిముసంబై పోవుఁబో దీర్ఘకో
పు ల్కా రుత్తములైన తాదృశులు పాపుల్కారయా త్వాదృశుల్
మేల్కో స్నేహ మదెంతయుత్తమము మీ మీ మధ్యఁ గీశేశ్వరా

ఉ॥ ఆతలివాఁడు తాఁ బెరిగినప్పుడు తగ్గనలేన్ సఖిత్వవి
ఖ్యాతపులక్షణంబుగ మహాత్ములు వా ల్పెరుగం దలంచినన్
భూతలమున్ దినంబు మరి భోగిజగత్తును నిండిపోదురే
నీతి యొకండుగా నెదురునిల్చును దాదృశులైనవారితో 316

ఉ॥ అగ్గినలెం గవాటమునయందుప నున్న సుమిత్రబిడ్డనుం
డగ్గరి యంజలించుచు విడంబనమాలి సఖిత్వరీతికిం

దగ్గ సపర్యచేసి యరుదారఁగ సాధుపథంబు చూపుమీ
యెగ్గు నొకంతయుం దలపవేకద ! తోడవు మంచిమాటలుౕ 317

వ॥ అంతఁ బ్రతివీరహంతయైన లక్ష్మణుండు ప్రతిసమాదిష్టుండైకిష్కింధా పురంబు ప్రవేశించిన ద్వారస్థులయిన మహావానరులు ప్రాంజలులై నిలచి క్రుద్ధాకృతియైన యతనింగాంచి భీతులైదూరమునంద నిలచిరి.

హయ ప్రి చా ర ము :—

రాజతంబు రత్నమయము
భ్రాజితంబు ప్రసవమయము
రాజగృహవిరాగమూర్తి
తేజువెలుఁగ దిశలఁ జొచ్చె 319

తు ర గ వ ల్గ న ం బు :—

రెండుదెసల సౌధరాజి శ్రీనిధానహోమదీప్తి
రెండుదెసల నాపణములు శ్రీనిధానరత్నఖనులు
రెండుదెసల పుష్పితాగ్రవృక్షసమితి వీధివ్రాలి
నిండుచల్లఁదన మొసంగు నిబిడపత్రమధురరేఖ 320

వి జ య మ ం గ ళ ము :—

దేవయోనులైన కీశదివ్యమూర్తు లేగు వీధి
పూవుదండ లొప్పువారు భూరిభుజులు కామరూపు
లావితేరు గంధపూఁత లంగములను బొంగువారు
శ్రీవిలాసగంధి మాధురీసురావిలోచనులును 321

ద్వి ర ద గ తి :—

పథమెల్ల మైరేయబహుళ ప్రసూనార్తి
మధువాసనా సమున్మాదకంబై యొప్ప
పథమెల్లఁ బటవాసపరిమళశ్లథమాన
పృథులవాయుతరంగవిధుతమై యేపార 322

విజయభద్రము :—

ద్వారిప్రక్కన ధరాధరకోణఘనశిలా
త్త వితర్దికాపరిస్తరణ రమ్యంబైన
దారిమధ్యన ధరాధరఝరీ సారణీ
దరనీలపరిలఘూత్తమ వారిమృదువైన 323

మధురగతి :—

గవయుని యంగదు గజశరభులయును
ద్వివిదుని మైందుని ధృతమతిఁ దారుని
యవసథములు మణిహర్మ్యములం గను
చవిరతకోపుఁడునై చను రఘుమణి 324

హారిగతి :—

హనుమజ్జాంబవదవసథములు సూ
ర్యాక్షుని సౌధము విద్యున్మాలిది
యు నలునిది సుబాహునిదియు కుముదుని
యు సుషేణుని తారుని గేహంబులు

కనుచుఁ లక్ష్మణుఁ డాగెఁ దచ్ఛ్రీ
కాంతిఝుళంఝుళితాక్షుం డగుచుఁ
వినమత్కీశేశ్వర పరిగణనా
పేతదృశాంతుఁడు రక్తాక్షుండై 325

హారిణగతి :—

ప్రతిగృహమందున బహుమణిసుషమ
ప్రతిదేహళి సుబంధురకాంతి
ప్రతితోరణము పచ్చల మెఱుపు
తతనేత్రములు ధగధగలాడి 326

వృషభగతి :—

పాండురాభ్రప్రకాశములును ప్రభూతధనధాన్యములు, లక్ష్మ
భాండారములు కనుంగొంచును బ్రసవమాల్య యుతములునేగి
పాండురసాలవృక్షకలతా పరిక్షిప్తము దురాసదమును
మండితవానరేంద్రగృహమును మహేంద్రసదనోపమము గాంచె 327

క॥ నవకనకసదనభవన, య
నవరత జలఝుర పరివహనకమన, సలతాం
తవిమలఫలనతపాదప
రవణపటహా, ప్లవగ పటలరాజస్థానిన్ 328

క॥ అసిపాణి కపికులేశ్వర
విసృత్వరభుజాభిగుప్తవివృతద్వారా
భ్యసనాష్టాపదతోరణ
విస్ఫురకాంతిచ్ఛటా నవీకృతశోభన్ 329

క॥ కమలానివసన, ప్రవసన
కమలాప్తాతపసమృద్ధ కమనీయకుజన్
విమలామధురకధూపిత
విమలానిలవాయు మధురవీచీపూర్ణన్ 330

వ॥ అంత లక్ష్మణుండు సింహద్వారమ్ము జొచ్చి నానాజనసమాకులమ్ము
లయిన సప్తకక్ష్యలు కడచి యష్టాపదపర్యంకంబు సువర్ణాసనము
మహాస్తరణోపేతమ్మైన యంతఃపురంబు ప్రవేశించి 331

మత్తమయూరము :—

నానాభూషామంజుల నారీచయ మంతన్
రానుంబోనున్ నూపురరావంబులు కాంచీ
స్థానాలోలత్కింకిణి సంరావము గాఁగన్
గానంగా నైనం గని కన్నుల్ చలితంబై 33

మదనదర్పణము :

కోమల కలనాగళాగ్రి సంకుచద్రవంబుగా
ప్రేమమెయి విపంచికావిమర్ది యంగుళీచ్ఛటల్
గామవివరణోగ్రగీతికా కలస్వనంబులన్
గ్రామవిన్మృతిం బాడ వించునే కలంగి గుండెలో 333

మణిరంగము :—

పూలతావులు ముక్కులలోనన్
కాలువల్గాని క్రిమ్మిన యంతన్
హేల కంతని యెంచగరాకన్
బాలికల్నడువన్ తనముందున్

పృథ్వి :—

తన నిలచినవిధంబు గనుం
గొనరు జడలు వికుంఠప్రవ
ర్తనలని కనలు రా నెదల
క్ష్మణుఁడు ధనువును గైకొనన్ దాన్ 335

వ॥ లక్ష్మణుండు జ్యానిస్వానంబు చేసిన వింజమాఁకిడిన తెఱంగై నవభూ
షాకనకగిరి కాంతిమణిసూర్యాంశుప్రసారంబున వెలుగదయ్యె నాట్య
వేదంబులు మాసె హేలాగమనకర్మ లడంగె మన్మథస్వాహా
కారంబులు మాటుమడంగె. 336

వృషభగతి :—

సౌమిత్రికిఁ గోపము వచ్చినసంగతి తెలిసెన్ సుగ్రీవున
కేమో చెప్పలేద యంగదు డిది నిజమే యని మదిలోపల
గోమలమతి రాఘవునకు మరిఁ గోపమువచ్చిన జగ మేమిటి
యే మైత్రి నిలువగా నేర్చున యీ మైత్రియె యిట్లులైనయెడ 337

గీ॥ ఆసనంబు డిగ్గి యంత సుగ్రీవుఁడు
తారవంకఁ గని యుదారమూర్తి

నీవు పోయి రాముని సహోదరుని కోప
మపనయించునట్టు లాడవలయు 338

ఉ॥ ఇంతులయందుఁ గోపమువహింపరు నిష్ఠురముల్ వచింప రే
కాంతమనస్కులైన మహితాత్ములు తాదృశులైన వీరు లీ
యింతటిదైన కోపమును హేతువులేనిది కల్గె శాంత ము
క్కింత ఘటించిపెట్టవలె హేతువు లేదనునట్టి వేళలన్. 339

గీ॥ మిత్రునందునఁ గోపమ్ము మిళితపంక
వర్షనదికచ్చరము దాఁటవలనుపడదు
అపహతమ్మైన కోపమ్ము నపుడు సితశ
రన్నదివిధాన నతిసుకరంబు దాఁట. 340

శా॥ మాంజిష్ఠంబగు కోపభావము రహింపం బట్టునే హేతుసా
మంజస్యంబు వళక్షభావ మిదియున్ మన్నించి నీవేగి ముం
దంజన్ మంచిగ నచ్చఁజెప్పుము సకృత్తౌ దోసమున్ సఖ్యమున్
సంజాతంబగు కోప మీదృశ ముదంచన్మార్గమా యంచనన్ 341

బంధురము :—

వడివడిఁ దడఁబడు నడుగులు మదిరాబంధుర లోచనకాంతులతో
నడుమున గుడుసగు కనకపురశనా నాదమనోహరకింకిణితో
నొడికపు మెలపున నొరెగిన మెడతో నుజ్జ్వలహాసరదచ్ఛవితోఁ
బడఁతుక చనియెను రఘుకులపతి యొప్పంగను నిల్చినచోటునకున్

శా॥ తారం గాంచినయంత లక్ష్మణునకున్ దవ్వాయ్యెఁ గోపంబు నె
వ్వారున్ భార్యలఁ బంప రాచికోసనన్ వైరంబు మాటాడఁగా
ధీరుం డంత మొగంబు వాల్చికొనియెన్ దీప్తాప్సరఃకామినీ
సారాభోగ మనోజ్ఞమూర్తినిఁ బురస్థన్ దారనుం గాంచుచున్ 343

గీ॥ చెలఁగి భర్తకు జీవికాజీవియైన
పురుషునకుఁ గానిపింతురు పొలతు లెందు

స్వాంతనిశ్చలల్ శుద్ధాంతకాంతలైన
నన్ననో తండ్రినో చూచునట్లుగాఁగ 344

వ॥ మరియుఁ దార యిట్లనియె 345

క॥ మీ మాట యెవరు కాదరు
రేమీ! వాగ్దానభంగ మొనరాఁడిరి నీ
వేమో! యంతఃపుర్ద్వా
స్సామీప్యమునందు వచ్చి జ్యా మ్రోయింపన్ 346

క॥ చెలికాడవును సమర్థుఁడ
వలఘుఁడవును నీవు వచ్చి యంతిపురముముం
గిలి నిలచి నారి లాగితి
చెలికారమునం దదైనఁ జెల్లునుగాదే 347

వ॥ అంత లక్ష్మణుం డిట్లనియె. 348

గీ॥ అంత నిష్ఠురమాడెద నంతెకాని
మరియు నేమందు వాతసమాట నీవు
హారి సుషుప్తిఁ జాతుర్మాస్య లవధరించె
మహితమై రేయపానాతిమత్తుఁ డగుచు 349

చ॥ పొరసి త్రివర్గముల్ ఫలముపూనుఁ జతుస్తమమందు మూఁడుగాఁ
దెరువులుపోయి పాపమగు దేని కదేయయిపోయి ధర్మబా
హిరమగు త్రోవ యయ్యెదియు యెక్కినమైకము దించుకోని యీ
శరదృతు వేగుదెంచినది సాగిన దాశలు దూరమై చనన్ 350

మ॥ నను మాటాడెద వాటదాన వగుటన్ నాయన్నతో నేమి యా
డెను నిద్రాలసుఁడౌట నేమియని యాడెన్ వానికిన్ జ్ఞాపకం
బని యున్నట్టుల లేదు భోగపరమై సామాత్యసంసత్తు ని
ద్రినుగాంచున్ రఘురాముఁ డొక్కఁడె నిద్రాదూరగుండైచనున్

మ॥ ధరణీశుండవువాఁడు పల్కఁడు ప్రియత్నం బింతయున్ లేదు దు
ర్భరమై యాశ్రితుఁడైనవానికిని గోపచ్ఛాయయుం గూడ దు

ర్వారకుఁ దేడవు టెందుకోసమని పౌర్వాపర్య మూహింపనుం
బడు వన్నంతటి సౌకుమార్యము స్వభావంబాటకుం గామినీ 352

మ॥ మతి సుష్ఠుత్వముచేత నర్థమును ధర్మంబుం బ్రిపాల్యంబు లా
మతి సుష్ఠుత్వము పాడుచేయునదిపో మైరేయపానంబు సం
గతపూఁ బాపము దాన నీ క్రమమునన్ గండాడుబో యవ్యవ
స్థితచిత్తత్వముకంటె వేఱుకలదే చెందింప సంఘాతమున్ 353

చ॥ తనపని పాడుచేసికొనుఁ దానొకఁ డయ్యది వానికర్మ మా
తనిని సమాశ్రయించుకొను దట్టుల నిర్మలినార్థధర్మముల్
కనుకని పాడుచేయుట యఘంబును మించు నఘంబు దానికే
మని వచియింతు చెప్పగదమమ్మ! యుదారవిచారవార్నిధీ 354

ఉ॥ నీకిది చేసిపెట్టెదను నిక్కముగా నని వానిచేత నే
దో కమనీయలాభగతి నొందితి వానికిఁ జేసిపెట్టవే
ప్రాకటపాపకార్యపరిపాకము కాదని చెప్ప నున్నదే
యీ కడమాట కేమివచియింతువు శాతవచోనిగుంఫనా! 355

ఉ॥ కోపము తగ్గలే దెదుటఁ గోమలి యున్నదటంచు నుంత సం
తాపముచేత శాంతవచనంబులు పల్కుటెకాని యన్న యు
త్తాపితమానసాంబురుహ తార కనుల్ తెలిచుక్కలై ప్రవి
క్షేపముపొందెఁ గ్రొఁబెదవి చిక్కనిగాల్లఁ బసిండిడాళ్లుగా 356

ఉ॥ ఐనఁ జమూసమూహవిచయాధిక కార్యగతప్రయత్నవి
జ్ఞానసమాప్తిధైర్యగుణసంపదఁ గోమలమందహాస రే
ఖా నిభృతాస్య వామపదకంజవికస్వర హేమనూపుర
స్థానవిరావకింకిణులు సన్నని ధైర్యము నాడుచుండగన్ 357

మ॥ వచియించెన్ మృదుదంతసాంధ్యసుషమా వాల్లభ్య రేఖామలి
మ్లుచగంభీర నయప్రియోక్తుల సమాలోచింపవే ధాయుఁశే
విచరద్దైవతయుల్ భవాదృశులు సావిష్కారకోపచ్ఛటా
రుచిరాత్మల్ మముబోంట్ల కామవశతారూపంబు బ్రాంతయ్యొనే 358

చ॥ మరియును మీకుమీకుఁ గలమైత్రికి సుంత ప్రమాదభావవి
స్ఫురణము నోర్చికోలుఇదె ! భూమిని మీకుగఁ జేసిపెట్టి త
త్పరమప్రభూతమా ననుభవప్రమదంబున దోసమెచ్చు ట
బ్బురముకదయ్య మీరనినఁ బూఁకుమసత్తము లాశ్రితావనుల్ 359

ఉ॥ ఎవ్వరు నిన్నెఱుంగరిట యెవ్వరు నిన్నిట రాలఁ జెట్లకో
రువ్వఁగ నెంచిరో నిను నెఱుంగరు వారిట నిన్నెరుంగరా
దెవ్వరి కా కపుల్ మరియు నెవ్వరొ క్రొత్తల యేల వచ్చినా
రివ్వసుధాతలంబునకు నింతప్రయత్నములేక యుంటిమా ? 360

క॥ తనకైనవారు క్షమియిం
చనిచోఁ బరులా యెడంద క్షమియింతురు వ
చ్చునె కోప మధికసత్త్వుల
కు నల్పబలులపయి ప్రీతికూటముచందుర్కా 361

గీ॥ అల్పబలులమీఁద నలరినఁ బ్రేమంబు
ముద్దు జాలి నవ్వు పుట్టుచుండు
వింటికొప్పుపైకి వెళ్లదు మన సంత
విసువుగలిగెనేని వెక్కసింత్రు. 362

మ॥ జగదేకోజ్జ్వలకార్ముకుల్ నవకపిక్ష్మాకండమైనాఁడు వె
న్నఁగ నీ నేలకు లోకకంటకుని మన్నుం బీడు మార్చైన రా
జుగ నా రావణుకోప మీసు పెరిగెన్ శూరుల్ భవద్ధైర్య మూ
నఁగఁ జాపంబును బూని వచ్చితివి యన్నా ! నీవు మా యింటికే 363

గీ॥ ఇంతదవ్వు వచ్చి యేటికి నూరకే
పోవ రాజుఁ జూచి పోదుగాని
రమ్మటన్న తార రాముని తమ్ముఁడు
తార తెలివి కద్భుతంపడుచును. 364

మ॥ మది సుగ్రీవుఁ జూచునప్పటికి నీమాత్రంబు కోపంబు ని
ల్వదో యీ నేరుపుచూచి మెత్తపడిపోవక్ బోయి యారాజుతో
నది నిష్కర్షగ మాటలాడకయ కార్యప్రోన్ముఖత్వంబు క
ల్గద యన్గొంచును లక్ష్మణుం డరిగె బాలంబట్టి యంతఃపురిన్ 365

గీ॥ రుమ యుభయపార్శ్వములను దోర్యుగము మెఱయ
కంకణంబులు హారముల్ కరములందు
గళమునందున నవమణికాంతి విరియ
సురియఁపిడి మణుల్ బొడ్డునఁ దురగలింప 366

శా॥ స్వర్గాంతఃపురవీధికాశితమణీ శయ్యాశచీదేవతా
దోర్గుంజన్మణికంకణాభరణ సందోహప్రియస్వాన సం
సర్గస్వాదుమనోఽనుకూల నయనచ్ఛాయాప్రియంభావుక
స్వర్గోత్తంబలె వానరేశ్వరుఁడు భాస్వన్మూర్తి దీపింపఁగా. 367

క॥ అవనతముఖాబ్జలై గీ
తవాద్యములు వదలిపెట్టి తన్వంగులు వె
న్క విమలితకుడ్యలేఖా
సవర్ణచిత్రములలీల సందీపింపన్. 368

ఆ॥ పరమశివుని కోపవహ్నిఁ బుష్పశరుండు
భస్మమైనవార్త వచ్చినప్పు
డింద్రు నంతిపురము నెట్లయ్యెనో యట్టు
లయ్యె వానరేశు నంతిపురము. 369

వ॥ అంత సుగ్రీవుండు తనచేతులు రుమమెడనుండి సడలించి యాసనంబు
డిగ్గి లక్ష్మణుని సమీపించి యంజలించి యవాఙ్ముఖుండై నిలచిన
సౌమిత్రి ముకుపుటంబు పడగవిప్పఁ బ్రయత్నించు పసిత్రాచువలె
నద్రువ విశాలారుణోన్నతవక్షస్స్థలంబు నడిమిభాగంబునఁ గదలు
చున్న నెత్తునాళంబులు కనిపించి కటిస్థవామహస్తుఁడు ఋజుప్రకోష్ఠ
దక్షిణహస్తసంగృహీత సశరకార్ముకలస్తకుండు దక్షిణపాదంబు నిబ్బ
రముగా నిలచి యిట్లనియె. 370

చ॥ కనఁబడినప్డు బత్తిమెయి కైజత మోడిచి మిత్రభావ మె
ల్లను దనమూర్తితాలిచినలాగున సర్వసపర్య సేఁతయున్
గనఁబడనట్టివేళకును గానల నుండిరో యూడిరో కనుం
గొనకయినన్ దలంపమియుగా నసమర్థప్రభుత్వవైఖరుల్ 371

చ॥ అతిశయబుద్ధి ధర్మమును నర్థము కామము దూఁచి పాళ్లసం
గతి పరిణామమంజులముగా ననుభూతికిఁ దెచ్చు ధారుణీ
పతి యిహాముం బరంబు సమభాగనిషేవణసాధుభోగియా
నితరుఁడు నేక దేశమున నెంతయుఁ బుచ్చినవృక్షమై చనున్ 372

శా॥ సానుక్రోశుఁడునుం జితేంద్రియుఁడు భాస్వత్సత్యసంధుండు ప్ర
జ్ఞానిష్ఠుండగు ధారుణీశుఁడు ధరాస్వర్గంబుల న్వంటచే
లానందోజ్జ్వలసస్యదాయుల సమభ్యాసంబు భోగించు శ్ర
ద్ధానిష్ణాతుఁడు స్వర్గధామము మహేంద్రస్వామి యెట్లట్లులన్ 373

శా॥ కల్లుం ద్రావుచుఁ గాంతలం గవయుచున్ క్ష్మాభారమున్ మంత్రులన్
బొల్లంబో నిరతంబు నంతిపురిలోఁ బూఁబోండ్ల సంగీతముల్
సల్లాపంబులుగాఁగ భోగనిరతిన్ సంచేత్తయా నీతి వీ
రుల్లోలంబగు ధర్మకూలమున విద్రోహాత్ముఁడై యన్నిటన్ 374

క॥ తన మాటయందు నిలచిన
మనుజుఁడు సురలోకభోగమండలి నిలచున్
జనుఁడు మృషావాది ఫణీం
ద్రనిలయమున నట్టయడుగునన్ గుడుసువడున్ 375

ఉ॥ శ్రీరఘురామచంద్రునకుఁ జిత్తమునందు దయారసార్ద్రివాః
పూరము పోయినన్ నిదురపోవును కార్ముకలస్తకోగ్రవి
స్ఫారశరంబునన్ నిదురపట్టదు నిచ్చలు ధర్మదేవతో
దారపరిష్క్రియారచన దండన మండన నిత్యకర్మతన్ 376

గీ॥ వాలిజుట్టు మిగిలి వచ్చినదేమియు
లేదు నీవు నంగళీప్రమృష్ట

చాపగుణనినాదసాంయాత్రికత్వమ్ము
కంటె మున్న పాణిగమన మొప్పు. 377

ఉ॥ బంధువు లైననుం గొడుకు భార్యయు నన్నలు తమ్ము లైనన్
బంధురసాధుశీలగుణవంతులు కావలె వారివారి సం
బంధము నిల్వగా మఱియు మైత్రి గుణక్రియలం ఘటిల్లు శీ
లాంధుఁడు మిత్రతావిఘటనాంధువునం బడుఁ బోయి నష్టుఁడై 378

మ॥ మొదలన్ మిత్రునియందుఁ దా నుపకృతిం బొందున్ దురాలోచనా
స్పదుఁడై ప్రత్యుపకార మించుక పౌనర్పంబోని దుష్టుండు భూ
తదయాదూరుఁడు వధ్యుఁడంచు నుడివెన్ దా బ్రహ్మ మున్ వాఁడుదు
ర్మదుఁడున్ సర్వకృతఘ్నుఁడున్ గుటిలుఁడున్ మత్తుండు దుశ్చింతుఁడున్

గీ॥ హయమునందు గోవునందు మృషావాది
వందమంది వేయిమందిఁ జంపు
పురుషునందు ననృతము వచించునాతఁడు
నాత్మహంత స్వజనహంత యగును. 380

చ॥ నెగులును బొందియున్ ప్రభువు నీపయి మోహము మానలేదు పూ
ర్తిగఁ జెడఁగొట్టుకోకు పని తీరి యొకించుక గోప్యమున్ గడిం
దిగఁ బ్రభుదుఃఖ మించుకయు నేరన యోర్వఁగ నేను నొల్త నా
మొగచిన కోపమైనయెడ నీవరకే వధియించియుండెదన్. 381

క॥ నీ మంత్రులలో నొక్కఁడు
శ్రీమచ్ఛిఖరాయమాణశేముషి యతఁడున్
దా మృదువు నీయెడన్ నే
నా మంత్రిని జూచి యింత యాగుట యయ్యెన్ 382

గీ॥ అన్నమాటపై నిల్తువో యంపనిప్పు
సెగలయందున సర్వకిష్కింధ బూది
బుగ్గిగాఁ జూతువో చెప్పుము శితశరము
తాళియున్నది నీ సమాధానమునకు 383

గీ॥ అణఁగియున్న వహ్ని యాజ్యసంస్పర్శ చే
మరలఁ బ్రజ్వలించుమాద్రిగాఁగ
శాంతపడినయట్టి సౌమిత్రి సుగ్రీవ
దర్శనమునఁ జండత౯ భజింప. 384

వ॥ రుమాదు లొదిగిపోయిరి. మంత్రు లధోముఖు లయిరి. సుగ్రీవుండు
నిశ్చలుండై నిలచినఁ దార యిట్లనియె. 385

గీ॥ అంతయంత ఘోరంబుగా నాడనేల
కట్టెవిరిచి ప్రొయ్యిని బెట్టినట్టు లాడ
వలెనె! విషయము విషయమువలె వచింపఁ
గాను ధర్మము ధర్మముకాని దగునె 386

ఉ॥ తాను ప్రమత్తుఁడైనయది తప్ప మఱేమియు లేదు దోస మ
జ్ఞానుఁడు కాడు మూర్ఖుడును గాడు కృతఘ్నుడు కాఁడలజ్జుఁ డా
జ్ఞానిరపేక్షభావుడును గాడు నమిత్రుఁడు కాడు మీకు తే
జోనిధి సాధుశీలుఁడును శూరుఁడు సూర్యసుతుండు రాఘవా! 387

క॥ నీయిట్టి మాటలకు న
బ్బా యని మదిలోనఁ గష్టపడవచ్చుఁ గదా
న్యాయమగు నూహ వెంబడి
పోయెడువాని మది కష్టముం బెట్టుటయా. 388

క॥ ఈసృష్టి కితఁడె మొదలా
భాసురముగఁ గామభావపరతంత్రుఁడుగా
శ్రీసముపేతులు యోగులు
మాసరమగు కామభావమహిమావనతుల్ 389

గీ॥ గాధిసుతుఁడు మేనకాస్పృహాయోగికి
ముక్కుబమలు కనులు మూతలుపడె
పట్టుమంచు నొక్క పదియేండ్లు సుగ్రీవు
డెంతవాఁడు దేని కింతగోడు 390

మ॥ అతిసూక్ష్మంబులు తర్కవాక్యములచే నాకార్యముల్ న్యాయ్యసం
గతముంగాఁగ నిరూపితం బొనరుపంగానైన క్లిష్టంపుఁ బ
ద్ధతి సుగ్రీవుని రాజుచేసికొని చింతాకంత దోసంబు న
ల్పత్వకై చంపితివేని సర్వము పునఃపాకప్రియత్నంబగున్ 391

ఉ॥ ఆతనికన్ననుం దెలిసినట్టిడు లేడు తదర్థమందు వి
జ్ఞాతము వాలికిన్ మునుపు నాకు వచించెను కూరదైత్యసే
నా తమసోగ్రనిర్భరఘనాఘనధూర్జర కాళరాత్రిసం
జాతుఁడు రావణుం డతఁడు సాధ్యుఁడు వానరసేనకున్ మరిన్ 392

క॥ సుగ్రీవునకు నటం చా
సుగ్రీవునిఁ జెఱుపఁబోకు సుఖతరమార్గ
వ్యగ్రమ్ము రామకార్య మ
పగ్రీవము చేయఁ బొలుపడకు ! కుమారా ! 393

మ॥ ప్రియయుష్మద్ఘనకార్యలగ్నమతి సుగ్రీవుండు గీశేశ్వరా
నయనార్థంబుగ సైన్యనాథులను నానాదిక్కులం బంచె న
త్యయగూపుల్ చనుదెంచుటన్నయది నేడా రేప ! యన్నట్టు లో
ప్పొ యవీయాంసుఁడ వింతయత్నమును వమ్మంగాఁగ మాటాడగన్

చ॥ ఇదివరకే చమూప్రతతి యెంతయొ వచ్చెను కొండకొమ్మలన్
గదలెడువారు వారె నిను గాంచి యెఱుంగరు నిన్నుఁ జూచి స
మ్మదము భజింతు రచ్చమధుమాసమనోహరమూర్తి లోచన
చ్ఛదములఁ గాంతిసూనవికసన్మృదుచాలనపుద్గలంబుగా 394

క॥ మధువనమున్ వ్యాఘ్రిహ్నా
ర్జధురానము నీదు గూపు రభసోక్తులనున్
బృధునుతివి చాలు కానీ
వృధాకులునిఁ జేయఁబోకు బ్రిధ్న తనూజున్ 395

ఉ॥ ఎంతటిచెల్మి గల్గిన నదెంతటి కోపమువచ్చినన్ ధరా
కాంతుఁ డితండు నంతిపురి కాంతలు సేవకు లీ స్థలంబునం

దింతలు మాటలాడుదురె యీవు సమస్తజగత్ప్రమాథదు
ర్దాంతభుజాబలుండ వనుదానికి దీనికె సామ్యమున్నదే 396

ఉ॥ ఆ ప్రభువైన రాఘవుని హాసము సర్వజగద్విమోహనం
బప్రతిమాన మీ వతస్సకైన ప్రియానుజుఁ డద్ది వంశశా
ఖాప్రణుతంబు చిహ్నమును గానలె నేది యొకింత నవ్వమీ
మీ ప్రియమిత్రుఁడున్ హృదయమేదురమోదరసాకృతిం జనున్

వ॥ అనిన మాటలకు లక్ష్మణుం డప్రతిభుండై చమత్కృతచిత్తవీథియై
ప్రసన్నశేఖాననుండైన సుగ్రీవుం డతనిఁ గాంచి నవ్విన లక్ష్మణుండును
నవ్వి పరస్పరాలింగనంబుల సుగ్రీవుండు 398

ఉ॥ దర్పములేదు నా కవిరతప్రభుభావన సేతు మీదెసన్
సర్పణశీలమా హృదయజాత ముపేతసమస్తభావనా
దర్పణమందునం బ్రముదితప్రభురాఘవమూర్తి యొప్పు రా
మార్పణమయ్యె నాదు బ్రదుకంతయు నేనని లేకయుండగా 399

ఉ॥ అప్పుడు కామమేచినది యప్పుడు దుఃఖముపుట్టెఁ గామముం
జొప్పడె నిప్పు డేదియు విశుద్ధముకానిది రామచంద్రుఁడె
ల్లప్పుడు శాంతభావవిభృతాకృతి వానినిఁ బట్టి నీకు నా
కొప్పు వికారముల్ రఘుకులోదధిరత్నవికీర్ణకాంతులై 400

ఉ॥ నా తనువెల్ల మీయదియు నాదగు రాజ్యము కీర్తి తేజమున్
బ్రీతియు దుఃఖ మన్నియును శ్రీరఘురామపదార్పితంబు ల
న్నా ! తెలివేది నేను కలుషాకృతినైన క్షమించలేడె తాఁ
జేతని గోసివేయుదురె చెల్లి యొకించుక లేచినంతటన్ 401

ఉ॥ వారము పెట్టితిన్ గడువు వారము రేపటితోడఁ బూర్తియా
వారిధులున్ వనంబులును వానరసేన గవేషణక్రియా
స్ఫారమనంబు తా వెదకె జానకిఁ గాంచి ప్రసన్నవృత్తమా
ధారణిజాతఁ గన్గొనక తా బ్రదుకం డెనఁ డిందు వచ్చినన్. 402

వ॥ అని సుగ్రీవుండు మెడలోని కాంచనహారంబు త్రెంచి పారవేసి యిట్లనియె 403

మ॥ క్షితినాథుండను గాను రాఘవుని దాసేయుండ నే ధారుణీ
సుత కన్పించినదాఁక ధారుణీసుతల్ శూరుండు రాముండు తె
చ్చితి నన్నంతటిదాఁక భోగము విసర్జింపంబడెన్ జానకీ
పతి దుఃఖంబది యెట్టిదో తెలియ దప్పా ! నీకు నాకుంబలెన్ 404

గీ॥ ఒక్కఁడొక్కఁడు వార్ధిధుల్ పుక్కిలించు
నొక్కఁడొక్కఁడు భూధ్రముల్ వ్రక్కలించు
వానరులు సర్వదేవతాయోను లుగ్ర
రూపులు కులాద్రులను గోట రువ్వఁగలరు 405

మ॥ స్థిర మీ సైన్యముచేత రావణుని సాధింతున్ ధరాగర్భగ
హ్వారమున్ డాగిననైన ఘోరభుజగున్ వల్మీకరంధ్రింబునం
గరముం జొన్పి బలాన లాగిన వడింగాఁ దెచ్చి ముందుంచెదన్
శరవిద్యాపరముండు రాఘవుని తేజస్స్ఫూర్తి నీతై చనన్ 406

వ॥ అనినఁ గన్నులు చెమ్మగిల్ల సుగ్రీవునిఁ గౌగిలించుకొని సౌమిత్రి యిట్లనియె. 407

గీ॥ మఱియును సమర్థునకు నసమర్థునకును
భేద మిట్లుండునయ్య కపిప్రవీర !
నీవు శౌర్యంబు నెఱపఁగా నేను వ్యర్థ
కోపమూనెద రఘుపతి కుతిలపడఁగ 408

ఉ॥ ఆ గుహుఁడైననున్ భరతుఁడైనను నీవయిఁన్ సమార్ద్రిచే
తోగుణమూర్తు లూర్జితపథుల్ ప్రభురామకథావతార ధా
రాగుణఘట్టభూతులు ధురాక్రమధ పొందిన నేనుగాని నీ
చేగ మెఱుంగ కాడినది చిత్తమునన్ క్షమియింపవే సఖా ! 409

ఉ॥ అన్నయు నీవు నిద్దతే మహాత్ములు ధారుణిమీఁద నోట మా
టన్నను పద్మబంధుఁ డపరాచలమం దుదయించినన్ సరే
చన్నది లేదు వెన్కకును సాధుశిరోమణు లుగ్రశౌర్యవా
రాన్నిధు లద్భుతక్రియులు రాజపదవ్యవహారయోగ్యులున్ 410

= ఖండాంతము =

సీ॥ నియమపాలనఖండ మన్వితము చంద్ర
మౌళిభూపాల శ్రోతృతామహిత మిద్ది
యుద్దిలేని రసప్రవాహోల్బణమ్ము
సుద్దిలోని సమస్తభాసురగుణమ్ము

ఉ॥ యుష్మదనంతలాస్య విభవోజ్జ్వలకింకిణిరావ మైహికా
ముష్మికభావసాంధ్య నవమోహనవేళ వినంగ నెంచెదన్
శుష్మవృశాశిఖాదమిత సూనశరాసన ! తీవ్రబాధ మీ
గ్రీష్మమునందు నన్ను నుడికింపకు వే ! శశిఖండలాంఛనా !

మాలిని :—

అమృతకిరణ చూడాహట్టవిక్రీతపాప
భ్రమణవిమలపూజా బంధురోదారసూనా !
అమరనదితరంగ వ్యాకిరచ్ఛీకరాసే
క మిలదలికనేత్ర క్లాంతిరేఖాభిగమ్యా !

# సమీకరణ ఖండము

శ్రీ మానిరాజమానస
తామరసోపరి తనూకృతశరత్కాలా !
హైమగిరీంద్రసుతా ల
జ్జా మధురోహాకృత మానసచలద్ధేలా !

ఉ॥ వృత్రవధాదులౌ మఘువవృత్తము లుజ్జ్వలవర్ణరేఖికా
చిత్రము లొప్పఁ బార్శ్వముల శేఖరమందున హేమకింకణుల్
ఛత్రము రాజదండమును చామరయుగ్మము పట్టుకుచ్చులుఙ్
జిత్రమనోజ్ఞమా శిబిక చేరిన లక్ష్మణుఁ డెక్కెఁ బ్రీతుఁడై 1

మ॥ కపిరాజెక్కెను వెంట రాఘవదిదృక్షాలగ్నచిత్తాత్ముఁడై
కపిరాడ్వాహకు లంతఁ బల్లకి భుజాస్కంధంబులం దూఁచఁగా
నిపుణుల్ మేనులు తూగకుండగను వెన్వెంటం బ్రిగచ్ఛచ్ఛమూ
విపులారావముచేఁ బరస్పరవచోఽవిస్పష్టతల్ కల్గకఙ్ 2

వ॥ అంత నమ్మహారావమ్మునకు శ్రీరామచంద్రుండు గుహాముఖంబు
నకు వచ్చి నిలచిన సర్వసేనాసమూహంబు రాఘవదిదృక్షావ్యగ్రంబు
సమప్రదేశము వెనుక రాలు వృక్షస్కంధంబులు శాఖలు శేఖరం
బులు పర్వతశృంగంబులు నిండి మెట్లుగాఁ గలపురుష తూలికా
రచిత మహారమ్యవర్ణచిత్రంబువోలె నొప్పె 3

హరిగతి :—

వీరులు పంచగిరీంద్రనివాసులు వింధ్య హిమాచల మందర రాజత
భూరిమహేంద్రధరాధర పాండురమోహన శేఖరప్రస్తరవాసులు

వారుణదిగ్గలరాశిసమీపగ బాలసరోజహితారుణవర్ణక
ధారుణిభృచ్ఛిఖరాగ్రనివాసులు దర్పితబాహుమహాపరిఘుల్ మరి 4

మరి సంధ్యాజలదాభ ధరణిధరమండన మంబుజమిత్రుని భవనము
హరిపుంగవు లచ్చటివారలును భయంకరపద్మకతాళవనాశ్రితు
లురుతరకుంజరదేహులు నీలమహాగ్రిపయోధరదేహులు నంజన
గిరివరవాసులు శాత్రవమర్దనకేళీపాళీకాళీమూర్తులు 5

హేమాంగులును మనశ్శిలయ గ్గుహ నెసక మెసగు వానరవీరులు దీ
ప్తామేయభుజాబలులును మేరుమహాగిరిపార్శ్వగు లుజ్జ్వలధూమ్రక
నామకపర్వతవాసులును నరుణనగవాసులు సంధ్యాసమదేహులు
భీమబలులు మధుమైరేయవివశవిశ్రుతవేగులు విస్తృతబాహులు 6

ఎట నిస్తంగతుం డర్కుం డచ్చటి హేమమహాభాసుర దశకోటులు
ఎట శివదేవుని నివసన మచ్చటి మృగపతికేసరవర్చసు లందఱు
పటుతరబాహులు హిమగిరివాసులు ఫలమూలాశులు కోటిసహస్రులు
చటులాకారులు వింధ్యమహాగిరి సంవసనుల్ పదికోటులు మేటులు 7

క్షీరాంబుధివేలానిలయుల్ పతిసేవానమ్రతనూవలయుల్ సం
ధ్యారమ్యాంశూజ్జ్వలదేహులు బాహాపరిఘాగతపటుయమదండులు
వీరానీకశిరోమణిభూషులు విద్యుదుదారతనూచ్ఛవిరమ్యులు
హారాంగదభూషాగళబాహులు హారివిశాలోన్నతఘనవక్షులు 8

మ॥ ప్రభు ! వీరందఱు త్వత్కృపారసరసముద్రిస్నానపానాతురుల్
ప్రభు ! సుగ్రీవుడు త్వత్కృపారసరసముద్రిస్నానపానాతురుం
డభయుం డెవ్వది యెల్లసేయుమన నీ యానంబడిం బోవు వ
ల్లభు వాక్యంబు ప్రతీక్షసేసెదరు గోలాంగూలాలయూథోత్తముల్ 9

వ॥ అని సుగ్రీవుండు సైన్యంబు వర్ణించి చెప్పిన నవంతకపిరాట్ప్రముఖా
పిశంగదృక్సమూహపరివేష్టనశబలితమూర్తి శ్రీరామచంద్రుం డనంత
విద్యుత్సమావృత నీలాకాశంబువడువున నై యానందహాసవిస్తా
రితనయనుండై సుగ్రీవు గాఢపరిష్వంగంబునఁ బట్టె. 10

మ॥ కపు లన్వేషణ కెంతయోగ్యులు పురీకాంతార దేశాంతరా
ళపు గేహాంతరసీమలందయిన హేలాచారులై యొప్ప దం
తపటాక్షేపముగాఁగ నల్పజనసంతానంబు భీకొల్పి కా
ర్యపు మార్గంబును సానుకూలపడు ధుర్యత్వంబు దీపించుచున్ 11

వ॥ అని శ్రీరామచంద్రుం డనుకొనుచుండ సుగ్రీవుండు 12

సీ॥ వీరు నాదేయులు వీరు సాముద్రిలు
పార్వతేయులు వీరు ప్లవగపతులు
వీరి సంచాలనవిధము సశైలకా
ననభూతధాత్రి సంధానపథము
వీరల తేజఃపరిసారము సాంద్ర
హితకరాచ్ఛాదనాహిండనంబు
వీ రెల్లవారు పృథ్వీవ్యోమసంపూర్ణ
తేజోనిధాను విభ్రాజమాను

సర్వలోకైకధానుష్క జలజబంధు
వితతకులదీపు నిన్ను సేవింపనుండి
రవనితనయా గవేషణార్థాగతులయి
వీరు నీ దయ వేచియున్నారుస్వామి ! 13

వ॥ అనినంతఁ గపిసేనఁ గాంచి సముద్రతీరంబున నిలచినట్లు రామలక్ష్మ
ణులు రెప్పలార్చుచు శ్రీరామచంద్రుం డిట్లనియె. 14

చ॥ అనిలుడు గాలి వీచుఁ గమలాప్తుఁడు ధారుణి నెల్ల పాకముం
బొనరుచు వాన లిచ్చును నమోఘుఁడు మేఘుఁడు నిన్నువంటి స
జ్జనులును మిత్రిసత్కృతివశంవదులౌదురు భూతధాత్రి ని
ల్పను దమ రెల్ల ధర్మశబలంబగు త్రోవలు పట్టిపోవుచున్ 15

గీ॥ ఇంతయైన సేనాపతు లెవ్వరెవ్వ
రంచు నడుగంగఁబోవఁగ నబ్జహిత త

నయుఁ డదే చెప్పఁబోవుచున్నాను స్వామి
యని చమూప్రాంగణంబున నరుగుచుండి 16

క్ష మ :—

ఇతఁడు శతసహస్రేడితానీకినీ
పతి సురపతిసాపత్యభోగుండునున్
శతవలి యనఁగా శౌర్యనారాయణుం
డితఁడు హరిచమూహీర మార్యోత్తమా 17

జ ల ద ము :—

ఈయన తార తండ్రి దుహితృస్థితిచే
నీయన కామెయంత తెలివేచునయా
యీయన కుగ్రవానరమహేంద్రసహా
స్రయుతకోటి సేన వశమై తనరున్ 18

ప న మ యూ ర ము :—

ఈయన రుమాజనకుఁ డేననిన నెంతో
ప్రేయముగఁ జూచుఁ దన బిడ్డ యనినట్టుల్
శ్రీయుతుడు కోటిశతసేన కధినాథు
డీయన యొకండు లయహేళి రణకేళిన్ 19

క మ ల న గీ తి :—

మేనివన్నె తమ్మిపూవులోని దుమ్మువోలు
నాననంబు బాలసూర్యు నంశుజాలరుచియు
ధీనిధాన మితఁడు శౌర్యదీప్తి హనుమతండ్రి
తాను కేసరి యను నేత దానవగజహంత 20

గీ॥ చెలఁగి బహుసహస్రసేనాసమన్వితుం
డఖిలదేవతాసమీపబుద్ధి
పరమపూజ్యుఁ డితఁడు ప్లవగసైన్యములకు
నంజనాఖ్య సాధ్వి కాత్మభర్త 21

కు సు మ వి చి త్ర ము :—

ఇతఁడు గవాక్షుం డెలమి మహోరా
జతిశతకోట్యాయతకపిసేనా
పతి, రణవేలాపతి, పతిసేవా
మతి పటుశక్తిమహితుఁడు రామా ! 22

వి తా న ము :—

ఇతండు ఋక్షోద్యత్సేనా
ప్రతానకోటీంద్రుం డేచుఁ
జితారి ధూమ్రుం డాదిత్య
స్తుతప్రభావుం డెంతైనన్. 23

మ ధు మ తి :—

పనసుఁ డితఁడు ఘోరనిబిడారియముం
దును త్రికోటిచమూ పనితకీర్తి ప్రభూ ! 24

మ ద లే ఖ :—

హేలాదోర్బహుగోలాంగూలేశుం డితఁ డొప్పున్
నీలుండన్ దుముదార్త్రై వేలాంతం బరికంధిన్. 25

హా ల ము ఖి :—

దండివీఁడు గవయనా, ముండు వీడు సముదితమా
ర్తాండవంశశశి ! కపిమా, ర్తాండుఁ డుగ్రభుజబలుఁడై 26

ప్ర మా ణి :—

దరీముఖుండు నైకకో, టి ఋక్షవానరావళీ
ధురావహుండు వీఁడు ని, ర్భరాహవోగ్రమూర్తియై 27

భు జం గ శి శు రు త ము :—

ప్రవిమలమతులు మైంద ద్వివిదులు కవలు వీరల్
తవిలి సురభిషగంశుల్ ద్రవిణచలదహిమాంశుల్. 28

నారాచము :—

ఈతండు రాఘవా! గజుం డేతెంచు శత్రుసంగరా
ఘాతంబుచే వధించు ని, ర్ఘాతంబునా మహాజిలో 29

ఉ॥ ఈయన జాంబవంతుఁడు మహీంత్రిదివాహజగన్నిమేషయా
త్రాయువరేఖికాపరిణతస్థిరతేజుఁడు వృద్ధమూర్తి బు
ద్ధ్యాయుతకోటిసైన్యపతి యాప్రపదీన రిపూర్జ్వలద్భుజా
శ్రీయుతుఁ డచ్ఛశీలి చిరజీవి మహాత్ముఁడు జానకీసతీ! 30

కౌముది :—

తోడి రుమణ్వంతు డీతఁడు నె
క్కుఁడు రిపుశ్రీ కుజోన్మీలనో
గ్రుఁడు భుజోద్యద్రుమాస్ఫోటనో
గ్రుఁడు సమిద్ధిరుడున్|శ్రీసతీ! 31

రసాలి :—

గంధమాదనుడు గంధబాహ
సింధురుం డితడు ఛిన్నశత్రు
స్కంధమాలుఁడు చకచ్చకద్భ్రా
సంధిఘాతరిపుచంక్రముందున్. 32

రుగ్మవతి :—

అంగదుఁ డీతం డాయతబాహుం
డంగదశత్రుప్రాంగణనాట్యో
త్తుంగభుజాశ్రీ ధూర్వహు డుద్య
ద్భంగపయోధిప్రాభవుఁ డీశా! 33

ప్రగుణట :—

వడిఁ దారుం డీతఁడు వాయుస్ఫా
టుఁడు సంస్ఫోటోగ్రుఁడు ధీస్తుత్యా! 34

ఇంద్రవజ్రము :—

హేలాభుజాశ్రీకుఁడు నింద్రజానుం
డీ లావరిన్ శత్రువు లెంచి రేనిం
గాలాహి స్వప్నంబునఁ గాంచినట్లే
యోలిన్ యముం డీతడు యుద్ధభూమిన్ 35

మనోరమ :—

ఇతడు రంభుఁ డాహితోగ్రదోః
ప్లుతివిదారితాంబుదావలీ
కృతపరాక్రమక్రియావియ
ద్గతియు వీని చేగ యెన్నగా 36

పంక్తి :—

దుర్ముఖుఁ డీతఁడు తూఁగి సమి
త్కర్మప్రచండుడు కాహళరా
వోర్మిచలద్రవుఁ డుత్థభుజా
కర్మఠుఁ డాహవకాలుఁ డయా ! 37

వ॥ ఈయన హనుమంతుండు 38

భద్రకము :—

ఇతఁడు నలు డహీనమూర్తి యా
యతన మఖిలమైన శౌరక
ర్మతతికి సరిరాదు వీనికిన్
క్షితి శతశత సేన యైనన్ 39

వృంత :—

ఇతఁడు శరభుఁడు సహింపోర్థిన్
పృతన మొగదలఁ జరించున్ సం
గతప్రళయసమయ కాలుండై
వితతభుజపరిఘవీలుండై 40

వృంత :—

ఇతడు కుముదుఁడు సహోప్రౌఢిన్
పృతన మొగదలఁ జరించున్ వై
ద్యుతసుషమ రిపువిధూతిన్ ని
ర్గతవిలయభయదకాలుండై 41

నాగరము :—

ఈతని పేరు వహ్ని సం
జాతరుషాచ్ఛటాప్రచం
డాతపనేత్రవహ్ని వి
ద్యోతితశౌర్యవార్ధియై 42

నాగరము :—

ఈతని పేరు రంహుఁడా
యాతమహాసమిద్ధరా
ధూతమృదుగ్రుడై పయో
దాత్రిప్రచండుఁడై చనున్. 43

శా॥ వీరేకాక పరాక్రమాంబుధులు వేవ్వేలుండి రీ వాహినీ
స్ఫారాంభోనిధియందుఁ ద్వచ్చరణసేవాభావపర్యాప్తులై
ఘోరాకారులు దైత్యనిర్మథనదోఃక్రూరుల్ మహాయుద్ధవాం
ఛా రూక్షేక్షణమాలికా పరిచితాశాకల్పితోషస్పృహుల్ 44

శా॥ తానెచ్చోటను దాఁచినన్ ధరణిజాతన్ జాతరోషచ్ఛటా
నూనాన్వేషణతీవ్రరేఖఁ గపిసందోహంబు దేహంబు లిం
కైనం దాఁచక యే శ్రమింత్రు భవదీయంబైన సంయోగరే
ఖా నిష్ణాతము మేనియందము కనంగా నెంచు కోర్కెంబడిన్ 45

శా॥ నిన్నుం జూచి నమీఁదఁ బూరుషులలో నీవెట్లో స్త్రీలోకమం
దెన్నం జానకియట్లటం చెఱఁగి వీ రెందే కనుంగొందు రు

దృష్ట్వాంబుజలోచనన్ గగనమధ్యామూర్తిన్ దేవతా
సన్నాహాకార, బహిశ్చ్యుచాంతరితపశ్చాదాత్మదీప్తిచ్ఛటన్. 46

శా॥ సైన్యం బీ యఖిలంబు దోఃపటువు నీ స్వాధీనమం దుంచితిన్
వన్యావాసము సర్వపర్వతదరీవాసంబు నంభోధి తీ
రన్యస్తంబును గామరూపమును శౌర్యప్రక్రియాచండమున్
నాన్యప్రాభవ మాక్షిపద్గిరివితానానేకదోఃకేళియున్. 47

గీ॥ ఖ్యాతకర్మావదానము కలితభీమ
విక్రమము జితక్లమము పృథ్వీపయోధి
భయదసంచారసహ మార్యనయవిశార
దమును పద్మాష్టదన్యష్టదపరిమితము. 48

క॥ నీ వేది చేయుమన్నను
నీ వెప్పుడు చేయుమన్న నిలచినపాటన్
నీ వేగులై పోనర్తురు
నీవే గురుమూర్తి వీ యనీకిని కెల్లన్. 49

వ॥ నాయెఱింగిన యర్థమైనను భవదాజ్ఞాప్రతిపాలనంబు సేయుదునన 50

ఉ॥ కేవలఁ గన్నుదోయి పులకించిన కాంతులు చెంగలింప సు
గ్రీవునిఁ గౌగిలించుకొని శ్రీరఘునాయకుఁ డిట్లనున్ మరిన్
నీ వాకరుండ వీ యఖిలనీతికిఁ జాలుదు నేను లక్ష్మణుం
డీవెది చెప్పె దట్ల చరియింతుము చింతితకార్యపద్ధతిన్. 51

క॥ ఆ సీత బ్రతికియున్నదొ
ఆ సీతయు బ్రతికిలేదొ ఆ ఘోరప్రచం
డాసురు డెచ్చట నునిచెనొ
నీ సైన్యము నీవుగాని నేర్తురు సఖుడా ! 52

ఉ॥ ఈవు సరామలక్ష్మణుఁడ వీ వధినేతవు సర్వసేనకున్
నీ వఖిలార్థవేత్తవును నిన్నడి వత్తుము మేము నీదు నా

జ్ఞావశవర్తులై తొలుత జానకియున్కి యెఱుంగనైనచో
నావల యుక్తకాలమున నాడెదఁ గార్యపథంబు నెచ్చెలీ. 53

వ॥ అంత శ్రీరామలక్ష్మణు లొక్కదెసను పావని మఱొక్కదెసను నిలుచుండ సుగ్రీవుం డొక్క మహోన్నతశిలాతలంబున నాసీనుండై తన చమూసమూహంబుఁ గాంచి యిట్లనియె. 54

మ॥ కపిలోకప్రియంబు వచ్చెను ధరాకాంతాసమన్వేక్షణో
గ్రపు కార్యంబున మీరు నేను కృతులై గట్టెక్కుచుండన్ ధరా
ధిపుఁడౌ రాముని దా ఋణానఁ బడిపోఁ దీరంగ రాదెల్ల సై
న్యపతుల్ దీనిఁ దలంపఁగావలె స్వకార్యంబట్లు శ్రద్ధాళువుల్ 55

గీ॥ ఋక్షరజసుని కార్యముల్ ఋషభకోటి
చేయుచుండిరి, దోశ్శక్తిచేత వాలి
తనపనుల్ తాన చేసికొంచును వహించె,
నేను మీరెల్ల రాధారమైనవాఁడ 56

చ॥ నలువుగ జానకీవిచయనంబున నద్దెస లంపెదన్ మిమున్
తెలిసి ధరాత్మజాత నునుదేరిన మీకును నాకుఁ బ్రాణముల్
నిలుచున చూడకుండ నవనీసుత వచ్చితి రేని మిమ్ము నే
నలుగులఁ గ్రుమ్మెదన్ శిలల నార్చెద శాపములం దహించెదన్ 57

మ॥ కితవశ్రేష్ఠులలోన శ్రేష్ఠుఁడు సుడీ కిగ్గాడి దైత్యుండు భూ
సుత నా దిక్కునయందె యుంచు ననిపించున్ నమ్మకం బేది? ది
క్చతురన్వేషణ చేయగావలె ధరాస్థానిన్ మదజ్ఞాతధా
త్రితలం బుండదు బోయి దాఁచుటకు ధాత్రీకన్య నద్దిక్కులన్ 58

గీ॥ నే నెఱుంగని యంగుళమైన నేల
లేదు ధాత్రీతలంబునఁ బాదలి కొని
చని, ధరాసుత నెందుదాఁచునో కనుంగొ
నెదను, దుర్జాతిమాయ పూనితిని జేత 59

వ॥ అని వినతుఁడన్న యూథపతిం బిలచి యిట్లనియె 60

మధ్యాక్కఱలు :—

శతసహస్రకపియూథపతి ! సమయోగ్రజలధినిర్ఘోష !
క్షితిభృన్మహాదేహ ! వినయిశేఖర ! స్థిరదేశకాల
తతనీతివేది ! నీ వేగి ధరణీసుతాస్థితి కనుము
దితిజు డుంచెనో యేమొ తూర్పుదెస యెఱ్ఱిల్లి కదాఁక 61

ఒక కొండగుహయందుఁగాదు నొక యేటియురవలోఁ గాదు
చకితుఁడై దైత్యుండు ధరణిజాత నెచ్చట దాచరాదు
నొక చోటు విడువక కన్నులుంచుక యొక వేయియెడల వె
దుకగావలయు ధారుణిసుతఁ దూరుపుత్రోవలనెల్ల 62

శివు మింటివాకలో నచట శిశిరాంబుశీకరయు సర
యువులోనఁ గౌశికిలోన నుల్లమై యున్నట్టి యమునఁ
గవిసి యేళ్లులు కోయునట్టి కయ్యాలకడుపులలోన
నవయక వెదకుడు యామునగిరీంద్ర నవశేఖరమున 63

ఆకుపచ్చని సరస్వతిని నరుణనీరాంబుధి శోణఁ
గోకవన్నియ మాటుగాఁగఁ గోపద్రుక్కులును మాటుగను
జేకొని దాఁచు మాయావి క్షితిజ నిశితదృష్టిఁ జూచి
కాక నేర్వరు కనుంగొనఁగ గళ్యాణకంధిఁ గన్గొనఁగ 64

ఆపైనిఁ గాలమహిమ యను నవనిభాగాభోగకాన
నాపీడశైలశోభితము నందమైనట్టి దేశంబు
తేపకు బ్రహ్మమాలము విదేహము దీప్తమాళవము
కాపున్న పుండ్రవంగములు కాశి మాగధ కోసలములు 65

జనపదంబులయందు సర్వజన మభిజ్ఞాతంబు వెలయు
నని శిల్పులున్న పత్తనములందు హేమాకరములుగఁ
జనుచోట్లఁ గోశకారనివసనముల క్ష్మాజాత దాఁచు
వెనుకాడ కాందోళికలును వెదకుడు వెస శిబికలును 66

జలధులలో నున్నయట్టి శైలముల్ జనపదంబులును
గలియఁబెట్టి కనంగవలయుఁ గాదని కాదు త్యజింప
వల మందరాద్రికొమ్మున్న దతివిశాలావని యందుఁ
గలరు కర్ణప్రావరణులు కడు నోష్ఠకర్ణకుల్ జనులు 67

మసిబొగ్గుమొగములవారు మహితులు మరి యొంటికాల
వెస నేగువారును నగ్నవేషులు భీకరాకృతులు
మసలి యసహ్యాంబుగాఁగ మానవమాంసఖాదులును
విసరద్భుజాబలుల్ పోయి వెదకుడు పృథివీతనూజ 68

ఏడనో యచటనే కలరు హేమాంగు లేపారు కర్ణ
చూడులు మత్స్యభోజనులు చూడ భాసురదేహు లగుచుఁ
వాడి కిరాతు లాద్వీపకోటి దిక్కుల వసించెదరు
వేడుక నచ్చోట సీతఁ బెట్టినో వేసంబుమార్చి 69

అటువంటి జలచరాళి కల వవి నరవ్యాఘ్రంబులందు
రెటుపోయి తప్పించుకో నదెంతయేనీ కష్టమగును
బటుతరవారాశి ఘోరవారుగ్రబంధంబులందుఁ
బటుజలస్తంభనవిద్య వైదేహి వాఁడుంచుఁ గనుడు 70

అట యవద్వీపమున్నది మహానర్ఘమైన రత్నములు
ఘటియించు దేశంబు వేలుగనులును గలవందు సప్త
ఘటితరాజ్యము లందుఁ గలవు ఘనభోగకలితమై హేమ
ఘటితనిష్కము లందు జననికాయ మక్కజముగా వాడు 71

అదిదాఁట శిశిరాఖ్యమైనయట్టి మహాద్రి శృంగముల
ను దివము తాఁకు రక్కసులునుఁ సురల్ నూల్కొనియుంద్రు
కదలి తద్గిరిమార్గములను గడుకొని కాంతారములను
వెదకుడు జనకరాడ్దుహితఁ వెదకుడు వే ప్రపాతముల 72

క్ష్మాయందు జీవించు సర్వజంతువుల్ స్వగతధర్మముల
మాయురే! పాలించుగాని మానవమహితధర్మంబు

లా యున్న స్వర్గదేశమున కతిసమీపాత్తమార్గంబు
లా యుత్తముని రాముభార్య నరిగి యందందుఁ గన్గొనుఁడు 73

అచట రక్తజలంబు శోణమత్స్య గాధాభీలవేగి
విచయసక్లిష్టంబు కలదు వేలాదవీయంబు జలధి
అచటు సిద్ధుల చారణుల సహస్రసంఖ్యాకుల వసతి
అచటి మనోజ్ఞతీర్థములయందు రమ్యవనంబులందు 74

వైదేహితోడ రావణుఁడు వర్తిలవచ్చు నచ్చోట
భూదారములు త్రవ్వ నాగముస్తెల బుగులువాసనల
లో దరుల్ గల యేటిపాదలలో నేళ్లలోఁ బోయి చూడు
డా దితికొడుకు దుష్టాత్ముఁ డనుకొనివగు చోట్ల దాఁచు. 75

పలుదీవు లాయబ్ధిఁ గలవు భయదముల్ పర్వతగుహాలు
తల దూర్పరానిదా గతి లతావేల్లితతరుప్రతాన
ములు గల్గు నందు వృక్షాగ్రముల గేహములు కట్టియుందు
రలఘులైన నిషాదు లతిభయంకరు లందుఁ గనుడు. 76

పూని యచ్చో మహాజలధి బోరన మొరయుచునుండు
దానవు లచ్చటివారు ధాతచేతను దత్తవరులు
నీ నీడ వారిపై నుంత నిలచిన నీల్గి లాగెదరు
కాన బుభుక్షితుల్ దీర్ఘకాలంబు గ్రసనార్థులగుచు. 77

ఆపైని లోహితమన్న యంబుధి యతిభయంకరము
దీపిత మేఘసామ్యమ్ము దృప్తివర్ధితమహోరగము
కోపితాసుర మహాకంఠకుహరాతి ఘోరరావమ్ము
నాపైని కూటశాల్మలి బృహన్మహితాభోగభూమి. 78

ఏవాఁడు మా హనుమవలె నిలయెల్ల నెఱకలఁ దాల్చు
నా వైనతేయుండు విద్యుదాభోగహరితాంశుమూర్తి
యావాసమై యుండు నచట నానందసారోపసాంధ్య
హేవాకపాథోదమూర్తి హేలామహేశానమూర్తి 79

కోరి యా ప్రభువైన గరుడికోసమై కొని విశ్వకర్మ
యారూఢి నానామణీవిహారరమ్యగృహంబు నిర్మించె
శ్రీరాజతాద్రి శృంగోరుశేఖరశ్రీకమ్ము తోఁచు
దూరాన కది లేఁతయరఁటితోఁటల తుంపెసలట్లు 80

అట్టిచోటఁ గబోదిపక్షులట్టుల నద్రిశృంగములఁ
బట్టుక వ్రేలాడుచుండు భ్రంశదభ్రంకషవాంఛఁ
బట్టి మందేహాభిధులు దివాకరబద్ధవైరు లుద
యాట్టహాసులు రాక్షసులు దురంతసద్యఃప్రాప్తజనులు 81

అది యొక నెత్తురుముద్ద యంతంత నాకాశవీధి
నుదయవేళల లేచి భూసురార్ఘ్యమహాంబు పటంబు
కవిసిన విరిగిపోయెడును గంధిసంఘట్టితవారి
నుదయాదంబుజమిత్రుతోడ నుడుగక యూను వైరమున 82

అంతఁ దెల్లని మొయిలేమొ యనఁగఁ దివ్యని పాలకడలి
గంతులువెట్టు కెరళ్లఁ గలితముక్తాహారమూర్తి
యెంతో యా జలరాశికడును బుషభమం చెసలారుఁగొండ
కాంతిచే నందివర్ధనులు కడుఁదెల్ల గన్నేసుపూలు 83

ఆచుట్టుపట్టులయందు నల్పమ్ము లద్రులనుండి
వీచు సుగంధమారుతము విహ్వలవిధృతనాకము
తోఁచు సుధర్మనంబన్న తోయముల్ తొలకాడు చెరువు
పోచలా పూవుదారాల పొందమ్మిపూల యుంగడిగ 84

అంబుధి గాలిఁ దపతపలాడు చేలాంచలహేమ
సంబద్ధహేలావిలాసశారదాప్సరసలు వచ్చి
యంబువులాడి శ్రీమత్తటాకంబునందుఁ బోవుదురు
కంబుకంధరలు దృష్టివహాకాంతిసంక్రాంతనీరజలు 85

కలశమహోదధిం దాఁటి కన్పించుఁ కమ్మని తియ్య
జలములకడలి యా నడుమ జలములు సలసల గ్రాఁగి

నిలబడి గోడిగవాయి నిప్పు మండినమంటగాఁగ
జ్వలియించు యాదోనికాయసంత్రాససంబంధకముగ 86

బాడబాగ్నిశిఖావిరావ బాధసంబాధఘోషమ్ము
కూడి తజ్జలజంతుకంఠకుహరనిర్ఘోషంబు కలిసి
యేడుచుచున్నార లెవరో యిచ్చోట యిచ్చోట ననుచు
యీడఁబోయి చరింపకుడు మహీజాతయేడుపు కాదు 87

కదలి యా కడలి యుత్తరపుఁగడఁ దప్తకనకకాంతులను
బదుమూఁడు యోజనంబులకుఁబైనఁ గన్పడు మేరు వేమొ
యది నాఁగ జాతరూపశిల యన్న మహాద్రిరాజమ్ము
త్రిదివనమస్కృతియోగ్యదేశమ్ము ధీశమ్ము కలుగ. 88

తన్నగశేఖరంబందుఁ దప్తకార్తస్వరకేతు
వున్నది ముమ్మొనవాలు నురవైన యొక తాడిచెట్టు
నున్నది యాతాడిమొదట నుజ్జ్వల మొకరత్నవేది
కన్నులవైకుంఠ మద్ది కడలిపుల్కల నీటిదొప్ప. 89

కన్నుల మిఱుమిట్లుకలుగుఁ గాంచఁగాఁ గళవళంపడక
చిన్నగా నరిగి యామహాశిఖరి నాసీనుఁడైయున్న
పన్నగస్వామికి వేయిప్రణతు లప్పనము గావించుఁ
డన్నాగలోకేశు కరుణ యయినచో నవనీజ దొరకు. 90

ఒకవేయితలలతో నచట నుప్పరం బూను నా స్వామి
యకట ! యీ ధారుణి శిరసుపం దెట్లు లవధరించెడునో
చకితాక్షులము కాక తెలియఁజాలము స్వామి యనంతు
డొక చంద్రికాంతపుబొమ్మ యొగి నల్లయుడుపులు తాల్చు. 91

ఆమణికేతుకరూపుడైనట్టి యాదికూర్మంబు
కోరి యభీష్టకములను గూరిచి కొండగాఁజేసె
దూరుపుదెసఁ బుట్టె వాని దోసిలి తొలివేళ్ల చివరఁ
దూరుపుగిరి యుబాకార తోచు నదూరదేశమున 92

మందేహరాక్షసరక్త మాంజిష్ఠమహితకాంతులను
సందేహపడవద్దు శైలసంగతజాతరూప మని
సందీపితచ్ఛవి గగనసంస్పర్శ శతయోజనాయ
తేందుకాంతోపలవేది యేచు భూభృద్రాజు కొమ్ము 93

కానుగుల్ మద్దులు తాళ్లు గాయత్రి కర్ణికారములు
పూనిక యెల్ల వేళలను బూడిచెడి ప్రొద్దువన్నియలఁ
గానని హేమమయములుగా నెఱ్ఱగాను మందేహ
దానవనిరతార్ద్రరక్త తరుణసంధ్యారోచిరాప్తి 94

ఆకొండ నింకొక్క కొమ్ము నభిధ సౌమనస
మాకాశ మాపైన లేద యన్నంత యౌన్నత్య మది, హృ
షీకేశుఁ డామున్న గుజ్జుచిన్నారిచెలువంబు తాల్చి
యీ కొమ్ముపై నొక్కకాలు హేమాద్రి నితరంబు నుంచె 95

ఒనర జంబూద్వీపమునకు నొడ్డుక యుత్తరదిశకుఁ
జనినచో వనమాల శంఖచక్రభాస్వరకిరీటాంగ
ద నిబిడమూర్తి స్పష్టముగఁ దనరారు తరణిబింబంబు
కనిపించు ననిపించు దేశకాలముల్ కడముట్టె ననుచు 96

ద్యోలంబమానశిఖరము తోచు నందుజ్జ్వలం బగుచు
వాలఖిల్యులు మహర్షులు తపస్వులు వైఖానసు లట
బాలసూర్యప్రభుల్ కాంతిపరిణాహపర్యాప్తు లగుచుఁ
గ్రాలుదు రచ్చోట దిశలు కనరాని కడమైన చోట 97

అద్ది సుదర్శనద్వీప మట నొప్పు నా రాజధాని
యద్ది నేత్రము తేజమైనయట్టిది యఖిలప్రాణులకుఁ
దద్దీప్తశృంగంబులందు దరుల కందరములయందు
ముద్దియల తలమానికము భూసుతఁ బోయి వెదకుడు 98

మేనవు మృదుకాంతి మిహికాంశుమృదుకాంతిఁ బోరసి
యారక్తబాలసంధ్యా నవారుణహారియౌ సుషమ
లాఁగూఢమై యుండు నచట నద్దియే యది తూర్పుటక్కు-
ధారుణికి భువనమునకు ద్వార మా స్థలము నిర్ణీతి 99
కోటిదేశమునందుఁ బొడుపుగుబ్బలి గుహలందు నచటి
యేటికయ్యలయందు వల్లులెత్తిన యారమ్ములందు
మాటుంచెనేమొ దైత్యుండు మహిజాత, మహిజాత ధర్మ
పాటనదుర్బుద్ధి పోయి వైదేహివార్త తేవలయు 100
ఆపైని నచంద్రమసూర్య మంధకారావృతదేశ
మాపైన వానరాగమ్యమై పొల్చు నందాక వెదకు
డాపైన నేమున్నదో తెలియద మీర లవనీతనూజ
యెపుంతనున్నదో చూచి యేతేర డిది వెక్కసముగ 101

చ॥ ఒకనెలలోపలన్ దిరిగి యుండవలెంజుడి యిందుఁ బ్రాగ్దిశా
సకలపదంబులన్ వెదకి జానకి, కానక వత్తురేని ప్రా
ణకములు మీకు నిల్వవని నమ్ముడు ప్రస్రవణాది దేశముల్
కుకపి శవప్రలంబులగు కూటములై కనిపించు నెల్లెడన్. 102

చ॥ తనరఁగ మీ రొకొక్కరును ధాత్రిని చేతులయందు బూరెలో
త్రినగతి నొత్తఁగల్గుదురు ధీరులు భూసుతఁ గాంచి రండు నం
తన నను నొత్తిగిల్లి కపిధాత్రిసమస్తము మీకొసంగు మ
న్నను మరి యీయకున్నయెడ నన్నడుగుండు చనుండు వానరుల్.

వ॥ అంతఁ దూర్పుదెసకు వారిఁ బంపించి దక్షిణదిశోపదేశార్థము హుతాశనసుతులైన నీలాసంగోల్కాముఖులను వాయుసుతుడైన హనుమంతుని బ్రహ్మపుత్త్రుఁడైన జాంబవంతుని నశ్వినీదేవతల తనూజులైన మైందద్వివిదులను దదితరదేవతాంశసంభూతులను సుహోత్రుని శరారిని శరగుల్మని గజుని గవయుని సుషేణుని ఋషభుని విజయుని గంధమాదనుని సర్వసేనాపతిని వాలితనూజుని నంగదునిఁ దిలకించి యిట్లనియె. 104

ఉ॥ మీ రతివేగవిక్రములు మీ రతిలోకమహత్త్వసంయుతుల్
మీరు సమస్తదానవసమీకసముత్థభుజాబలైకవి
స్తారపరాక్రమాంబుధులు సాధుశిరోమణు లీర దక్షిణా
స్ఫారదిశాగవేషణకుఁ జాలుదు రుగ్రమతిప్రగల్భులై 105

చ॥ తెలియగ దక్షిణాదిగుపదేశము చేసెద మీకుఁ జానకిం
దెలిసి యెవండు వచ్చు నతిదేశము వానిదెసం బ్లవంగభూ
తలసకలాభిషేకసముదారమహావిభవంబు వాఁడునుం
గలుచఁ గృతాపరాధుఁడయి కాడు మదాత్మసమానమూర్తియై 106

మ ధు రా క్క ఱ లు :—

లవలివల్లిక పాదంబులం దగుల్కొనిన దుప్పి
యవు సహస్రశృంగము నర్మదాపగాకలితమూల
మవఘళించెడు వింధ్యాద్రి యతిలోకభయదజంతు
నివహావాసం బగస్త్యసాన్నిధ్యనతశిరసంబు 107

ఆదిబ్రహ్మ నిర్మించినదగు సౌధమనగ నొప్పు
నాది యీ ఖండ మీ వింధ్య మొక ద్వారదేశ మెసఁగు
గాదిలి సరస్వతియు ముందుగడపల నిడిన ముగ్గు
గా దొరయుఁ గృష్ణ గోదయుఁ గావేరి మధురవారి 108

మెఱయు వరద మహానది మేఖల యుత్కలయును
వరదలెత్తి దిశల్ ముంచు వాహినుల్ తరగలెత్తి
కరుణమై బుభుక్షాపూర్తి కావించు వాహినుల్ త
దుపయోవేశికలయందు నుర్విజ వెదకఁ బొండు 109

అలదశార్ణనగరములు నశ్వవంతియు నవంతి
మలయు ఋషిక విదర్భలు మాహిషకాంగ వంగ
ములు కళింగముల్ కౌశికంబులు జనపదము లొప్పు
వెలయు పల్లెలలోఁ బోయి వెదకుడు పృథ్వికన్య 110

దండకారణ్యదేశంబు తరులతాసాంద్రభూమి
గండశైలప్రచండంబు ఘనఝరీతరణదుష్ట
మండజాతమృగానేకవాల్లీసకోగ్రదృశ్య
ముండసురియ లసాధ్యంబు లుగ్రజంతువులు వనిని 111

మెరయు కిన్నెరసాని దామెరతోగు శబరి మొదలు
ఝరులు శాఖానదుల్ కలిసి త్మ్రావాలు నీటి తరువు
సరస గోదావరీనది సాలీనియల్లు పటము
శరణి నేపారు వెదకుడు ఘనకబంధములలోన 112

గుహాలలోపలినుండి నిష్కుటములలోననుండి
కహకహధ్వని స్రవియించుఁ గాంతారపు సెలయేళ్లు
విహారదమరయోషిచ్ఛటా విట పరస్పరరహస్య
విహసితంబని విడువక వెదకు డా చాటుచోట్లు 113

కెలన నాంధ్రముల్ పుండ్రముల్ , కేరళ పాండ్య చోళ
ములు మహాజనపదములు పొలుపొందు వెదకవలయు
అలఘుదైత్యునకు నిషాదులందఱు భయపడి జన
కులబిడ్డ దాచవచ్చునుజూడీ గూడెంబులందు నెందు 114

అచటు దాఁటి యయోముఖమన్న పర్వతము ధాతు
నిచయనిత్యసంధ్యారమణీయమ్ము తుంగశిఖర
కచమహాగురుచందనకాలాహిపుష్పమాల
మచటు దైతేయసంవాస మద్ది గాలించవలయు 115

సుపరిలఘువారి కావేరి శుద్ధవారి కనిపించు
నపరిమితమోద లచ్చరలటఁ గ్రుంకులిడుచునుంద్రు
కపురపుందావి మేనులఁ గస్తురితావి చనుల
వపనయంబొందకయ స్నానమాడుదు రచ్చర లట 116

ఉదధిదేవేరి కావేరి యొడ్డునఁ గుంభసూతి
త్రిదివమస్తకమాణిక్యదీధితిమత్పదనఖుఁ

డుదితతేజోమహోరాశి యుండు నా పరమహాని
పదజలేజకేసరహాళిభాగులై చనుదు పైన 117

మిఱుకడలి మూఁడు పుడిసిళ్ల మేరలోఁ గలదు మునికి
తఱుసలుల్ రక్కసుల్ గలరు తపసికిఁ బంటికిక్రింద
నెఱసరిక్ష హాని గని ధరణీధరంబుల శిరములు
పిఱుతివియుఁ గాలిగోళ్లుల విఱిచిపోవునను భీతి 118

అచటఁ దామ్రపర్ణి పయోఘియుతివలఁ దీరవృక్ష
నిచయశాఖాసమావృతనీర యఁగుకునిషక్త
కచికురయు నసూర్యంపశ్యఁ గానమణి తాదృశవేణి
ప్రచురముక్తాకలాప మరకతమాణిక్యగూఢ 119

తాము కృష్ణాభిసారికల్ దక్షిణదేశనదులు
వే మొయిళ్లు క్రమ్ము నిరుల విభులకై వెడలఁదాల్చి
యామెయి న్నీలిచీరల నందులోఁ దామ్రపర్ణి
యామె సిగ్గులబరణి రహస్య మాగమరసాబ్ధి 120

బాలసూర్యుని వెల్గుల పసిఁడిడోలలు సముద్ర
లోలవీచులు చిందులలోననే పాండ్యనృపుల
లోలముక్తాకలాపంబు లోభనీయకనకమయ
మౌలిఁ దోఁచుఁ గవాటంబు నోషధీశమణిభూష 121

అద్ది పొలిమేర పాండ్యులదౌ రాజ్యసీమ కచట
ప్రొద్దు మింటఁ బ్రస్థానమ్ముపోవు వేళఁ దన పైడి
ముద్ద మెఱుపు నుంకువ లుంచిపోవుఁ గవాటకాంతు
లుద్దవిడి సముద్రసుషమ లుయ్యాలలూఁచు నచట 122

ఆ సముద్రతీరంబున నర్ధనిర్ణయము చేసి
భాసమానపయోరాశి భయదవీచీఘటాళి
కేసరంబుల గ్రహియించు కేళిఁ జరించవలయు
త్రాసకరంబు సాగరవారి దాఁటు యత్నంబుచేసి 123

మత్తసామజంబు సరస్సుమధ్యమ్మునందుఁ జొచ్చి
యుత్తమిల్లుగతి మహేంద్రమన్న పర్వతము జలధి
తత్తరంపడు నీళ్లలో దాగెఁబో కలశసూతి
హత్తె దాని సముద్రాంతరాభీలవారిలోన 124

కుసుమసితలతాప్రావార, కుండలిరత్నభూష
విసరదంభోవిహార యుర్వీధరభాగ్యలక్ష్మి
మసలి క్రొత్తకోడలివోలె మజ్జనఁ దల తడుపదు
కొసలఁ జూడానిబంధముల్ కొమ్మలు కానిపింప 125

వేలుపులరాణివాసమ్ము విచ్చేసి కొండ పరుపు
లాళిశతసహస్రంబుల నాటలాడెదరు సతము
కోల క్రోఁతులు గూరనగోలలు కుందిగాళ్లు
వేలుపుందేవిడీ కన్నెపిండు వెస నాడుచుండు రచట 126

పరవడిదినాల వేలుపుపతి వచ్చి దక్షిణావి
గురుశరధి స్నానమాడి చూడోజ్జ్వలచంద్రశకలి
పరశివుఁ బూజసవరించు పరమవ్రతంబు పూను
నరయ నుత్తాలవాశ్చుంబితాకాశ మచటి జలధి 127

అటకు వందయామడల దవ్వైనట్టి లంకయందు
కుటిలరాక్షసకోటుల కూటమౌ లంకయందు
చటులవారాశియగడిత చాయయౌ లంకయందు
కడగిమానవకోటి కగమ్యమౌ లంకయందు 128

అదియు రావణునేల సహస్రాక్షు చేతిలోని
ముదుకఁడౌ హాని వెన్నెమ్ము మణఁగిన యసుర
చదురు నుక్కివ మీ రెండు జతసూడు వాని
పొదరుటిల్లది వెదుకనోఁ బొండు మీర్లంకయందు. 129

ఒక్కచోఁ జూపి కొట్టు నింకొక్కచోఁ గలుచ యసుర
యెక్కడో దాఁచుననుకొన నింటనే దాచవచ్చు

మొక్కలీడు ధరాకన్య మూర్ఛను భయరహితుఁడు
నొక్క కొంశిదెడు మేరైన యుజ్జగింపక వెదకుడు 130

కటికరాక్షసుల్ లంకలోఁ గలరు చేతికిని జిక్కఁ
జటికవ్రేళ్లల నడుమను జిదిపెద రుగ్రజనులు
ఘటితకామరూపములతోఁ గడలఁ గ్రుమ్మరుదు వారి
నిటలదృష్టులు మిఱుమిట్లు నెగడ నెగడులవోలె 131

జనకరాట్కన్య వెనుకగాఁ జనుదెంచి రన్న అలుకె
మనసులోఁ బుట్ట దనుజులమందకుఁ బండ్లు కాయ
లు నెనుకుచు వచ్చె నివి కోతులు భయంబు లేద యంచు
ననుకొనక మీరు వెదకుఁడీ యంతిపురాననైన 132

నెగడు శరధినట్టనడుమ నీడపట్టుకొని లాగి
యగడు క్షుధ తీర్చుకొను దయ్య మంగారక యనుపేరి
దెగసిపాటుది మీ నీడ యెంతయు దాని కెడగ
బగళముంజేసి చనవలెఁ బరమరక్షోనివసము. 133

మిసిమి తోలుకారు క్రొమ్మెయిల్ మేని వన్నియలవాని
విసరదాశానిపీడహార్వ మహాధ్వనులవాని
మసృణకాశ్మీరకాంతి దృఙ్మధుకృపాచ్ఛవులవాని
సుసఖుని లతాంగి మీరేగి చూచిరం డసురవీట 134

లేదు వానితోఁ బనిపట్టలేదాయె మున్ను మనకు
పాదుతోఁ బెల్లగించనౌ పనిపట్టె నిప్రుడు మనకు
నా దితిప్రభవుని నేల నాశౌశలందు రాము
గాఁదిలిలతాంగి వెదకుడు కాంచినక్ జెప్పరండు. 135

ఎవఁడు భూజాతసంజాతహేవాకుఁడై కనుగొను
నెవఁడు రాముభార్య ప్రవృత్తి నెనసి తా నేగుదెంచు
చివుకకంటికాంతుల నభిషేకంబు పొందుఁజూడి మ
ఘవశిలామణీ సుషమాపఘను రామునందు వాఁడు 136

మరియు నాపైన వందయోజనమేర శైల మున్న
దరయఁ బుష్పితకాఖ్యము హైమశృంగోన్నతంబు
ధరణిధరశృంగముల్ రెండు తనరారు నొక్కటి హైమ
సరసిజాభ ముకహ్లారసదృశంబు నింక నొకఁడు 137

తమ్మిపువువంటి కొమ్మపై తరణి తా నత్తమిల్లు
సమ్మతిం గల్వకొమ్మపై జాబిల్లి యత్తమిల్లు
నమ్మె యేడాది కార్నెలలా నలి దక్షిణాయనమున
క్రమ్మె చీఁకట్లయడపుల కార్చిచ్చులై యిరువురు 138

నాస్తికుల్ నృశంసులు కృతఘ్నుఁపుజాతి కానలేరు
సిస్తులపవిత్ర మగ్గిరి నీరంధ్రగగనపూర్ణ
మస్తకకృతసువినము నమస్కృతుల్ గిరిసపర్యఁ
బ్రస్తుతమహాస్కు లేగుడు ప్రభవిష్ణువులు మహితులు 139

ఎఱ్ఱనవు తమ్మిమొగ్గ బీటిచ్చిన పైడివెలుగు
వఱ్ఱుగానైన సూర్యుడు వాలెడు కొమ్మమీద
ముఱ్ఱుబా ల్జున్నుకట్టెడు పొద్దులగు తొలియీఁత
కుఱ్ఱివన్నియ రెండవకొమ్మపైఁ గూడ వెదకి 140

దాని దాఁటిన సూర్యవంత మనెడు పర్వతంబు
దానినైతము దాఁటిన తరువాత వైద్యుతాఖ్య
మైన శైలము పదునాలుగైన యోజనములందుఁ
బూని వైద్యుతగిరి ఫలపుష్పసంభరితమూర్తి 141

నాటుకొను నిప్పపూవు లనంతము లారగించి
తాటిరేకలదొన్నెలఁ దత్సర యానియాని
మేటి యీఁతగుంజు భుజించి మిస రేగుపండులు తిని
కోటికెక్కిన సౌఖ్యంబు కూర్చికొండు గిరిమీఁద 142

కనులకెంతో యందమ్ము గాఁగల దన్నమాటలోని
పనిత మర్థమ్మదేమి ? తద్వస్తుసౌందర్య మెల్ల

మనసునకును నచ్చినదన్నమాట యామాట యర్థ
మునకు లక్ష్యమ్ము నట నొప్పు భూభృత్తు కుంజర మని 143

కుంజరముపై నగస్త్యర్షి కోఱకుగా విశ్వకర్మ
మంజుమణిరత్నశిల్పసంపదయెల్ల నవధిగాఁగ
రంజితమ్ము సౌధమ్ము నిర్మాణమ్ము మొదలి
సంజలం దేటవాలుగా సౌరకాంతి పడఁ జేసె 144

యోజనముమేర నొకపదియోజనంబులగు నెత్తు
రాజితనానామణీహేమరత్నభూషితము గాఁగ
తేజపుంగూడు భోగవతీనామ పురము భుజగ
రాజవాసంబు కాంతిధారాపుంజ మొప్పు నచట 145

వితతబహుకక్ష్య, దుర్ధర్ష, విష్వగ్భటపరిరక్షి
త, తరుణభుజంగసేనావితానదుశ్శ్రుతుభయద
తతసపత్నుల యులికిడితగిలినఁ జాలు భోగ
వతి జ్వలించు దర్వీకరప్రభుమహోగ్రపువిషాగ్ని 146

పరమవిజ్ఞాని వాసుకి పాలించు భోగవతిని
తిరుగఁగా మున్ను నా కది తెలిసినయంతవరకు
ధరణిజాతను దైత్యుఁడు దాచెడుచోటు కాదు
కొఱఁతవెట్టక జాగ్రత్తకోసము వెదకు డంతె 147

పైన నవి యేవొ రాజ్యముల్ స్వల్పంబు లున్నవచటఁ
గాననొనని తోచినఁ గాంచు డచ్చోటికిఁ బోయి
పైన నున్నది వెదుకఁగావలసిన యట్టి చోటు
కానిపించు దూరానికిఁ గకుమ్ధనందివోలె 148

చందనఁపుఁ బద్మకపు హరిశ్యామ గోశీర్షకముల
స్యందివాసనల్ మందమందానిలనీయమాన

సుందరంబుగఁ గుమ్మ్రుమంచుచు గొట్టు ముక్కుతుదల
నెందు రమ్యాతిరమ్యంబు ఋషభ మన్నట్టిది గిరి 149

జోగి నిప్పైనఁదాక వచ్చును బోరపాటు పొంది
చేగ తావి కాకృష్టులై చేరి చందనము తాఁక
సేగియౌను గంధర్వ లక్ష్మీణ తేజస్కులు మిళి
తాగురుద్రురక్షానుసంధామహస్కులు గల రట 150

శిగ్రుగ్రామణి శైలూషచిహ్నితుల్ శుభ్రబభ్రు
లుగ్రనాము లైదుగురు మహోగ్రగంధర్వు లందుఁ
బ్రాగ్గ్రసరులు కాపుందురు రవిశశివహ్నిసములు
నిగ్రహాసమర్థులతితీవ్రనిస్త్రింశపాణు లగుచు 151

తలఁప నచ్చోటె యీధరాస్థలికి దక్షిణపుటెల్ల
నిలచియున్న గంధర్వుల నీరంధ్రనిబిడమూర్తి
యలఘుజీవులు పోరాని దాపైన యమునిపురము
నలువుగా నది దాఁటి ప్రాణాలతోఁ బోవ రెవరు 152

కటిక వీఁకట్ల యిండ్లులు ఘనరోదనారవద్వి
కటకజీవలోక నిరంతగాఢాంధకారవసతు
లటకుఁ బోరాదు నరవానరాళికి దక్షిణా ది
గుటజవాసంబు యముడన్న యుగ్రభోగి దగు నేల 153

పరమభర్తృవ్రతాచార వైదేహిఁ జూచిరండు
పరము భార్యఁ దపస్విని వైదేహిఁ జూచిరండు
పరమురాలిని శ్రీమూర్తి వైదేహిఁ జూచిరండు
మెరయు నా యాశలన్నియు మీమీఁదఁ బెట్టుకొంటి 154

శా॥ మాసాంతమ్మున కింద యుండవలె రామస్వామి యీయల్లకా।
యాసం బిక్కడఁ గూరుచుండి యొక నేనై చూడఁగా లేను మా
యీ సౌమిత్రియు నన్న దుఃఖపడఁ దానేమో కుధాంభోధి వి
చీసాంయాత్రికుఁడౌను మీకొఱకు వేచెద రాజు రండీ వెసన్ 155

ఉ॥ వచ్చెదరంచుఁ గన్నులను వత్తులువేసుక కూచుచుండు నే
పచ్చనికాంతి కన్పడిన బారుగ మిన్నున నాదు సైనికుల్
వచ్చిరటన్న యాశఁ గని వచ్చినవానికిఁ బూరుషార్థముల్
గ్రొచ్చినవేలలో దొరకకొల్లుగ లంకెలబిందెలై చనన్    156

చ॥ రమణ సదన్వవాయ జలరాశిశశాంకులు మీరు వానరో
త్తములు మహాగుణాంబుధులు ధారుణియందున జన్మమెత్తిన
ట్టి మహితమా ఫలంబు ప్రకటీకృతమైచను కార్యమిద్ది య
గ్గము పొనరించినన్ యుగయుగంబుల మీ చరితల్ వినంబడున్

వ॥ అంత వారిని దక్షిణదిశకుఁ బంపించి పశ్చిమదిశాప్రేషణార్థ మర్చి ర్మాలామహాబలులను మారీచులను జూచి తదధిపతియుఁ దారాజన కుండును భీమవిక్రముండును వైనతేయసమద్యుతియు బుద్ధివిక్రమ సంపన్నుండును సర్చిష్మంతుడునునైన సుషేణుని మరీచిమహర్షి యపత్యంబును బ్రదక్షిణించి నమస్కరించి యిట్లనియె.    158

చ॥ ద్విశతసహస్రసంఖ్యయును దెప్పరమైచను సేనమీది మీ
విశదపరాక్రమంబు నతివేలము పశ్చిమదిగ్గవేషణా
నిశితమనస్కులై చనిన నీ పది నా కభివాంఛనీయ మే
ను శరణుచొచ్చెదంజుమి నినున్ రఘురాముని కార్యసిద్ధికై    159

ఉ॥ తీరుచు నేర్పుమై వసుదేవుని దూరధరిత్రి ముద్దమం
దారపుఁ బూలతోట రఘునాయకు భామిని సాధ్వి లోకమం
దారము దాచెనో యసుర దుష్టులు వానరసేనఁ గూడి పం
చారముచేయు పశ్చిమదిశాగ్రహణైకమతిప్రగల్భతన్    160

అ ల్పా క్ష ర ము లు :—

ఓ సైన్యపతులార ! యుర్విజాత, భాసురగాత్రప్రభావైకదీ
ప్తాసమమూర్తి నెందైనగాని శ్రీసముపేత నర్థిం జూడగా    161
శ్రీసుషేణులు మీరు శ్రీరామకార్యాసక్తి వరుణదిశాంతసీమ
ఆ సురాష్ట్రంబులయందు శూరదేశంబు బాహ్లీకదేశంబులన్    162

భీమాఖ్యమగు నేల స్ఫీతజనపదామేయ దేశంబులందుఁ బోయి
భూమికన్యావార్త పొలుపు తెలిసి యీ మాసపుంగడ కిటకు రండు

పున్నాగకాంతారముల్ పొన్నలుఁ బొన్నారిగేదంగి పూఁదోటలుఁ
సన్నని వకుళాగసంతానముల్ క్రన్న గవేషించి కాంచి రండు 164

పడమటికొండల పసుపులైన కడువులలోపల క్రమ్ముపొదల
మడుగుల చలినీట మత్తికాడు పడతుక నుంచెనో పాలించుడీ 165

ఎదురుపారెడు నీళ్ల యేళ్లలోన ముదియెఱ్ఱనీళ్లుల పొదలలోనఁ
గదియు కొమ్ములతోడి కాంతారముల్ వెదకుడీ సతిదాచిపెట్టవచ్చు

కొండలఁ బొడుచుక గ్రుచ్చుకొనెడు దండిశిలల పర్వతంబులందు
కొండరాలకు మధ్య గుహల దాచియుండెనో రాక్షసు దుర్వృత్తుఁ

ఒక మొక్క మొలవని యూషరక్షితికిబొమ్మలై యుంద్రు దీప్తాసులై
యొకజాతి తబిసు లందుంచెనేమొ మొకరిరక్కసుడందుబోయికనుడు

ఏ కల్పములవారో యింత మనిసు లా కొండకొమ్ములయట్లు నిలచి
వే కాంచునట్లు కన్పింతురు భయదాకార మొప్పనీ రచట కనుడు

రివ్వుమఁ గాలి నారికెడంబు తలలు జవ్వజవ్వన నూపి సాగరంబు
నవ్వులనురువుల నర్తింపగా దవ్వులఁ గనిపించుఁ దప్తజలధి 170

అ ం త ర క్క ఱ లు :—

మొగలిడొంకల కాన్గుపొదలఁ గపీంద్రు
లగవిహారులు వత్తు రాహారవాంఛఁ
జిగురుకన్నులవారు క్షితిజ నందుంచు
నిగరణార్థము దైత్యనీచుండు కనుడు 171

జలధివేలానివిష్ట శైలాంతగుహలఁ
జలితతాళీవనాంత జాంగలభూమి
చలువసరకుచెట్లున్న సైకతస్థలాన
కలదొ భూజాత పోయి కనవలె మీరు 172

మురచిపత్తన మొందు పోనఁబో నవంతి
మరి జటీపుర మొందు మరి యంగలోప
పురమునందునఁ గనుడు భూజాతఁబంక్తి
శిరుడు దాఁచనువచ్చు జీవాంతకుండు 173

మహితసాగరసంగమస్థలంబునందు
మహీధరంబుండె హేమమహితాఖ్య మొందు
విహితమహా శతశృంగవిభువును నుత్తాల
మహీజరమ్యంబు రత్నమణిప్రస్తరంబు 174

చెలువురెక్కలతోడి సింహముల్ చరించు
వలయమూర్తి హేమగిరిప్రస్థంబులందు
జలధిలోపలి మత్స్యసామజతిమిరాజి
వెలిచి తమగూళ్లలోనఁ బెట్టు సింహరాజి 175

చెట్లపై గూళ్లలోన సింహముల్ వసింపఁ
గట్లపైఁ గొమ్ములందుఁ గరులు చరింపఁ
జొట్లు కుంభములందు జీర్వాకు నెత్రు
బొట్లుగా ధాత్రి తోచు బొక్కాణమనగ 176

పోలి యా కొండ జలధి చొచ్చి వందయోజ
నాల దూరానఁ దేలి నాయంకరంబు
గ్రాలఁ బారియాత్రగిరిగాఁ గానిపించు
నేలపై దానికొమ్ము నిక్కఁ గాంచనంబు 177

నడుమ శతయోజనముల నాగేంద్రపాళి
కడఁగి చరియించు మేఘఘటలూ యనంగ
పుడమికన్యక నీటి ముడుతలయందుఁ
జెడుగురక్కసి దాచుఁ జీకాకుపొంది 178

ఆటఁ గాంచనశృంగమంచు వృక్షరాజి
పాదులం గొమ్మలందుఁ బారీంద్రరాజి

చాదు నీడంబులందుఁ జార్చిక్యకాంతు
లూదు కందరములను నుర్వీజ తోఁచు 179

అంత దుర్దర్శపారియాత్రంపుఁ గొమ్మ
వింత యష్టాపదచ్ఛవియు శతయోజ
నాంతముం గాంచు డచట నాశంసితార్థ
చింతులై చూడవలయు సీతమ్మయునికి 180

కర్ణాట చతుష్పదలు :—

చతుర్వింశత్కోటికసంఖ్యాకు లనల
ప్రతీకాశులు భీమబాహులుఁ ఘోర
గతుల్ కామరూపులు గంధర్వు లచట
వితతముగను రక్షావేశులై యుంద్రు 181

అచటఁ గించిత్క మాహార మాహార
విచయనార్థంబు మీ రెట్టికోరాదు
నిచితనాదేయంబు నిర్మిమీష, యట,
విచల్లిక మొదలైనవి పత్రములు తిని 182

నాకేమి యంచు గంధర్వాళిపైన
దూఁకబోకుడు సమిద్ధార్వహాల్ వాకు
మీకు సాధ్యులుకారు మీరు వానరుల
జోకగా నున్న మీ జోలికే రారు 183

సముద్రాంతరావర్జనాహారమ్ము
వమద్వహ్ని గంధర్వమాలాకమ్ము
నమచ్ఛత్రుసంతానరక్షాకమ్ము
సముదితోగ్రబాహాశక్తి రక్షించు 184

మీఁద వజ్రాఖ్యభూమీధరలక్ష్మి
వైదూర్యవర్ణాభ • వజ్రసంస్థాన

మేదినీజానేకమృదులమారకత
చోదనచ్ఛాయావిశుద్ధైకధాత్రి. 185

తదవనీభృద్గుహాతాపింఛకాంతి
మదాంధ్యధరాంతశ్చమల్లేఖవోలె
విదితశంపాదేహ విభుధర్మపత్ని
యొదిగియున్నదో యేమొ యుర్వీజ కనుడు 186

ప్రావేలు పుర్వీధరశేఖరమందు
శ్రీవిదేహపతి దుహితృమణి నట నెందో
యే విగాహితమైన యిరులగుహాలోన
నో వెట్టుఁ బెట్టునా యొగిఁ బశ్చిమదిశ 187

శతయోజనాయామ శైలాగ్రగుహాలు
శతధృతిసృజనాధిషణా చిత్రములు
క్షితిధరరమ స్నానమ్ముసేయుచో నాభి
గతవారి జారునాఁ గనిపించుఁ గడలి. 188

అంతఁ గడలిలో నాల్గవపాలు మేర
కాంతవార్బంధమ్ము కడచన్న చక్రి
వంతమ న్గిరి తోఁచు వాడి వేఱుంచు
సంతన సుదర్శనము సంతరించె నట. 189

మును విశ్వకర్మ, వేమొన వాలు పూని
దనుజుని హయగ్రీవు దండించె స్వామి
కొని శంఖచక్రముల్ కోరంవచెట్టు
నునుబంకవలె నోట నుచ్చిళ్లు క్రక్క— 190

హృషీకేశుడన్న౯ హేరాళకోప
తృషావేగి యసుర వైదేహా నచ్చోట
ముషితబుద్ధి త్రివిక్రముసిడెప సిరాద
రషాడ్గుణ్యాకారి నెఱసి దాఁచవచ్చు 191

శిలోచ్చయసానువుల్ చిత్రముల్ రమ్య
ములు విశాలములు పరిమూఢనాసాగ్రి
బిలపరిమళములు నట వెదకుడీ సీత
జ్వలితరత్నక్షితిసుషమ మెఱుఁగుబోణి 192

అరువదియు యోజనా లాపైని కలదు
వరాహమను ఘనపర్వతమ్ము సువర్ణ
భరశృంగము నగాధభయదాంబుధియను
ముకువుకంబము కాకిబోడ్డుపట్టైనన 193

అందుండుఁ బ్రాగ్జ్యోతిషాఖ్య పట్టణము
సందీపితోర్జితాష్టాపదోజ్జ్వలము
నందుండు నరకుడన్నట్టిదానవుడు
చిందిపోయిన మట్టి క్షితి నెత్తువేళ 194

పధిత్తైనోనిరాకృతి సేయడంచు
సాధింపగా భూమి జలరాశి మునుఁగ
స్వాధీనపతిక యొయ్యారంపుఁ బోత్రి
ప్రోధమ్ముతో నెత్తి పూను నవ్వేళ 195

ఆ మట్టిముద్దకును బ్రాణప్రతిష్ఠ
స్వామి చేసెను నేలచాన నోదార్ప
ఆమసటు నసుర యేడవు కంచుకోట
లామీఁదఁ గట్టి రోదోఽంతరం బాఁచు 196

వడిఁగశ్యపప్రజాపతికూఁతుఁ గానియె
పడఁతుకఁ జతుర్దశిని వాని చావామె
పిడికిటం గల దసురవీటిలో నెల్లఁ
బుడమికూఁతును జూడఁబొం డెల్లగుహల 197

మేఘవంత మనియెడి మేదినీధరము
ఓఘధారాప్రస్రవోరుకందరము

మాఘమాఃప్రాతస్సుమల్లీరుచి, విధు
తాఘుంబు సర్వకార్తస్వరంబు గిరి 198
విరచితోదన్వత్కృపీటతాడనరు
డుకుఘోషగిరి కందరోరుప్రతి స్వ
న రీణామతి మృగేంద్రవ్యాఘ్రగర్జ
లోరిపిళ్లుపెట్టు నట నుప్పరంబెల్ల 199

తురాసాహునకు నిందు నభిషేకంబు
సురానీకముల్ భాసురంబుల్ చేసె
గిరీంద్రంబు పూజాకృత్సఽమూర్తి కపి
వరుల్ ససపర్యాసవంబుగ వెదకుడు 200

జాతరూపమయంబు త్వాష్ట్రజసంతతియు
వే తరుణమార్తాండవిభ్రమావహము
నాతతగిరిసహస్ర మంతఁ గన్పించు
శ్రీ తావి ముసరు పుష్పితకాననముల 201

ఉన్న దా గిరులలో నుత్తరపు మేరు
వన్నాఁడు మార్తాండుఁ డతిప్రసన్నుఁడయి
మున్నా మహాశైలముం గాంచి నేఁ బ్రి
సన్నుఁడైనాఁడ నిశ్చయము నీయందు 202

పగలు రేల్ నీకు లోసము లేదు పైఁడి
జిగులవెల్గుల కోయి క్షితిభృన్మహేశ.!
తగులు నీ శృంగసంతతి వసించెదు సు
రగంధర్వుల శరీరముల పసిఁడిజిగి 203

దివౌకులును విశ్వేదేవతల్ సురలు
ను వసువులు నుదీచీనూత్నసంధ్యా వి
భవదర్శనార్థంబు వచ్చి యీ మేరు
వవధరింతురు తరణి యర్చానిరూఢి 204

ముహూర్తార్థమందుఁ బోగి శతసహస్రి
మహాహా ! యోజనములఁ గట్టాక్షించుఁ దరణి
రహోమూర్తియట్టుల్ రాజతక్ష్మాభృ
దహో పురుషిక కనుల కస్తంగమించు 205

అచ్ఛోట విశ్వకర్మాభినిర్మితము
పచ్చలను నీలముల్ ప్రాసాదపరిఖ
లచ్చపడఁ గట్టినది యలరాలు వరుణు
నుచ్చస్థలీసౌధ మూటాడి మిన్ను 206

అస్తగిరిమేరువుల యంతరమునందు
నిస్తులము మణివేది నిట్టలము పొందు
ప్రస్తరము కొలువుండు వరుణదేవుండు
విస్తార మిరమ్మదవేశంతమూర్తి 207

తన్నుఁ దా భావించు తత్త్వజ్ఞమాళి
సాన్నాయ్యనిధి మేరుసావర్ణి కొండ
కన్నా కపరబ్రహ్మయుఁ గమలాప్తతేజు
డున్నాడు కొండపై యోగీశ్వరుండు 208

చరణమూర్ధులు మేరుసావర్ణిఁ గాంచి
ధరణిజాత ప్రవృత్తి తగును బ్రశ్నింప
పరమహానిని జూచి ప్రశ్నించు ఫలము
ధరణిజాత ప్రవృత్తి తనయంతఁ దెలియు. 209

జీవలోకమున కా శిలోచ్చయవేది
కావల మరేమున్న దవగతము కాదు
దేవుఁడో సూర్యుండ దేవుండు పైనఁ
గావిరులు చీకట్లు క్రమ్ము దేశమున 210

మహా కృ అ :—

మిగిలి యచ్చోట జీవలోకాక్షి నిమీలనం బంబుజాప్త తుదివెల్గు తగిలి చీఁకట్లు కృష్ణసర్పముల మొత్తము లుండు లోతైన పెద్దగుహ

ప్రగతజానువు లూర్ధ్వజానులు దైత్యపతులెవ్వారోకానియిరుల మొత్త
ముఁగఁ జరింతు రసూర్యు లచంద్రముల్ మూర్తిమదజ్ఞానపుంజములు
వరుణదేవుని పూఁదోటలోఁ బూలు వ్రాలు సంజల నెఱ్ఱవెలుగులొప్పి
మరుచటిదినంబు ప్రొద్దుట నల్లనై మరి తెల్లనై పవళ్ల నవి
యరయ నచ్చట నున్నవారికిఁ దెలియదు వస్తురూపంబు తెలిసికోను
ధరణిజాతవియోగభావముచేతఁ దగు నెఱుంగను స్పష్టమార్గమున

చ॥ వెసఁ బరిపూర్తికాకమును పే నెల యిచ్చట నుండగావలెన్
మసలినవాఁడు వధ్యశిలమధ్యమునందున నుండు మీరు ధా
త్రిసుత గవేషణాధిగతదేశులు చూచియు రండు నీలర
క్తసితవిధా దినప్రళయకాలము కల్గెడు చోటుదాఁకనున్. 213

ఉ॥ ఏను కపీశ్వరుండగుట యెంతయు నిష్టమయేని మీకు నీ
నేను కపీశ్వరుండగుట నిక్కము రామునిచేత తాను ప్రా
ణానికిఁ బ్రాణమొడ్డి యవునా మరి నన్ను సముద్ధరించె నిం
తైనను జేయజాలమొ గుణాబ్ధికిఁ బ్రత్యుపకారలేశమున్ 21

ఉ॥ ఎప్పటి కేది కావలయు నెప్పటి కేది ప్రానర్పగావలెం
జెప్పగఁజాలు మామయు సుషేణుడు భీమపరాక్రమాబ్ధి మీ
కొప్పఁగ వెంటవచ్చు నరుణోపలపశ్చిమవార్ధిదాఁక నా
కెప్పుడు మీరు కన్పడు రిచ్చటఁ జూచుచునుందు మీకునై 215

చ॥ ఉదయములందు రండు మరియున్ మలుసంజల యెఱ్ఱవెల్గులన్
గదలిన మీ నవారుణితకాంతిదృగంశుచకచ్చకద్విధా
భిదురముగాఁగఁ గన్పడదు పృథ్వితనూజయుఁ గానిపించిన
ట్టిది ప్రొడ యున్న దాని ప్రకటీకృతి మున్నుగ గోచరింపఁగన్ 216

ఉ॥ పట్టిన యెర్రజేగురుల పశ్చిమదిగ్గిరి దుమ్ముకొట్టుకొ
న్నట్టి శరీరధారులకు నాయువు మిక్కిలి యిచ్చుఁ దమ్మిపూఁ
జుట్టము నచ్యుతంబు తన శోభకు నా ప్రళయాచ్ఛముల్ ఛప్రల్
నట్టువ కీ గతిన్ దినదినప్రళయంబగు గోప ముఖ్యముచున్ ,217

వ॥ అంత వారి నందఱం బశ్చిమదిశకుఁ బంపించి యుత్తరదిశాప్రేష
ణార్థంబు సర్వవానరసేనాప్రథమయూథపతిని శతవలిని శతసహస్ర
వానరవీరపరివృతుఁ గాంచి యిట్లనియె. 218

గీ॥ బంధులము మీరు నేను వైవస్వతులము
నీవు నీతోడి సదృశంబు నీ చమువును
మొగి మనోవాయువేగగాములు తలంపఁ
బ్రథమదుర్గములరు కపిరాజ్యమునకు 219

ఉ॥ ఇమ్మొగ నుత్తరాశను మహీస్థలి మిక్కుట మొప్ప మార్గిత
వ్యమ్ము నెలఁగ సమస్తమునయందునఁ జూడఁగ మీర నేస్త ను
గ్రమ్మగు దోర్బలంబు నధికంబగు వేగము సూక్ష్మబుద్ధి మీ
సొమ్ములు రాముభార్యఁ జని చూడుడు మత్ప్రియ మాచరింపఁగన్

మ॥ ఉపకారంబును బొంది ప్రత్యుపకృతివ్యాఘాత్ముఁ డెవ్వాఁడు కా
డపరాధంబని యంతకంటెఁ గలదా యీ పాపమున్ నారకా
స్రిపుఁ గుల్యాక్రిమితన్ ఘటించుఁ దనుదూరంబైన యీమాట కా
దిపు డీ నెచ్చలికాని కార్యకరణం బేలాగు కాదందుమో 221

క॥ మన మింతయింత వారము
మనతోఁ బనిలేదు మనకు మైత్రీఫలమై
చనుఁగాక మన పరాక్రమ
మనితరసంస్థానరమ్య మాశ్చర్యదమున్ 222

చ॥ అవనిని జూడఁగావలసినట్టివి సర్వ ముదీచియందు యు
న్నవి హిమవన్నగంబు కనిరన్ మరి చాలు నదొక్కఁడే మదిన్
బవియన నెట్టియాయుధము పర్వత మెంతది దాని తెక్కలె
ట్టివి సురరాజు కీదృశుడు డెప్పరమౌను దలంచినంతటన్ 223

మహాక్కలు :—

మొదట నిచ్చోటనున్న నదీవనంబులు గిరికందరములను జూచి
పిదప మ్లేచ్ఛముల్ శూరసేనపుళిందపృథువులు ప్రస్థలమద్రకము

లుదితకాంభోజయవనకురుభరత ఉర్వీభాగములును శకధరిత్రి
వెదకి బాహ్లికటంకణపౌరవవీథులుఁ ఋషికముల్ చూడవలె. 224

పరమచీనముల్ చీనముల్ నీహారపటుధాత్రిదరదములు హిమవంత
మరసి శివజటాజూటికాభోగ సీమంతశైవాలినీనీరముల
సరగ లోధ్రపద్మకషండపున్నాగ సల్లకీదేవదారువనరాజి
ధరణికన్యక దూషితాత్మండైన దైత్యుండు దాచెనో చూడవలె225

అంత సోమాశ్రమం బున్న దర్భాసమాయాత దేవగంధర్వయక్ష
కాంతల పునుగు జవ్వాది పరిమళాక్రాంతదిగ్దేశాంతభాస్వరము
వింతసేయునో వేల్పువల్వలుకట్టి వెస లొద్దుగుల పూవుదుమ్ము తలకు
చెంతలఁ రాచి విస్మయానిమిషదృక్స్థి జానకియక్షి యున్నటుల226

అట మహాసానువు మహాద్రి కాళమన్నాఖ్యాది మంత్రించినట్టు లుండు
అట మహాస్తాపదపదంబు హేమగర్భాఖ్యము శైలరాజమ్ము కల
దట సుదర్శనమన్న భూధరము లతాంతకాంతారధాళధళిపటువు
నట మహాక్షేత్రమగు గిరి దేవసఖాఖ్యమ్ము దేవతాగేహకము 227

ఉఱక దిక్కులు తెలియక యాడాడ నూగాడుచుండంగ విరిసిపోక
మఱియుఁ గాత్రస్వరాశావికృష్ణులై మహిమంబు చెడక మీరెల్లరును
గుఱుతుగా లుప్తదృష్టులై సౌందర్యగూఢభావపరిహీనమతి లేక
మెఱయు దేవతాకన్యా కనకచేల మృదుతాసమూహులు కాకయును

కాళహేమగర్భసుదర్శనములందుఁ గడునడి దేవసఖగిరియందు
హేళికాంతులు తగ్గకముందు మహీసుతపాడ యున్నఁ జూచుచును
కేళిదీర్ఘికలందు డోలలయందుఁ గేతకీవకుళక వనములందు
హాళి దేవతాకాంతలు చరియించు నాయాయి కందరభూములను229

మొసలి తొండలు బహువర్ణచిత్రితామోఘకాంతిచ్ఛటాతనువులొప్ప
మసలు బహువర్ష కాలపతితములు మాగునీళ్ల గిరిదరీస్థలుల
మొసళులుఁ బయోగ్రస్తార్ధదేహముల్ మొద్దులై ప్రస్తరపల్వలముల
నెసఁగువాని దాకుభ్రాంతి సామీప్య మెనయక ధాత్రిజఁ జూడవలె

ఎటులఁ జూచిన శతయోజన మెడారి యేచు నచ్చోట నిర్వృక్షకంబు
ఘటితమిథ్యాజలాసార, ససిదాఘు, కాలిదారియునైనఁ గన్పడదు
పటుమహాలంఘనంబుల నది దాఁటి పరమవిశాల మాకసము దాని
కుటజమల్ వృక్షముల్ ఫలంబులు నదీకుల్యలేని దాని నంతటను 231

అటనె కైలాసమున్నది శివనంది యమ్మవారును భృంగిరిటుడు దుంతి
యుటజవాసి మహాపరమేశుఁడు యోగీంద్రులకుఁ గాని కన్పడదు
ఘటితమా మహాశ్వేతభావమున నాకారమ్ము లేర్పరింపఁగను రాక
పటువులుపరమహంసలు స్వచ్ఛమా పలితమహస్సులోఁ గాంచెదరు

మింటిమెఱుపుల వెలుగైనది వళక్షమేఘ సన్నిభమైనదియును పైడి
బండిసుషమా మనోజ్ఞమైనది మణివైదూర్యమరకత శ్లిష్టమును
కంటికింజారితార్థ్యము కలిగించు కలుములు తుదియెల్ల యనఘమైన
దంటమోముల దేవర జిగులసౌధము కుబేరునిది కన్పించు నట 233

చెలిమికాఁడైన ముక్కంటి తలమీఁది శివనది రత్ననిర్మితము నేల
వెలసి ప్రతిబింబరూపమ్ముపొందినవిధముగా నొక తటాకమ్ము కల
దలఘుకారండవాకీర్ణ మష్టాపదాంభోజరమ్యంబు చెరువునొడ్డు
జలము వనరాజి కొలుపుచువ్వ లచ్చరల విహారదేశంబు నది 234

పరమభక్తుడు నిజముగాఁ జెలికానిభావమ్ము పడయు టనాదిమతము
ధరణిజాపతి కేను మిత్రుడ నైనదారిఁ దాను పినాకపాణికిని
బరమమిత్రుడు వైశ్రవణుఁడు యక్షపతిసర్వభూతవంద్యుడునుబొల్చు
బరమువీరశైవాచారపరుడు దిక్పతి యలకాపురాధీశుడయిఁ 235

జ్ఞాతిశత్రుత్వ మది పరాకాష్ఠ నెసంగు రావణవైశ్రవణులమధ్య
సీత నచ్చోట వైశ్రవణుఁ డెఱుంగుచెలు వేర్పడకయుండ దాచినను
చేతనులయినవారికి ననుమానచిహ్నంబు గలుగదు మరియు నిద్ది
హేతువై దాఁచనువచ్చును వెదకుడీ హేరాళచంద్రకమహాప్రభవులు

పైడిమేడలలో ముందువెనుకలు వచ్చునట్లుగఁ గట్టినట్టివియునైన
గోడలందున మూళ్లలందున మణికుట్టిమస్థల రత్నపుత్రికల

నీడ లారని వెలుగులచోటుల నిర్వ్యాహగిరికందరములఁ దరులఁ
బైడికంటుల పావురాలయు గూళ్లవలభులందున రత్నదేశముల 237

ఇనతళించిన నీళ్ల చెర్వులయందు హేమాంబుజాతసంతతియుఁ జిత్రి
మవ్రను రేకులంచుల పైడిచారలు నాదిమ్మనంటుచో నందముగ
నవనిధుల్ సూచితంబుగ మరియు నానావర్ణములుగాగ జిలుగుజిల్గు
ఛవుల చుక్కలు చుక్కలు పరిమళాభ్యాసంబు నాసాగ్రతర్పణము

అంతటి మనోజ్ఞమైనెడఁ బరమనోజ్ఞాకార భూజాత నెచటనైనఁ
గాంత మందమ్ములోపల నందమ్ముకలసిపోయెడువట్లు దాచనగు
సంతసమ్ము వివిచ్యమానంబుగా సంగతహేతుసంచయ విమర్శ
పొంతనంపెట్టు మీకు సౌందర్యంబుపొరలు తీసి కనుండు భూమిసుత

క్రౌంచగిరి యున్నదాపైఁ గనుపవులు కాంతారజంబైన వెలుగురేక
చించు బెజ్జమ్ము కన్పించుఁ గొండలోఁ జేరఁగావలె నప్రమాదముగ
బ్రాంచితుల్ దేవరూపులు సూర్యప్రభావంతులుమహర్షులచటనుండు
రంచులంచులఁబడి పోవు డాయాసమనక యుదీచీదిగంతములు 240

గురునితంబయు వరగుహాయును క్రౌంచకుధ రేందిర దానిసొగసుచూచి
యెరుగు డాపైన వృక్షము కామశైలాఖ్యము విహగాలయంబునకు
సురలు యక్షులు గంధర్వసమితియుఁ జొరరాద యీ ప్రదేశము దైత్య
వరులు పోరాని వాచోట్లు వెదకు డాపరమదేశమ్ము భూకన్యకయి 241

ఇదియు మానససరము క్రౌంచభూభృత్కోటి దేశసంస్థములు వాని
వెదకి మైనాకనామకగిరిరాజు వెదకుడు దానవశిల్పి గృహ
పదము మయునిది మైనాకగిరి యశ్వవదనలు గిరిమీద నచ్చటచట
సదనముల్ కట్టి వసియింతురి గగనమ్ము సంగీతభంగీతరంగముగ 242

పైన వైఖానససరస్సు నపరంజివన్నె యంచుల విహారములచోటు
చానలంగూడి యట సార్వభౌమంబు చనుదెంచును కుబేరసామజము
పూని వైఖానసుల్ వీతకల్మషుల్ పురుషవంద్యులు మహర్షులు వసింతు
రా నెలవులందుఁ దలతోఁ బ్రణామంబు లాచరించి 'యదుగుడీ లతాంగి

మ ధ్యా క్క ఱ లు :—

ఆచెర్వు దాఁటినమీఁద నర్కచంద్రాంశుప్రసార
వీచీదరిద్రమ్ము మొయిలుఁపిసరు కన్పించని చోటు
పోఁచగానైన నక్షత్రముల వెల్గు పుట్టని నేల
ప్రాచీనమగు చోటు విగతప్రాణి సృష్టికంబు 244

దేవకల్పులు తపస్సిద్ధదీధితిదివ్యకాంతులను
దేవతామూర్తులు ఋషులు దేశమ్ము దేశమ్ము సూర్య
దేవుండు వెలుగులపిండు తీర్చినతీపుగాఁ జేతు
రా వెగ్గలంబైనచోటు నపసరవ్యాహతంబుగను 245

ఆపైన శైలోదయను మహానది యంగదట్టముగ
నేపు పొందిన కీచకములు నిరుతీర మిమ్మడింపగను
చాపర్వు వెట్టుచునుండు సవరిల్లు సన్నవేణువులు
గీపెట్టు నావర్తతీవ్రకీలిత కేళివాయువుల 246

అచ్చోటి ఋషుల వెదుళ్లు నవియుఁ దమంతట పడవ
లచ్చుపడంగ నీయొడ్డు నాయొడ్డు నరుగుచుఁ జేర్చ
విచ్చిన పొడుగైనయట్టి వెదురెక్క వెస వాల్చినంతఁ
జెచ్చెర నవతలియొడ్డు చేర్చు మూసినకంటిలోన 247

పొలుపుగ నట నుత్తరకురుభూములు పుణ్యదేశములు
నెలవులు విమలశైవాలినీ సుధానీరములకును
కలితమనోహరసస్య కాండైక కాంతారములును
చెలువొప్పు నాత్యుష్ణనాతిశీత మశీతాంశువెలుగు 248

మ ధు రా క్క ఱ లు :—

ఎట్టితామరపూఁదోట లిందిరాసివసభూము
లిట్టికన్నులవోనివి యిట్టిగోరజము తావు
లిట్టుకట్టువిధాన సముద్భూతమధురసమ్ము
లెట్టివారిన మలుసంజ లెత్తిపోసిన విధాన 249

సల్లకల్వాపూఁదోటలు ననుపువెంచు నునుతావు
లల్లలాడు తరంగాళి నాకుపాత్తి యుడుపములు
తల్లడంపడు నవషట్పదప్రియు వేగదర్శ
నోల్లసన్మందహాస కృతోన్మీలనప్రణయినులు 250

చెఱువు లుల్లలదూర్మికాశృంగాటకములు నొడ్డు
నిఱికటంబైన నునుపూవుటీరంబులందు మరుఁడు
తఱిమెనంబెట్టు సంకేతితనిమేష మనభియాత
గఱకుదేరు వృషస్యంతికై భుజంగతతి యార్తి 251

అచటి సెలయేళ్లిసుకతిన్నె లందంబు చిందుకొంచు
ప్రచలితప్రతీపదర్శని సరువెత్త జఘనభాగ
సిచయ మది జారినట్టులఁ జెలువొందు నిట్టిగిరజ
లెచటు వొందు నచ్చటు ప్రియాహితనఖక్షతము లనఁగ 252

ం త రా క్క అ లు :—

భూమిధరములు నిత్యపుష్పితంబు లొప్పు
భూమపరిమళభరితములు స్పృహ లీను
భూమిజంబులు వస్త్రములు సమర్పించు
కామధేనువు నేయి కై సేతలట్లు 253

మొగిని సర్వర్తుసేవ్యములు ఫలరాజి
నగము లిచ్చు సమర్పణాయత్తబుద్ధి
మగువలకుఁ బూరుషులకు మండ్రాట లేని
నగలు రత్నముల్ మణికనకము లొసంగు 254

ఇష్టి కావలెనన్న యూహ కల్గుటొండు
యిద్ది లభియించెనన్న తృప్తి పూనుటొండు
తద్ద రెం డవి కావు తత్క్షణాత్తమతులు
నుద్దిలే దా తసులకు నుపద లర్పింప. 255

అ ల్పా క్క ర లు :—

కలుగును వస్తునికాయ మూహా
కలిగినసమకాలికంబైనదై
అల కోర్కె కలుగ లేదన్నట్లుగా
నిలచినయానందనీరనిధిగ

ఎప్పుడు సంగీతహేలాస్వనం
బుప్పరం బుమియు వాయువు చలించు
చప్పళించిన తాళహాసరవము
మప్పితమపు నాట్యమందిర మన 257

మ హా క్క ర లు :—

అల నకల్పాగసంభూత దివ్యభూషావళీ లలితావయవలు నంగ
నలను పూరుషు లతపస్సమా త్తమహాసిద్ధమహిములు భోగులును
నలఘు లముదితుండని లే డస్త్రియుండని లేదు నవ్వినజనుల నవ్వ
లోలయు వీణాగ్రశబ్దాపయ త్తంత్రికోత్పన్న తీవ్రస్వరస్వనము 258

కుసుమశరచాపశింజినీ మంజులఘుమఘుమారావాంకురములు రమ్య
కుసుమపరిమళ ఘూర్ణితతరువల్లిగుల్మసంతానమ్ము నిత్యమును
విసరదోంకార సుశ్యామబంభరావిర్భూత సంరావసుపరిణాహ
మెసగు నచ్చోటి బ్రహ్మవిష్ణుమహేశ్వరేహా పరిపూర మాకసము

నాగకన్యల గంధర్వసిద్ధకిన్నర కన్యకలయు విద్యాధరాంగ
నాగుణసమూహములయు చేలాంచలనాట్యరేఖాహూతు లర్కసమ
భాగ తేజోనిధానులు కృతపుణ్యభాగధేయులు పూరుషులు చరింత్రు
మూగగుండెలయందుఁ దేగా కత్తిమోపిన ట్లున్న వా కోరికల

ఉత్తరకురుభూములమధ్య కనకమయోర్వీధరం బున్న దచట నింద్ర
పత్నీసమాయాతులు శతధృతిపత్నాయాతులు నుండుదురు
పుత్తడివెలుంగు నెండలు కాయు నా భూధరమందు నది విసూర్య
మాత్రదేవేక్షణాకాంతిసంయోగమై సోమగిరి దాని పేరు మరి 261

అట ననస్తంగతుండైన శీతాంశునంశుల ననుమేయతఁ గను సూర్యు
డటుఁదపించు సూర్యునిచేత ననుమేయమమృతాంశుమాళియేకాదశ ని
కటకమూర్తులు శతధృతిబ్రిహ్మర్షి ఘటలచేఁ బరివృతుఁడయి వసించు
నట నచటుదాఁటి మీఁకును నఖిలభూతముల కగమ్యమగు 262

సోమగిరి చూఁచి వెనుకకుఁ దిరుగుడు సోమగిరివెనుక నది యసూర్య
మూము కవిసి మీఁ రేగినఁ దిరిగిరా రా చో టమర్యాద మంధతమ
సామయాస్థానియు నచంద్రమసము భూతాజ్ఞాత మెవ్వారు చనినగుర్తు
హోమధూమమ్ము పొలసిన గుర్తులే దుచ్ఛ్వాస మాడిన గుర్తయిన

క॥ నెల కాకమున్న రావలె
సలలితగుణుఁడైన రామచంద్రుఁ దిదృష్టా
వలిత్వాపాంగచ్ఛవు ల
ల్లల నరుణితమైన రేక లారకమున్నన్. 264

క॥ ఒకవంద దిక్కులైనను
నికరంబుగ లేవు భక్తినిండినదగు పొం
గుకు తగినయట్లు వెదకిం
చి కపిసమూహంబు పంపు చిత్తము చాలన్. 265

క॥ జలజాప్తు వెలుగుపిండుఁగ
చలించుపర్యంతమైన క్ష్మా వెదకుటమై
వెలి నెచట నుంచు జానకి
ములుచయుఁ దా నంధతమసమునఁ జొచ్చిననున్. 266

క॥ మొదల ధరాకన్యకదగు
మెదలిక తెలియంగనగుట మేల్కాక మరీ
కదలిక కదలిక, శాత్రవ
విదళనగమనార్థవిజయభేరి పొనర్తున్. 267

క॥ ఆమాట యిప్పుడెందుకు
భూమిజను వెదకిరండు పోయి వినతసూ

ప్రామహాణ్యాతేజో లాపయి
వ్యోమ సమాపూర్ణశితశరోదధి యగుతన్. 268

మ॥ మహనీయంబు రఘుప్రవీరుని కృపామాధ్యంబు శాఖామృగా
ళి హారం బెట్టిదొ స్వామికార్యమతికేళీవైభవం బెట్టిదో
ద్రుహిణాండంబునఁ దెల్లమైచను రవీందుజ్యోతి ముక్కాలమున్
విహరద్వానరశౌర్య చంచలదిశావీధుల్ ద్విసీత్యంబులై 269

వ॥ అంత వారి నుత్తరదిశకుఁ బంపించి సుగ్రీవుండు మనంబున నిట్లని
వితర్కించె 270

క॥ అతినిర్భయుండు దైత్యుఁడు
క్షితిజాతను దనపురంబు చేర్చెను గడుసై
శతయోజనముల జలధియు
నతార్య మన్యులకు నాకు హనుమకుదక్కన్. 271

గీ॥ జాంబవంతుఁడు దానికిఁ జాలుగాని
నూకఁజాలడు మోకాలు నొప్పిపట్టి
నాకు హనుమంతుఁ డొక్కఁ డున్నాడుగాక
యీ మహాకార్యభారము నెత్తలేను 272

వ॥ అని వాయుదేవతాపత్యంబు హనుమంతుం జూచి యిట్లనియె. 273

క॥ అదియేమి క్రిందిచెక్కిలి
మొదలింటి శతారఘాతమున నగు మచ్చన్
మెదలుననుచుఁ జేఁ తాఁకుచు
నది యేమియు లేదటంచు హసితాననుఁడై 274

మ॥ అవనీదేశము సర్వ మెంత పరిణాహం బొప్పు నాకాశ మెం
తపు నీ రెండును వైనతేయుఁ డొకఁ డాహా ! అక్కాలం బట్టెఁ బ్రో
డవు బాహాయుగళంబునందునను గూడల్ వేయదున్ నీవు, వి
ష్ణువు శ్రీరాముఁడు దీటుగాఁగలరు నిన్నున్ వైనతేయుం గనన్

చ॥ తలపయిఁదా ననంతుఁడును ధాత్రిని దాల్చె నతండు భారముఁ
దోలఁచిన నీధరావహనధూర్వహుఁడెవ్వఁడు వైనతేయుఁడు
జ్జ్వలచలపక్షచంచలుఁడు పట్టినభారము నాల్గునాల్గు ది
క్కులకును ద్రిప్పు నీదుభుజకోటి యనంతఫణాప్రమాణమై 276

చ॥ మతికలిమిఁ వచించెదరు మానక వేల్పులయొజ్జయౌ బృహ
స్పతి నతినాస్తికంబయిన భావపరంపరచేత వక్రమౌ
నతని మతిప్రగల్భతయు నర్థవినిర్ణయరూపమైన దే
మతి యొకనిన్ను వీడి హనుమా! యనుమానము లేదు లేదెటఁ.

మ॥ సురగంధర్వభుజంగదైత్యఖగయక్షుల్ లేరు దక్షుల్ నినుం
దొరయఁ లంఘనచాతురిఁ జలధిగండూషింతు దూషింతు ని
ర్జరదైతేయచమూసమూహము నఖచ్ఛాయాప్రమీతంబుగా
స్థిరయుష్మన్మతివిక్రమంబులు జగత్క్షేమంకరంబుల్ సఖా 278

క॥ ఒకవేయి గండములనుం
డి కాచితివి తెచ్చి తెచ్చి నేడీ నను ముం
పకు రామకార్యసాధో
ధికృపీటోన్నతతరంగదృప్తభ్రమిలో 279

శా॥ నేర్పొప్పంగను నాకు రాఘవునకుఁ నేస్తంబు గావించి తా
నేర్పొప్పంగను భూమికన్యఁ గని యా నేస్తంబు నిల్పందగుఁ
సర్పిష్మద్ధవిసుం బలెఁ గృతభవత్సంస్పర్శఁ గార్యంబు లెం
దర్పించుఁ ఫలితంబు మింటికొసలందా స్వర్గచూడంబునఁ 280

వ॥ అంత వినయావనతహసితాననుండైన హనుమంతునిఁ గాంచుచు
శ్రీరామచంద్రుఁడు సుగ్రీవుని ప్రశ్రయం బెఱింగి తత్పూర్వహనూ
మద్గతసద్భావస్ఫురణరేఖ స్పష్టంబుగా నిట్లని వితర్కించి 281

ఉ॥ ఇమ్ముగ నింత ప్రాభవము నింతటి దర్పము సూర్యసూతిధై
ర్య మ్మితఁ డన్నమాట యితఁడం చనుకొన్నదియే సమగ్రశౌ
ర్యమ్మును బుద్ధిమత్తయును ప్రాభవయుక్తము భక్తిభావముఁ
గ్రిమ్మన యింతయౌ వినయగౌరవ మెయ్యెడలేని పొంతనల్ 282

ఉ॥ ఈతనియందు నుంచి విధియేనియు సర్వము సృష్టికార్యసం
ఘాతము నిద్రపోఁగలఁడు కార్యవినిర్వహణైకదక్షతా
శ్రీతను వొందినట్టిఁడు నిరీక్షణమంజులహాసతస్సమా
ఖ్యాతనిజాతిలోకమహిమామాధ్యుఁడు సుందరమూర్తి యెంతయుఞ్

వ॥ వ్యవసాయోత్తరుండని నిర్ణయించి రహస్యంబున నతనిఁ బిలచి
స్వనామాంకితమైన యంగుళీయం బతనికిచ్చి 284

క॥ నీ వెవ్వఁడవో తెలియదు
నీ వియ్యది చూపు తెలియు నీరజదృశ నీ
కై వేచియుందుఁ గన్నులు
నీ వచ్చినదాఁక విచ్చు నీరజములుగా 285

గీ॥ హనుమ స్వామి యిచ్చు నంగుళీయకమును
అంజలిఞ్ గ్రహించి యాత్మమూర్ధ
మందు నునిచి యెత్తినట్టి యాస్యంబునఁ
దళతళయ్యె హరిశతారరేఖ . 286

వ॥ అంత హనుమ దక్షిణదిగ్దేశగమనార్థ నిర్దిష్టేతరవానరయూథపతులం
బోయి కలిసికొని 287

గీ॥ పరమయజమాని వేల్చిన ప్రాణమయము
హవిసు మోయుచునున్న కరిత్వగ్నివోలె
శ్రీసమర్పితమై ప్రావృషేణ్యజలద
వారిధారలు వహియించు వాయువువలె 288

గీ॥ సారరూపమహా ఛందోఽవతారుఁ డగుచు
కడఁగి యమృతంబు వహియించు గరుడివోలె
సరగ స్తోభాధిదేవతాజ్ఞాతమైన
మహితుఁ డుద్గాత తాల్చు సామమ్మువోలె 289

ఉ॥ అంతట నాంజనేయు హృదయంబున మ్రోగుచునుండె నో హనూ
మంత ! నరేశకార్యప్రథమానవినిర్వహణైకదీక్ష ! ధీ

మంత ! పరీక్షిశార్యసుకుమార పథాభిమతానుయాయి ! శ్రీ
మంత ! సురారిలోకవినిమారణ ఘోరభుజాదిభారతుల్ 290

సీ॥ అంత రాముండు ప్రస్రవణాద్రిమీఁద
చేరుకొని ససౌమిత్రి వేంచేసియుండె
గుళికలై సూర్యునికరాంగుళులు నుదయ
భూమిధరసానువుల పూలు పుణుకుచుండ 291

క॥ బహుకోటివానరచమూ
విహారమగు నచటి నేల విప్పెడు చీక
ట్ల హాలాహలపుఁ మొదలి ప్ర
వహాముంబోలి వినువీధి వెడలిన గుమ్ములై 292

ఉ॥ పో నొకవెంట మింట నొక ముద్దగఁ గన్పడి నాల్గుభాగముల్
గానయి నాల్గుదిక్కులకుఁ గాఁ జని దిక్కులు రూపమందెనో
నా నెగడెం జలచ్ఛలఘనాఘనముల్ పెనురివ్వ్రమోతలుం
గానయి సర్వవానరనికాయము ప్రస్థితమయ్యెఁ గ్రమ్మమై 293

మ ధ్యా క్క ఱ :—

శతవలి యుత్తరదిశకు సాగె ఝంఝామరుత్తువలె
ధృతమతి వినతుండు తూర్పుదెస కేగె దీప్తార్చిపోలె
క్షితిభృత్తువలె సుషేణుండు చేరెఁ బశ్చిమదిశావీధి
క్షతిలేక దక్షిణదిశకుఁ గాలసాగరపయోవిధృతి 294

గీ॥ హనుమదాదులు బాహుపర్యంతలంబ
మానవియదధ్వులై సమున్మత్తసింహ
నాదబధిరితాశామహానాగరాట్ప్ర
వశ్చలితరంధ్రులై కపిపతులు చనిరి. 295

మ ధ్యా క్క ఱ లు :—

దిగ్గజదంతముల్ పెరికి తెత్తుము తేమేని సీత
దిగ్గుమన గుండె యసురఁ దెత్తుము తేమేని సీత

పగ్గెలాడుచు నీళ్లు చనఁగ వానరపతులు దిక్కులకు
గగ్గురుపాటయ్యె నొడలు కమలినీకాంతాత్మజునకు. 296

అఱతురు కుప్పించి యెగసి యార్తురు హాసంబుసేతు
రఱకడ చేతులు చేర్చి యంతంత యరిగి వచ్చెదరు
నుఱుగొట్టుదురు గాలిఁ జూచి యుగ్రులై యురవడించెదరు
పఱివోవ శత్రుల ధైర్యభావంబు పరవళ్లుత్రొక్కి 297

గోళ్లతోఁ బాతాళలోక గుహలెల్లఁ గ్రొచ్చఁ గల్గుదును
వేళ్లతో దానవలోకవృక్షముల్ పెల్లగించెదను
నీళ్లతో సాగరంబెల్ల నేలపై నిండింపగలను
క్రేళ్లువారి ధరిత్రియెల్లఁ గెరకొట్టి కేడించగలను 298

సీ॥ శతయోజనమ్ముల జలధి దాఁటెద దాట
కున్న మార్చేరున నన్నుఁ బిలుము
నాది సమాధాన నూఁది దానవభర్త
దంతముల్ పగులంగఁ దన్నుటకును
ననుఁ జెప్పవలయు మానక నిట్టిపనికి ధ
రాత్మజ వెదకెడునట్టిపనికి
నసుర నేనొక్కఁడ నరిగి చెవుల్ పట్టి
తెత్తు నా కీవేమి యిత్తు చెపుమ

యనుచు నాత్మపరాక్రమాహంక్రియాభి
యాతిమారణకరణ సంయమనవాక్కు
లగుచు దిక్కులకేగి రంతంత దూర
గగనములఁ జిన్ని మొయిళులుగాఁగఁ దోచి 299

మధ్యాక్కర :—

శ్రీరామచంద్రుండు హనుమ చేతి కిచ్చిన యుంగరంబు
పీసుండు సౌమిత్రి ప్లవగవీరుల విక్రమోల్బణము

కోరి సుగ్రీవుండు ధాత్రికూఁతురు కోసఁ గనంబడుట
నారేయి యూహించుచుండి రాలోచనాధీనమతులు 300

క॥ తన దర్శనాన్నికై వ
చ్చిన సుగ్రీవునిఁ గనుగొని శ్రీరాముం డి
ట్లనె నీపాటికి దిక్కుల
మనసేనలు చూడవచ్చు మహీజాత సఖా ! 301

చ॥ కకవికలై కడున్ నిజముగా వెదుకంగను నైనచోటు నే
రక చకితాస్యులై తిరిగిరాకయుఁ గల్గెడి దప్పుడైన, నో
ద్దిక నిపుడైన నీదు నుపదేశముపొంతె మరెందునెందు జా
నకిఁ గనఁగావలెం దెలిసినా రటనచ్చటఁ జూచివత్తురున్ 302

మ॥ మఱియున్ నాకును జిత్రమైనయది సుమ్మా, ఆదిగంతంబు భూ
ధరనానాచ్ఛతటాక సన్నగరకాంతారోగ్రశైవాలినీ
భరమై నీగతి సర్వధాత్రి యెవఁ డప్పా నేర్చుఁ జెప్పంగ ని
ర్భర మీ జ్ఞానము నీకు నేగతి లభింపం గల్గెనో చిత్రమా 303

మధ్యాక్కర :—

అనినంత సుగ్రీవుఁ డఱియె నంబుధు లద్రులు నదులు
వనములు దేశముల్ వాలిభయమునఁ బర్యటించితిని
గనులు మూసిన వాలి తెఱవగా ముందుఁ గన్పడు వాలి
వెనుకవచ్చును వాలి పార్శ్వవీథుల వెస వాలి గాఁగ 304

చంద్రరేఖ :—

మాయావి వెంబడిన్ భీమప్రౌఢి నవ్వాలి యేగన్
నాయున్న భూమిభృచ్ఛంక్ష్మాగుహాస్యంబు రక్త
వ్యాయత్తవాహనుల్ ఘోరాకార మేపారఁ బారన్
మాయన్న మృత్యువాతన్ బడ్డాడి కేమున్నదంచున్ 305

సుగంధి :—

అందుకోసమే దురాత్ముఁ డద్రికందరంబునన్
విందుగాఁగఁ దూరినాఁడు వేలమంది బందుగుల్
క్రిందుగాను గూడి చంపగాఁ నటంచు దుఃఖినై
కందరాముఖంబు రాతఁ గప్పి యింటి కేగఁగా 306

చంద్రరేఖ :—

ఆమంత్రులెల్లరున్ నన్నారీతి భూజానిఁ జేయన్
నే మొఱ్ఱవెట్టితిన్ దండ్రీ ! బాబు వద్దండి యంచున్
నామాట విన్నచో నీనాఁ డిట్టులే లౌను గాఁగా
నామీఁద నేఁడు పోగా నవ్వాలి యేతెంచి యట్టుల్ 307

శిఖరిణి :—

హాతాగ్నిర్భిన్నాద్రిప్రకటశిఖరాహంకృతిఁ గ్రుధా
హరప్రౌఢిన్ నన్నున్ జరజర ధరాహర్త ననుచున్
శఠుండై చున్ సి హాసనమునను గేశాహృతి శిరో
లుఠన్మాంసత్వగ్రక్తముగను గృపాలుప్తి విద్రిచేన్ 308

మనోజ్ఞ :—

అరయ నదే మొద లన్నమంచు జలంబటం
చెఱుఁగ దిశాప్రతతిన్ విప్రకీర్ణలతాకృతిన్
విరియు మహా లరాజి వెక్కసమై సుల్
మొఱయుచు గుప్పిటఁబూసి పోయినపోకగా 309

ఫలసదనము :—

అచటి కరిగి యిచటికరిగి యెటుచూడన్
విచయ టు వగుచుఁ విరిగి చను వాలిన్
సిచయపుఁగొస మంచుచెలు వఱియ చూతున్
గచము విరియ దెసలు కలఁగి పరువెత్తన్ 310

తరళము:

అపుడు పోయితిఁ బ్రాక్ప్రశాంతము నబ్ధిఁ జూచితి వాస్తరం
గ పటుమూర్తి వియత్తలంబున గ్రమ్ము నుష్ణులనవ్వలన్
గపియు నన్బడి వచ్చుచుండఁగఁ గాలికొద్దిగ దూసితిన్
గపిశకాంతలఁ దూర్పుకొండను గాంచితిన్ రవిపుట్టుచో 311

హరనర్తనము:—

పొద్దుటెఱ్ఱనికాంతిగుంపులు ధాత్రిశ్రీపురుహూతుఁడా!
తద్ద తోఁచినయంత నాతఁడు నావెంటన్ దరుణార్కుఁడై
యుద్దిగా నిరువైపులం దొనరన్ బ్రాణం బురి గోలగా
సుద్దిలేకయ వాకిటిన్ సుడిగొట్టున్ భాసురవేగినై 312

మద్రకము:—

దక్షిణదిక్కు పోయితిని చందనాగభుజంగవిషానలఝురీ
కుక్షి గిరీంద్ర మెక్కితిని దిక్కుడుంగవితానవిరూషితమతిన్
దీక్ష నగస్త్యవాసము హసంతిదివ్యతపశ్ఛటఁ గాంచితి విరూ
పాక్షుని వాలి నందుఁ గన దీర్యదాశ భయాపఁ బలాయితుఁడనై 313

స్రగ్ధర:—

మేనెల్లన్ ముండ్లుగాఁగన్ మిళితభయమతిన్ మేరుసావర్ణిదాఁకన్
నేనాచుం బశ్చిమాశాఖిలగిరిదరీనిర్వవిన్యస్తపాదుం
డై నేలన్ నింగిఁ గాకన్ హతుఁడయి తిరుగన్ హాస్యరేఖానిరూఢిన్
గానంగా నైన వాలిం గని భయపడి నా కాళ్లు వే త్రిప్పికొంచున్ 314

కరిబృంహితము:—

ఉత్తర దిశకుఁ బోయితి హిమవదుర్వీధరమున వాలియై
కత్తళమనుచుఁ బోయి పరుగునఁ గ్రౌంచగిరిపయి వాలియై
జొత్తిల నడుగుదోయి తుదికొస సోమగిరిపయి వాలియై
తత్తరపడుచు వేరుదెస మదితట్టక ముడుఁగుచుండఁగా 315

క॥ ఆ బుద్ధిమదగ్రణికిని
ధీబంధురునకును నిన్ని తిరిగినమీఁదం
గాఁబోలుఁ దోఁచె రిపుమృగ
యాబద్ధుఁడు తోఁచనిచ్చునా వాలి వెసన్ 316

ఉ॥ తూలు మతంగశాపపవితోసభితోవినికృత్తపక్షుఁడై
వ్రాలఁడు ఋశ్యమూకమున వాలి మరప్పటిదాఁక నిద్రయున్
జాలదు త్వత్పరాక్రమవశంవదమై కపిధాత్రి పొల్చెడున్
వేళకుమాత్రమే కనుకువెట్టితి ముట్టితిఁ ద్వత్పదాబ్జముల్ 317

క॥ అప్పుడు చూచితి నాల్గు క
కుప్పులు తత్తత్పయోధిఘోషలు పొదలుం
దిప్పలు నెల్లలు గుంటలు
నప్పటికిప్పటికి నాకు ననుకూలముగా 318

క॥ ఒకచెడ్డ యొక్కమంచికిఁ
బ్రకటితముగ జరుగునన్న పలుకది నిజమై
యకటకట వాలి చేసిన
నికార మదియున్ ఫలించె నే డుపకృతియై 319

క॥ తెలిసిన లోఁతుల నీదుట
చులకన కపిసేన తిరిగిచూతురు నెలలో
పల నిదియిది యని తెలియక
తలమే బ్రహ్మకును ధాత్రిఁ దట్టాడంగన్. 320

ఉ॥ ఇన్ని పయోధులున్ గిరులు నిన్ని నదీనదముల్ చరింపఁగా
నెన్నడు నేర్వఁడెవ్వఁడు మరెవ్వడు ప్రాగ్గిరిపశ్చిమాద్రులన్
గ్రొన్నన యెఱ్ఱగన్నెరుల కుప్పలు కోసిన తోఁటలోఁపలం
గన్నుల చారితార్థ్యకృతిగాఁ గనఁజాలెడువాఁడు ధాత్రిలో 321

వ॥ అంత నింటికిఁ బోవు సుగ్రీవుండు శ్రీరామచంద్రు ప్రశంస నిట్లని
విత్కరించె. 322

ఉ॥ మెచ్చెను మెచ్చలేదెపుడు మెచ్చుట యోచన చూడలేద యా
మెచ్చినమెప్పు వస్తుగుణమిశ్రిత మశ్రిమమైన బుద్ధియై
యచ్చెరువంచుఁ గన్పడద యక్కట పండినబుద్ధిశాలికిన్
దచ్చపుకంబు దిక్కులకుఁ దారిన యీ వెఱఁగెల్ల నల్పమై 323

మ॥ పదునే నీకలుకల్గు రెక్కకుదియింపన్ జంటరెక్కన్ మరిం
బదియా నీకలు ముద్దుచాశ్వయుజమ న్మాసాఖ్యమాపక్షి నే
ల దిగంబోయెడు నంత మేఘమన నేలం దూకి యే తేరఁ దూ
ర్పుదెసం జన్న కపుల్ ధరాగజము మున్ ముంగాముఠంబై చనన్

వ॥ ప్రథమకక్ష్యాగతప్రతీహారదత్తదర్శనుండైన సుగ్రీవునితోఁ గలిసి
ప్రస్రవణాద్రికిం బోయి శ్రీరామచంద్రసన్నిధానంబున వినతుం
డిట్లనియె 325

మధ్యాక్కఱలు :—

అమ్మ యిట్లుండు నిట్లుండునంచు నాయాత్మలోఁగలవ
యమ్మకన్పడెనేని యెఱుఁగనంతటి యల్పుండఁగాన
యమ్మఁ దూరపుదెసయందు నసుర కొంచనుగడు లేద
యిమ్మగాఁ దూర్పుదెస మఱెందు నేనే ప్రమాణమ్మ 326

శతసహస్రంబు నాదు కపిసేన యక్షిశతసహస్ర
వితతంబుగాఁ జూచె గిరుల వివరముల్ వివరంబుగాను
నతవారులగు నదుల్ సర్వనగరముల్ నగరులు శబర
తతుల గూడెమ్ములను నసుదారఁ గాంతారదేశములు 327

ఈదేశములుదాఁటి యడవులేగి వార్ధీంద్రులఁ జూచి
యాదేశవర్తుల పూచు నాశాసమన్వీక్షణముగ
నే దివ్వెనుడి చూడనుండ నేతేర మే వెల్గు సీత
యో దాసంగానంచు సేనయును నాకు నురనడించినది 328

వైకుంఠసదనంబు మొదలి వాకిటవరలు దీపముల
వేకంబముల చాలువోలె వెలుఁగు దర్వీకరరాజి

నాకాశ మంటిన మాళులందు రత్నాంశుసంతతులు
నాకల్పముగనున్న ప్రాగ్దిశాబ్జాప్తు నర్చి చూచితిమి 329

క॥ అని చెప్పినంత సుగ్రీ
వునకును బ్రాగ్దిక్కునందు భూమీసుత లే
దనిపించె నంత వినతుఁడు
వినతుండై కన్నుగొనలు వివృతంబులుగా. 330

ఉ॥ ఇక్కఁతినంపుఁగార్యకృతి యెవ్వఁడు నేరడు చేయఁగానతం
డొక్కఁడు దక్క బాహుయుగళోగ్రపరాక్రమవహ్నిమాలికా
ధిక్కృతదిగ్విపత్సకలదేశుఁ డధీశుఁడు సర్వకార్యపుం
ఫక్కికలందు నంచుఁ బెడఁబాసెను రామపదాబ్జనమ్రుఁడై 331

మ॥ పరితోవృక్షకపత్రధూననభస్వద్వేగమై వచ్చి ని
ర్భరమై యామఱునాడు పశ్చిమదిశావ్యాకోచమై చన్న వా
నరయూథంబు తదుగ్రవేగకృతమంథానాకృతిన్ ధూళి యు
ర్వర నల్పాతపమార్గముల్ చిలుకఁగా స్వల్పీకృతాభ్రంబుగన్. 332

వ॥ శ్రీరామచంద్రపదాంభోజఘూళిమిళితమస్తకమాళియై సుషేణుం డిట్లనియె. 333

నేను చూచిన మేర నీరజాతనేత్ర
కానగారాదు రామ! కల్హారనేత్రి!
నేను చూడని చోటు నిజముగాఁ బశ్చి
మాన నంగుళమైన మహియును లేదు 334

ఏగి ప్రాగ్జ్యోతిషమున నిన్నగోడలందు
పేఁగు కన్నులుగాఁగ వెదకితి నేన
లోఁగు ననుకుల కనులలో దుమ్ముకొట్టి
సాగి చూడని నదియు శైల మొండు లేదు 335

ఉర్వి నాసేన నేను నుప్పళించినాము
పరిఁ పశ్చిమదిక్కున ప్రథితగుణాంక!

గర్వ మింతయుఁగాదు కడు మముమించి
ధూర్వహుఁడు లేడు సీత దూపిల్లి చూడ 336

స్వర్ణమూర్తి యగా నేరుసావర్ణిపకాళి
వర్ణధర్మముల్ రూపవంతముల్ చలింప
నర్ణవారుణకాంతు లమరఁ దత్కాంతి
గీర్ణ యగుట కని తిరిగితిమి యిట్లేపు 337

క॥ అని చెప్పినంత సుగ్రీ
వునకును బశ్చిమపుదెసను భూమిసుత లే
దనిసించె నట సుషేణుఁడు
ఘనసేనుఁడు విస్మృతవదన వహ్వాసుఁడగుచున్ 338

ఉ॥ ఇక్కతిచంపుఁగార్యకృతి యెవ్వడు నేరడు చేయగా నతం
డొక్కఁడుదక్క బాహుయుగళోగ్రపరాక్రమవహ్నిమాలికా
ధిక్కృతదిగ్విపద్వలయదేశుఁ డధీశుఁడు సర్వకార్యపుక్
ఫక్కికలందు నంచు నెడబాసి చనెన్ వినయాక్షివీధినై 339

మ॥ ధ్రువతేజుండు సపక్షధావదచలేంద్రుండై యుదీచీపరీ
ష్టివిధిం బంచిన యోధుఁడంతఁ జనుదెంచెన్ వాలినున్నంజలం
దవనీభాగము డిగ్గి వానరపురీహర్మ్యాభిముఖ్యంబు చెం
దౌవతోటల్ బలె వచ్చిరిం గపిచుహేంద్రుల్ సూర్యసూతిం గనన్ 340

వ॥ అంతఁ బ్రస్రవణనివాసగుహాముఖంబున నిలుచున్న శ్రీరామచం
ద్రున కాభిముఖ్యంబు దీపించి దివ్వెటీలవెలుతురున శతవలినిలుచుండి
సుగ్రీవునితో నిట్లనియె. 341

మహాక్క అలు :—

నేను చన్నట్టి దిక్కునఁ దానవనీజాత లేకున్కి సిగ్గుపడెదఁ
బూని మర్యాద పాటించెనేగాని భూసుత యున్నట్టి దిక్కునకుఁ
దాను పంపించలేదు నారాజు నన్ దగ నుత్తరాశాసముదితవీధి
కానలుం గిరుల్ నదులును పల్లెలు కాంచినా మేను నాసేనయును

అల్ల నీహారపర్వతోపత్యకలాపైని కైలాసశృంగములును
తెల్లవైప మొగాలు వేసినవి ధాత్రీసుత మేము నెఱుంగమని
యల్లనెదురుబడి మహేశునడుగుద మనుకొంటి స్వామికిఁదెలియదంచు
నెల్ల ప్రమథులు చెప్పిరి భూజాతహిమగిరిచాయల లేదు మరి 343

పోయి చూచితి మెల్ల నుత్తరకురుభూములు భోగాయతనములందు
మాయురే మహిజాత రక్కసి కొన్నమాటయేయెఱుఁగరు శ్రీనిధులు
పోయి శిశిరాంబువేశంతసీమలు పున్నాగముఖ్యభూజముల పూలు
దోయిలించిన తేనెలు భూసుత దొరకునో యంచు గాలించితిమి

సోమగిరి చూచితిమి బ్రహ్మకొలువున్న చోటనారసితిమిపదియునొండు
గా మెఱుంగు రుద్రాకృతి శోధించి కాంచలేము ధరిత్రికన్యకను
మేము చెప్పునవలె లంక రక్కసి మేదినీకన్య దొంగిలె నటంచు
నా మహాత్ముల కేల దుఃఖము కల్గుటని చెప్పకుండనే వచ్చితిని 345

మతి సుగ్రీవున కప్పుడు
దితిసుతుఁ డతఁ డుత్తరంపుదిశ సతి నిడఁడం
చతి విశదమయ్యె శతవలి
శతవలితాననుఁడు నవరసపుతి గాఁగన్ 346

ఉ॥ ఇక్కఱితిం బుఁగార్య మిది యెవ్వఁడు నేరఁడు చేయఁగా నతం
డొక్కఁడు దక్క బాహుయుగళోగ్రపరాక్రమవహ్నిమాలికా
ధిక్కృతదిగ్వియత్సకలదేశుఁ డధీశుఁడు సర్వకార్యపుం
ఫక్కికలందు వాఁడొకఁడు వానరలోక విధాతృమూర్తియై 347

క॥ అనినంత నాంజనేయుఁడు
జనకజఁ గని వచ్చినట్లె సంతోషం బ
య్యెను నాల్గు దెసలు దక్షిణ
మున ముడినడియున్న భావమున నంకురమై 348

ఉ॥ అంతట రాజయుగ్మకహృదంతరమందున మ్రోగె నో హనూ
మంత ! నరేశకార్యప్రథమానవినిర్వహణైకదీక్ష ! ధీ

మంత ! పరీష్టికార్యసుకుమారపథాభిమతానుయాయి ! శ్రీ
మంత ! సురారిలోకవినిర్మారణ ఘోరభుజాదిభారతుల్. 249

= ఖండాంతము =

గీ॥ అల్ల ముక్తీలపతి శ్రవణాభిలాష
మిద్ది వానరసేనల నెల్ల బ్రోవు
చేసికొనినట్టి ఖండంబు, శివ ! శివా మృ
దూహసంగ్రహణక్రియాదోహలాత్మ.

ఉ॥ ఐహికవాంఛ లెల్ల వెనుకాడెడునట్లు సదా ప్రయత్నమై
యూహకొలందిఁ జేసితిఁ బ్రభూ ! భవదాకృతియైన వెల్గహో
యూహ కసాధ్యమైనదయి యున్నది నీదయలేని భావమై
సోఽహమటంచు నీ నడిమిశూన్యమునందున విహ్వలించెదన్.

సుగంధి :

నందమూర్ధ్నివాస ! శోభనాద్రిసాధుభావనా
మందిరా ! హిమాద్రిరాట్కుమారికాత్మసుందరా !
మందిరాయమానశోభమానరాజతాచలో
ల్కందరా ! నతార్తపాపకంఠిలగ్నమందరా !

# అన్వేషణ ఖండము

క॥ శ్రీశోభనాద్రికృతగే
హాశయ ! గంగాన్నపూర్ణికాంబాసహితా !
పేశలప్రాణమయాదిక
కోశాంతరసూత్రనాళకోమలమూర్తీ !

చ॥ సకలజగత్తు సీతఁ గనఁజాలిన దిట్టతనంబు సర్వమే
యొకనికి నున్నదంచు ననుచున్నదొ యాయన దీనమూర్తియై
యొక పెనుచెట్టునీడ నిలుచుండె ధరాత్మజఁ గాన లేని దా
నికి దిగులొంది వింధ్యగిరినెత్తములం దవియేదొ చోటునన్ 1

ఉ॥ జాంబవదంగదుల్ మిగులు సైన్యపతుల్ పరిదీనవక్త్రులా
లంబన లేక కార్యపువిలంబన మోర్వను లేక యశ్వమా
సంబును బూర్తికానగుట జానకి యెచ్చటొ యోజనాల దూ
రంబున నున్కియున్ దెలియరాకయుఁ జేతుల నప్పళించుచున్ 2

ఉ॥ అంతకుమున్ను వారముగ నన్నము లేకయు నీళ్లు లేకయున్
వింతయెడారి గుజ్జయిన వృక్షము లేకయుఁ జిన్నతుప్ప గొ
క్కింతగ మండుటెండఁబడి యేర్పగు కాళ్లలుపెట్టు నీసయుం
బొంతన లేని యూషరపు భూమిఁ జరించుచునుండి యొక్కఁడై 3

ఉ॥ జొత్తిలి కందు పాని తన షోడశవర్షుఁడు పుత్త్రికుండునున్
మిత్తినిబొందఁ గోపమున మేదినిఁ దా శపియించె క్షామము
వ్యాప్తగనయ్యె నాక్షితిని పీనులు వానరసేన దప్పియుం
గత్తెరవెట్టనాల్కలకుఁ గాళ్లలు నీడుచుకొంచు నేగుచున్ 4

మ॥ అసితాంభోధరరూపుఁ డొక్కరుఁడు రౌద్రాకారుఁడై చెట్టర
క్కసి మిమ్మెల్లరఁదిందునంచుఁ బయిదూఁకన్ వాఁడెయౌ రావణుం
డసురాధీశుఁడటంచు నంగదుఁడు బిట్టా ముష్టిఘాతంబునన్
వెస మర్దించెను వాని నాఁకలి బలావేశంబు కల్పింపఁగన్ 5

చ॥ కనపడి వాఁడు రావణుఁడు కాకయుపోవుటయున్ నిరాశులై
జనకజ నల్లి పత్తన రసాధరవాహిను లెన్ని చూచినన్
గనపడకున్కి ధైర్యమును కత్తళ మూడిన చిత్తరూపులై
వనచరవీరు లుత్తములు వట్రువ కన్బొమలన్ గలంచుచున్ 6

ఉ॥ చెట్టులఁ దుప్పలన్ వెదకి సీతను గానఁగలేక కొండలం
గుట్టల నన్నిటన్ వెదకి క్షోణిజఁ గానఁగలేక సింధువా
రట్టములందుఁ జూచి జనకాత్మజ గానఁగలేక ధారుణీ
కుట్టకులయ్యు దుఃఖములకున్ బెనుదీవులుగాఁగ నెంచుచున్ 7

మ॥ అశనాయాపరిపీడితుల్ ఘనపిపాసాయుత్తులై భావక
ర్కశులౌ వానరవీరులంగని దివౌకస్స్వామిపౌత్రుండు నం
త శనైర్వాక్కుల నిట్లు చెప్పె గిరిమంతంబైన యీధాత్రి మీ
రుశనోబుద్ధులు చూడుడి తిరిగి యింకొక్కండు పర్యాయమున్ 8

మ॥ ప్రియ సుగ్రీవులు మీర లెల్లరు ననిర్వేదంబు చేతోఽపరా
జయమున్ దాక్ష్యము గల్గువారలకు భాస్వత్కార్యసిద్ధుల్ ఘటి
ల్లు యథార్థంబుగ వింధ్యధాత్రి యిది పెన్ లోకంబు దీనిన్ దృశా
మయులై యింకొకసారి చూడుడు మరిన్ క్ష్మాకన్య కన్పించునో 9

శా॥ పశ్చాత్తాపము చెందినట్లు కనిపింపన్ వచ్చు నాపైని చే
తశ్చండుండు మహోగ్రశాసనుఁడు సంతప్తారి సుగ్రీవుఁడా
యుష్మచ్చైతన్యము కోఁతిదేహములు నిం దూఁగాడఁగాఁ గోర్కె మే
నాశ్చర్యంబుగ లేచిరందు మరి వింధ్యక్ష్మా గవేషింపగన్ 10

ఉ॥ పాళముకానిబస్వ తలపై నెనఁడెత్తికొనెన్ మనాగతం
దాళువుగాఁగ నుండవలె నాతఁ డనద్రుఁ డశోకుఁడై యనీ

ర్ష్యాళువు నోఁచు సర్వము యథార్థముగాఁ బొనరించి రెండు కాం
తాళము మాని వింధ్యవసుధాధరమార్గణమార్గణంబులై 11

ఉ॥ ఆవలఁ దీక్ష్ణదండుఁ డినుమంతయు వ్యత్యయమొప్పనేని సు
గ్రీవుఁడు కోపనుండయిన ఱేడు మరిన్ రఘురామమూర్తి యో
దేవికి దూరగుండయిన దేవుఁడు సత్కరుణాబ్ధి మీఁదు చే
తోవిభులై శ్రమన్ విడిచి తూఁగుడు దేవిగవేషణార్థులై 12

శా॥ ఈతండాశ్రిత నీరువట్టుగొని చావే మేలా! వింధ్యాద్రి నా
నాతామిస్రగుహాగవేషణ నిలీనన్ ధాత్రికన్యన్ బుభు
త్సాతీవ్రాకృతులౌచుఁ జూచు కృతిలోఁ జావౌట మేలో! మరిం
జేతోవీథిని మీరె చూడుఁడు మతిం జింతించి వాక్రుచ్చితిన్ 13

ఉ॥ అంగదుఁ డిట్లు పల్కఁ దడియారిన నాలుకతోడ బిట్టుగా
నంగద గంధమాదనుఁ డహంతయు నేర్పడ నిట్లుపల్కె నీ
యంగదుఁ డిట్లుచెప్పె నది యంతయు తథ్యము నిష్క్రియాపదో
భంగము పొందనేల తుదిప్రాణము కల్గినదాఁక నీఁదకన్ 14

మ॥ వమదూర్జస్వలశౌర్యులౌచును బునఃపర్యేషణావ్యగ్రులౌ
దము శైలోన్నతకందరానదనదీద్రాఘిష్ఠకాంతార దే
శము లెల్లన్ దిరుగంగఁ బోసినగతిన్ శ్రాంతాకృతిం జచ్చి స్వ
ర్గము రా దుజ్జ్వలకార్యమగ్నమృతి శూరత్వంబు దీపించెడున్ 15

శా॥ అంతన్ సర్వకపుల్ పునర్విచయనవ్యగ్రోత్సుకులై లేచి ర
త్యంత మ్మబ్దము క్రిమ్మి పాయఁ బునుద్వాంతార్కపాషాణపుఞ్
సంతానమ్ములవోలె వింధ్యగిరిరాజప్రస్థకూటప్రపా
తాంతఃప్రస్రవణాంకకందరగుహాగ్రాధిత్యకల్ చూడగన్. 16

చ॥ సవసవలౌచు భూతతతి సల్పిన ప్రార్థనఁ జేసి కుంభసం
భవముని వింధ్యపర్వతకవాటము తీసిననాటనుండి యీ
యవని సమస్తమున్ బరువులై ముదివింజము సాచుకున్న ద
బ్ధివసన దక్షిణావని కుభృత్కరినీకృతపాద దేశమై 17

గీ॥ సపరివారంబుగా వింధ్యశైలరాజు
విడిదిచేసెను దక్షిణావీథియందుఁ
బ్రథితకూటస్థుఁ డాసాగరంబు వెదకి
వెదకి తఱుఁగవి కొండలై వీరులెల్ల. 18

చ॥ కడు నిది యల్పమైన గిరికందర మిచ్చట దాఁచవచ్చునా
యుడుగనువచ్చునంచు మతి నూహ పొనర్పఁగరాదు కొండలం
దడుగడుగున్ బ్రయాసపడు చల్లల నాడుచు వీగికొంచుఁ ది
మ్మడిపడు చుస్సురంచు మితిమీరిన వెక్కసపాటు నందుచున్ 19

చ॥ పవడపుఁదీవ యాడిన దుపత్యక పార్శ్వగుహాముఖంబునన్
జివురుల జొంప మూగినది చిన్నగఁ బ్రస్రవణాద్రిమా తటిన్
సవిధ నగేంద్రశేఖరపుఁ జాయ మలంగెను బ్రొద్దుపొడ్పుపూ
వవనిజయంచుఁ బోదుకు మహాకపు లల్లలనాడు గుండెలన్. 20

చ॥ రజతనగం బొకండు కనరాఁ గనరాని గుహాంతరంబులన్
రజతనగాభిమానియగు రక్కసి యక్కడ దాఁచెనేమొ భూ
మిజనని పోయి కన్గొనిరి మిట్టలఁ జట్టుప లెత్తు పక్షిరా
జ జనమునన్ జరించెద రసాధ్యులు సిద్ధులు సాధ్యులుం బలెన్. 21

సీ॥ శీతాంబుధృత్తప్రపాత నిర్ఝరసతీ
దత్తార్ఘ్యములఁ జేసె తనిసి తనిసి
యుత్తాలతచ్ఛిఖరోపాయనీభూత
కాంతారఫలమూలకములు మెసవి
యరుణాంశుమత్తన్మహా నితంబస్థలీ
మృదుదేశముల విశ్రమించి మించి
పరిణద్ధతద్గుహా ప్రతిరావముల భూమి
జాతఁ గాంచమి సానుభూతి పడసి

గీ॥ అచటి దేవమాతృకలైన యాళ్ల మడుల
కంకులను ద్రుంచి కరతల ఘట్టనముల

నలిపి యూది భుజించి వానరులు దిగిరి
తద్ధరాధరరాజ ప్రస్థముఁనుండి 22

క॥ మఱి వెదకిరి మఱి వెదకిరి
వెఱవక వానరులు సర్వవింధ్యమునందున్
మఱి వెదుకఁగ మఱి వెదుకఁగ
వెఱవక వానరులు సర్వవింధ్యమునందున్ 23

ఉ॥ పండినచేను కోయునగు పద్ధతి మున్ముఁలుపెట్టి యొక్కఁడో
క్కండును యూథనాథు లిరుకంధులమధ్య ధరిత్రి తూర్పునం
దుండి ప్రతీచిదాఁక నియతోర్విగ ముక్కల నేర్పరించి బ్ర
హ్మాండము కొల్చునంత ధృతి నందిరి దక్షిణసాగరాంతమున్ 24

వ॥ గజగవయగవాక్షులు శరభగంధమాదనులు మైందద్వివిదులు జాంబవ
దంగదులు నలతారసుషేణులు హనుమంతుండును దక్షిణాపథము
పనలువెట్టి గాలించి గాలించి చివర కంద ఒక్క గుహాముఖంబుచేరి.

గీ॥ ఋక్షబిలమన్న పెద్ద పేరిటి సొరంగ
ముగ్రదానవరక్షితం బురులతావ
కీర్ణముఖము దంష్ట్రాప్రసమాగిళితలోక
యమవదన మట్లు వారియం దవతరించె 26

గీ॥ క్షుత్పిపాసాపరిశ్రాంతి జొత్తు కనులఁ
దుత్తిమేనుల నాల్కలు తోడుకొనుచు
నమ్మహాబిలముఁ జొచ్చుటా ! పిపాసఁ
జచ్చుటాయన్న ప్రశ్నమై సైన్యపతులు 27

శా॥ దైత్యాభీలనివాసమన్న ప్రథ నేతద్గహ్వరాస్యంబు నా
దిత్యుల్ పోవని త్రోవ కంటకలతాఘెష్వాన మజ్ఞాతని
ర్గత్యుచ్చండము కూరసత్వమృగర క్తప్లావితక్ష్మాక మ
స్తత్యం బచ్చట నిల్చి వారలు సమర్థుల్ క్షుత్పిపాసాతురుల్ 28

శా॥ నిర్భీకుల్ త్రిదివేశశౌర్యులు సమానీతోరుబాహాజగత్
స్వర్భానుల్ బహుభూధ్రపర్యటనవిభ్రాంతుల్ మహారాక్షసా
యుర్చ్ఛేత్తల్ సురలోకకార్యఘటనాయుంజానమూర్తుల్ వృథా
విద్యాశోగ్రకుషుల్ ఋషీశ్వరకృపావిష్కారకార్యజ్ఞులున్ 29

చ॥ అపహృతయైన శాబకకృతాధికమార్గణ రుష్టమై క్షుధా
నుపమమహాగ్నిఁ గ్రక్కెదలి నూల్కొను యత్న నిరర్థకత్వమై
విపులిత గర్జలన్ దెసలు విహ్వలితంబుగఁ జేయుచున్న పె
ద్దపులి విధాన నొక్కొకఁడు దాత్రనిభభ్రుకుటీనిటాలుఁడై 30

గీ॥ అంతఁ బర్వతాభుఁడైన హనూమంతు
డా బిలాస్యమందు నార్ద్రిసస్య
మరసి మిన్నునందు నరిగెడు క్రౌంచాళి
నరసి యిట్టులనియె వెరగుతోప 31

మ॥ నలినీఖండవిలగ్నచంచులు బిలాంతర్దేశమందుండి హం
సలు పక్షాంచలకీర్ణవాఃపృషదుదంచన్మూర్తులేతెంచి మి
న్నులకై యేగెడు లోన నున్నవి నవేందుస్ఫారవీచీసర
స్సులౌ వాపీనివహంబులో కుముదినీశుద్ధాంత రమ్యాకృతుల్ 32

చ॥ అనుచునె లోనికేగఁగ మహాకపు లందఱు వెంటనేగి రే
గను వెలివెల్గు సన్నగిలగాఁ బెనుచీకటి కాపుముద్దమై
కను కను పొడ్చుకొన్నఁ గనఁగానక యందఱు నుండిరన్న గు
ర్తునకును వారలొక్కరొకరిన్ జనుచుండిరి చేతులూనుచున్ 33

చ॥ ఎవరును నీకుఁ గన్పడరు నేరికి నీవును గానిపించ విం
తవు తిమిరంబు దేహికిఁ దనంతట నిర్భయహేతువయ్యెఁ బ్రా
ణి వెలివెలుంగుకోసమయి నిర్భరతాపమునందు లోని వె
ల్గు వెలయకుండినన్ వెలివెలుంగులకోసము నావటించుచున్ 34

మ॥ అవి యెందుండి వినిర్గమించెడునొ ఘోరాభీలశార్దూలసిం
హవిరావంబులు వీనులంబడెడు సీమాంతమ్ము కన్పించ దాం

ధ్యవిమూఢాక్షిసధంబుగాఁ గపిసమూహం బేగు దుర్దాంత శౌ
ర్యవిశేషాబ్ధులు నీటిబొట్టు కనరా కా గండుచీఁకట్లలో 35

సీ॥ రాత్రినుండి పగలు రా నెంత పరిణామ
వీధి వెలయు వెల్గుపిండులకును
కొద్దిలోన నంత కూడివచ్చెను గుహాం
తర్ధరిత్రి తుదకుఁ దారువేళ 36

శా॥ నానాపుష్పఫలప్రజంబుల ననంతప్రౌఢమాణిక్యభూ
షానిర్వ్యాజమనోజ్ఞముల్ త్రిదివయోషామూర్తులా భూజముల్
కానంగా నయి యొక్క స్వర్గమనఁగాఁ గన్పింపఁగా వానరుల్
సానందాత్ము లొకళ్లొకళ్లను బరిష్వంగమ్ములం బట్టుచున్ 37

ఉ॥ ఆమడదవ్వు పోయిరి తృషార్దితు లాగతి కాలుతీసి కా
లూన్చమిని బెట్టఁజాలక విమూఢహృషీకచయుల్ తదాస్థితిన్
భూమిజ లేదు మానవవిభుండును లేడు కపిప్రభుండు లే
డేమి మనస్సొ యాడని దదేమి మనస్సు దృశాంతలగ్నమై 38

ఉ॥ కానఁగనయ్యె నంతటను గాంచనవృక్షవనంబు దీప్తవై
శ్వానరకాంతిమంతమయి చంపకవంజుళనాగవృక్షకా
నూనరసాలసాలసుమనోరమణీయ మణీయథాస్వసం
స్థానకకర్ణికార వనసంగతమై తటతాళబృందమై 39

చ॥ భసలపు రెక్కనీడగమి వారినయంతన పిండెలయ్యెడుం
గుసుమ చయంబు యౌవనలఘుత్వము పొంది కిసాలవారుణీ
పరిస్రుతదృశావిలోకనభరంబుగ నెంత తపించి పోవునో
మసలదు తేటిప్రోడ యణుమాత్రము కాలిడి లేచిపోవుచున్. 40

ఉ॥ ఎచ్చట చూచినన్ లతిక లింటరమై పయిరాలు పూవులం
బచ్చని రాతివేదికలు బ్రిధ్నమరీచివిశారదంబులై
పచ్చని వింటిపాఁ దురలవైచిన వ్యర్థశరంబు లట్లుగాఁ
దచ్చనలాడు వెచ్చపువుతావుల తావులయందు దట్టమై 41

చ॥ విహగగరుత్ప్రచాలితకృపీటవినిర్గతమత్స్యశాబకో
పహితసఖాగ్రసంగ్రహణబంధురవారిచలత్తరంగసం
వహన సరస్సులున్ దటవిభాసురమాసరవృక్షసంహతుల్
మహిత సితాంబుజాత సుకుమార తనూచ్ఛవిమత్ప్రథాకముల్ 42

ఉ॥ అచ్చటి తమ్మిపూలు తమయంత నవే యుదయార్క రమ్యముల్
వెచ్చనివెల్గువానికయి విచ్చగనేల తమంతఁదాముగా
విచ్చెడు గంధవాహపదవీ మదవీచికలన్ భరించుచున్
దెచ్చిన తావిచే నపచితి ప్రతిపత్తి దిగంత రమ్యమై 43

చ॥ పసిఁడి హొరంగు లీనెడు గవాక్షము లుజ్జ్వల రత్నఖండ సా
రస నవశిల్ప చాతురిభరంబులు ద్వారము లచ్ఛ కుడ్యముల్
మసృణశశాంకప్రస్తరసమాప్తము లట్టివి సౌధముల్ కనుల్
మసలినయంతమేరఁ గపిమండలి కాంచుచు నేగె నంతటన్ 44

చ॥ గృహములలోని కేగినను గేవల మెవ్వరికోసమో స్పృహా
విహ్వృతులకోసమై విగతవిఘ్నముగాఁగను సిద్ధపెట్టిన
ట్లు హిమికవారిపూరములు లోలితపానకముల్ పసిండిగిం
డ్ల హాయవుగాగ భోజ్యము లనంతవిధంబులు పూలవీవనల్ 45

చ॥ కనకపుఁ బట్టెమంచములు గందపుగిన్నెలు పావకోళ్లు భో
జనహితభాజనంబులును సర్వము రత్నమయంబులై చనన్
గనఁబడె భక్ష్యభోజ్యములు క్రమశలాటువినిర్మితంబులై
వినతమరీచిగంధములు పిచ్ఛిలముల్ దధికూర్చికాతతుల్ 46

సీ॥ అప్సరఃస్త్రీలు తాల్చెడునట్టి యుడుపు
లగురు కస్తూరికా చందనాదిద్రవ్య
ములును పన్నీరు లత్తరుల్ భోగ సకల
సాధనంబులు కనుల కాశ్చర్యముబుగ 47

చ॥ బయటికి నన్నిటింబలెనె పర్వతమం చనిపించె నీగుహా
లయమున బ్రాణమింత మెసలన్ జగదండ మొకండు రాత్రిడి
ప్పయిఁ బయి నొప్పునా నెసఁగు ప్రాణము వెల్గుఁ జేసి యీగుహా
లయము నసూర్యచంద్రము తళత్తళలాడు మనోవిచిత్రమై 48

చ॥ అవిదితమైన గహ్వరము నందునఁ గంటికి నింత రమ్యమై
పవివలె నేదొ వచ్చిపడవచ్చును మూర్ధమునందు దాన దా
నవ సుర యక్ష దైత్య ఖగ నాగ జగద్యుగపత్ప్రమాథనో
త్సవ భుజకేళి ముందు నిడి సాగిరి ధీశివతాతి మారుతిన్ 49

సీ॥ స్వతనూవినిర్గతచ్ఛవిమత్కిరణమాలి
కాబద్ధయగుటగాయత్రి యేమొ
సంస్కృతేతరశిరోజయయి ప్రోషితభర్తృ
కాకారయగుట గాయత్రికాదొ
మహితశార్దూలచర్మమహోగ్రపరిధాన
ధృతిఁ జేసి పార్వతీదేవి యేమొ
చూడామనోహరసురవాహినీచంద్ర
ధృతిలేమిఁ బార్వతీదేవి కాదొ

ఒక్కవేళ నే తల్లికై యుర్వియెల్లఁ
బర్యటింతుమొ యాతల్లి ప్రభువియోగ
భావపరిదీన యోగినీపరమమూర్తి
యిచట వేంచేసియుండెనో యేమొ వచ్చి 50

చ॥ మణినికరాయమానప్రథమానతనూచ్ఛవి నేతదూహకా
రణ మగునట్టిదై యువతిరత్న మొకానొక దేవి హేమకిం
కిణిమృదురావసంహాసనకృత్కలనాధరసన్నివేశ స
ద్గుణనికురుంబ కార్తికికతోయదమూర్తిని గాంచి వానరుల్ 51

ఉ॥ ఆయమ యెవ్వరో తెలియనాడఁగ నాలుక యాడ కందఱున్
శ్రీయుతమూర్తియా హనుమచెంత నిలంబడ నావహాత్ముఁడా

ర్యాయుతబుద్ధి భూధరమహా.ఘనుండును సుంత చెంతకుం
బోయి వినీతదేహుఁడు నమోఘవచస్కుఁడు పల్కె నీగతిన్ 52

క॥ అవ్వా ! యీామణిసౌధము
నెవ్వరి దీ పూవుఁదోట లెవరివి వెలుఁగుల్
కువ్వైదు సితాంబుదచ్ఛవి
నివ్వసుధాధరగుహాంతరేచ్ఛామూర్తీ ! 53

క॥ మరియు ననె హనూమంతుఁడు
మరి మరి వింధ్యాటవీసమస్తక్షితి ని
ర్భర మనువులు నసుకుసుకుగ
దిరిగి తిరిగి యిట్లు తిండి త్రిప్పలు లేకన్ 54

చ॥ కడువడి నాలుకల్ పిడచకట్టఁగ నీ రెచటన్ లభింపదో
యొడలునఁ బ్రాణముల్ నిలువవో యని యీగిరిగహ్వరాస్య మే
ర్పడఁ గని రెండుసాళ్లగను రాదది మృత్యువటంచుఁ గన్నుఁ గ
న్పడని మహాంధకారమున వచ్చితి మిచ్చటి కేమి చెప్పుదున్. 55

చ॥ ఇచటికి వచ్చి మా మనసులేమియు నాడ విదేమి యద్భుత
ప్రచలన మింతదృశ్యము నబద్ధమొ నిక్కువమో మహామణి
ప్రచయవినిర్మితంబయిన భావవివర్త మిదెల్ల నేరి భో
గచరణవీథి యెవ్వరివి కాంచనహర్మ్యములుం దటాకముల్. 56

గీ॥ ఎవని తేజోవివర్తము లివ్వియెల్ల
నచ్చ జాంబూనదమయంబులైన తరులు
పచ్చరాకట్టడములైన భవనములును
మచ్చలేనట్టి శశిశిలామండపములు 57

మ॥ నవతామోహనముల్ ప్రకృష్టశుచిమంతంబుల్ విపాకంబు ల
భ్యవహారంబులు కందమూలఫలసంపన్నంబు కుస్తుంబురూ
త్సవసంధా నుకవాసనామిళితముల్ శాకాదిపాకంబు లీ
యెవరో యింతటి దేవభోగులు మనోహేలాప్రపంచాధిపుల్. 58

మ॥ అవి కార్తస్వరకచ్ఛపంబులును మత్స్యాళుల్ తటాకంబులం
దవి మాణిక్యఫలంబులుం గనకపత్రాళుల్ కుజవ్రాతమం
దవి పాకంబులు శ్రీధురాపరిమళవ్యాకృష్టనాసాగ్రముల్
శివ మీ లక్ష్మి యదీయమో తెలుపవే సీమాంతయోగవ్రతా 59

మ॥ ఉపయోగింపమ యింతడస్సియుఁ దటాకోపాత్తముం వారి నీ
యపురూపంబులు వృక్షపుం ఫలములుం పాత్రిత్తాద్భుతోహం మర
చ్చపుజిజ్ఞాసను పృచ్ఛచేసెద గుహాసంపత్తి దెవ్వారి దే
కృపతోఁ బల్కఁగదే స్పృహావిదళనక్రీడాపవిత్రాకృతీ 60

వ॥ అనిన నద్దేవి యాంజనేయునివంక సునిశితంబుగాఁ జూచి యాతని మహానుభావంబున కచ్చెరువడి యితఁడేమి కపిరూపపరమేశ్వరుం బోలెఁ గన్పించునని మౌనభావంబు పరిత్యజించి సప్రశ్రయంబుగా నిట్లని సమాధానంబుచెప్పె. 61

మ॥ మయుఁడం రక్కసిఱేఁడు పెన్విధములం మాయావి తానీ హిర
ణ్మయమౌ తోటల సృష్టిచేసె నవశంపాకాంతిమద్వాస్సుధా
మయమౌ చెర్వుల సృష్టిచేసెను ఘలీమత్స్యాళి జాంబూనదో
దయకాంతిప్రసరంబులం బొలసులం దళ్కొను రత్నాంశులం. 62

ఉ॥ ఆపయి విశ్వకర్మయు సహస్రసమల్ విధిఁగూర్చి సత్తప
స్తాపముపొంది యబ్జభవదత్తవరుండయి దివ్యరత్నసం
దీపితముం మహాధనము దివ్యము సౌధచయంబు సేసె నా
నాపరమోపభోగకలనానవనూతనభావరమ్యముం 63

గీ॥ హేమగర్భుసృష్టి హేమాశ మొదటిది
హేమజపము సేతు రెల్లవారు
నకట ! హేమయన్న యక్షరా లవి రెండె
హత్తుకొందు రెడఁదలందు జనము 64

గీ॥ ఇంత మోహమంది హేమాఖ్యయైన య
ప్సరసఁ దెచ్చి యింద్రుపురమునుండి

ఋక్షబిలమునందు నిట నుంచెఁ బైడితో
హేమ మేని వెలుగు లెన్నుకొంచు 65

గీ॥ మరి శతారపాణి మన్నించునా యిది
రాగి కలియు పైడిరంగు కలుగఁ
గఱకునెత్తుచార గ్రైవేయకంబుగా
నంధతమసమునకు ననిచె వాని 66

క॥ ఈ యాస్తి హేమపేరిటి
దాయెను హేమకును నాకుఁ బ్రాణము న న్నిం
దే యుండుమనియె నాయమ
నాయునికిని దీని రక్షణంబగు ననుచున్ 67

గీ॥ మేరుసావర్ణి నా తండ్రి మీరు చాల
బడలి యున్నారు పెను క్షుత్పిపాసలఁబడి
యచ్చెరువు మిమ్ము రక్షించె నద్దియిద్ది
త్రావి తిన్నారుగా దాపదల్ ఘటిల్ల 68

వ॥ ఇవియెల్ల నారగింపుడన వారిముందు బహువిధ ఫలంబులు భక్ష్య
భోజ్యంబులు సుధానీరంబులు ప్రసన్నమయిన వారందఱు క్షుత్పిపా
సాపనోదంబుసేసి సొలసి యితివ కృత్యతామూఢులయి యున్నంత నా
యోగిని మరియుఁ బ్రసన్నురాలై 69

గీ॥ మేరుసావర్ణి యన్నట్టి పేరు వినుచుఁ
గపిచయం బవనతమస్తకంబు నగుచు
గౌరవంబున దేవివాక్యములు వినుచు
గౌరవంబున నొక్కరొక్కరిని గనుచు 70

గీ॥ దేవి యిట్లనె మీ శ్రమ తీరెనేని
యెవ్వరికిఁ గానిపించని యీగుహాస్య
మెట్లు కన్పించె మీకు మీ రెచటి కేగు
చిట్లు చనుదెంచితిరొ చెప్పుడీ యనంగ 71

మ॥ దనుదారున్దముదార్శరాగ్రమునయందుం గ్రుచ్చి యుంచెన్ ద్రిలో
కముఁ దమ్ముండును నంతవాఁడు తనతోఁ గాంతారముల్ వచ్చె దే
వి మరిన్ ద్వ్యాదృశ కానఁ జేరెఁ బతివెన్వెంటన్ మహారాక్షసుం
డు మరిన్ రావణుఁ డామె దొంగిలి చనెన్ నూల్కొన్న వైరంబునన్.

మ॥ రణబుద్ధిన్ బవి దాఁటినట్టి వ్యవహారంబిద్ది సీతమ్మ కా
రణమై యింకొక దేవదానవరణప్రారంభబీజంబుగా
నణుమధ్యన్ దితిజాతుఁ డెందుని చెనో యాతల్లిఁ గన్గొను మా
ర్గణబుద్ధిన్ జరియించుచుంటిమి కడంకన్ దక్షిణావీధికన్. 73

శా॥ సుగ్రీవుండని వాలిసోదరుఁడు రాజుంగాఁగ వర్షాపయో
ముగ్రావాకృతులైన వానరచమూముఖ్యుల్ చతుర్దిగ్గతుల్
నిగ్రాహ్యుండగు దైత్యుఁ డెందుని చెనో నేమీ దిశావీధియం
దగ్రేగుండగు నంగదుంబడి ధరాధ్రానేకపర్యేషణన్. 74

శా॥ ఆ సుగ్రీవుని యన్నగారి కొడు కీయంభోధిగంభీరుఁడున్
దా సుగ్రీవుని రాజుచేసె రఘునాథస్వామి తా నర్యము
స్సాసుగ్రీవుఁడు నన్నబిడ్డ యువరాజుంజేసె వా రిద్దఱున్
వే సఖ్యంపడినారు తా రుభయతఃపృథ్వీసతీభర్తలై 75

ఉ॥ ఇంకొక తమ్ముఁ డాయనకు నీశ్వరుఁడే యనువానికై ధరా
కింకరి వానితల్లి యపకీర్తి మోసెను రామపాదశం
ఖాంకితపాదుకల్ శిరసునందునఁ దాలిచి యేగెఁ దమ్ముఁ డా
వంకను దండ్రిమాట నిలుపం జనుదెంచెను స్వామి కానకున్ 76

చ॥ ఒకనెల యిచ్చె మాకు నదియుం గడువైనది వానరేశ్వరుం
డిక వెదుకంగనైనయెడ యించుక లేదు సమస్తవింధ్యధా
త్రికి మొలనూలు చుట్టితిమి తెచ్చె మమున్ భగవంతుఁ డీగుహా
స్యకమున దించె నీవ పరమార్థమయైన సమస్యలోపలన్. 77

శా॥ కాల్సేతుల్ కదుపంగలేక తతశోకప్రౌఢపాథోధి బా
ర ల్సాచంగనులేక యూరక వివర్ణంబైన యాస్యంబులన్

వేల్పులఁ గని వేల్పుధరాధరములన్ వీక్షించి పెక్కారాతిగూ
డిత్సరంగనునయ్యో నీఁపుది మరీవే మత్ప్రమాణంబుగన్ 78

ఉ॥ అక్కడ గహ్వరాస్యమునయందుఁ దామరతూటిఖండముల్
ముక్కులఁ బూని హంసములు పోవఁగ లోన జనంబు కల్గునం
చిక్కడి కేగుదెంచితిమి యేగతి వచ్చితిమో యెఱుంగలే
మక్కడ నట్టెమూసికొని నక్షుల నిక్కడ విప్పినట్టులై 79

మ॥ ఎవరో రాక్షసు లుందురంచు నది యింకేహానో యంచున్ సహ
స్రవిధాలం దలపోయ నిచ్చట నజస్రప్రాణమూర్తి ! భవ
త్సవిధక్ష్మాతలి చేరినార మిఁక నస్మత్ క్షుత్పిపాసల్ తొలం
చి వెసం బ్రాణము నిల్వఁబెట్టితివి నీ సేమంబు వాంఛింపఁగా 80

క॥ ఉపకృతికిం బ్రాణులు ప్ర
త్యుపకృతి సేయంగఁ గనుట యొక పుణ్యము ప్ర
త్యుపకృతియని పచరింపఁగఁ
గృపాజలధి యానతీయవే మా కనినన్ 81

చ॥ హనుమ మహార్థసంగ్రహణమైన వచోవిభవంపు ప్రౌఢియున్
వెనుకను దోచు శౌర్యరమ విస్ఫురితాద్భుతవృత్తిసేయ యో
గిని నిభృతాక్షిసంకలితకేవలభావముగాఁగఁ బల్కె మె
ల్లనఁ గృతపుణ్యబుద్ధియు ఫలంబునఁ బొందుటవంటిదే మరిన్ 82

గీ॥ కనులఁ బసిమివన్నెకాంతు లూగునో యన
హనుమ సుంత మసలినట్లు మసలి
యుఱక వనియె నంత నొకమాట యనఁబోయి
యొక్కమాట జారెనో యనంగ 83

క॥ ఏ గడు విడెనో కపిపతి
యా గడువును దాటిపోయె నన్నట్లె మే
మీ గహ్వరము విడిచనం
గాఁ గల్గుట యెట్లొ నిజముగాఁ గన్పడదే 84

ఉ॥ ఇచ్చటినుండి పోవుటది యెట్లను చింతయె కాని పోయి మే
మచ్చట నేమి చేయవలె నంతకు ముందె యెఱుంగరాదు మ
మ్మచ్చట వానరేశ్వరుఁడు నందఱ. జంపినఁ జంపవచ్చు మీ
మ్రుచ్చు మొగాలు మీకు చన భూమిజ కన్పడునా యటంచొగిన్

క॥ పూనిన కార్యపుగౌరవ
మూనిన వాచోమహత్త్వ ముద్దిగనాడున్
దాను గపీశానుం డా
హా నిర్భరవృత్తియుంచు నామె యిటులనెన్ 86

ఉ॥ ఈ గుహయందుఁ జొచ్చుటకు నిబ్బడికష్టము నిర్గమించు టా
యీ గుహఁ జొచ్చు వారెవరు నేగినజాడ కనంగరాదు మి
మ్మీగుహనుండి పంచెదన యెల్లరు గన్నులు మూసికొండు నా
దా గురుశక్తిచేత నియమాత్తముచేత వెలార్తు మి మ్మనన్ 87

చ॥ కొకిబికి వ్రేళ్ల కా కనులకున్ సరిపోయెను గన్ను లింత మూ
యకయును మూసినట్లుగనె యైనది కన్నులు మూయుటెంత వి
ప్పుకలుగుటెంత వానరసమూహము కన్నులు గిఱ్ఱుమంచనన్
జకితచకచ్చకత్స్ఫురణగా రవివెల్గుల నాడె నేత్రముల్ 88

క॥ ఇది వింధ్యధరాధరమును
నిది ప్రస్రవణాద్రిరాజ మిది సాగర మ
న్నది యంతలోనఁ గనిపిం
పదు చూచుచునే స్వయంప్రభాదేవి మరిన్. 89

క॥ ఆలిప్తలోన గర్జా
భీలంబుగ నెపుడు మున్ను విననిది రావం
బాలింగితరోదోఽంతర
హేలాధారావిచిత్ర మేదో వినుచున్ 90

సీ॥ చెట్లసందుగను వీక్షించినయంత నీ
లాకాశమనఁగ బాహాటమైన
ధృతిమై నిదానించి తిలకించినను ననం
తాంభోదమనఁగఁ బర్యాప్తమైన
నిబిడ విహ్వాలిత డిండీరమై యొడ్డునన్
బర్వులెత్తెడు మహాశ్వంబనంగఁ
బరువులై యొరుగుచుఁ బ్రవహించుఁ గెరటాల
నూగాడు భూమీధరోర్వియనఁగ.

నదియదే సముద్రంబన నఖిలకవులు
మస్తకంబుల విన్యస్తహస్తులగుచు
నింతగా గొంతుకూర్చుండి యెగువ రెప్ప
లలవరించక చూచి రభ్యర్థులగుచు 91

క॥ బ్రదుకునఁ బరమార్థంబన
నదేయదే చూడఁదొడఁగి రంభోధిని నా
ల్గుదెసలులేని యఖండా
స్పదము స్ఫురింపించు భైరవ వ్యవహితమున్. 92

గీ॥ పరమయోగులైనవారలే యాత్మద
ర్శనము చేసి దృష్టి జగతిఁ ద్రిప్ప
నచట నిచట రెండు నాభాసమైనచో
దృష్టి తిరిగె ననుట దెప్పరంబె 93

చ॥ మరలినదృష్టిఁ దత్కపిసమాజము వింధ్యగిరీంద్రపాదవి
స్ఫురితవిశాలకాననపు సొంపుల పచ్చనివన్నెఁ గాంచుచున్
మెరమెరలాడఁ గన్నుగవ మించిన హాయనవేళ సంస్మృతిన్
విరవిరలాడె గుంపియలు విచ్చినగండము వొచ్చు గండమై

చ॥ వనరమ స్నానమాడినది వాసకసజ్జికవోలె గ్రొత్తచీ
రను మెయిఁదాల్చుకొన్న దవురా ! యొక మాధవమూర్తి సిగ్గుతే

కను దనుఁ బొందవచ్చుననఁగా విన్ గాహితసర్వవింధ్యకా
ననగిరికందరాళుల మనన్ జనకాత్మజఁ గాననైతి నే 95

చ॥ కపిపరమేశకోపవిన్ఘట్టితదంతపటాత్కృతిన్ సమీ
పఁపుఁ దరుశాఖలన్ జిలుక భైరవవాదము చేసెడిన్ ధరా
ధ్రపు గుహాలం భజించి ఖగరాజుల నీడములం జరించి స
ర్పపతి సుషల్ భ్రమించి కనరాదు ధరాత్మజ మా మనోరుజన్ 96

మ॥ చివురుం గేలుల హేలగా వనలతాసీమంతినుల్ మందవా
యువు రమ్మంచును సైగచేయు రఘురాడ్యోషాన్వీషామృషా
వ్యవసాయంబున వింధ్యభూధరనిరంతారణ్యమా దక్షిణా
భువియుం బాతరలాడి కానము సుఖాంభోరాశివీచీఘతిన్ 97

ఉ॥ కొమ్మల నెందు నేన్ దుదలఁ గోమల పత్రములుండవచ్చు నీ
కొమ్మ మొదల్ మొదల్ తొడిగికొన్నది పావడవోలి కం గిస్తా
ఒమ్ములు నాట్యకత్తెవలె లాస్యముసేయగ వానరేంద్రు కో
పమ్మును మృత్యుతాండవము భావి విపత్తును జెప్పునంచనన్ 98

చ॥ జలజహితుండు వత్సరపరిచారముచేయుచునుండుఁగాని యా
నెల సగ మట్లునిట్లు గమనించి వచించు నెలన్ నెలైనదం
చులుకఁజనుండ నన్ని నెలలో పరిభుక్తములైనవంచు నీ
నెల తొలికట్టు క్రొంజివురు సిహ్నుతి మాలి వచింపఁజొచ్చెడున్ 99

ఉ॥ ఈమధుమాసమింత వెలయించిన నెత్తురుముద్దలై కిసా
లామిషఖండముల్ తరులతాగ్రములందున జొంపముల్ బలెన్
దీమములయ్యె దక్షిణాపతిప్రథితోగ్రసపాదదత్తముల్
రామునిఁ జూచి మమ్ముఁ గపిరాజు క్షమించడు రిక్తబుద్ధులన్ 100

వ॥ గుండె జారిపోయి మహానుభావులయిన యా వానరవీరులు గిరిసాను
దేశంబునఁ జతికిలంబడియున్న సింహవృషస్కంధుండు తద్వానరసేనా
ప్రాజిత బుద్ధిమదగ్రేసరుండయిన యంగదుండు వారి నిట్లనియె. 101

గీ॥ ఎంత సేయవలయు నంతయుఁ జేసితి
మింతమిగిలి సేఁత యెవఁడు సేయుఁ
గాలశిఖరమందుఁ గపిరాజు కూర్చుండెఁ
జివురుకనుల మనలఁ జెక్కికొంచు 102

క॥ మనయొడలు దాఁచనైతిమి
తిని త్రావుచుఁ బ్రాలుమాలితిమొ క్షితిజాతన్
గనరామి యొకఁడు మన తెలి
యనిదాఁకను సన్నిధత్తమై యొప్పారెన్. 103

క॥ మీ రొక్కరొకరు చతురం
భోరాసులు పుక్కిలించు మొనగాండ్రు దిశా
ధాతుణి కొనగోటికి రా
దేరిది దోసమ్ము చెప్పుడీ మనయందున్. 104

మ॥ మనయం దించుక లేదు దోసము మరిన్ క్ష్మాజాత కన్పించకుం
డిన దోసంబిది దైవకారణముగా నెక్కొన్న దీ మిమ్ము న
న్నను బ్రాణాత్యయకాలపుం బ్రణిధికిన్ నూల్కొన్న వైరమ్ము నీ
మనయం దేటికిఁ గల్గెనో విధికి సంసారాంధ్యనిర్మాతకున్. 105

చ॥ కపిశవ లంబమాన తరుకాండము ప్రస్రవణంబు చేతునం
చవుడె నచించె నింతయును నా సమయంబున నూహచేసి గుం
డె పగిలె నాకు నెంతగ ఘటించునొ వానరరాజు సూర్యసూ
తి పరమదైవ మిట్లనుమతించెన యంత ఘటింపఁజేఁయగన్ 106

ఉ॥ తాఁ జనుదెంచియున్ వెదకి ధాత్రిజ కన్పడునే చెదారముల్
గాఁ జదలున్ లతాతరు లెగాదిగ త్రవ్వి ధరాధరావనిం
జాజర లేక దోఁగితిమి క్ష్మాసుత తోఁచని భాగధేయమై
రా జతఁ డేను భృత్యుఁడను భ్రాతృసమానము భృత్యభావమున్

చ॥ మురెను రామచంద్రు మొగమోటమిచే యువరాజుఁ జేసె న
న్నసువులయందుఁ దండ్రి కథకాథకుఁడౌదున క్ష్మామభావపు

ల్కుసుఁడయి తల్లిఁ గైకొనియెఁ గావున నాకది రక్షయౌ నశే
ప్రసృతజగత్తునందు స్మరభావము మిక్కిలి యెల్లదాసికిన్. 108

క॥ అప్పుడు నను యువరాజును
దప్పక సేయుమియు నది యధర్మం బిపుడో
కుప్పించి నన్నుఁ జంపుట
యొప్పెడు ధర్మంబు నీతియును మర్మంబై 109

శా॥ నాతో మీకును దప్ప దీవిలయసంధ్యాన్మృత్యు మే నందు రా
నీతాత్పర్యము మీ రెఱింగికొని మీ రేగుండు కిష్కింధకున్
నాతోఁ బెట్టుకొనంగరాదిపుడు నానాగూఢకాంతారర
థ్యాతృష్ణాక్షుధ లోర్చుకోనయిన ప్రాణాకృష్టి మీ కేటికిన్ 110

ఉ॥ ఆ రఘురామచంద్రుఁ డొక యద్భుతశీలుఁడు సీత లేకయున్
మీరట కేగినన్ ద్రుతనిమీలితనేత్రుఁడు మాటలేనివాఁ
డౌ రుమభర్త సేయు సమయ మ్మకృతమ్మగు నేను రానయా
ఘోరము చూడలేక కనుగోసల నాడుచునున్న మృత్యువున్ 111

మ॥ ఇకఁ బాతాళము త్రవ్వి చూడవలెనా యెవ్వారో యీ యుప్పనీ.
ళ్లకు వింధ్యాచలపాదదేశమున ప్రేలం జోటు కల్పించి రిం
తకు వింధ్యాచలధాత్రియంతయు సముద్రంబౌను కాదన్న పూ
నికకైనన్ నెల తప్పె మృత్యువునకున్ నిర్వ్యాజదుష్టాత్మకున్. 212

మ॥ బహుమార్గంబుల నెంతచూచి యొకఁడే ప్రాయోపవేశంబు సం
గ్రహకార్యంబుగ నాకుఁ గన్పడెడు మీరా! రాజబంధుల్ ప్రతి
గ్రహయోగ్యుల్ కపిరాజ్యధూర్వహులు పోగా నేను కిష్కింధ కా
గ్రహమో లేక యవగ్రహంబో యది మీ కార్యంబు మీ యోజనల్

ఉ॥ జేగురుచక్కలౌ కనులఁ జిందెడు బాష్పచయంబుగాఁగఁ దా
రాగురుసైనయట్టి యువరాజు వచించిన మాటలన్నియున్
మూఁగలపోలికన్ గపిసమూహము వించు యథార్థమన్న యా
గూగణనంబుచేసి రతికోవిదు లంగదబద్ధచేతసుల్. 114

గీ॥ తిరిగి కిష్కింధ కేగుట, తెచ్చుకొను టె
నిక్కముగ మృత్యుదేవత నెత్తిపైకి
దానికంటె మరి సముద్రంబునందు
దిగుట యుత్తమ మెంత చింతించినైన 115

క॥ వెదకించుమనంచు జానకి
వెదకింపఁగఁ జాలడయ్యె వీఁడని రాముం
డదయుండగు సుగ్రీవున
కదియిది మనమీఁదికే సమస్తము వచ్చున్. 116

ఉ॥ ఆ పురమేగి దోషులయి యందు నికృష్టపుఁ జావుచచ్చుటే
లా! పరమంబుగా నిది స్వరవ్యయసౌఖ్యము కల్గునేమొ ప్రా
యోపవిశక్రియన్ మరణ మొందుట మే ల్యువరాజవాక్యసం
దీపితమార్గ మిం దనుమతించిన భృత్యత లోపముండదున్ 117

వ॥ అని సర్వవానరసమూహం బంగీకరించినట్లున్నఁ దారుం డిట్లనియె

మ॥ మఱి యిచ్చోటనె యున్నచో మృతివరింపం జెట్టయాఁ జావ న
క్కఱయేలేదు స్వయంప్రభాగుహా యనంగా దేవదైతేయులున్
వెఱఁగై రారట యోగినీమణి కృపావిర్భూతచేతస్క యు
క్కఱగాఁ గాయలు బండ్లొసంగదె తినంగా నిట్టులో మన్కికై 119

క॥ ఆయనరాజై మనకు మ
రీయన కాడేమి యీయనే రాజు నిజం
బీయన పిత లేకున్క మ
రాయన రాజయ్యె నేమి యది యెట్లయ్యెన్ 120

ఉ॥ ఇంతకు దేవి కన్పడిన నియ్యది యేమియు లేదు కాలసం
క్రాంతముగాఁగనై గడువు రాజక్రుధాపరదీప్తవహ్నిలోఁ
జింతయులేక చచ్చుటది చెట్టతనంబు నబుద్ధిమత్త వి
క్రాంతికిఁగాక వట్టి బ్రదుకం గన కెందుకు చచ్చినట్టులై 121

ఉ॥ ఈ వెడగా గుహాయతన మెవ్వ రెఱుంగ రెఱింగనేని సు
గ్రీవుఁడు చెప్పియుండు నుతకీర్తి నుతించి దిశోపదేశవే
ళావిపులంబుగా నృపతి లక్ష్మణు లిద్దఱెఱుంగలేరు నా
చావును లేదుపో మనకుఁ జాలినయంత గుహానివాసమై 122

వ॥ అనిన నంద ఱాలోచనాధీనమనస్కులై యంగీకృత్యాభిముఖులై యొకరి మొగ మొక్కరు చూచుచుండ వ్యవహారము చెడిపోవు చున్నదని యెఱింగి హనుమంతుం డిట్లనియె. 123

క॥ మీరన్నది యోగులకును
వీరులకును గాదు మీరు వీరు లుదార
స్ఫారభుజావంతుల కిది
యోరిమి యెటుకల్గు నూరకుండుట కలదే 124

గీ॥ మనకు నామెకు నేమి సంబంధ ముండెఁ
జెలఁగి కూర్చుండబెట్టి పోషించుటకును
ఆమె సొమ్మా గుహాలక్ష్మి యప్సరసది
యెవరి సొమ్మొ మరెవ్వరో యిత్తురేమి ?

శా॥ నన్నున్ నిన్నును జూచి పంపదు గృహాంతర్భాగమందుండి శ్రీ
మన్నామంబది రామ యంచు వినిపింపం బంచె నందేగి మీ
రన్నంబంచును దేహి యంచడుగగా నా దేవి యోగప్రభా
సన్నాగ్నేయశిఖాళిలన్ మిము దహించన్ వచ్చు దుష్టాత్ములన్. 126

ఉ॥ ఇద్ది యగమ్యమంచు మరి యెవ్వరు చెప్పిరి మీకు లక్ష్మణో
ద్యద్దళనక్రియాచణశరాలి కగమ్యమటన్న నేల లే
దుద్ధవిడిన్ ద్రిలోకమున నూరక ఋక్షబిలంబునం దెదో
ప్రొద్దుటఁ గ్రొత్తినెత్తురుల ముద్దగఁ జేయకుఁ డార్తబుద్ధులై 127

ఉ॥ ఉత్తముఁడైనవాఁడు తన యూనిన కార్యపథాన కడ్డమా
మిత్తిని లెక్కసేయ డొకమేదకు డెవ్వఁడో వేదయాచుఁ దా

నొత్తిగిలున్ జగత్త్రితయ మూరక బాహుల నప్పళించు మీ
రుత్తములో నిరర్థకులొ యూహపొనర్చుడు మీరె మీరెయెదన్. 128

ఉ॥ తక్కిన మూఁడుదిక్కులకుఁ దారిన వానరయూథనాథులుల్
మిక్కిలి యూహఁ జేసెదరు మీరవలెనే యిఁకఁ దిగ్గిరాదు తా
నొక్కఁడు సూర్యసూతి ప్రభువో భటుఁడో రఘురామకార్యముం
జక్కఁగఁ జేయు నద్దెసల సైన్యము నద్దెసలందు దాఁగఁగన్. 129

ఉ॥ సాహసి తాను జేసికొనఁజాలక కాదు స్వకార్యమందు స
న్నాహములఁ జేయుటల్ సఖజనంబు పరుల్ మృదురీతి పూనగా
ద్రోహముపుట్ట దెచ్చటను ద్రోహముపుట్టుఁ దనంతఁ జేసినన్
సాహసి కోపభావమున సాగుటచేత స్వకార్యమందునన్. 130

క॥ విశారందటు ఘోరభుజా
పారీణు లటంచుఁ జెప్పఁబట్టి కపీంద్రుం
డారాముఁడు నమ్మెను మీ
ర్వారులనుచుఁ దెలిసి యాడె సుగ్రీవుండున్. 131

వ॥ అనినఁ గపివీరులెల్ల రవనతవదనులైనంత హనుమంతుం డంగదునిఁ
గాంచి యిట్లనియె.

చ॥ విఱిచెదవేల నీవు కపివీరుల బిడ్డగ నిన్నుఁజూచి నీ
యఱకడఁ బెట్టెఁ బెద్దపనియంతయు నీదెసఁ బిన్నతండ్రికిం
గొఱకొఱ లేదు నీ వెఱపుగుండియ వాని కెఱుంగరాద యే
ర్పెఱ రఘురాముకార్యము గడించెడు వీరుఁడ వీవు కావుటన్. 133

క॥ ఎన్నాళ్లు సీత కన్పడ
దన్నాళ్లును పోనె పోమ యప్పుడు చనినన్
నిన్నేమను మరి భయమే
మున్నది చిఱుమొయిలు లేని యుఱుముల నుఱుమన్ 134

ఉ॥ ఉర్విజ యెల్లదిక్కులను నుండునొ యేయొకదిక్కునందునే
యుర్విజయుండుఁ దక్కదిశఁబూనిన వానరరాజి కుత్తుకల్

నిర్వాపణోగ్రకారియై నీ పినతండ్రి యుకుల్ బిగించు నీ
పర్వినబుద్ధి దిక్కులను బట్టదు లోకములైనఁ బట్టదుర్ 135

గీ॥ కాదు నీమీఁద నతనికిఁ గసియెసంగఁ
గసిమసంగగఁజూచు నకారణముగ
వారణము మత్తమని చంపుకోరు కోరు
యుద్ధ మది సిద్ధమై వచ్చుచున్న వేళ 136

ఉ॥ వీరుని నిన్ను నింతపనివెట్టుక ముందఱ సంహరించునా
నేరని నీతిశాలియగు నీ పినతండ్రి మరిర్ హరింపఁగాఁ
దారయు నీదుతల్లి కపిధారుణిఁ జక్రముత్రిప్పుచుండె నా
రార ! యఁదెంత చెప్పినను నంతకదా మరి తార యాతఁడుర్ 137

ఉ॥ నేనును జాంబనంతుఁడును నీలసుహోతులు మేము మమ్ము నీ
శానపదాశయుర్ విఱువఁజాలదు నీ పినతండ్రి యర్యమ
స్సూనునినుండి యింతకును సూర్యసుతుండును నేమి చేసిన
శైనను లేదు నీకుఁ దదనంతరవానరధాత్రినేతకుర్ 138

మ॥ కడిమిర్ వాలికి బాహుయుద్ధ మొకటర్ గా దుద్ది బాహాబలో
గ్రుఁడు సుగ్రీవుఁడు వాలినొక్కని భుజోగ్రుర్ బూన లోకాన నె
వ్వఁడులే డాతనిముందు సూర్యజుఁడు నిల్వంజాల డన్నట్టి దే
ర్పడఁగాఁ దక్కువకాదు తక్కిన సహస్రార్ధ్వంబులర్ మిన్నయై 139

చ॥ తన కధికుండు శాత్రివుడు తానొక వేళఁ బ్రిమత్తుఁడైన నా
తనిఁ గికురింపఁబోయి యలఁతర్ బలహీనుఁడు సర్వనాశనం
బును తనుదానఁ జేసికొను బామ్మరవోక యతండు తన్నుఁదా
ను నిలువుకోఁ బ్రియత్నమున నూల్కొనియుండదగుర్ వివేకియై

ఉ॥ ఈపగిదిం గపుల్ విఱుగ రింతకునింతకు నింటివిందులై
పాపము వారికిండ్లకడ భార్యలుఁ బిల్లలు వీరికోస ము
త్తాపితచిత్తులై చనినదారి యెఱుంగక పల్లటిల్లఁగా
నీపరిచర్యచేయుచు వనిం జరియింతురు భృత్యభావులై 141

ఉ॥ ఆ చరియించు టెందనుక నందనుకన్ మరియెంతదాఁక విం
ధ్యాచలకాననాఖిలగుహాపరిమార్గణదహ్యమాననా
రాచపరంపరాకలన రామసహోదరచాపనిర్గతం
బూఁచిన ఝుంఝుగా నసువు లుంకువ కైకొనవో మునుండుటై 142

గీ॥ ఆ స్వయంప్రభ గుహా సుంతయైన రక్ష
కాదు కాదయ్య సౌమిత్రి కాండచయము
ముందు హరిపవి, తృణకాండమును నిజంబు
కాదు, మీకద్ది యేమి రక్షాబిలంబు 143

శా॥ ఈ మీ దాఁగినచోటు నా కెఱుఁగనాయెం గోపనం బున్నదే
నే మోసంబును జేసి రాజును జలస్నిగ్ధోషసంఘాతధా
త్రీమాంజిష్ఠకయాతనాపఘనధూతిన్ బొందగా లేన దో
ష్ఠ్నేమన్ జంపినఁ జంపుఁ బోయెదను గిష్కింధాపురం బింతటన్ 144

చ॥ అలఘుఁడు రాజు నేనెఱిఁగినంతకు నన్నను మించి యెవ్వఁడుం
దెలియఁడు ధర్మకాముఁడు పితృవ్యుఁడు సాధువు ప్రీతికాముఁడున్
దెలియ దృఢవ్రతుండు శుచిదీపితసత్యవచస్కుఁ డెన్ని ని
న్నిల యువరాజుఁజేసి వధియించెడు బుద్ధిని బూన్చఁ డెన్నఁడున్ 145

శా॥ వాలిం జంపితినంచు నీదెస నదిన్ వాత్సల్యభంగ మ్మటం
చాలిం ఘోరశుచావిదీర్ణహృదయుండై యుండు మీ తల్లి న
ట్లాలుంగాఁ గయికొంట నీ కననియమం దర్హాత్వ మర్పింపగా
బాలుండై పితృభాన మీ వెఱుఁగ వప్పా! గుండెలో నీసుచే 147

క॥ అతఁడుఁ సిరిసత్యకుండ
వతపకేఁ జిననాటనుండి యనుఁగవు చేతో
ధుశి స్వీకరించెఁ దప్పక
క్షితి నీవును నంతయింత చిన్నవు గానన్ 144

ఉ॥ ఏదిశయందు రక్కసి మహీసుతఁ దప్పక దాఁచియుంచునో
యాదిశ కన్నె నిన్ను మము నందఱ నీదుముదార్లఁ జేయుచున్
నీదెస వాని ప్రక్రియము నీవ కనుంగొను మెంతొ నేత్రుతన్
గాదని జాంబవంతునకుఁ గాసి యొసంగెనొ యంతఁ ఎకన్. 148

గీ॥ కేవలము నీది పట్టి చాంగేరిమనసు
మధురమానసు సుగ్రీవు మట్టసింప
నరయ నాలుగునా ళ్లట్టిదైన నేమి
కేవలునకుఁ గార్యయథార్థకృత్తునకును. 149

వ॥ అనిన మున్నే కపివీరులందఱు తిరిగిపోవుటయు నాఁజనేయునివలని భయమునను దారేయుం డవరోహించి తన యువరాజపదంపు దండితనమున నిట్లనియె. 150

గీ॥ నీవు లక్ష చెప్పు నిజముగా సుగ్రీవు
నందు శౌచభావ మానృశంస్య
మధికమైనయట్టి యార్జవంబును లేవు
నీవు పొగడవచ్చు నీకుఁ గూర్చి 151

ఉ॥ ఒప్పగ నాడినన్ మొదటినుండియు నాతని సర్వవృత్తియున్
దప్పుడుదారిపట్టినది తాతను వీనుని లోననుంచి పైఁ
గప్పెను పెద్దఱాత గిరిగహ్వరవక్త్రము దాని కేదియో
చెప్పెదరాయె మీరు గుణిశేఖరుఁ డంచును విశ్వసించుటన్ 152

మ॥ తనభార్యన్ రుమఁ దండ్రికైకొన నదిన్ దప్పయ్యెఁ దాఁ జిన్నత
ల్లిని గైకొంటయుఁ దప్పుకాదు రణకేళీచండసాహాయ్యుఁ డా
తని ధర్మాభిగతిం బరాక్రమమునుం ద్వావృగ్విపశ్చిన్మణుల్
వినుతింపన్ వినుచున్న లోకమున కన్పించున్ నిజం బిట్టుల్ 153

గీ॥ తన కుపకారంబును జే
సిన రాముని మఱచిపోయె స్త్రీలోలుండౌ
చును నడమంతరపున్ సిరి
పెనచు గుణములింతకంటెఁ బెనచునె యచటన్ 154

గురునకు వానరేశ్వరునకుం బినతండ్రికి సూర్యసూతికిన్
గరములు నాదు దోసములు కాచి క్షమింపు మటంచుఁ జెప్పుడీ. 161

ఉ॥ తల్లియటన్న నెల్లపుడు తల్లియె, ద్వేషము నింద మోహమీ
యెల్ల మనోవికారముల కేమియు స్థానముకాని మూర్తి యీ
తల్లికిఁ దారకున్ జరణతామరసంబునఁ గేలుమోడ్చి దన్
మెల్లనఁ జెప్పు డేను బ్రణమిల్లితినంచు దయార్ద్రచిత్తులై. 162

ఉ॥ తా నొక పిచ్చితల్లి రుమ, తాల్చిన కైజత ఫాలమందు మో
డ్పై నతి చేసినాడనని యాడుడి యంగదుఁ డొక్క పెద్దతే
డైనను చచ్చినాడనిన నన్నియు నొక్కటె తీవ్రసౌఖ్యదుః
ఖానుభవంబులేని జనువై చను నామెకు బాలభావకున్. 163

వ॥ అని దర్భాస్తరణంబు సేసి యంగదుండు ప్రాయోపవేశంబు సేసినఁ
గపు లెల్లరు మేము నీ తోడివారమే యని కుశాస్తరణంబు లేర్ప
ఱచి యుపవసించిన నాంజనేయుం డిట్లనుకొంచు నుండె. 164

క॥ ఒక తప్పు చేసి బాలుఁడు
ప్రకటితముగఁ దల్లి కోపపడినం దప్పొ
ప్పికొనక నా కన్నంబే
యకటా! వలదంచు బిగిసినట్లుగ నుండెన్. 165

క॥ తననీతి చెఱచినా నని
మనమున నాగ్రహమును నభిమానము కలుగన్
నను సాధించుటకును బ
ట్టును బట్టె నిదెంతసేపు పిటుల్ చేసెఁనో. 166

మ॥ నెటి నీసంగతి తల్లికిం దెలిసెనేనిం దన్ను కోపించు ని
ర్భరవృత్తిన్ సకలంబు తా నభినయింపంగావలెన్ నేను ...
షురరీతిన్ వచియించినా ననుచు నీసున్ రోసమున్ గల్గెం ...
దటిముందున్ యువరాజు ద న్నిటుల నన్నన్ రీవికిం దక్కువై 167

మ॥ చిననాటన్ బినతండ్రి యందెటులనో చెల్లించు నాయందు న
ట్లనె గారాబము నేను నా బిగువు చిట్లన్ సర్ది చీవాట్లు పె
ట్టినఁ దూష్ణీంకృతి పూనియుండుఁ దనుపొంటెన్ నేనునున్ నీతివి
ర్చిన బాలుండయి తల్లక్రిందులయి పేర్చెన్ సాహసాధ్వంబునన్. 169

మ॥ ఇపు డేదన్నను నేను బిఱ్ఱబిగియన్ హ్రీధూర్తుఁడై నేను న
బ్రిపుఁ గోపం బరుదెంచినట్టుల నటింపన్ బల్కరించున్ మనో
ల్పపు ధైర్యంబున జారివచ్చు నవబాలత్వంబు నానావిధం
బుపరోధింపఁగరాదు సాగఁగలడే యోరంత ప్రొద్దై చనన్

చ॥ ఇది యొక తిక్క యెప్పుడు పితృవ్యుని నిట్లనుటేమొ లేద యే
హృదయములోపలం గలవొ యీదృశభావము లుండకుండనుం
డదుగద యెంతధర్మ మయినన్ జనకుండు గతించె నన్నయ
ట్టిది గొక వేళయందుఁ బ్రకటీకృతకోపముకాఁ జెలంగెడున్. 170

క॥ తన తండ్రి లిద్దఱును పూ
నిన వైర మ్మన్నినాళ్ళు నేనెఱుఁగను బా
లున కెంత తెలివి వచ్చెను
వినిగూఢవ్యంగ్యవాక్యవిభవము నేర్చెన్. 171

వ॥ అని హనుమంతుండు తనలోఁదాను చిఱునవ్వు నవ్వుకొంచుఁ గూర్చుండఁ దక్కిన కపులంద ఱంగదునిచుట్టు కూర్చుండి యిట్లు వేవిధంబుల నాడుచుండిరి. 172

క॥ అసురులు గుహలో నన్నను
గసిమసఁగినఁ దనకుఁ జేతకాదా శౌర్యం
బెసఁగఁగ దాఁ జని చంపెడు
నసురుల మరియెవ్వఁడైన నాగుణమున్నన్. 173

ఉ॥ ఆజ్యము పోసినట్టులయి యన్నయు మండెనటన్న మండడా
ప్రాజ్యభుజాబలుండయినవాఁ డెపుడైన మరిట్లు చేయునా

పూజ్యుని యన్నగారి సిరిపొందెడు న్యాయము లేకయున్నచో
రాజ్యపుగద్దె యెక్కుడు సరాసరి పోయి ధరాధినాథుఁడై, 174

క॥ ఆయన యెక్కుడ మరిమరి
యీయన యెక్కుడ భుజామహైశ్వర్యుఁ డతఁడున్
పోయినదై పోయెను కా
నీ యిల మనదే యటంచు నెంచి దితఁడున్. 175

మ॥ తనకున్ మించిన శత్రువున్ గెలువఁగా ధర్మం బధర్మంబటం
చును లేకన్ మరి యెవ్వ డిట్లు తలఁచున్ శూరుండె వాఁ డేమి చే
సిన రాజాన్వయు డంచు వానరపతుల్ సేవింతురి కా కామహా
త్ముని వాలిం బతియన్న బుద్ధి యిఁకటన్ బుట్టించుకో నయ్యెడిన్.

ఉ॥ రాజన దోర్యుగాధిక పరాక్రముఁడై యుధికుండు కావలెన్
గా జొకఁడొప్పి వెన్క మణి కాసెడు వెల్గులచేత రత్నమా
నా! జగ మాని మోహపడినన్ గుదిఁ గుప్పెగ నుండిపోవు శ్రీ
రాజితమూర్తియైన రఘురాముఁడు వెల్గినఁ దాను తానెయా. 177

చ॥ పోరిపోరిఁ దా భయంబునఁ బట్టయి యంగదుఁ డన్నయట్లుగా
బరబర ఋశ్యమూకమునఁ బారెను నాటికి నేటికిన్ మరిన్
బరబర రామచాపమునఁ బారెను బారుటయుంగాఁ బెద్దనే
ర్పరి పరికాడు తానె గజరాజును పోలమునందుఁ దోలియుచున్.

ఉ॥ ఊరక పోల్చి చెప్పుటయు నొప్పని చెప్పుట సామ్యమే, నిరా
ధారము స్వర్గమున్ వ కథామయం పోల్చినఁ బోల్చ రున్ననున్
దీరని జంట మూఁడవ పదిన్ గనిపించదు వాలియున్నచో
ధారుణి యిట్టులుండెడిదె ధర్మము శౌర్యము మాసియుండునే 179

చ॥ ప్రజ యొక మంద, రాజనిన రాజొక యెవ్వఁడొ బుద్ధిమంతుఁడా
రజ గళరావ మొప్పఁ గుహారస్థితి చెప్పిన వాఁడుగా జఘ
న్యజుఁడగు బుద్ధిలేని జగమందున నెప్పుడు నిల్లె యుండు నీ
ప్రజకును నిల్లె కావలయు రాజపదంబున జాగిలంబులై. 180

మ॥ సుగుడిం దాఁగఁగ జుట్టు చేరి యువరాజుం బట్టు సంతోష పె
ట్టఁగ వాలిన్ మరియున్ బ్లవంగశిఖివిష్టప్రోన్నతుంగాఁగ నా
డఁగఁ దా రేయుఁడు వారి పక్కలు లఘుస్తంబుల్ మదిం దాల్చడే
మిగ నూహించునొ యాంజనేయుఁ డని సామీరిన్ విలోకించుచున్.

ఉ॥ నాయన చిన్నవాఁడ విది న్యాయము కాదని చేయి పూని నా
రా యన నేను రానొ పెఱరాజగ నన్నును జూచి పల్కినా
డీయన నాఁడు రాజ్యమది యేటికి మంత్రిఁగఁగాఁగ దల్లి లే
కీయన లేక మంత్రిగ నిష్ఠలు కల్గినవాఁడె రాజగున్. 182

ఉ॥ ధన్యతలేమి యెంత పినతండ్రికి దోస మటన్నఁ దండ్రి కా
ఠిన్యము కాదనంగఁ బ్రకటీకృతి కల్గను చిత్తమం దసా
మాన్యపుఁ గర్కశత్వమును మానసముండినవా లోర్వలే
రన్యలె యైన వేఱు విధ మన్యది సూర్యసుతుండు తమ్ముఁడై. 183

ఉ॥ నే నిటులైన చో వికచనీలసరోరుహ మగ్ధకాంతి మా
లానికురుంబ కేసరకలాప మనోహర రామచంద్ర శో
భానవనూతనాధరశుభాస్యము భాస్యము చూచు టెట్లు నా
యీ నవబుద్ధి తానెఱుగు నీయన యద్దియు పూనుధైర్యమున్. 184

మ॥ ఇఁక మాటాడఁడు కావలెన్ మొగము సందేదో బిగింపై ముడుం
చుక కూర్చుండెను నేను నుం బలుక నంచున్ దీః తారేయుఁ డూ
రకయున్నన్ గపివీరు లిద్దఱు మనోరాజీవకింజల్కతాం
బకకాంతుల్ కని కానలే రచటి తాత్పర్యంబు శ్రీధుర్యమున్. 185

సీ॥ రే నల్లచీర మార్చెడు దినాంగన యూఁడి
చిన పండు చెంగావి చీర యనఁగ
ప్రత్యుదుద్యన్మహానీలలోహితకటి
భాసియై పశ్చిమాశాస మనఁగ
యామినీమదసామజాననంబున యందు
మెత్తిన సిందూర మృత్తనంగ

నాకాశతరుపశ్చిమాశామహాశాఖ
సొంపారు జివురాకు జొంప మనఁగ
నేడ్చుచుండిన సంజను నెత్తిగాని
వేసి యెఱనీళ్లలను దీసి పోసి రనఁగ
సురలు పశ్చిమ దిగ్భిత్తి సుందరముగఁ
జఱచుకొన్నట్టి యెత్తు జేగుఱులు తోఁచె. 186

శా॥ సంధ్యారాగము లారినన్ గిరిఝరీసంతానముల్ వార్షుకా
వంధ్యశ్రీసుషమాభిరామములు పొల్పారెన్ గపీశానసం
బంధ్యాజ్ఞాకృతవేళ దాఁటదను నప్పాటన్ నిరాశాశుచా
కంధ్వన్నజ్జనభావతో విముఖతం గర్వించుచున్ వారికిన్. 187

మ॥ కలహంసీశితచంచుపారశవవృక్ణంబుల్ పయోజాతపం
క్తులు సంధ్యారుణకాంతిభల్లములు రాఁ దోడ్తో మరిన్ ముద్చుకో
నలవింగాకయ పల్లటిల్లుచును వింధ్యాధిత్యకాంతస్సర
స్సుల శైవాలపు నీలిదుప్పటులఁ జొచ్చెఁ విచ్చుకచ్చుల్ సెడన్. 188

ఉ॥ దుర్గమమై వియత్పదము తూఱెను మున్ దన కీ శిలోచ్చయం
బర్గళపూచు దానిఁ గనకాంచితకాంతిని జేయు మేరుసం
సర్గముకల్గగా నుభయ సంధ్యలయందున వేవెలుంగు స
న్మార్గగులైనవారి చరణంబులె రమ్యము లెంత చూచినన్. 189

క॥ మలుసంజ యెర్రదనములు
నలఘులు ప్రాయోపవిష్టులౌ వానరవీ
రుల వృత్తదేహయష్టులు
పులుముచుఁ బెను మాంసఖండములుగాఁ దోచెన్. 190

క॥ చలిగాలి తిరిగి వింధ్యా
చలగహ్వర వాసి నేను శైలాభుఁడు చం
చలపాటలచండత్రో
టిలాలసాత్ముఁడు మహాపటిష్ఠుఁడు జటియున్. 191

మ॥ క్షితిభూస్నంవహనాతిదక్షుఁడుఁను వర్షీయాంసుఁడున్ ఛిన్నప
క్షతి తా నొక్క మహాఖగేశ్వరుఁడు దృక్పండుండు నచ్చెన్ గపి
ప్రతతిం గాంచె నధోగిరిస్థలగుహాభాగంబునందుండి యు
ర్థితులం దర్భలపై శయానులగువారిన్ వారిముక్తైతుప్రలన్ 192

క॥ మొగ మెత్తి చూచి క్షుధ యెం
తగఁ దీరెడు మంచివేళ దైవము తెచ్చెన్
దెగిన గరుత్తుల దిశలం
దెగురఁగ లేనట్టి నాకు నీవృద్ధునకున్ 193

ఉ॥ కొండలమంద కీ పడుచు కోతులు చచ్చినఁ జచ్చినట్లుగాఁ
దిందును మత్ప్రియాచరణాధికము దైవము నావసించు నీ
కందరభూమికాజిరవిగాహితులం గొని తెచ్చె నెంకుఁజా
వం దలపోసి యిచ్చుటికి వచ్చెఁను చచ్చుట యంచు నున్నదే 194

ఉ॥ చిత్తములందున న్నిలువజేసిన ధాన్యము చూచియెంతగా
మెత్తురో లోకపుంజనులు మిన్నుటమై దొంకొన్న తిండియై
హత్తిన సంతసం బెటకలాడని నాకుఁ బయోధిమీఁద ను
వ్వెత్తుగఁ బారినట్లు వెలయించెను వించిన మోదవార్తనాన్ 195

మ॥ అకటా ! చాలియుఁ జాలనట్టి కబళంబై యున్నినా ళ్లొక్క దిం
చుక పోవున్ దినమైన తిండి కనుగొంచున్ జిత్తము త్తేజమా
టకుఁ బూర్వ క్షుధతోడి బాధ యది గాటం బెంతగా నైనదో
వికటాస్యంబగు వానరప్రజను కన్పించున్ సుధావర్తమై 196

క॥ అనిన ఖగరాజు నుడుల
న్వినుచును వానరులు నిలువు నీరైరి మరిక
గనులను ఖగరాడ్రూపము
గనుచును వానరులు గగ్గుగగ్గులకాడై 197

చ॥ మనుజులమర్క శిరోజములమూదిరెఁ బక్షుఁకుక్ గరుద్ద్వయం
బు నిశితమూర్తిమత్త్వమును బొల్పును దెచ్చును లేకయున్నఁ గ

న్గానఁగ విశారభావమునకున్ నిధిగాఁగ ననానసహ్యాతా
ఖనియయి వాఁడు భూధ్రనిభకాయము కల్గిన భీతి కొల్పెడున్ 198

మ॥ అటఁ గిష్కింధకు నేగ దుష్టమగు చావౌనంచు శైలాగ్రమం
దిటఁ బ్రాయోపవిశక్రియన్ మరణ మూహింపంగఁ జిచ్చారు పె
న్పటకారై కనవచ్చె ముందర మహాపక్షీంద్రుపెన్ త్రోటి దు
ర్ఘటమా మృత్యువు వ్రాసియుండవలె స్వర్గం బేగినన్ బ్రాప్తమా

గీ॥ భక్ష్యలుబ్ధుఁడైన పక్షిరాజును గాంచి
యంగదుండు నివ్వెఱైన కనుల
నంగములను బెద్ద యాయాస మొప్పంగ
నిట్లు లనియె హనుమతట్టు చూచి 200

మ॥ కనవయ్యా కను మేగుదెంచి యెదుటన్ కాలుండు కూర్చుండఁ బే
ర్చిన పక్షీంద్రమహోగ్రరూపధరుఁడై సీతాపదేశంబునన్
వనికిన్ రాముని బంపుటన్నయది యాపాపంబుగాఁ గైక వి
త్తిన యీ వృక్షమునం గపిస్త్రియ మేతెంచెన్ ఫలావాప్తిగా 201

ఉ॥ కావలులై యురుల్ బిగయఁ గంఠములందున నంత ఘోరపుం
జావును జావలేమనుచు శైలపుఁగొమ్మునఁ గూరుచుండఁగాఁ
గేవలమిట్లు వచ్చెను నికృష్టపుఁ జావులు వేయి చచ్చిన
ట్లై విలయంపుఁ జావు వదనాంగణమందున నృత్యమాడుచున్ 202

శా॥ చచ్చీ చావని సాము పీనుఁగుల చంచచ్చంచదాశుక్రియో
ద్యచ్చంచూగ్రవిఘూనసంబులు వియద్వ్యావల్గసంబుల్ మరిం
జచ్చుం జావుగ నేమి చెప్పవలె నీసంధాన వైచిత్రి తా
నచ్చో రాఘవ కార్యమున్ గపిచయవ్యాపాదనప్రౌఢమై 203

శా॥ ప్రాగ్జన్మార్జితపాపకర్మఫలమై రామోగ్రకార్యంబు తి
ర్యగ్జంతూగ్రవిచిత్రచిత్రమృతిధారాస్యూతమై యొప్పఁ దా
దృగ్జీవుండు జటాయు నప్పగిది సంధించెన్ గపివ్రాతమీ
దృగ్జీవాళిని నేటికిప్పగిది సంధించున్ ధురాక్షిప్తమై 204

చ॥ మఱి రఘురామచంద్రు ముఖమండలదీధితి యాత్మలోపలన్
గుఱుతుగ నిల్చియుండుట గొంకొండు నిజంబు పరిత్యజించినన్
వెఱగగుఁ దత్కథావిభవవీధిక నాతని సొంటు కల్గినన్
తెఱుగని దుఃఖసంతతులు తప్పవు చూడు మయోధ్యగా మొదల్

ఉ॥ ఆరయ నుత్తమోత్తమ మహాపురుషాళి చరిత్రముల్ నిజం
బేరికి సౌఖ్య మంత వెలయించవు ధర్మపుసూక్ష్మతల్ పరి
ష్కారము చేయుఁ దత్పురుషసత్తమవృత్తసహాయులందు సం
ధారతిదుఃఖభాజనత తప్పదు తచ్చరితానుబంధులై 206

చ॥ విధియును దొడ్డకాడు కపివీరుల ప్రాణములన్న ముద్ద వీ
వధమును జంకఁబెట్టి చని పక్షికులేశ్వరు కుక్షిలోపలం
గ్రిద్ధితము చేయఁబోయెడిని రామకథాపటుసంప్రయోగ వీ
వధమున రాక్షసుల్ కపులు పక్షులు లేళ్ళు హరించిపోవఁగన్ 207

చ॥ మఱియును నిందులోనఁ గపిమండలి పక్షిచయంబు మిత్రులై
మెఱయగ రాము చాటుగను మిత్రికి నగ్గముగాఁగ నాటయున్
మెఱవడి రామచంద్రుకథ నేలిమిమాలిమి శాస్త్రవైఖరిన్
దఱిఁదరిషై భవాబ్ధిఁ దృణతారణకారణమంజువై చనున్ 208

చ॥ చనియెడు ప్రాణిమొత్తములును జన్నది శ్రీరఘురామచంద్ర ద
ర్శనసుకుమారబంధముగ సన్నిధినై నను గొంతమేలు నా
జనకున కద్దిమాత్రము సుసంగతమైనది నాకుజూడు మా
తని కొడుకై రఘూద్వహు నదర్శనవేళ హరించిపోవుటల్ 209

చ॥ అదియొక నేను లెక్కలె జటాయువు రావణునంత నంత కా
ల్కదపక నిల్వఁద్రొక్కిన హలాయిత పక్షతి విక్షతిం గనెన్
జనుచు జటాయు సామ్యమునఁ జచ్చెద మేము జటాయువెందు బ
ల్లిదుఁడయిపోయె మేము నవలీలగఁ జేరెద మా ఖగేశ్వరున్ 210

గీ॥ ఆ జటాయువు చచ్చిన యదియు మేలె
యుదిరి సుగ్రీవు భయములేకుండఁ జచ్చె

భయముతోఁ జచ్చుచున్న యీ ప్రాణమేమి
లోకముల కేగునో మదిలో నెఱుంగ. 211

వ॥ అంత హనుమంతుండు తార యంగదుని నీతిమతివిభవునిం జేసిన దని శ్రీరామచంద్రుని కితండు వట్టి బంటేకాదు రాజకార్య నిపుణుం డయిన రాచబారెయుఁ గూడ నగునని తలంచుచుండ నా పక్షి రాజు వానరవీరులంగాంచి యిట్లనియె. 212

మ॥ అవు మీమాటలయందు విన్పడెడు నయ్యా నిక్కమా! మా జటా యువు ప్రస్తావన మీర లెవ్వరు చిరాయుష్కుండు తమ్ముండు మీ కవునా మిత్రము రావణుండనెద రేలా! వాఁడు కుజ్జుక్ జటా యువు నేమింబొనరించె వేపలుకుడీ యుల్లంబు పల్లంబగుక్ 213

చ॥ విశదపరాక్రముండయిన వీరుఁడు రాముఁడు వేల్పునేస్తు మా దశరథబిడ్డ యాతఁడు శతారికి నాతఁడు మాజటాయువుక్ వశచరణుల్ సఖుల్ త్రిదినబంధులు తమ్ముని నేమిచేసెఁ గ ర్కశనఖచంచువుక్ సమరకాలునిఁ బక్షతియామ్యదండునిక్ 214

క॥ ఎన్నాళ్ళకు వినిపించిన
దన్నా నా యనుజుమాట యద్రిగుహాస్థుక్
నన్నుక్ గ్రిందికి దించుడు
విన్నది స్పష్టముగ నాకు వినిపింపంగక్ 215

మ॥ లలితాకారుఁడు శౌర్యవార్నిధి గుణశ్లాఘ్యుండు నాతమ్ముఁడు య్యొలలో నూచినయట్లు లూచితిని మున్నీకోలుగా నాడు త క్కలపై, వాని వధించినాడనిన రక్షస్సుక్ శిరోరక్తపి చ్ఛిలమచ్చుంచువుగాఁగఁ జంప నెఱకల్ చిల్లాణముల్ లేప్రపో 216

శా॥ ఏదీ మీకును సుంతదగ్గఱకు రండీ! స్థావిరంబొక్కడే కాదు ద్వేష్టసపక్షసంహతియు లేకక్ నేను రాలేను తా నా దైతేయుఁడు వానితో సమరమేలా చేసెఁ జేసెత నే నై దాదుంగను బెట్టి చెక్కెదనుగాదా యందు నేనున్నచో 217

ఉ॥ ఐనది పాతికేండ్లయిన దప్పుడు చూచితిఁ దమ్మునిం జన
స్థానమునందు వాఁడనికషాతనదేశమునన్ వసించు ము
న్నీ ననుఁ జూడవచ్చుఁ దన యెల్ల పరాక్రమమున్ వచించునే
మైనది వాఁడు నే నెఱుఁగ నైతిని మీరిది చెప్పనంతకున్ 218

శా॥ అయ్యో! మీ రిట నాత్మబంధువులటం చజ్ఞాతమై ముక్కునన్
వ్రయ్యన్ బెక్ క్షుధతీర్పఁగా దలఁచితిన్ వార్ధక్యచిహ్నంబుగా
దయ్యంబం చనుకోకుడీ యిటకు మత్సాన్నిధ్యమే తెంచి ధీ
క్రియ్యంబాటుగఁ జెప్పుడీ యతని వార్తాయోగ సర్వస్వమున్ 219

క॥ అన నంగదుండు తన తలఁ
చిన సర్వమ్మాభిముఖ్యాశివతాతిపథం
బ్బున కొగ్గిన నుద్గ్రాహం
బునఁ బట్టిన నీతిఫలము పొందించుటకున్ 220

శా॥ సంతోషించుచు వృద్ధపక్షియును మోసం బెంచునోయంచునున్
జింతించెన్ గపులెల్ల రప్పగిది నే చింతించి రీ పక్షి రా
జింతం బోవునె మంచిగాఁ బలికి భక్షింపంగ వాంఛించున
న్నాంతర్యంబున భీతి గ్రమ్మిరి మహాశయస్త్రాక్షికోణంబులన్ 221

ఉ॥ విస్తరిలోన పడ్డ నను వీఁ డొకఁడేమి పరిత్యజించువాఁ
డస్తమితంబులైనవని ప్రాణము లింకఁ దలంచవచ్చు నా
కూస్తవనీయబుద్ధి కయికోలుగ నాడెనయేన్ గుభృన్ని దే
శ్యస్తనయిత్ను మేఘపరివత్తులమై చనవచ్చు ముందుకున్ 222

క॥ ఒక యోపన నిచ్చి కుటుం
బక కలహము లంతనంత మాపి చనెడు, నీ
వికృతిం గడచిన సంగదుఁ
డిఁక మారుతి మాటవెంట నేగుట జరుగున్ 223

చ॥ నిజముగఁ బక్షి మోసము గణించిన నిఘృణముష్టిపాత మా
రజరవ మొప్పఁ దూల్చెద ధురామతి మారుతివెన్కనుండి యం

డజపతి కంఠనాళదళనంబుగ దూఁకి మలంచు గొంతు బే
రజ మది లేకయున్న రఘురామునికార్యముచక్కనైనదే. 224

వ॥ అనియంగదుండు గిరిశృంగముననుండి యవతరించి తనచాలనంబున జాగ్రత్తయుఁ బ్రీతియుంబు తోపమి లేకున్కియుగా సమీపించి యయ్యా నీవెవ్వరన నతండు నాపేరు సంపాతి. జటాయువు నా తమ్ముఁడు. నాయనా మీరెవ్వరు వినవలతు నతనివార్త సవిస్తరంబుగా నుడివెదే యన. 225

గీ॥ ఋక్షరజనుండనంగ దోర్వీర్యశాలి
దండి కపిలోకపరమేశ్వరుండు కలఁడు
వాలి సుగ్రీవు లిద్దఱు వాని సుతులు
వాలి త్రిభువనవిదిత దోశ్శాలి రాజు. 226

గీ॥ ఇపుడు రాజయ్యె సుగ్రీవుఁ డిద్దఱికిని
పడక చంపించెఁ దమ్ముడు వాలి నొకఁడు
రాముఁ డరుదెంచె నీ కపిరాజ్యగురుత
చెంది సుగ్రీవునాజ్ఞ వచ్చితిమి మేము. 227

ఉ॥ ఆ విభు సూర్యసూతి సుగుణావళి రాముఁ డోకం డెఱుంగు సు
గ్రీవుఁడు వాఁడు రాముఁ డనఁ గేవల మాదిమహేశ తేజముల్
పోవగు మూర్తి మేము కపిపుంగవు నాజ్ఞను భూమికన్యకన్
వే వెదకంగ వచ్చితిమి పృథ్విసమస్తము రాఘవప్రియన్ 228

చ॥ అఱువదివేల దైత్యచము వర్ధముహూర్తము మాత్రలోన నే
డై అ రఘురాముఁ డుాడ్చిన నడిన్ ఖరదూషణనాయకంబు రూ
పఱనొక వింటిమీఁద నుఱుమాడెనుబో పినతల్లిబిడ్డ లి
ద్దఱమృతి విన్న రావణుఁడు ధాత్రిసుతన్ హరియించె దొంగయై

చ॥ దొర భరతుండు కావలయుఁ దోయజనేత్రకుఁ గైక కెప్పుడో
వరములొసంగె రాజు పనిఁ బంపెను రాముని స్వామితోడ వ
చ్చిరి యనుజుండు లక్ష్మణుఁడు సీతయు నామె గవేషణార్థమై
వరకపియూథనాథులను బంచె దెసల్ కపిరాజు మైత్రికిన్ 230

ఉ॥ ఆ మహనీయపక్షబలుఁ డద్భుతనృత్తుఁడు మీ జటాయువున్
ప్రేమను రామచంద్రు నొక బిడ్డనలెం గనుచుండఁ గానలో
నాముది వెఱ్ఱిరక్కసి ధరాత్మజఁ గొంచును బోవఁ జూచి సం
గ్రామమహోర్భటిం బ్రళయకాండము చేసెను జూడ రెవ్వరున్ 231

వ॥ అచట నారక్షసుని రథంబు చెక్కుచెక్కులై వాని వర్మంబు ముక్క
ముక్కలై వాని కిరీటాంగదంబులు వాని యొక్క మణికంకణాభరణ
హస్తంబు వానివీపుచర్మంబు దిక్కుదిక్కులై కనంబడె శ్రీరామచం
ద్రుం డమ్మహానుభావునకుఁ బరకర్మలం జేసె 232

క॥ నా తండ్రి వాలికంటెను
మీ తమ్ముని జన్మ యెంతమేలో రాముం
డే తండ్రికిఁ జేయనియవి
చేతులతోఁ జేసె ముక్తిసీమలు సేరన్ 233

గీ॥ రామశరకృతవక్షుఁడై వ్రాలె వాలి
వాలికృతధర్మపక్షుడై వరలె సూర్య
సుతుఁడు సుగ్రీవుఁడున్ గపిక్షోణినేత
నలినదృగ్దిశాపర్యేషణావిధాత 234

గీ॥ నాల్గుదిక్కులు కపియూథనాథు లేగ
మేము దక్షిణావని వచ్చినాము తాత !
యేము వెదుకని రెండువ్రేళ్లెడము లేదు
వింధ్యగిరిశిలాకాంతారవీథి నెచట 235

చ॥ నెలగడువిచ్చె నా గడువు నీకడకుం జనుదెంచు నంతలో
పల నయిపోయె నొక్క గుహపట్టితి మచ్చటఁ బట్టె మాసమున్
దెలియక సీతయున్కి సరుదేరిన మాదెసఁ గంటి మెట్టి చా
రలుగను మండిపోవుఁ గపిరా జిటఁ జచ్చుట మేలు దానికిన్ 236

శా॥ క్ష్మౌకస్యం గన దక్షిణాపథ ధరన్ గాలించినా మెందు నే
లోకంబందున దాఁచెనో యసుర ముల్లోకంబు తచ్చౌర్యశే

ఖాకల్లోలిత మింకఁ జత్తమనుచుం గాఢంబు ప్రాయంబుగా
నై కూర్చుంటిమి నీవు కన్పడితి కాలాకారమిత్రంబవై. 237

క॥ కాలికిఁ గాదేఁ దప్పదు
ప్రేలి కనినయట్లు నిన్ను భీతిం గనుచున్
మాలో మేము జటాయువు
కాలగతుండౌట మొదలుగాఁ జెప్పికొనన్. 248

వ॥ అవునవును నేను విని మిమ్ము పలుకరించితినని సంపాతి నాయనా నీ పేరేమియనిన నంగదుఁ డంగదుఁడనిన సంపాతి దుఃఖసంపాతియై యంగదాయని పిలిచి యిట్లనియె. 249

ఉ॥ అప్పుడు వృత్రుఁడున్ మఘవుఁ డాహవముం బొనరించువేళలం
దప్పుడు పూర్వపున్ మనువు నాదియుగంబునయందు విన్ము మే
మిప్పటివారమా చెలఁగి యిద్దఱ మొక్కర మొక్కరంచు పై
యుప్పరమంటగా నెగురుచుంటిమి దీర్ఘగరుత్ప్రణాదిగా. 240

ఉ॥ ఒక్కరిమించి యొక్కర మహో త్రిదివంబును ముట్టుకొందు మం
చొక్కరిమించి యొక్కర మహోదిశలంతము లందుకొందు మం
చెక్కడలేని వేగమున నేగఁగ నూగుట తోచరాని మా
ఱెక్కలుకావు ఱెక్కలు పఱన్ మినుదున్ను యుగాతివేలముల్ 241

మ॥ నడిమింటన్ హరిదశ్వమూర్తి హుతభుజ్జ్వాలదీపిచండార్చిరు
గ్రుఁడునిప్పుల్ వడిఁగ్రుమ్మరింపఁగ మహోగ్రుండౌచుఁ దమ్ముండు మి
న్నడుమన్ జాఱుచు సీలయూడిన విమానంబట్లుగానైన నే
గొడుగుం బట్టితి వానికిన్ జ్వలన సంక్షోభంబు వారింపఁగన్ 242

క॥ తగనగ్ని మండలంబును
దిగువేళకు ఱెక్కదోయి తెకతెకయై యు
గ్గి గురుసుమలంగి పొనుపడి
మొగచిన ప్రాణముల నేన యెఱుఁగను నన్నున్ 243

శా॥ ఇచ్చోటం బడినాడ నన్ వెదకికొం చెన్నాళ్లకో తమ్ముఁడున్
వచ్చెన్ నన్నును జూచి దుఃఖపడియెన్ వాఁ డేను వానిం గనన్
విచ్చెన్ ఱెక్కలతో ముదంపడితి నీవృత్తాంత మేనాఁటిదో
యచ్చైచ్చ కన్నుల గ్రుద్దిన ట్లెపుడు నా కానందముం గూర్చెడిన్. 244

క॥ నాకంతటి మమకారం
బా కోమలహృదయుమీఁద నవునవు నాతం
డా! కొంచుఁబోవ రక్కసి
భూకన్యకఁ జూచి యడ్డుపోవక యుండున్. 245

ఉ॥ నావిధ మీరె చూడు డొకనాటికి జేనెడుమేర మింటికిన్
లేవఁగలేను రక్కసి మలీమసకృత్యము నిల్లె గుండెలో
నే విలయంబు పొందవలె నిట్టుల చేసినవాని గుండెలోఁ
బ్రేవులు తీసియుందు నురరీకృతకోపముచేత రక్కసిన్. 246

క॥ తుడుచుకొను వెం వు కానని
కడుకొను బాష్పములు గార్చగా సంపాతిన్
దుడుముకొని వానరేశ్వరు
లడుగడుగున వచ్చి చుట్టి రాప్యాయితులై 247

ఉ॥ క్రీతమనుల్ జటాయుగుణకీర్తన చేసిరి వానరాళి సం
పాతికిఁ దమ్ముఁ డందుఁగల మక్కువ మెచ్చిరి వానరాళి దీ
ర్ఘాతతకాలజీవుల యుగాంతరపూరుషులన్ గపీశ్వరుల్
చేతము మెచ్చుపుట్టఁగను జెప్పిరి తేఁకొనన్ ఖగేంద్రుడున్. 248

శా॥ అన్నాదమ్ములప్రేమఁ గూర్చిన నుతివ్యాహారపారీణులై
యున్నన్ వానరకోటి యంగదుఁడు లో నూహించె సుగ్రీవుపై
ము న్నా చేసినచేఁత వాలి మదిలోఁ బుట్టంగ నేనమ్ము సం
పన్నంబైనది బుద్ధి సూర్యసుతసంబంధాభిమానంబుగా 249

ఉ॥ అంగదుఁ డిట్లు చెప్పెను ఖగాధిపుతోడను నీవు రక్కసిన్
ముం గొనముక్కునన్ విదిచి పుట్టిన కోపము తీర్చరామికిన్

బుఱ్ఱింగఁగనేల రావణుఁడు పొల్చిన యుక్కు- యెఱింగితేని మే
ముంగల మేగి తీర్చెదము మూదలికన్ వచియింపు మింతటన్. 250

మ॥ అన సంపాతియుఁ గంఠగద్గదిక నిట్లాడెన్ వచస్సాహ్యాముం
దున రక్షఃకులధూమకేతు పగ నార్తున్ జూడు డేనన్న నే
మని నే వారుణమైన లోకములు కన్నారన్ విలోకించితిన్
మును త్రైవిక్రమమైన విష్ణుచరణంబుం జూచితిం గన్నులన్. 251

గీ॥ నే నెఱుంగుదు నద్రిమంథానమథిత
దుగ్ధపాథోధి నిందిరతోడి విష్ణు
దేవుకళ్యాణ మెఱుఁగుదు దేవతల య
సురుల కృతియుగాదిరణంబు చూచినాఁడ. 252

క॥ అంతటి ముది పగ్గను నా
కింతటి యుపకృతిని చేసి యీ రక్కసి తా
నెంతగను బాగుపడునో
చింతితసాహాయ్య మేను చేసెద మీకున్. 253

క॥ నావంటివాని కన్నుం
గోవులఁ గన్నీరు తెచ్చి కొఱ పాఱిణముతో
నీ వెంగలి విత్తుండు నె
నావాక్యమె మొదలు రావణక్షణనమునన్ 254

మ॥ అసితాంభోదముతోడ నిల్చి చనునో యైరావతీవల్లి యం
చు సితాకాశమునందుఁ జూడఁగ భుజాక్షోదంబుగా మిన్న ర
క్కసి యీదంగను చూచితిన్ సుమలతాకల్పంబుగా నొక్క సా
రసనేత్రిన్ హ్రియమాణ నొక్కతెను శారచ్ఛాయ దీపింపగన్.

చ॥ మెయి నగలెల్లఁ దీయుచును మేదినియందు విదల్చుచున్ శుచా
మయమగు మూర్తి రామ యనుమాట యనన్ వినువైన లేక య
వ్యయమగు మింటితోవఁ గనినైనది యాయమ సీత కావలెన్
దయయుగ నుర్వియుండి యొకతాలిమి లక్ష్మణయన్న పిల్పుగా 256

శా॥ రక్షోనాథుని యునికి చెప్పెదఁ బునఃప్రాయోపవేశంబునన్
పక్షిప్రార్థనముల్ పొనర్పకుడు మత్పక్షంబులే యున్నచో
దక్షుండై మిము నెక్కలం దిడి సముద్రం బింతయుం దాఁటి త
ద్రాక్షప్రాణకవాటమందు నిడియుందున్ లేవు నా పక్షముల్. 257

చ॥ ఇచటికి సూటిగా నెగు నీజలరాశికి వందయోజనా
లచటను లంక యున్నయది యయ్యది వాని నివాసభూమి ది
గ్విచయనమన్న నొక్కఁడగు వింధ్యముఁబోఁడనె పూర్తియైన దా
ప్రచురబలాఢ్యుఁడో నసురపట్టణ మాతల నెంతయున్నదో 258

క॥ మీ పని తేలికయైనది
ప్రాపింపఁగ నొక్క రోజుపని లంక నిరా
క్షేపముగ వెదుకఁగల బా
హాపటువులు మీకు లంఘనానాయాసుల్. 259

ఉ॥ సత్తముఁడో కుబేరు ననుజన్ముఁడు దుష్టుఁడు వీఁడొకండు సా
క్షాత్తుగ విశ్రవస్సుతుఁడు శాపదశీలుఁడు వాని కుత్తుకన్
లత్తుక మెత్తు మిత్తి పదలాంఛనమా రఘురామబాణసం
పత్తులు నూపురంబులుగ సర్వము నాకెఱుఁగంగ వచ్చెడిన్. 260

చ॥ కుతుకపు పాలరాతి రుగుల్ రతనంబు పసిండి వాకిళుల్
ప్రత్తము సూర్యవర్ణము వప్రము పూర్వము విశ్వకర్మని
ర్మితమవు పట్టణంబు రిందముఁ డా దనుజుండు నిల్చు దో
రతితరగర్వనిర్గత మహాంకృతి పట్టణమెల్ల నిండగా 261

చ॥ తన యొక పట్టుచీర మెయి దాలిచి బోసిగనున్న మేనితోఁ
గనులను బాష్పబిందువులు కాల్వలు కట్టగఁ జుట్టు రాక్షసాం
గనలు ఫెళాఫెళా వికవికా నగుచుం బెదరింప నీటిమొ
డ్డునఁ బడియున్న బేడిసలు డుస్సిన చూపుల సీత యుండెడిన్. 262

చ॥ కళపెళలాడు నీరముల కంధి వియద్వలభి ప్రకోష్ఠకా
హాళరవచండకంధిపరిఖావరణంబుగ దుష్ప్రవేశమై

హాళహాళిసేయ శత్రువుల కందను బొందను రాని యూర నీ
ర్దళిత రాక్రిముండయిన రావణు నూర వసించు దీనవై 263

శా॥ మీ రచ్చోటికిఁ బోవఁ గావలె భుజామేయపరిథాకంధిథా
రాయాత్నోజ్జ్వలబాడబాకృతులు మీ కచ్చోటఁ గన్పించెడుక్
శ్రీ రామాంగన మీరు చూచి యిట విచ్చేయుండు క్ష్మాకన్యకక్
మీరుం జూతురు తిర్గివత్తురు కుటుంబిక్ రాము దర్శింతురుక్ 264

క॥ ఆ సంగతినే నెఱుఁగుదు
మీ సంగతి కలిగె స్వామి మిథిలాకన్యా
శ్రీసంగతి కను సత్పురు
షాసంగము కార్యనిర్వహణదక్షంబౌ 265

వ॥ అనిన వానరులు తాతా! సీతయందున్నద్ద యెట్లు తెలియునన
సంపాతి ధాన్యజీవులైన కులింగుల పథము ప్రథమము వృక్షఫలాశు
లైన బలిభుక్కులది ద్వితీయము క్రౌంచకురరములది తృతీయము
శ్యేనములది చతుర్థము గృధ్రములయది పంచమము బలవీర్యోప
పన్నములు రూపయౌవనశాలులైన హంసములది షష్ఠము పరమే
శ్వర వాహనంబయిన వైనతేయునిది పరమంబైన గతి 266

క॥ స్వామియనఁగ గరుడి సంతతి
మే మే నిచ్చోటినుండి మిథిలాకన్యా
శ్రీమంతము సీమంతజ
టామాంజిష్ఠచ్ఛవిచ్ఛటక్ కనుగొందుక్. 267

క॥ మానిమతాహారంబును
మా నైసర్గికగుణంబు మరిమరి యిరునూ
రై నామడ పైచిలుసుగఁ
గానంగల శక్తి నిచ్చుఁ గపి పరమేశుల్. 268

క॥ కుటిలనఖాకుంచనపటు
ఘటితకరండముఖ మాంసఖాదుల మది క

ర్కూటవృత్తి వ్రాసెఁగా నీ
నిటాలమున బ్రహ్మ మేము నిస్తుషితులమే. 269

మ॥ నిగుడుఁ జోదరపింజవైరకలనానిర్యాతనంబుఁ బొన
ర్పఁగ వాంఛింతును మిమ్ము దైత్యుఁ బరిమార్పంగల్గు రాముండు ము
న్నగ నా విన్నది మీకుఁ జెప్పితిని మిన్నుంబట్టి యంభోధి దాఁ
టగ యత్నంబున నుండుఁడీ యికఁ గృపీటశ్రేణికాగ్రంధికన్ 270

వ॥ నన్ను దయయుంచి సముద్రముకడకుఁ దీసికొని పోదురా! తమ్ము
నకు నివాపవారి వదల నెంతునన వానరు లందఱు మున్ను దేవా
సురులు మంధరపర్వతము దెచ్చినట్లు సంపాతిని మోసి స్నానాదు
లైన తరువాత మరల నాయనను దెచ్చి గిరికందరా మూలంబున
నుంచిన మై నీరు విదలించుకొన రెక్కలు లేక యట్లే సూర్యాతపం
బుల నెండుచున్న యతనిఁ జుట్టు చేరియున్న వేళ జాంబవంతుఁ
డిట్లనియె. 271

శా॥ ఆ మైనాకుఁడు మింట నొక్కయపు డిందాఁ యస్తుఁడై చాటుగా
నేమో పోవుసటంచు నెంచితిని గానీ! నీవుఁ దమ్ముండె యా
శ్రీమన్మూర్తి జటాయు వంచెఱుఁగ నీ ప్రేమమ్ము లోకోత్తరం
బీమైఁ దర్పణమిచ్చి ధన్యులరు మీరిద్ద్వ ర్పరిజ్ఞాతల్తె. 272

ఉ॥ చింతయు శోక మిన్వియుశుచిత్వము లిచ్చట సాంపరాయక
ర్మాంతమునందు క్షాళితములై చనుఁ దమ్ముని దుఃఖమాగి ము
న్నింతగ విన్నదంటి వది యెవ్వఁడు చూచె నెవండు చెప్పె, మా
కంతయు నీవు చెప్పఁగదవయ్య గరుత్మదుదారబంధువా! 273

ఉ॥ ఆ రఘురాముఁ జూడక దురాత్ములు పల్కుట కాదు చూచి యా
శ్రీరఘురామమూర్తిఁ బయిఁ జెప్పవలెన్ మృదుచండసర్వక
ర్మారభమాణసంక్షయదనంతజగద్భ్రియమాణజూర్ణితే
జోరుచికోటిపాటితనిశుం డతఁడొక్కఁడె వింటికాఁడునన్. 274

మ॥ ఎవడా స్వామి శరాసనిర్గతపృషత్కచ్ఛాపురస్తాద్గతుం
డెవఁడా యాయువుతీరినట్టి డెవడో యింతంతనీలీకృతి

వ్యవసాయుం డతఁ డిట్లుకొంచుఁ జనఁ దా నెవ్వాఁడు వీక్షించెఁ జె
ప్పవుగా మాకును మా కృతార్థత వచింపం గల్గె నే సాధువో. 275

గీ॥ అనినఁ గనులు విప్పి యనియెను ఖగరాజు
మరి యెఱుంగఁగలను మాజటాయు
వంతచేసినప్పు డాతని తెక్కలు
లేని నేను కనులు లేనివాఁడ. 276

ఉ॥ సర్వము చెప్పెదన్ వినుడు సౌరమహోగ్నుల నాగతిన్ గరు
ద్గర్వము మాలి వింధ్యగిరి కందర దేశమునందు రాలినన్
గుర్వనుయాయి నాకొడుకు కూడి సుపార్శ్వుడు వచ్చి మత్ క్షుధా
నిర్వహణంబు సల్పు గమనించుచు వేళయుఁ బాళయున్ నన్నున్.

చ॥ ముసలితనంబు క్రూర మిది భోజనవేళ యతిక్రమించుచో
నసువులు నిష్క్రమించు ననునట్టుల యుండును గోప మింత వె
క్కసమయి పోవు నల్పమగుఁ గారణమైనను నిల్వలేమియున్
గసకస లాడుచుండుటయు గల్గును బోషణ చేయువారిపై. 278

ఉ॥ ఆస్యము వెల్వెలై యసువులాఁగ వికం చనుకొన్నయంత యా
లస్యముగాఁగ వచ్చె ఖవిలాసి సుపార్శ్వుఁడు వాని జూచి నే
నాస్యము బిట్టుగాఁ దెఱచి యాములు ఘూములు చేయుచో నవి
శ్వాస్యుడ ! నేను చావవలెనంచుఁ దలంచుచునుంటి వాడిగా 279

క॥ పడకుము తొందర పీడయు
నడగునులే యంచు నేను నాలాపింపన్
గొడు కిట్లనె నయ్యయ్యో
కడు జాగగుటకును నేడు కారణ ముండెన్. 280

మ॥ తొగమూంతం గని నీడ సన్నిధి ఝరీతోయంబునన్ బొద్దు ము
న్నుగఁ బాగంబరకర్షణార్ద్రమతినై నూల్కొన్న వాంఛన్ మహేం
ద్రగిరిద్వారమునందు నిర్భరపృషత్సంతానవాగ్బంధతా
తగు రాజీవసమూహాసంగ్రహణబద్ధస్వాంతుఁడై యేగితిన్. 281

మ॥ గుహలో ఘూర్ణనఘోషపూర్ణమగుచు వాగుల్ చుట్టు క్రొల్లారుని
గ్రహడిండీరవిమర్దవార్లహరికాగ్రంబందు దండాభసం
గ్రహపక్షద్వితయంబుగా నుపరిభాగస్థేమమూర్తిన్ దనూ
రుహసంస్పృష్టజలంబుగాఁ దెలచు నోరుంగాగ నేనున్నచో 282

చ॥ వనచయధూళిధూసరితభల్లుకరోమచయాభ కాంతితో
మునుపటి వృత్రుఁడో యనిన బొద్దగు దేహముతో నొకండు న
న్నడిగె నిద్ది తోవియగునో యని సంగతదక్షిణాదిశా
వనధినిగల్గు ద్వీపములవంకకు నేఁ దలయెత్తిచూచినన్ 283

ఉ॥ వాడిన పూలమాలవలె వాల్చిన కన్ను నొసంటఁ దట్టుము
ట్టాడిన ముంగురుల్ కటు నిటాలముగా నొకచాన వానిదోః
పీడిత యుండె నా మనసు విద్రితముద్గరపాళి నుండె న
న్నాడిన మాటకున్ దెలియనంతటి కోపము వచ్చె నాయెదన్ 284

చ॥ మివులఁ జిరాకు పుట్టును సుమీ! ఋషరాణ్మృగయాసమాధివే
ళ విరియు మాటలన్ దెలియులాగున దీనతఁ బల్కరింప నే
నవునని పంపితిన్ బతియు నంగన యామినివేళ వింజపుం
గవి విహరించి పోదురనిగా మరి వారును దూర మేగఁగా 285

ఉ॥ ఖేచరులందుఁ గన్పడినఁ గేవల సిద్ధులు వారి గూర్చి నే
నా చనినట్టివార లెవరంచన వారలు స్వస్తివాక్కులై
యేచి యదృష్టవంతుడవు నిట్టిలమై వినుగూనలేదు దు
ష్టాచరణుండు వాని కదియైనను గోపము తెచ్చి యుండెడిన్ 286

ఉ॥ వాఁడు గరాసు దాశరథిభార్యను రామునిభార్యఁ దద్దఁ బూ
బోఁడిని బట్టి దొంగిలుచుఁ బోయెడు రామవచోనిబంధనన్
వేఁడిన రిత్తకోరికగ వేదుఱు నెత్తిన యామె రక్కసుల్
గూఁడగు లంకలోపలికిఁ గొంచును బోవునటంచుఁ జెప్పఁగా 287

ఉ॥ పుక్కిలియందు బొత్తులుగఁ బూన్చిన చేపలతోడ నీవుఁ బోవి
దైక్కనటంచు వచ్చితిన యియ్యది కారణమంచు నాడగా

నక్కట ! యేమిచేయవలెనయ్య ! యపాకృతపక్షుఁడన్ వృథా
ముక్కిఁడియుండి యుండనిదె పుట్టిన కోపము తాపమై చనన్ 288

శా॥ మీర్మీరేగతి పౌరుషప్రకటనామేయప్రభారూక్షదోః
కర్మం జేయఁగఁజాలుటల్ కలుగు వక్కాణింతు నాసర్వమున్
గిర్మీరీకృతదిక్సతీవసనశాఖిశ్రేణిపతాంచలాం
తర్ముగ్ధాక్షి మృదుచ్ఛవిన్ రఘుపతిన్ దాల్తున్ రిపూన్మాథనున్ 289

శా॥ మీమీ బాహులు నంసముల్ నయనముల్ మీకంఠముల్ దీప్తతే
జోమర్యాదలు కన్న నాయొకఁడు రక్షోభర్త లెక్కా ! యధే
చ్ఛాహార్వీరనదిక్కటాహకృతమూర్ఛామూర్తి రాముండు హి
క్కాముండుం బొనరించు రావణుని దిక్కాలాద్యతీతప్రభన్ 290

ఉ॥ ఇంతటి నిశ్చయార్థముగ నేటికిఁ జెప్పెదనో వినుండు నే
శాంతగరుత్ప్రచారముగ సౌరమహోగ్నుల మాడిపోయి నే
నంతట నా యొడల్ తెలియ కంగము బిమ్మిటివోయి కూలినా
నంతము నాదియుం దెలియనట్టి యొకానొక కొండకొమ్మపై 291

గీ॥ అంత స్మృతిలేనియప్పుడు నాత్మరక్ష
భావ మెచ్చటనోయుండుఁ బడెడువేళఁ
దల యొగచి పట్టుకొంటిఁ గావలయు ముక్క
లైన జాడలేదది తదనంతరమున 292

గీ॥ ఆఱుపవళులు నిశలును నట్టుఁగంటి
నా యొడలు నగ్నిగోళ మన్నదిగనుండె
నామనసునందుఁ దిరిగెను నాల్గు జలధు
లేడు కులగిరుల్ దిక్కులు నెన్మిదియును 293

గీ॥ ఆవి కొఱప్రాణ మెప్పుడు పోవునంచుఁ
బక్షిజంబుకములు చూడ నక్షులకును
బరిచితంబైన వింధ్యపర్వతము తోఁచెఁ
గంధరాప్రస్థసానూత్సకములతోడ 294

గీ॥ అట్టిస్థితిలోనఁ దెలిసినయట్టిచోటు
ధైర్యమును దెచ్చెనన్నచో, ధైర్యమనెడు
దినుస దెట్టిదో నిజముగాఁ దెలియలేన
వచ్చెఁ గ్రమముగ నోపిక వచ్చెనాకు 295

మ॥ పరిగత్యంతర మేమికావలెఁ బునఃపక్షప్రరోహంబు శ
క్వరిగా దుప్పటిగాఁగఁ గల్గవలె భావంబిద్ది సైరించుకో
వెరవుం గానక పల్లటిల్లితిన యాశాస్యంబు నేరీతి సు
స్థిరమౌ నప్పుడొకంతటన్ స్మృతికి వచ్చెన్ మార్గ మార్షంబదిన్.

ఉ॥ నేనును మాజటాయువును నిత్యము వింధ్యగిరీంద్రదూరభూ
మీనిభృతేంద్రియుండయిన మిత్రవదాచరితున్ నిశాకరా
ఖ్యానుతు మౌనిరాజు చరణాంబుజదర్శనమాచరింతు మా
మౌని యొకండు నన్ను దయమన్నిన మన్నునటన్నకోర్కెమై 297

చ॥ ఎనుబదివేలయేండ్లయిన దిప్పటి కాముని నేనెఱింగి మౌ
నిని గనుకోర్కె శైలధరణిం బడి నూరక డొల్లుకొంచుఁ గ్రు
మ్మినదగు కత్తిగడ్డి ననిమీఁదుగ ఱాళ్లలు డొక్కలందుఁ గ్రు
చ్చినవగు సానుదేశములఁ జేరితి మౌని నివాసభూమికిన్. 298

ఉ॥ ఆ పొలిమేర చేరుకొనినంత సుగంధులు పిల్లగాలు లా
హా పువుఁదావిమొత్తముల నశ్వతరంబుల మీఁద వర్తకుల్
ప్రోపు సుగంధవస్తువులు పూనిచి యేగెడునట్లు వచ్చె నా
తాపసి యున్నచోట స్తిమితంబులు వాయువు లెప్పుడట్లుగై 299

గీ॥ పూవులేని రెమ్మ ముగ్గిన పండు లే
నట్టి కొమ్మ లేద యాశ్రమమున
నెడఁదఁ జెమ్మకాద ఋషినిల్చు నాసీను
యతఁడు మూటకట్టినట్టి కరుణ 300

మ॥ భగవంతుండు నిశాకరుండును జటాభారస్రవత్స్నాత వా
రిగ సర్వాంగసమార్ద్రమూర్తి వనధాత్రీజంతుసంతాన మొ

త్తుగ నల్వంకలఁ జుట్టిరా నచటికిం దోతెంచె భూతవ్రజా
నుగుఁడై వచ్చెడు కృత్తివాసనువలెన్ ధూఁటాడుచుం బాపముల్

మ॥ సృమరవ్యాఘ్రసరీసృపోగ్రమృగరాడృక్షంబులున్ బక్షులా
శ్రమముం జేరిన మౌనిరాజు విడి యిచ్చంబోయె నచ్చంపు బ్రే
మమునన్ నాదెస చూచి యప్పరమహంసస్వామి లో నేగి యం
త మరిన్ వచ్చెను స్వామిపాదములచెంతన్ మ్రొక్కి నేనుంచగా 302

మ॥ ఇది యేమీ మరి యిట్టులైతి వవి యేవీ తోంటి నీ ఱెక్కలుం
గదలున్ మావిచివుళ్లువోనియవి నిక్కం బీవు నీ తమ్ముఁడున్
బోదిగొన్బత్తిని వచ్చి నాపదములన్ మూర్ధంబునన్ మున్ను తాఁ
కుదు రీ వొక్కఁడ వేల వచ్చితివి నాకుం జెప్పుమీ సర్వమున్ 303

క॥ ఆతని పేరు జటాయువు
శాతగరుత్కుండు నీవు సంపాతివి కా
దా ! తమ్ముఁ డేమి యయ్యెను
ప్రీతమహావేగమాతరిశ్వులు మీఁకల్. 304

ఉ॥ వారముపైన నైనయది వాఁడును నీవును వచ్చి పక్షిసం
భారము మీరు దూరమగు పర్వతకానన దేశమేగిరో
కూరు బుభుక్ష నంచు ననుకొంటని వ్యాధి యెదేని కల్గెనో
యేరయినన్ శపించిరో యిదేమి విపక్షుఁడవైతి బోసగా. 305

మ॥ స్మయదూరుం డతఁ డంతప్రేమ యొలికింపన్ జూచి నానోట మా
టయు రాలేదు మఱిన్ మఱిం గనులవెంటన్ బాష్పముల్ వాగుగా
భయమై యిచ్చటిదాఁక వచ్చి వచియింపజాలనో యంచు ని
స్మయ మేపారగ నంత దేహ మపరిశ్రాంతమ్ముగా నొటయున్. 306

చ॥ ముని కనులందుఁ గన్నులను బూసిచి చెప్పితి నేను తమ్ముఁడున్
గనుకని స్పర్థపూని వడిగా మరియెత్తుగ మిన్నులందుఁ బో
వనువలె వాఁడో నేనో చనువాఁ డధికంబుగనంచు నిర్ణయిం
పనువలెనంచుఁ బోయితిమి మౌనివరేణ్యా వియత్కటాహమున్ 307

శా॥ కైలాసంబున మానిసంతతుల మున్ గాఁ బందెముం బెట్టి మా
యీ లావుం దుది నిర్ణయించుటకు సర్వేశున్ జగచ్చక్షునిన్
వాలాయంబును మధ్యవర్తియవు నేర్పాటొప్పఁగా మిన్నులన్
హేలం బట్టితి మెల్లచూపఱు త్రిధా హేళిభ్రమం బొందఁగన్. 308

అ శ్వ గ తి :—

ఇర్వుర మద్రిశిఖాగ్రము నేకపదోద్గతిగా
గర్వితపక్షబలంబునఁ గావడి మోసినటుల్
పర్వితి మాకసమందున భాస్కరు తేరున రెఁ
డర్వము లీతల వీడ్వడి యాఁజడిపోవునటుల్ 309

శ్యే ని :—

మిన్ను ఱెక్కలాగి మేలమాడుచున్
మున్ను దవ్వు నెల్ల మోహరించుచున్
నిన్ను నేను నేను నిన్నటంచు సం
పన్నమైన స్పర్ధవాక్కు లాడుచున్ 310

జ ల ధ ర మా ల :—

ఆకాశంబందున గనుదాక్షోదంబై
యే కోసల్ పోయితి మట నే దిక్కేదో
కాకుండన్ గన్నులు జతుకావర్ణంబై
యేకోనల్ తోఁచవు మది కేదో భీతిన్ 311

చ ం ద్ర వ ర్త్మ :—

ఉర్వియెల్ల నొకయుండవలె మహో
ఖర్వమూర్తి కనగాను వెలసెఁ దా
ముర్విఁ బెద్దనను లూఁచకొనియె నా
దూఁగొకాడలనఁ దోఁచె నచటికిన్. 312

మధ్యాక్కరలు :—

ఆకాశమందుండి పడిన నబ్ధిలో నవనిపైఁగాక
యాకాశమున నిల్చె యురక యల్లాడుచౌనేమొ యనఁగ
నాకిట్లు భూమియు పైన నలినబాంధవుఁడు సమాన
మై కానిపించెను భూమి యది యెంతొ యంతగా రవియు 313

అప్పటి భయ మింతయంతయని చెప్పనైనది కాక
యుప్పరం బూరకే మ్రింగునోయన్న యూహ కల్గినది
యప్పటిలోఁ బడి గ్రుక్కయాడక యంతమ్ము గనిన
గొప్పయే యిదియేమొ తెలిసికోరాని గుండెతో చావు 314

ప్రక్కవచ్చు జటాయు వొకని రాకచే బ్రతికియుంటి నను
నొక్కయూహ త్యజించి యేమియును లేద యుల్లంబునందు
తెక్క లాడించుచున్నాను ఋషిమహావృషభ! యాడించు
టక్కటా! తెలియదు నాకు ననుకొన్న నాశ్చర్య మిపుడు 315

ఇటు చూడగా జటాయువు నొకింతపక్కని లేని
పటుగరుద్యుగ్మంబు చచ్చుపడి జారిపడుచుండె మింటఁ
బటుతీక్ష్ణకరభానుపటలిచే వాని తెక్కలును
చిటమటలాడుచున్నవియు శిఖిధూమ చిహ్నంబుగాఁగ 316

క॥ అప్పుడు నాతెక్కలున్
నిప్పంటుకొనంగవలయునేకద యంచుం
జొప్ప డనే లే దూహయుఁ
తప్పక రక్షించవలయుఁ దమ్మునినంచున్. 317

మ॥ అతఁడే వంపులు వంగుచుంబడెనొ తా నాకాశమందుండి ప
క్షతి కానంపులు వంచుకొంచును గరుచ్ఛాయాపరిత్రాణసం
గతిగా నాతనివెంటనే దిగితి నక్కంజాప్తతైక్ష్ణ్యంబు త
ప్పితి మంతన్ స్మృతిలేకనే పడితిఁ బృథ్వీభృద్దరీభూమిపై 318

ఉ॥ తాను జటాయువుం బడెడి ధారుణి చూచుచు నంతలో జన
స్థానమటంచుఁ దోఁచినది సంస్మృతిపోయెను నాకు నంతటన్
గానఁగరాని యేమి మెలికల్ తనుపిండము కాంచియున్నదో
నేనిట వింధ్యశైలధరణిం బడినాడను సొమ్మసిల్లుచున్ 319

క॥ లేదు వియత్సామ్రాజ్యము
లేదిఁకఁ దమ్ముని గనంగ లేవు గురుత్తుల్
మీ దర్శనంబు నైనది
యేదో పుణ్యమున సెలవునిప్పింపఁగదే 320

గీ॥ ఒక ప్రపాతంబునన్ బడి యుసురులింక
వీడెదను సెలవిప్పింపవే యనంగ
నీకు ఱెక్కలుకావలె నిజము మఱల
నేల మొగమోటపడియెద వింతచెప్పి 321

శా॥ నీకున్ ఱెక్కలొసంగఁ గల్గుదునుగానీ యీయఁగానొల్ల నీ
వేకార్యంబు ఘటింప దైవమది నిన్నీరీతిగాఁ జేసె నీ
వాకార్యంబును నిర్వహింపవలె నీ వందే వసింపన్ వలెం
గా కింకొక్కవిధాన నెట్టులగు నక్కార్యంబు నాలింపుమీ 322

శా॥ ఏ సూర్యుండు భవద్గురుద్వయము నిష్ఠేర్చెన్ మహార్చిర్వ్రతుం
డా సూర్యాన్వయ రాజసంతతి యయోధ్యాధీశు లాశాంతరా
భ్యాసస్వచ్ఛయశఃపరిబంధులును బాహాశౌర్యకుల్యాగ్రధా
రాసంపూరిత దేవతానగరసౌరశ్రీతటాకంబులున్ 323

ఉ॥ వారల నేటి భూమిపతి పంక్తిరథుండు కలంగి పుత్త్రికుల్
లేరని యశ్వమేధ విమలీకృతపాపపథుండు నల్వురన్
గూరిమి పుత్త్రులం ధరణిగోపనబాహులఁ గాంచు వారిలో
శ్రీరఘురాముఁ డొక్కఁడు సీతయు నాతని ధర్మపత్నియై 324

చ॥ ఒక పినతల్లిమాటపయి నుర్వి త్యజించి రఘూద్వహుండు పా
యక ననసంతతిన్ వటపయఃపరిబద్ధజటానిటాలుఁడై

సకియగు సీతతోడ ననుజన్ముఁడు లక్ష్మణుతోడ వచ్చునం
తకు నుత దక్షిణాముని వితానవితానకృశానుదీప్తిగా 325

కII నా వెనుకతట్టు లంకను
దీవింగల రావణుండు దీప్తభుజుండున్
దేవానధిగమ్యుఁడు దో
రావిష్కృతయామ్యదండుఁ డవనీజాతన్ 326

చII ప్రళయపినాకివోని రఘురాముని భార్యను దొంగిలించుఁ గం
దళమున నిప్పుకట్టుకొని తాను వణిక్కునిబోలె ఘోరమ
ర్దళరవుఁ డేగి లంక కొసదద్దడమందునఁ బెట్టి సీత సం
బళమును భద్రపెట్టినటు బమ్మెరఁ గాలుని కాలిబంటుగా 427

చII పృథులములైన భక్ష్యములు పేణులు లడ్డులు ముందుఁ బెట్టి య
ప్పృథివితనూజచేతఁ దినిపింపఁగఁ జచ్చినచావగున్ మనో
వ్యథబడి చెట్టరక్కసికి నామె భుజింపదు చిక్కిపోదు న
వ్విధము నెఱుంగలేక నలభీకృతదృష్టి నిశాచరుండు కాన్ 328

గీII చిత్రమన్నమ్ము తెచ్చి ప్రాచీనబర్హి
అద్ది పరమాన్న మమృతప్రఖ్యంబు నముచి
సూదనైకభోగ్యంబు భాసురసురాళి
దుర్లభము సీతకొఱకు ముందు నిడిపోవు 329

చII తొలికబళంబు తీసి యిది తోయజనేత్రులు రామలక్ష్మణుల్
ప్రళయసముద్రశౌర్యులది భాగమటంచును బెట్టి సీత వా
రలు జనకాత్మజాత యిడు ప్రాశనవేళసుఁ జేతిలో బలా
బల లిడు తృప్తిమించిన ప్రభం గనుచుందురు కానలందునన్ 330

మII గిరిసంకాశులు సూర్యతేజులు భుజాక్రీడామహాశాను లు
ర్వరయం దేగుచు వత్తురిం దననిజాపర్త్యేషణావ్యగ్రు లు
ద్ధురులై వానరయూథనాథులు దిసంతుల్ కొట్టుకొం చీవు మ
త్పరమార్థోక్తులు వారికిం దెలుపుమీ పాలించు చీకొండపై 331

మ॥ సరిగా వారిట కేగుదెంచునెడఁ బక్షివ్యష్టి నీవున్న నే
గిరిపై నుందువొ యేమహాంబునిధిపైఁ గ్రీడింతొ నీ విందె వా
నరయూథంబు ప్రతీక్షసేయుమ నిరంతం బుండుమంచున్ నిశా
కరుఁ డాజ్ఞంబొనరించె నేను నది తెక్కల్లేక పాలించుదున్ 332

క॥ సురలకు మునులకు బ్రాహ్మణ
వరులకు నభివాంఛనీయబంధురకార్యం
బురవడిఁ జేయఁగ నేలా
గురుత్ప్రరోహాభిలాష గలుగును నాకున్ 333

క॥ మరియును ముని చెప్పెను మీ
రరుదెంచినయంత మీద నాశాస్యంబున్
విరచించినయంతటిలో
గరుదుద్గమనంబు నాకుఁ గలుగునటంచున్ 334

మ॥ ఝటి చెప్పెన్, మరి దేవదానవమహాసంగ్రామముం జూచి త
చ్చట నిచ్చోటను రామరావణమహాసంగ్రామముం జూతు వ
క్కట నాకుండగ వీలులేద యదికాకన్ జూడ వాంఛింప నే
నిటలాక్షాభుని రాము దైత్యశమనోన్నిష్టాసమాఘాతునిన్ 335

ఉ॥ దింపగరాని యీ బరువు దీర్ఘము పుక్కిటఁ మోసికొంచు నై
లింపము కార్యభారమిది లేఖ్యముగా రసనాగ్రవర్తిగా
దింపితి నేటి కీ బరువు దెప్పరమైనది సందయేండ్లుగాఁ
గంపితచిత్తవృత్తి యది కాంచినయంతట మిమ్ముఁ బాసితిన్ 366

మ॥ ముని మీ రెవరు చూడలే దతినిలింపున్ దృష్టతత్వార్థద
ర్శను మిమ్మందఱ నేను చూచితి ఋషిస్తంబేరముం డెట్లు చె
ప్పెనో యట్లా రఘురామమూర్తి సుఖియై పెంపారునే జానకీ
మనుఁడై వాడకయుండెనే యతితరమ్లానాగ్రపత్రచ్ఛవిన్ 337

వ॥ మునియు నంతఁ దన యాశ్రమాంతరం బేగఁగా నేనును డొల్లు
కొంచు నెత్తైన తాలు ముక్కుతో నదిమిపట్టి యింతటి కళేబరంబు

పైకెగచికొంచు నీకొండ యెక్కి యీకందరంబును విడువక యిట్లే
కూర్చుంటిని 338

ఉ॥ మీరరుదెంతురో మరియు మీరరుదెంచరొ యెన్నినాళ్లకున్
మీరరుదెంతురో యదియు నేలని చెప్పఁడు మౌని యీనిరా
ధారపుటాశచేఁ గుతకుతల్పడి కాలము వెళ్లఁబుచ్చ నా
కౌర! వివస్వదస్త ముదయంబు ప్రతీక్షకు నిప్పువెట్టుచున్ 339

మ॥ ప్రతిచూడామణి మౌని యంతట మహాప్రస్థానముం బొంది స్వ
ర్గతిగాంచెన్ వనవాసి జంతుతతి వారం బన్నమున్ నీళ్లు ము
ట్టితిమన్నట్టిది లేక బెగ్గడిలె వోఢృజ్యేష్ఠుఁడై యేను త
ప్పితి నామౌనికి నెట్టులా ముని మహాభీష్టం బటం బంజితిన్ 340

ఉ॥ ఈ నెలనాళ్లలోఁ దెలిసె నెయ్యది మీకును నొక్క కార్యముం
బూనినగుండెలో వగపుపొందుటకంటెను నిప్పుతింట మే
లానతశత్రు వా దశరథావనినాయకుఁ డశ్వమేధి గాఁ
బూనెనొ లేదొ దీక్ష యొకపుట్టనివార్తగఁ దల్లడిల్లుచున్ 341

మ॥ పదియో తొమ్మిదియో నెలల్ మును సుపార్శ్వప్రోధనిర్వాంతమ
య్యది వార్తన్ వినుదాఁక నిశ్చయము లేనైతిన్ మరింగాక పో
యెద నాపుత్త్రుఁడు వచ్చి చెప్పినది యాయెన్ మేలు కీడైన రెం
టిటి మౌనీంద్రుఁడు చూచినట్టులుగ నాడెన్ జేసె రక్షస్సదిన్

సీ॥ అన్నము పూట లేకున్నఁ జత్తునయేమి
దైతేయువెంబడిఁ దఱిమియేల
గుండెనెత్తురు చూడకుండ వచ్చితి నీవు
తెచ్చితివిని నప్రతిష్ఠ నాకు

నాగర్భమునఁ బుట్టినావా! నిజంబుగ
వైనతేయునిదైన వంశమెల్ల
నీమూలమున నపనిందపాలైనది
యని లక్ష తిట్టితినయ్యా! కొడుకు

నెంత గుబ్బిసలాడిపోయితి నేడందఁ
ప్రాణమిత్రుని దశరథు నన్నుఁగుబిడ్డ
యిట్టి దుస్థితి పొందఁగా నేమిచేయ
లేకపోయితి ఛితకదళీవిధాన 343

సీ॥ మరియు విచారింప మా జటాయువుఁబోలెఁ
గసిమసంగియయుండుఁగాదె యసుర
కొడుకు వాఁడటులైనఁ గూడు లేకిచ్చట
నేఁ జచ్చియుందు మనీషిలోక
సార్వభౌముని మునీశ్వరునాజ్ఞపాలించు
టని యెట్టులౌనని యాశ్వసిల్లి
కపియూథనాథు లింకను రార యంచును
నెలలు దినములు గణించుకొంచు
మెట్టఁ బ్రాయోపవిష్టుల మిమ్ముఁ జూచి
వట్టికోఁతులేమోయని పట్టిచూడ
నట్టులాడితి ననుకొన్న యట్టులైతి
రిట్టులంబైన కార్యంబు నినుమడింప 344

వ॥ అనుచుండ వానరయూథనాథుల యుత్సాహంబు శతసహస్రాధిక గుణంబై సంపాతి గాంభీర్యంబు గాంభీర్యంబంత పౌరుషంబు పౌరుషం బంత విజ్ఞానంబు విజ్ఞానంబంత మెత్తనిగుండెయుఁ జూచి మన్వంతర జీవుల స్వరూపం బిట్లుండుననుకొంచు ఋషిపరమేశ్వరప్రాగభిజ్ఞాత రామ కార్యసిద్ధిలోఁ దనకార్యసిద్ధి యున్నదనుకొంచుచుండ 345

మ॥ ఒకయేడాదియొ సంగృహీతమయి యే యొక్కండుగానో నిమే
షకాలంబునఁ గుంచుకొన్నటుల వృక్షశ్రేణి కాంతారకా
మకమహా బహ్వృతుకాలికంబు పరిణామం బొక్కఁ డేకాక నిమే
షకాలంబునఁ గుంచుకొన్నటుల దృక్కాలూక ముద్భిన్నమై 346

క॥ సంపాతికిఁ బక్షంబులు
శంపాతీవ్రంబుగఁ గా జనుదెంచుటయు౯

( 40 )

సంపాతికి సంతోషము

శంపాతిత్రంబుగాఁగ జనుదెంచుటయుఁ 347

చ॥ కనుగొనుచున్న వానరులఁ గన్గొనుచుఁ ఖగనాయకుండు న
మ్మునివచియించె నాయువు ముంగిలి నేస్తు నిశాకరుండు న
మ్మునివచియించె ఱెక్కలును మొల్చిన వమ్మునిచెప్పినట్లు మీ
రును జనుదెంచినారలు గరుత్తులునుం జనుదెంచెఁ జూడుడీ 348

క॥ పది పర్వతముల మిగిలి నెడు
నది యుత్సాహంబు గలుగు నాలోఁ దొల్లిం
టిది సత్త్వమ్మును వచ్చిన
యది మఱి యబ్బురముకావె యమ్మునిమాటల్ 349

వ॥ మత్పక్షత్యారోహణంబు సేయుఁ డింక నాలస్యంబేలఁ మిమ్ము లంకా
పురికిఁ జేర్చెద ననిన నంగదుండు సంపాతికి దోయిలించి తాతా!
నీవు మేరుబలశాలివయినను మేము నసంఖ్యాకులము నీ ఱెక్కల
యందు స్థలముచాలదు. పైగా మేమొక్కొకళ్లము నీదయవలనఁ
బర్వతాభులము మేము సముద్రము లంఘింపఁగలము. రావణుని
పదిజుట్లుపట్టికట్టి తేగల మన్న సంపాతి మునిమాట చేసితి నింక
మీ యిష్టము నేనును ప్రస్రవణగిరి గగనలంబినై మాశ్రీరామచం
ద్రుని గాంచిపోదునని వెడలిపోవ 350

సీ॥ కపిచమూహీంహీం నికామ హాసవిదీర్ణ
దంతకాంతిచ్ఛటాతాండవములు
కపినాయకాల్పలంఘనసమాక్లుప్తోరు
జంఘావిఘట్టనాస్ఫాలనములు
కపిరాజతనుపార్శ్వకండూత్యపాకర
ణోగ్రవక్రనఖాగ్రనిగ్రహములు
కపినాథకంఠనిర్గతతర్జనాభీల
ఘుర్ఘురారావసంఘోషణములు
అగ్రతరుశాఖికాడోలికాత్తవేగ
లంబమానాన్యశాఖికాలంఘములు

జనిత సంతోష వల్గనచాలనములు
వింధ్యగిరి గుహానిస్వనాభీలమయ్యె 351

సీ॥ లాంగూలపరితాడనాంగారనిర్వాము
ద్భంగిశిలాకోణభాసురములు
సంజాతకోపదృక్కంజాతనిగ్రహా
న్మ్రాంజావనీసముస్మాలకములు
శింజానమధుకరీయుంజానమదభావ
గంజారవత్కంఠకాహాళములు
సంఘూతవిచలితాజంఘాలపటుమేండ
శింఘాణవర్ధశాత్సీత్కృతములు
ధరణిలంఘితశైలాభ దర్దురములు
నరణివద్ఘోరనికష శౌర్యాగ్నికములు
జనిత సంతోష వల్గనచాలనములు
కపిమహాసేన లదిరిభాగమున నరిగె 352

గీ॥ ప్రవిసరద్ఘోరవార్బంధవాగురా వి
లగ్నతిమితిమింగిలవిగళన్మహోగ్ర
నాదమేదురితాకాశనాళమైన
వారిరాశిని జూచెను ప్లవగచమువు 353

భుజంగ విజృంభిత:—

పాతాళాయాతాహిశ్రేణీబహుళకుటిలగమనవిభావనాద్భుతమాలికా
నీతాన్యోన్యాపాదీర్ఘాశ్లేషా నితరజలచరనిచయ నీలవర్ణ సితచ్ఛవిన్
స్రోతస్స్రోతస్స్రావాంతవ్యాకీర్ణాంబు త్స్ఫురితదళితసికతకిసలసోమనల్కఁతరూజ్జ్వలున్
ద్రేతాగారాంతక్రీడా భూమాంతిపథచలితసురగణ దివ్యభూషణరంజకున్

అష్టమూర్తి: —

నాకస్పృగ్వ్యోధుతి నేర్చున్ వాకనుహాసా మూగున్ నగసుహార్కృత్తిజోరగున్
బాకాదివరిముఖసాంద్ర ప్రణతిగంభీర రేఖా ప్రవిభక్తాద్భుత తేజః

ప్రాకారాంతరనిగూఢ పరిచలనాభోగధర్మ ప్రసరణాంచితమూర్తిన్
లోకాలోకకుధరాంభోలులితపర్యాయమూర్తిన్ లురసమంధరమూర్తిన్

లయగ్రాహి:—

స్వర్ఘటితవీచిచయ దుర్ఘటితనిష్కరుణ
దోర్ఘటితజంతుతతి నిర్ఘృణజలౌఘాం
తర్ఘృణమణీనిచయ దుర్ఘణమహోచ్ఛవి సు
దీర్ఘపరిణాహక వపుర్ఘనమహోర్మిన్
దుర్ఘటకసంతరణ దుర్ఘటికలందు సువి
దీర్ఘభుజతాడనము ఘుర్ఘురరవంబుల్
స్వర్ఘటనచేసెడు ననర్ఘమణివాంఛ యది
దుర్ఘటము వార్ధిహరి నిర్ఘృణునియందున్ 356

వరాహము:—

దిక్సీమాంతకమిళ ధిమితధిమిత ధిమకధిమక పటుతరమృదంగోద్యత్
స్రక్సంరావముల నటనచతురశఫరశకునినిచయకృతసాహాయ్యున్
ప్రాక్సృష్టిన్ వెలుచు జలజభవకృతనుతిభరిత సవనఘటనానేహః
స్రుక్సందీపిత మహితచరునిహితనుతరుచిర మహిమహాధాయ్యున్ 357

స్రగ్ధర:—

సంత్రస్తప్రాణిలోక జ్వలితజలమహాచండు మైనాకభూభృత్
సంత్రాణోపేతకార్యచ్ఛదన వదనవిచ్ఛాయగంభీరభావున్
సంత్రైవిద్యప్రశస్తక్షితిరహిత సమజ్యామహోద్యేత్సామర్
జ్యంత్రాయాతపరికీర్ణోన్మఘురరవ మహామండలీభూతరావున్ 358

పద్మనాభము:—

హేలాజగదూపిసర్వేశ్వరాముక్త హీరావళీప్రౌఢహారాళిభూషా
పాలంబికాయుక్తముక్తావళీ హేమగ్రైవేయక ప్రోజ్జ్వలత్పారితధ్యా
మాలాచలద్గుచ్ఛగుచ్ఛార్ధనక్షత్రమాలా చకత్పత్త్రిపాశ్యాసమంచ
ద్వ్యాలోలసత్కర్ణికాకుండలానేకపస్తుచ్ఛటాన్తైష్కికాకారదివ్యున్

సీ॥ భోగవతీఝరాంబువులు క్షేత్రాజీవ
లాసారముగ గూడ వేసినట్లు
ఫణాళిరత్నచ్ఛటా మహానీయచక్షుశ్శ్రీ
వశ్చమూతతి దండువచ్చినట్లు
రత్నసంగ్రహమతిం బ్రస్ఫోటనములతోఁ
జిల్లు బస్తకమును జెరుగునట్లు
జగదంకురములు విశ్లథధవళక్షుదళ భా
సురవనంబులు తలసూపునట్లు

నాగలోక మహోగ్రవానరచమువులు
తమ్ముఁ గని తర్జనాభీలదంతదర్శ
నోగ్రముగఁ దూకఁగాఁ బోవుచున్నయట్లు
నచ్చెరువు భీతిఁ గొల్పెడు యామ్యవార్థి 360

గీ॥ దేవతలు రాక్షసులును మథించినాఁడు
పూర్వమెపుడో యాభయ మింకఁ బోవలేదు
తనకు నవిరతకంపునకును జగమ్ము
భయముపెట్టు దురధికారి వార్ధిరాజు 361

గీ॥ ఎచటనైనను కట్టినసిచయ మనిల
ధూతమై చెంగులవి మేనఁ దొలఁగిపోవు
నవనిదేవి యీకట్టినయట్టి బట్ట
యామె దేహాంచలంబుల హత్తుకొనెడు 362

గీ॥ అయిదుఋతువులయందు వర్షాగమంబు
కావలయు నల్ల నాగలోకంబునందు
నచట వర్షించు స్తనయిత్నువైన మేఘ
పటలి యుపరిభాగంబ యీ వార్ధిరాజు 363

వ॥ ప్రథమదర్శనభయంబు తీరి యాశ్చర్యంబునఁ జూచుచు సంతరణ
భావంబు గదుర నిస్పృహులగుచు వివర్ణులై గ్రుక్కిళ్లు మ్రింగుచు

విచారించి విచారించి విషాదంబు భజించి యచటఁ బ్రాయోప
వేశంబు మేలైనది సంపాతివాక్యశ్రుతోత్సాహంబు వృథాయని కటి
మస్తక విలోచనవిన్యస్తహస్తులై యున్న వానరవీరులం గని హనూ
మత్సమాన ప్రతిభుఁడైన యంగదుం డిట్లనియె. 364

గీ॥ జడము దుఃఖంబు నతితరోత్సాహవృత్తి
చేతనత్వంబు నుత్సాహసిద్ధి ప్రాణ
వత్త్వమును మృత్యువు విషాదభావ మీ వి
వేకమున మనంగవలయు వీరచయము 365

శా॥ ఈ యంభోధి తరింప లేమనిచో నిందేల రానయ్యెడిన్
బ్రాయోపాసీనత నందె యుండెదము సంపాతిక్షుధాపూర్తిగా
శ్రీయోదూత నిశాకరుండు వచియించెన్ దేని నయ్యర్థమం
దా యర్థంబును సంఘటిల్లినది శిష్టార్థంబు కాకుండునే 366

చ॥ ఉదధియు నొక్క యీదిశనె యున్నదొ తక్కిన మూఁడుదిక్కులం
దుదధులు పెక్కులున్నయవి యూర్జితబాహులు తద్దిశాగతుల్
త్రిదివసముల్ కపీంద్రు లరుదేరుదు రింతకె యన్నిఁగాంచి యా
మ్యదిశను వచ్చినట్టి మనయందున యున్నది దోషమంతయున్ 367

చ॥ కవియు విషాదమై యకృతకార్యుల మేగినఁ జండశాసనుం
డవు పినతండ్రిచే బ్రతుకుటన్నది యుండదు నాత్మహత్యచేఁ
గవిసెడు రౌరవాదినరకంబు ఫలంబగు వీరజాతికిన్
దవిలిన కార్యమార్గమునఁ దాఁకుట చచ్చియు స్వర్గహేతువే 368

ఉ॥ ఈదెస సీతయున్కి నదియెంతొ యెఱుంగును వానరేశ్వరుం
డీదెస నామె యున్నదని యే వచియించె జటాయువన్న మి
మ్మీదెస కన్పె రా జుదధి యిచ్చట నున్నదటంచుఁ జెప్పెనే
కాదె పయోధితారకునిఁ గానక యే వచియించెనందురా 369

మ॥ తనయూహల్ మరి తా నెఱుంగుఁ గపిరాడ్ధాత్రీశుఁ డీయింతమం
దిని తత్కార్యరచండవా స్తరణసందీప్తోరు బాహానిటం

ధను లెవ్వారో యెఱుంగకే పనిచేనా తచ్ఛౌర్యరేఖాబ్ధి లిం
దున వారెవ్వరో వారివారిఁ గనుఁగొందున్ నేన యేలా న్వ్యథల్

క॥ ఇతరదిశాపర్యేషణ
కతని నతని నొకని నొకని సంపించెఁ జమూ
పతులను బన్నిద్దఱ నీ
క్షితికిం బంపించె నేమి చిత్తము కలఁదో 371

ఉ॥ అందఱు మాకుఁ గాదనినయట్టుల నిట్టులఁ గూరుచుండఁగాఁ
గ్రందగు వేళ వాఁడు యువరాజుగదా మనకేలయంచు నా
కెందును దప్పదిందు మఱి యెవ్వరో నిర్ణయమాచరించెదర్
పందురనేల ముంగిటికివచ్చిన సిద్ధిని స్వీకరింపకన్ 372

మ॥ పగటంజూచితి మీ పయోనిధి నిశాబాంధుర్య మెట్లుండునో
తగ నీరెండు నెఱింగి పోవలయుఁగాదా ! వార్ధిపైఁ బోవ నెం
చగ నేదోయొక వందయామడలు నుజ్జాయింపులె క్కేపదో
మిగులంగల్గిన సంతమించి చసలేమిన్ వాఁడొకం డేమగున్ 373

శా॥ అన్యాధారములేని యీయిరులు ఘోరాంభోధినైల్యచ్ఛటా
జన్యంబుల్ జలజాంగనాప్రియజగచ్చక్షుశ్ఛటావాహినీ
జన్యప్రాప్తనిశాజయంబులు దిదృక్షామూర్తిమద్విఘ్నముల్
పన్యేభంబులనన్ దటీఘవళవార్వ్యాజోగ్రదంతంబులై 374

వ॥ అనుచున్న యంగదుని నొసంటఁ బొద్దుపొడిచిన నాంజనేయాదుల
ప్రాతఃకాలిక జపతపఃకర్మానుతైన యనంతరంబున శరవణభవాది
యోధసైన్యాగ్రయాయియయిన పురుహూతునింబోలె నొప్పారి
వాలిపుత్త్రుఁ డిట్లనియె. 375

గీ॥ ఈ మహాకార్యమిది ఘటియిల్లె మనకు
నన్యులకు శతయోజనాయత మహాబ్ధి
నురుకగా దుస్తరంబు దోరూపుజనన
హృతమహానిలులైనవారికివి గాక 376

ఉ॥ ఈచము వెల్లరుం దిరిగి యింటికి నేగుచు నాలుబిడ్డలన్
జూచుకొనం బొనర్పఁగల సుందరమూర్తి యెవండు రామకా
ర్యాచరణంబునందుఁ బ్రభువైచను నెవ్వఁడు వార్ధిమీఁద జం
ఘాచణుఁ డెవ్వఁ డింత దుమకంగలవాఁడు గరుత్మదాభుఁడై 377

చ॥ తరణి వియత్పదంబునను దా ననిలుండు దిశాంతరంబులం
దరిగెడునట్లు దక్షిణదిశాంబుధి నే మహనీయమూర్తి యు
ద్ధురతర వేగపాతమున దూఁకఁగజాలినవాఁడు వానరే
శ్వరపటుకోపభాక్పటుఁలశాసనభీతిని నిస్తరింపఁగా 378

చ॥ క్షితితనయానభిజ్ఞతను శ్రీరఘురామధనుర్వినిర్గమత్
శితశరవహ్నిమాలికలఁచేత త్రిలోకము పేర్చి భస్మసా
త్కృతముగఁ గాకయుండగ నురీకృతసత్కరుణాబ్ధి వేఁడు దో
ర్ధృతపటువేగలంఘన గరుద్వినతాసుత నూత్నమూర్తియా. 379

మ॥ నను లంఘించెడు వీఁడటన్న యభిమానం బబ్ధి రాజూనసుం
డను దల్లంఘనతీవ్రకార్య మదియున్ మర్యాదగాఁ జూచుకో
గను దానెవ్వఁడు సర్వధర్మమయు మాకారంబుగా నూరు యో
జనముల్ దాఁటెడు దక్షిణాంబుధి శిరశ్చామీకరాకల్పమై 380

మ॥ అనినన్ గుండెలు చాల కే కపియు మాటాడంగ నుంకించకుం
డినఁ దా రేయుఁడు కార్యమింత తలపైనిం గూరుచుండంగఁ బ
ల్కనురాకుండిన నెట్టు లిట్టిపగిదిం గాకున్న నింకొక్కరీ
తిని బ్రశ్నించెద నంచుఁ గన్నుగవ సందీపించు నుత్సాహమై 381

గీ॥ ఎవ్వరెవ్వ రెంతయెంత దవ్వను బోవఁ
గలరొ వార్ధిమీఁదఁ దెలియవలయు
వారువారు చెప్పవలయు నాకిప్పుడు
కార్యవశతఁ జెప్పఁగడగు డనిన 382

వ॥ గజగవాక్షులు దశవింశతులు గవయుండు ముప్పది శరభగంధమా
దనులు చత్వారింశ త్పంచాశద్యోజనంబులు మైందద్వివిదులు షష్టి

సప్తతులు సుషేణుం డెన్బదియు యోజనంబులు గమింపసమర్థుల
మని చెప్పి యూరకుండిన వృద్ధతముండగు నన జాంబవంతుం డిట్లనియె.

ఉ॥ తొంబదియైన యామడలు దూఁకెదనంచుఁ దలంతుఁ బూర్వకా
లంబునమాట యేఁటికి బలంబున వేగమునందుఁ దొల్లి న
న్నుం బురుడించువానిని గనుంగొనలేరును బెద్దవాఁడనై
తిం బహుకాల మేగినయదిన్ జవసత్వము లింతతగ్గగా 384

కం॥ పదిపది తక్కువగాఁ జె
ప్పెదరు సుషేణాదు లవియు వెస నాచను తొం
బదియును నొక్కటియే కా
ర్యదశోనము లెన్నియైన నవి నిష్ఫలముల్ 385

శా॥ పైకింజూచిన రామకార్యముగఁ గన్పట్టున్ గపివ్రాతపేం
లాకృత్యంబుగఁ దోచవచ్చు మదిఁబోలంజూచినన్ ధర్మవే
లాకైదర్యము సర్వపక్షిమృగమాలాభోగ్యమున్ ముక్తిరే
ఖాకళ్యాణపథంబు సర్వానుమనఃకాండాభిసంస్పృష్టమున్. 386

గీ॥ ఒక్క స్త్రీ యొక్క పురుషుఁ డహో! యనాది
పథమ యిది దీనియందు వివక్ష లేదు
చెఱసగంబుగ మేనొండు చెందియున్న
యీశ్వరాకారమునకు నా యేడికోళ్లు 387

మ॥ జగమున్ విఘ్నహేతుకోహలను విష్టబ్ధంబు గావించు జీ
వగణంబుల్ పరివహింపకుండను నిలింపప్రత్నభావంబు జా
రగనీకుండను ధర్మదేవతలు సంరక్షింతురిగాతన్ మమున్
బగదీర్పంగఁ బరాంగనామతి మహాపాయంబు కల్గింపకన్ 388

ఉ॥ మున్ను త్రివిక్రముం డుఱిమి మూఁడుజగంబులు మేననిండ నేఁ
దన్నిగమాంతమూర్తికిఁ బ్రదక్షిణముల్ పొనరించినాడఁ గా

లు న్నిలుపన్ మహాజవనలోలత నట్టిడ నేను రామకా
ర్యోన్నయనంబువేళఁ బదియుంగొ అయ్యెతిని కాలమెట్టిదో 389

కII వేల్పులకు మృతియె కల్గున
యల్పులకుం జరయుఁ గల్గు నవి యెన్నిమహా
కల్పములు బ్రతికిరైన న
నల్పం బీధర్మబుద్ధి యది రక్షించున్ 390

కII ఒక్కఁడ నేనిక్లాటను
దక్కవ కారాదు సముదితప్రభుకార్యం
బిక్కడిలోకము నానా
దిక్కంతన వార్ధితరణ దివ్యంబగుతన్. 391

వII అనిన నంగదుం డీనందయోజనంబులు నేఁ బోవఁగలను గాని తిరిగి
రాలే నన్న భయమున్నది యేమి చేయుదుననిన జాంబవంతుం
డిట్లనియె. 392

శాII చాలుంజాలును నే నెఱుంగుదును నీ శక్తిన్ శతంబంచు నే
లా లక్షైన మరిం బదైనఁ జననేలా నీవు మా స్వామివై
పోలన్ ప్రేష్యుల మేము ప్రేషయిత వీవున్ నీవు పంపింతువున్
మాలో నెవ్వఁడొ సేయు స్వామికృతియున్ మన్నించ కెట్లొప్పెడున్

ఉII స్వామికళత్ర మెల్లపుడు సైన్యచయంబున కీవు లేక మే
మేమియుఁ జేయఁజాలము మహీయసుఁ డీవును స్వామిభావర
క్షామహితాబ్ధివై నిలువ సర్వపయోధులు జానుదఘ్నకుల్
గా మసలన్ మఱేంతదనుకన్ ప్రతిపాల్యుఁడ వీవు మాకిటన్. 394

కII గురుఁడవు గురుపుత్త్రుండవు
పరమాధారమవు మాకుఁ బ్రతిపాల్యుఁడవున్
భరణముగ మూలమే చెడఁ
దరువు కిసాలయపిశంగదళఫల మగునే 395

వ॥ నిన్నాశ్రయించి మా బుద్ధివిక్రమములు ఫలించు నిన్నాశ్రయించి
మే మర్థసాధకుల మగుదుము నిన్నాశ్రయించి జగంబులు నడచుచున్న
వన నంగదుండు హనుమంతునివంకఁ గాంచి జాంబవంతునితో
నిట్లనియె 396

చ॥ అవు నిది నేను చేయనిది యన్యులు చేయరు చేయకున్న నే
మవు రఘురామకార్యము నృఘాంగదహస్తవిలగ్నయత్నమై
వివర మెఱుంగఁ బ్రాయ ముపవేశనమే మరలన్ బొనర్పగా
నవు విపులాగ్రహాగ్రహావిహారుఁ గపిప్రభుఁ జేసుటెట్లగున్ 397

శా॥ ఏనా ! రాజునుగాదు కాదనుటలే దీ సంధిలోనుంటిఁ బో
నైనం జూతును వచ్చు మాట యది వే అన్నన్ భవద్వాక్యసం
ధానం బ్టిలనున్న దింక నెవరో తన్నిర్ణయం బీవ సం
ధానింపన్ వలె నన్నుఁ బ్రేషయితయున్నన్ బ్రేష్యుఁడన్నన్ సరే

మ॥ శితధీకుల్ శ్రితబాహు లందఱును దూష్ణీంమగ్నులైయున్న ధి
క్కృతసర్వారిచమూనిబంధనుఁడు సుగ్రీవుండు నా తండ్రి నన్
బతిగాఁగం బొనరించి పంపిన చమూభారంబు నానేర్చు ప
ద్ధతిగాఁ జేసెదఁ జేయుచున్ జలధిమధ్యంబందు నేమైనను. 399

గీ॥ అదియు సుగ్రీవుఁడేమొ నన్నధిపతిగను
జేసి పంపించనే లేదు చిత్తములను
మీరె యనుకొనుచుండిరి మొమ్మెరైనఁ
గనులు దివ్వెయటం చూహకలిగినట్లు 400

వ॥ అనిన జాంబవంతుండు నేను సాధించెద నీవెందు కూరకుండుమని
మాటాడకుండ దూరముగాఁబోయి కూర్చున్న హనుమంతుని
సమీపించి విషణ్ణమైన వానరసేనఁజూపించి యిట్లనియె 401

క॥ నీవొకఁడవు కాకుండగ
నీవానరసేన దుఃఖ మెవ్వఁడు తీర్చున్

నీవేమొ పట్టనట్టుల
భావించెదు మూఁగనోము పట్టినయట్టుల్ 402

శా॥ నీకున్ భక్తుఁడు రాజు నంగదుఁడు వానిన్ నీవు మన్నింపనుం
గైకోనన్ వలయున్ భవత్ప్రతిభ యాకాంక్షించి కూర్చుండె నీ
వేకాంతంబునఁ గూరుచుంటి విట నేఁడీ రామకార్యంబు బా
హాకుంఠీకృతవార్ధి ! వార్ధితటమం దాందోళితంబయ్యెడిన్ 403

శా॥ ఈ నిన్ మించరు సూర్యసూతియునుగానీ ! రామసౌమిత్రులుం
గానీ శౌర్యమునన్ బలంబునను వేగంబందుఁ బాండిత్యమం
దీ నీ జన్మయె వేదశాస్త్రపరిషద్దేలామనోజ్ఞావతా
రానూనప్రతిభామయంబగుఁ గపివ్యాజాకృతీ ! మారుతీ 404

వ॥ అనిన సర్వసేనాపతులును సర్వవానరచమువును నిర్నిమేషదృష్టి శ్రీ
హనుమంతుం గాంచుచుండ జాంబవంతుం డిట్లనియె 405

ఉ॥ దండితదందశూకసముదాయుఁ డనంతసఖుండు పేర్చి బ్ర
హ్మాండములెల్ల టెక్కెకవయందునఁ దాల్చు నరిష్టనేమి పు
త్రుండగు వైనతేయుఁ డొకరుండు గరుత్మదభిఖ్యుఁ బక్షిమా
ర్తాండుఁ డనంతపక్షజవహారి వియద్భ్రమణప్రచండుడున్ 406

ఉ॥ ఆయన నెన్నిసార్లయిన నారసినాడ మహోద్భుతాక్షిసం
ధాయుతమూర్తి నాచు గగనంబున సాగరవర్తమాననా
దేయభుజంగలోక కుస్మృతిప్రవిదారణ కర్మభాగ్గరు
చ్ఛ్రీయుతవేగ నేత్రవివశీకృతి వైష్ణవచక్రసన్నిభున్ 407

శా॥ ఈనిన్ మించరు వైనతేయుఁడునుగానీ రామ సౌమిత్రులుం
గానీ తీవ్రవియద్భ్రమత్తనుసమగ్రప్రౌఢవేగంబుచే
నీసీజన్మ సతీపరిగ్రహణపూర్వేచ్ఛాక శ్రీకంఠరూ
పానూనప్రతిభామయంబు మతిసంస్త్యాయాకృతీ ! మారుతీ ! 408

గీ॥ బలముచే బుద్ధిచేత సత్త్వంబుచేత
నధిక తేజస్సుచేత నీయంతవాఁడు

చెలఁగు త్రైకాలికంబైన సృష్టియందుఁ
గానరాడయ్య! మేలుకో కపిమహేశ 409

వ॥ అనుచుండ సర్వవానరపతులును సర్వవానరసేనయు విస్మృతాక్షి
గోళంబులఁ గనుచుండ జాంబవంతుం డిట్లనియె. 410

ఉ॥ నీవు మహానుభావుఁడవు నీదగు జన్మకథాసుధార్ఝరిన్
నా వినినట్టిదాని నొకనాడు వచించెద మిత్రులారా మరు
ద్దేవుఁ డుపర్బుధుం డటవిదేశవిహారము సేయుచున్ దహా
త్మావకు నంటి యేగు పృషదశ్వుని నగ్ని వచించె నీగతిన్ 411

చ॥ ఒక శిలవెన్క నే నొదిగియుండి సమస్తము విన్నదాని భ
ల్లుకములు వహ్ని భీతి కడలున్, సఖ నీకును నంజనాప్లవం
గికి జత యొల్లు కూడినది కీశసులంబున నీకుఁ గోర్కెయే
ల కలిగె మైత్రిభావశబలంబుగఁ జెప్పుమటంచు నాడినన్ 412

ఉ॥ తానును లేక వహ్ని తృణతాపరిసంఖ్యను రాదు వహ్నికిం
దాను చరించుచుండ నొక తక్కసవాని విధాన మారుతుం
డైనను, గొన్ని స్నేహములయం దిటులుండును, వహ్ని కాల్చుచుం
గాన సమస్త మేమి యధికారమొ తా విను శాంతి నున్నటుల్

చ॥ అనినను బ్రక్కచెట్ల చివురాకుల నీలులువేసికొంచు నం
తన యనిలుం డనెన్ గిరినితంబిని సంపిహితోత్తరీయమో
హనరుచమండలీవిరచితాంగజకౌసుమ ముగ్ధవర్మ తా
రిన కనుమేరలన్ మధురురీశఫరీవిలుఠత్తరంగయై 414

ఉ॥ ఆమెను నే నెఱుంగుదున యామమ యచ్చర పుంజికస్థలా
ఖ్యామసృణాంగవల్లిక యొకానొక శాపముచేతఁ గుంజరా
ఖ్యామహనీయుఁడౌ కపికి నాత్మజయై జనియించెఁ గానలం
దామెయుఁ గామలబ్ధవివిధాకృతియై విహరించుచుండెడిన్ 415

చ॥ మొగమునఁ గోతియై సకలముగ్ధతమాంగములం దలౌకిక
ద్విగుణితకా వనోత్సవవితీర్ణిగ నొక్క శిలాతలంబునం

దు గిరినితంబఁ గాంచిన కనుంగవ సాంగవపుశ్ఛవిప్రపీ
తిగఁ దిగ కంటికిన్ మరులు తెచ్చెడి యందము మ్రుచ్చిలింపఁగన్

ఉ॥ సంగమవేళ భావరససంగతవృత్తులో యేమొకాని మా
తంగమనోజ్ఞయానలు ఘృతాచియు నూర్వశి రంభ భావసం
ధ్యంగ మనోజ్ఞతాకలితతామృదుతానవయౌవనోత్సవా
నంగకుడుంగమూర్తిఁ గనినన్ సరిపోలరు పుంజికస్థలన్ 417

చ॥ ఎఱుఁగనివేళ స్త్రీవసన మింత హరింపుము కన్నువిచ్చపెన్
వెఱఁగున నీ వెఱుంగకయు వేచు నొకానొక యాభిముఖ్య మి
వఱుమగ నొక్కసాహసము నార్ద్రితసాంత్వనచాటువైఖరుల్
మెఱవడి నీకుఁ బాల్కడలిమీఁగడయందు మధింపకుండఁగన్ 418

మ॥ రతిభావాంబుధిసూక్ష్మనిర్మథనసారంబౌరహోవేళ నా
సతి వక్షోంశుకముం బిఱుందుపయి వస్త్రం బవ్వియే జారె నన్
గతి సూక్ష్మంబుగ నే హరించితి నెఱుంగన్ లేద నేఁ గాగిలిం
చితి గాటంబుగ నెంతదాఁక విన్మృతాక్షి క్లిన్నభీతత్రపన్ 419

శా॥ నా కౌమారహరుం డెవండనియె సంధ్యానల్లి నోదార్చితిన్
గోకన్ లాగుచు నే భయంపడకు నీకుం గీడుకావింప నే
నీకుం బాపమురాదు నేఁ గొనెద దానిన్ మంజుగుంజద్గళా
శ్రీకారశ్రవణా నవాధరసుధాశ్రీకా కపోలారుణా ! 420

ఉ॥ అప్పుడు పుట్టి మా హనుమ యస్మదనంతజవోగ్రమూర్తి తా
నప్పుడు పుట్టుచే యెగిరె నాకసమం దుదయించు వేవెలుం
గొప్పిన యీఁతపండ్లవి నతోజ్జ్వలగుచ్ఛమటంచటంచుఁ దాఁ
జెప్పుచు నేగె వాయువును జేరని విన్కలిగాఁగ దవ్వులన్ 421

మ॥ మరి వీఁడెవ్వఁడొ క్రొత్తరాహు కబళింపన్ వచ్చుచున్నాఁడు బం
ధురుసిన్ సూర్యు నటంచు నేసె బురుహూతుం డంజనీసూను బం
ధురునిం జెక్కిలిక్రిందిచోట హనుమంతుం డంత మూర్ఛన్ గనెన్
సుపుత్రుం గాంచిన యంజనీగళరవాక్రోశంబు క్రోశంబునన్ 422

మ॥ వినుచుం గాలి బిగించె ముజ్జగమునన్ విజ్జైన ప్రాణుల్ హరిం
పను ముక్కోటులు కాళ్ల వేళ్లఁబడి సంప్రార్థించి యుజ్జీవితుం
బొనరింపన్ హనుమంతు నప్పటికి వంపుల్ తీరె లోకంబునన్
దునుగన్ రానివి చేరె నీకు బహుమహత్తుల్ సర్వదైవత్యముల్

ఉ॥ ఓ మహనీయ వానరకులోదధిపూర్ణశశాంక ! నీకు ని
చ్ఛామరణం బొసంగె జలజాసనమూర్తి యశస్త్రవధ్యతన్
నీ మెయిలావు ధారుణియు నింగియుఁ బట్టవు నీ జవంబు ది
క్సీమలు పట్ట వెంతయు నసీమపరాక్రమవార్ధి మారుతీ 424

మ॥ ఉదయత్సూర్యునిదొట్టి యస్తమయసూర్యుండైన దాఁకన్ సమల్
చదువన్ దోఁ జన మిన్ననం దెవనికో సాధ్యంబు దా నట్టి నీ
కిది యేపాటిది గోఁటిమీఁదిపని మ మ్మో యల్పవారాశియం
దదయత్వంబున ముంప కే సకలవిద్యాభారతీ ! మారుతీ 425

వ॥ అనినంత సర్వవానరపతులును సర్వవానరసేనయు మహాశ్చర్యరస
నిమగ్నులై భయభ్రాంతబాష్పనేత్రంబుల నతశిరస్కులై నిలువ
జాంబవంతుండు 426

మ॥ మునుపో ! తాత ! యధోక్షజుండు సహసాపూర్తిన్ద్రిధా విక్రమిం
చిననా డేను ప్రదక్షిణించితి మహాక్షిత్యాకృతిన్ వెంటవెం
టనె ముమ్మాఱు జరాభరంపడినతోడం జన్న వానాళ్లు నే
నును చన్నన్ మరి నీవు చన్నదగునే నూల్కొఁగదే మారుతీ 427

శా॥ ఆపన్మగ్నుల నుద్ధరింపవె ప్లవంగా నీకెనిన్ పీ రహా
నీ పంతంబును నీమహాబలమునున్ నీమింటిసాంయాత్రిక
త్వాపూర్ణోగ్రజవంబు చూడవలెనం చంతం బ్రతీక్షింతు మ
య్యా ! పాలింపవె మమ్మిటన్ గగనబాహావ్యాప్తృతీ మారుతీ 428

చ॥ వివృతవిలోచనాంబుజుఁడు విస్తృతదేహుఁడు జాంబవద్యథా
ర్థవచనపాలికాశ్రవణరంజితచిత్తుఁడు స్వస్వరూపసా

ధువిమలభావనామతియుతుండయి పొల్చె బుగర్ధదీపనా
శ్రివపరితోవివర్తమధురస్థితిఁగాంచు బిడౌజువోలికన్ 429

మ॥ అట యోగింబలెఁ గూరుచున్న ప్రభునా నయ్యాంజనేయుండు వి
స్ఫుటసంస్తోత్రము లాడుచున్నకొలదిన్ స్తోత్రోక్తికార్థాన్వయ
స్ఫుటతేజోఽపఘనోల్బణంబుగ దిశాస్తోమంబు నిండారె నం
తట దర్శించెడు వానరోత్తములనేత్రంబుల్ దువాళింపగన్ 430

మ॥ ఒగిఁ గూర్చుండినయట్టిఁడౌ హనుమ కూర్చున్నట్లుగా నొక్క హే
లగ నల్దిక్కులు చూచి చూచు త్రుటిలో లాంగూల మాభీలజి
హ్మాగపుచ్ఛోగ్రవిచాలనాప్చుతరవవ్యాదీర్ణరోదోఽంతరం
బుగ సంతాడన మాచరించె వసుధాభోగంబు నిమ్నంబుగా 431

ఉ॥ అంత నభస్వదాత్మజుని యాననమండల మంబరీషవి
భ్రాంతిగ నేత్రగోళకభరంబగుచున్ హసనీజ్వలంబుగాఁ
జెంతలనున్న వానరులు చేతములందు భయంబు హర్షవి
క్రాంతులు దందడింపఁగ ముఖంబుల మిశ్రవికారభావులై 432

ఉ॥ ఉంభితదేహుడై గిరిగుహాముశయానము నిద్రలేచి పెన్
జృంభణ మాచరించిన మృగేంద్రమహాస్యములోల దర్శనో
త్తంభనమూర్తియైన పృషదశ్వతనూజుని వక్త్రగహ్వరా
లంబితమా విహాయసతలం బతియామ్యజగత్త్రబర్హమై 433

ఉ॥ మున్ను త్రివిక్రముం డఖిలభూభువనంబులు నిండె నట్లుగా
నన్న నదిట్లుగానను నుదాహృతిఁ జండనిగుంభితంబుగా
మిన్నున కంతసంతఁ బయిమెల్చిన మాళితలంబుగా జగా
కన్నులు చంద్రనిప్పుకలుగా హనుమంతుఁడు నిల్చె నుగ్రుఁడై 434

చ॥ నలుగురునున్ మహాకపియనన్ విను టొక్కటి మంత్రిభావము
జ్జ్వల మధికార మొక్కటియు సంగతగౌరవహేతువుల్ కపీం
ద్రులకును మున్ను నేడసితతోయదమూర్తి నభోఽంతరాళసం
జ్వలితతనూరుహాప్తఘనచండునిఁ గాంచిన గుండె బ్రద్దలై 435

వ॥ అంత హనుమంతుండు హరివృద్ధులకు నమస్కరించి యిట్లనియె. 436

మ॥ పృథివీభృత్ప్రవికంపనోగ్రము యదాభీలప్రవేగంబు సా
రథి యెవ్వాడవు జీవకోటికి సమారబ్ధానుయాత్రామహా
పథమం దాపృషదశ్వు నౌరసుఁడ మద్బాహూరురేఖల్ జవా
పధికంబుల్ నను నేన పోలుఁదు బ్రభావస్థైర్య వేగంబులన్ 437

ఉ॥ ఎంతటివాఁడు కావలయు నెప్పుడు యత్ప్రతిభావిశిష్టుఁడై
యంతటివాఁడు నేనగుదు నప్పుడు తత్ప్రతిభావిశిష్టుఁడై
యంతకప్రాంగణస్థితమహాధ్వజవద్భుజదండతీవ్రుఁడన్
జింతితకార్యముల్ తనరఁ జేయఁగఁ గల్పతరూపమానుఁడన్ 438

ఉ॥ నా జవమున్ బలంబును మనస్సున కందవు సర్వభూమిభృ
ద్రాజులఁ బెల్లగించి విసరంగను జాలుదు దిక్చయంబులన్
భ్రాజితవార్ధివాశ్చయభరంబును జిమ్ముదు ధారుణీస్థలిన్
నా జనియింపఁజేయు గళనాదముచేత దిశల్ చలింపఁగన్ 439

ఉ॥ ఇంతటివాఁ డెవండనిన నింకొకరుండు మరుత్తనంగనై
నంతటి వైనతేయుఁడు మహాగరుదుత్థమహోగ్రవేగుఁడై
క్రాంతవియత్పథంబు జనఁగా నొకనేన ప్రదక్షిణింతు నే
శ్రాంతమనస్కుఁడై యొఱులు కానని సారణసంచనంబులన్ 440

మ॥ పుడమిం జీల్చెద రెండుగా నడిమికిన్ భూమీధరంబుల్ పొడిం
బొడిగాఁ జేసెద వార్ధివారి ధరణిం బూరింతు గగ్గోలుగా
వడి మద్వేగవికృష్టమై చని వియత్ప్రస్థానవేళన్ ననుం
బడి యేతెంచున మింట వృక్షచయముల్ వల్లీప్రతానంబులున్ 441

ఉ॥ ద్విత్రివిలిప్తలన్ గగనవీధిఁ జరింతు నన్నేను స్వాతిన
క్షత్రము వోలె నన్నుఁ గని కంపము నొందఁగ సర్వభూతముల్
ధాత్రియు మత్పదాహతికిఁ దాళదు లంఘనమందువేళ మ
ద్గాత్రపు బర్వుచేతను దిగంబడిపోవు మహాబిలంబుగా 442

మ॥ మరి మింటంజన నేను న న్ననుసరింపఁగల్గు భూతంబు లే
దురువేగంబున మింటికేగఁ గనుఁడో హో మీరు శాఖామృగే
శ్వరులీ నన్నుఁ ద్రివిక్రమక్రమతనూసంస్ఫూర్తి మెట్లుండెనో
గరుడుండుం బవనుండు నిద్దఱిది వేగంబౌను నాముందటన్ 443

క॥ పదివేల యోజనంబుల
ను దూఁకెదను మీకుఁ జాలునో ధరణిసుతన్
ముదితాత్మం గని వచ్చెద
ముదితాత్ములు కండు భయము పొందకు డెదలన్ 444

చ॥ ఇదియును జాల కింక వలెనేనియు లంకను బెల్లగించి తె
చ్చెదఁ బురుహూతుఁడున్ విధియుఁ జేతులయందమృతమ్ముఁ దాఁచియుం
చెద రనుకొండు సాయుధులు చెచ్చెర దానినినైనఁ గొంచు వ
చ్చెద నిది చేయలేననినచేఁత యెఱుంగను నేను సృష్టిలో 445

వ॥ అంత 446

మ॥ మును శ్రీరాముఁడు జానకీవిరహసంభూతోగ్రకోపుండు వి
ల్లున ద్రమ్మందించెదనంచు నన్నపుడు ముల్లోకంబు, ముల్లోకమెం
త నితాంతోగ్రభయంబు పొందినదొ యంతంబొందె నే డాంజనే
యుని యీరీతిగ విక్రమించెడు పరితాపోత్తిపత్రిపంచంబులన్ 447

చ॥ కపి తమవాఁడునుం దమది కార్యము కావున సంతసంబులో
నపుడు భయంబెఱుంగదు మహాకపివాహిని విస్మయాక్షి ని

స్త్రపముగఁ జూచుచుండి, యరుదార జగంబిది స్వోపయోగమా
తిరిపుఁ దెలిసైనయట్టిదియు తత్త్వవిచారణలేదు దానికిన్ 448

వ॥ అంత జాంబవంతుండు హనుమంతుని వాక్యంబులు విని వానరుల
సంతోషంబు కని పరిసంహృష్టుఁడై యిట్లనియె. 449

శా॥ తాతా ! కేసరిపుత్ర ! యార్యనుతవృత్తా ! వీరచూడామణీ !
జ్ఞాతుల్ సంతసమంద సాగరతితీర్షం బోయి రావయ్య ! యూ
హాతీతాద్భుతబాహుశౌర్యవిభవా ! అంబోధిగంభీర ! య
జ్ఞాతోదాత్తమతిప్రభావ ! సుసమజ్ఞావ్యాకృతీ మారుతీ 450

వ॥ గురువృద్ధానుమతంబునను ఋషిప్రసాదమహిమంబునను మహార్ణ
వంబు లంఘించి రమ్ము నీకోసము మే మిచట నొంటికాలిమీఁదఁ
దపస్సుచేయుచుండు మన నాంజనేయుం డిట్లనియె 451

క॥ ఈయల్పశిలాసంహతి
హస్మా యిది మత్పాదఘాతచటులత నణఁగున్
బోయెద మహేంద్రగిరిశిఖ
రాయత గాఢాశ్మబంధురావని కనుచున్ 452

మ॥ కపిమూర్ధన్యుఁడు నమ్మహేంద్రగిరిశృంగం బెక్కె మేరూర్విభృ
ద్విపులప్రస్థము పంకజాసనుఁడు నాన్ బృధ్వీధరం బెక్కె యా
క్షిపదుగ్రోపలపాతిగాఁగ విహరించెన్ లంఘనాదిప్రథా
వరాభూతనగేంద్రవాసిసకలప్రాణిప్రకంపంబుగన్ 453

సీ॥ కెవ్వున గీపెట్టె క్షితిధరంబంతఁ బం
చాస్యంబు మదకుంభిఁ జఱచినట్లు
ఉరుఝరీధారలై యొడ్చెను గిరిరాజు
తడిగుడ్డ చేతులఁ బిడిచినట్లు

ఘనశిలాతతి వ్రీలఁగానయ్యె నగము చే
తులఁ బండ్లకొమ్మను దులిపినట్లు
ఎగసి క్రిందికి వ్రాలె నగరాజు నల్లన్నా
నుదుపులు చపుడులో నుప్పినట్లు

ఉస్సురనేఁ గొండ పాములు బుస్సకొట్ట
కందరాబిలసీమలు కత్తిరిల్లి
యొక విరక్తి వహించేఁ దా నుర్వీధరము
కదలు చఱియల సిద్ధులు వదలిపోవ 454

చ॥ మంగళరూప! యయ్యా! హరిమర్కటమర్కట! పంచవక్త్ర! ఖ
ట్వాంగమహాసిఖేటకుధరామృతకుంభసృణి ప్రదీపితో
త్తుంగకరాంబుజాత! నవతోయదమూర్తి! త్రిపంచనేత్ర! స
ర్వాంగదకంఠహార! కరుణాంబుధి నన్ దయచూడు మారుతీ! 455

శా॥ నీపాలం బడినాము చంచలమతిన్ నీ దోసదగ్రప్రభా
శ్రీపాండిత్య మెఱుంగలేమును గటాక్షింపంగదే రామకాం
తాపర్యేషణ పెండ్లికూతురయి యందా లొప్పెదున్ వార్ధిర
ధ్యాపల్యంకిక! నూత్నధాత! హనుమంతా! యాపదుద్ధారకా!

---

= ఖండాతము =

మ॥ ఇది కిష్కంధము స్వామి! కోమలచమత్కృత్యధ్వనిర్మాణసం
పదనూనోజ్జ్వలరమ్యభావరససామగ్రిసమగ్రంబు నీ
పదపద్మోపరిసంభ్రమద్భ్రమరరావాశ్లేషణాకూతి నీ
పదరాజీవపుఁ దేనె నా పెదవి నబ్బా! తాకనీవే! శివా!

శా॥ తా నస్మద్విలసత్కృతిశ్రవణసంధాబుద్ధి ముక్త్యలధా
శ్రీనాథుం డోకఁ డాన్నృపాలునకు ధాత్రీమండలోద్యద్రథా !
నీనిర్వ్యాజకృపాకటాక్షములు పండింపంగదే ! యేది కూ
ర్పో ! నీనేర్పె యెఱుంగ న్నాంతరరసాహుత్యాకృతీ ! వేనికి౯.

ఉ॥ ఓప్రభు ! నిన్ను నే నడుగుచుండినయట్టులఁ దోచు ముక్తికై
దీప్రములైన భోగములు దీనిని విన్నటువంటి త్రేనికై
కప్రిముపోని నాయునికి కమ్మని గాలివి నీవు పీవఁగా
శ్రీప్రముగా హరించిచనుఁ జెందఁగ దప్పక నాకు నీకును౯

శిఖరిణి:—

విపద్గ్రీవాకాంతి ప్రసృమర సుధావిర్భవజగ
త్తృషాపూర్త్యుద్రేకప్రవిమల దయాదీప్తివిభవా !
మృషావ్యాహారాఘాంబుధిజలసదాదృత్యవరధీ
తుషాగ్ని వ్యాపారప్రకటిత మహస్త్రాణధిషణా !

మాలిని:—

ప్రణవప్రకృతిమూర్తీ ! పార్వతీచ్ఛందవర్తీ
తృణచలననిదానా ! దేశరూపాత్మనీనా
ద్వ్యణుక కలలహేతూ ! పాశుపాల్యార్ఘ్య సేతూ
అణిమముఖవిభూతీ ! ఆశరత్వాభియాతీ !